**vinnanta kannanta**

(as heard and seen)

*By*

**Budaraju Radhakrishna**



First Published: November, 2001

*Typesetting & Cover Design:*
Vivid Design Ventures
&: 040-658 8819

Printed at:
Akruthi Offset Printers
&: 040-766 4525

*For Copies*

l **Media House Publications**
1-9-289/4, Behind Post Office
Vidyanagar, Hyderabad - 500 044.
&: 760 7307.

l **Visaalandhra Book House**
All Branches

Price: **Rs. 100**



# ఎందుకిదంతా?

అద్దంలో తన నీడ చూసుకున్నప్పుడు కలిగే ఆనందం, తృప్తీ అనిర్వచనీయం, అనుభవైకవేద్యం. ఎవరికి వారు తాము మన్మథులో రతీదేవులో అనుకోవచ్చు. లోకం ఏమనుకుంటుందో? అది వేరు విషయం. తమను లోకం తక్కువ అంచనా వేస్తుందని బాధపడే వాళ్ళ సంఖ్య అపారం. తన అంచనా సత్యం. ఇతరులది సత్యదూరం. లేదా అర్ధసత్యం. ఇది సాధారణ మానవుల భావన. తాము మహనీయులైనా వినయంకోసం 'మందః కవియశః ప్రార్థీ' అని చెప్పుకున్న కాళిదాసాదులూ తెగ బోలెడు చదివి వ్యాఖ్యానించి కూడా 'భగవద్గీతా కించి దధీతా' అని బాధపడ్డ మహామేధావులూ మరోజాతి. ఆత్మకథను, స్వీయచరిత్రగా రాసుకున్న తెలుగువాళ్ళ సంఖ్య పూర్వం చాలా తక్కువ. ఇప్పుడు చాలా ఎక్కువ. సంస్కృత కవులు ఆత్మస్తుతి పరనిందలకు పాల్పడలేదు గాని తెలుగు కవులు కుకవినింద మానలేదు; గద్యల్లో ఆత్మస్తుతి చేసుకోకపోనూ లేదు. ఇదంతా కాలప్రభావం కావచ్చు. పూర్వ మార్గాన్ని అనుసరించటానికే ప్రయత్నిస్తాను.

కందుకూరి వంటి మహనీయుడు స్వీయచరిత్ర రాసినప్పుడు నాటి దేశకాల సమాజ పరిస్థితులను ప్రస్తావించినంతగా తాను నిజంగా సాధించిన విషయాలను కీర్తించుకోలేదు. ఆత్మ సాక్షాత్కారం అంతసులభమైన విషయంకాదు. పూర్వకవులు కొన్ని సూచనలు చేశారు, ఇలాంటి సందర్భాలకు సరిపడేవి. "పరైః ప్రోక్తా గుణా యస్య నిర్గుణోప్పి గుణీ భవేత్, ఇంద్రోపి లఘుతాం యాతి స్వయం ప్రఖ్యాపితై ర్గుణైః" అన్న శ్లోకముంది. ఇతరులు మెచ్చినప్పుడు సామాన్యుడైనా గొప్పవా డనిపిస్తుంది. తనంత తానుగా తన విషయం చెప్పినప్పుడు లోకం తేలికగా తీసుకుంటుంది. అలాంటి ప్రయత్నం స్వహస్త కుచమర్దనంలాంటి దన్నవాళ్ళూ ఉన్నారు. శ్రీశ్రీ 'ఆత్మ చరిత్రాత్మ చరిత్రాత్మక నవల'గా 'అనంతం' రాసినప్పుడు, "ఆత్మహత్య చేసుకోవడము అనేక పద్ధతుల్లో ఆత్మచరిత్ర రాసుకోవడం ఒకటి" అని వ్యాఖ్యానించిం దందుకేనేమో!

సాహిత్యంలో ఆత్మకథలూ ఉన్నాయి. ఎవరో రాసిన ఎవరెవరి జీవిత చరిత్రలో ఉన్నాయి. ఎలా రాయకూడదో నిరూపించేవీ ఉన్నాయి. ఎంత జాగ్రత్తగా అతిశయోక్తులూ అత్యుక్తులూ లేకుండా రాయాలో బోధించేవీ ఉన్నాయి. ఏ రూపంలో రాసినా అది కత్తిమీది సామే. తాను లేకుండా తనకు తెలిసిందున్నదని చెప్పటం అసాధ్యం. తానుండి తెలుసుకోకుండా చెప్పటం అనర్థం. అసలేవో రాసి లోకాన్ని వివేకవంతం చేస్తా ననుకోవటం ఎందుకనేది ప్రశ్న. రచనా కండూతివల్ల రాయటం మానుకోలేకపోవటం ప్రథమ కారణం. తాను చూసింది తక్కువ, విన్నది ఎక్కువ. వినికిడి మాటలు సాక్ష్యంగా చెల్లవంటుంది న్యాయశాస్త్రం. అనుమానాది ప్రమాణాలను అంగీకరిస్తుంది తర్కం. ఆయా విషయాల ప్రాముఖ్యంలో అప్రముఖతలో ఉన్న అంతరాన్ని నిరూపిస్తుంది చరిత్ర. తాను దృశ్యాదృశ్య పాత్రగా విన్నంతగా కన్నంతగా ఏవేవి ఎంతవరకు సహజ స్వరూప స్వభావాల్లో కాలగమనంవల్ల వచ్చిన మార్పులో బేరీజు వేయటం సులభం కాదుగాని, దురాశ లేకపోతే అసాధ్యంకాదు. ఆయా మార్పులు భావితరాల వారికి మంచివో చెడ్డవో నిరూపించేవి కూడా కాలమే, సమాజమే. మార్పంతా మంచిదని 'క్షణే క్షణే యన్నవతా

ముపైతి తదేవ రూపం రమణీయతాయాః' అని సంతృప్తిపడే వాళ్ళున్నట్లే, ప్రమాణాలు పడిపోతున్నాయనీ సమాజం భ్రష్టమైపోతున్నదనీ అంగలార్చే వాళ్ళూ ఉంటారు – ఉన్నారు. ఇంత వైరుధ్యంలోనూ కొంత సమధర్మం ఉండవచ్చు. మరికొంత పురోభివృద్ధికి తోడ్పడేదీ ఉండవచ్చు. గతం లేని వర్తమానం, వర్తమానం లేని భవిష్యత్తు అనూహ్యాలు. అందువల్ల కాలచక్ర పరిభ్రమణంలో కిందుమీదులు కాగల అవకాశమున్న విశేషాలను తరవాతి తరాల వారి పరిశీలనకు, విమర్శకు అందుబాటులో ఉంచాలన్న తాపత్రయమే ఈ రచనకు దారితీసింది. దీని ప్రయోజనం లోకం నిర్ణయించవలసిందేగాని రచయిత నిరూపించదగింది కాదు.

ఈరచనా సందర్భంలో స్వగుణాఖ్యాపనం లేదు. ఉన్నట్లు పాఠకుల కనిపిస్తే అది రచనా సామర్థ్యలోపమే. కొందరు పెద్దలు స్వీయకీర్తిగానం మీద మోజుంటే, "స్వగుణాఖ్యాపనం యుక్త్యా పరద్వారా ప్రయోజయే" త్తని సలహా ఇచ్చారు. అలా చేయగలిగితే, చేస్తే అది జీవిత చరిత్ర అవుతుంది. ఇతరుల రచన అవుతుంది. స్వీయరచన కాదు. ఎవరో జీవితచరిత్ర రాయదగినంత చరిత్ర ఈ రచయితకు లేదు. ఆత్మజ్ఞానమో, ఆత్మసాక్షాత్కారమో తాత్వికులూ వేదాంతులూ భావించినట్లు లేకపోయినా, అనాత్మజ్ఞానం కూడా కొరవడ్డా, నా అనుభవాలు ఆధారంగా నేను విన్న విశేషాలు ప్రధానంగా మాత్రమే ఈ రచన నడుస్తుంది.

"ఉచ్ఛై రధ్యయనం పురాతన కథాః..." మొదలైనవి ద్వాదశ భిక్షుకగుణా లన్నారు. గత కాలవిశేషాలు కాబట్టి ఇది రెండోరకం అడుక్కుతినే లక్షణమనాలి. అంటే మొదటిరకం కాదని ఘంటాపథంగా చెప్పవచ్చు. ఇన్ని సంకోచాలతో ఈ ప్రయత్న మెందుకనే ప్రశ్న రావచ్చు. చాపల్యం వల్లనో, వయోధర్మం వల్లనో పూర్వానుభవాలను ప్రస్తావించినప్పుడు, శ్రోతలు తమకు నచ్చినవని అనిపించిన విషయాలను గ్రంథస్థం చేయరాదా అన్న సందర్భాలున్నాయి. బైబిల్ నిర్దేశించిన వయసు దాటబోతున్నప్పుడు నీకు తెలిసిన వింతలూ, విడ్డూరాలూ నీవు చూసి గౌరవించిన మహాపురుషులూ, వాళ్ళ ప్రత్యేకతలూ, లోకుల కెందుకు చెప్పవన్న విద్యార్థు లున్నారు. ప్రస్తుత సమాజంలోని అనేక వ్యక్తులూ, సంఘటనలూ నచ్చక ఆక్షేపించి బాధపడేవాడివి, ఆ కారణంగా అనేక మిత్రులను దూరం చేసుకున్నవాడివి, చాలామంది అనుకూల శత్రువులను సంపాదించిన వాడివి ఎవరితో, దేనితో ఎవరిని, దేన్ని పోల్చి ఈ పరిస్థితికి వచ్చావో రాయరాదా అన్నవాళ్ళున్నారు. సుదీర్ఘ జీవితంలో కోల్పోయిన బాంధవ్యాలు, ఆనందాలు, మరిచిపోతున్న అనుభవాలు అక్షరబద్ధం చేస్తే ఏ కొద్దిమందికైనా అవి మంచిగానో, చెడుగానో ఉపయోగపడవచ్చు గదా అని ఓదార్చిన వాళ్ళున్నారు. ఇవేవీ కాకపోయినా నీలాంటి గుణగణాలు (సద్గుణాలా, దుర్గుణాలా అన్నది నిర్ణయించగలవి సమాజం, దేశం, కాలం) ఉన్నవాళ్ళు సంతోషించవచ్చు కాబట్టి లిపిబద్ధం చేయమని ప్రోత్సహించినవా రున్నారు. భవభూతిలాగా 'ఉత్పత్స్యతే మమ తు క్కోAపి సమానధర్మా, కాలోహ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ" అనగల సాహసంలేదంటే, దాన్ని ఆ భవభూతినుంచే అరువుతెచ్చుకొమ్మన్నారు కొందరు. ప్రపంచమంతా అరువు సొమ్ముతో, అప్పుకూటితో ఆనందంగా నడుస్తుండగా 'నవ్విపోదురు గాక నాకేటి సిగ్గు?" అనే ధీమాతో ఈ రచన ఆరంభిస్తున్నాను.



ఇందులో ప్రయత్న పూర్వకంగా కొన్ని పేర్లు పరిహరిస్తున్నాను – అవి అప్రతిష్ఠాకరాలనీ ఆదర్శశూన్యాలనీ భావించినప్పుడు. కొన్ని పేర్లనూ సంఘటనలనూ ప్రస్తరిస్తున్నాను – అవి ఆదర్శవంతమనీ, ఆచరణయోగ్యమనీ తలచినప్పుడు. నా సొంతగోడు దృశ్యాదృశ్యం. నేను చూసిన, విన్న రాజకీయ సామాజికార్థిక సాంస్కృతిక విశేషాల్లో ప్రముఖమైన వాటినీ దర్శించిన మహనీయుల వ్యక్తిత్వ విలక్షణతలనూ గుర్తు వచ్చినంతమేరకు పాఠకుల దృష్టికి తెస్తున్నాను. అన్ని సంగతులూ ఖచ్చితంగా కాలక్రమానుసారం రాయటం లేదు. ఒక విశేషాన్ని ప్రస్తావించినప్పుడు పూర్వాపరాలనూ భూతవర్తమాన ధోరణులనూ రేఖామాత్రంగా సూచిస్తాను – గ్రంథవిస్తరభీతి పీడిస్తున్నందువల్ల, శరీరారోగ్యం క్షీణిస్తున్నందువల్ల, పాఠకులను మరింతగా బాధించా లనుకోనందువల్ల.

ఈ నా ప్రయత్నం సంతృప్తికరంగా కొనసాగుతుందని ఆశిస్తూ, "యత్నే కృతే యది న సిద్ధ్యతి కోఽత్ర దోషః?" అన్న శ్లోకపాదం గుర్తుకు తెచ్చుకుని నన్ను నేనే ఓదార్చుకుంటున్నాను. ఇది నా ధోరణిలో నాకు చేతనైన పద్ధతిలో స్వాతిశయ రహితంగా రాసిన నేనెరిగిన సామాజిక చరిత్ర, నాకున్న సాహితీపరిచయం, నా కర్థమైన రాజకీయార్థిక విషయాలు, నా బలహీనతలు.

రాయమని ప్రోత్సహించినవా రనేకులు. ఇలా తప్ప రాయలేకపోయింది నేను. కొన్ని వాస్తవకథనాలవల్ల కొందరికో వారి అభిమానులకో బాధకలిగించి ఉండవచ్చు. వారి మీద సదభిప్రాయం లేనివారికి ఆనందం కలిగినా ఆశ్చర్యంలేదు. నా ఎరికలోని విషయాలను అక్షరబద్ధం చేశానేగాని ఎవరినీ అవమానించా లనిగాని, ఆకాశాని కెత్తాలనిగాని ప్రయత్న పూర్వకంగా వక్రీకరించనూ లేదు, వన్నెలు దిద్దనూ లేదు. 'ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః' అని విశ్వసించాను.

చదవండి. నేను దృష్టికి తెచ్చిన పూర్వవిశేషాల్లో ఎన్ని స్వీకార్యాలో ఎన్ని పరిహార్యాలో పరిశీలించండి. భావిసమాజం సుఖసంతోషాలతో అభివృద్ధి చెందటానికి ఏవి అవరోధాలో, ఏవి అవసరాలో గమనించండి. ముఖ్యంగా యువతీయువకుల కిది నా విన్నపం. భవిష్యత్తు మీది. మా కాలం కుంటిగానో, గుడ్డిగానో గడిచిపోయినట్లే. మానాటి అనుభవాలు మేం వినీ చూసీ చెప్పినవి మీకెంతవరకు పనికివస్తాయో తేల్చుకోండి. పనికిరావనిపిస్తే నన్ను శపించి మరిచిపోండి. ఎలా జరిగినా నా రచనా ప్రయోజనం నెరవేరిందన్న సంతృప్తి నాకు మిగిలి తీరుతుంది. నా కదే పదివేలు.

ఈ పుస్తకాన్ని ప్రచురించటానికి సాహసించిన మిత్రులు మీడియా హౌస్ పబ్లికేషన్స్ ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ డాక్టర్ గోవిందరాజు చక్రధరుకూ, నీటుగా టైప్ సెటింగ్ చేసిన ఎన్.రఘురామయ్య గారికీ, కవర్ డిజైన్ చేసిన వివిడ్ డిజైన్ వెంచర్స్ పవన్‌కుమార్ గారికీ, ముద్రించిన ఆకృతి ఆఫ్‌సెట్ ప్రింటర్స్ కిరణ్ గారికీ నా కృతజ్ఞతలు.

ఈ రచనను నా మనుమరాళ్ళు చిరంజీవులు ప్రత్యూష, పావని, ప్రద్యోత, నవ్యసాయి శ్రీలకూ, మనుమలు గౌతమ్‌హరి, హరీత్‌మాధవులకు ఆశీఃపురస్సరంగా అంకితమిస్తున్నాను.

**-రచయిత**







# 1. బాల్యం - తొలి చదువులు

**ఆ**ర్థిక మాంద్యంలో ప్రపంచం అల్లాడుతున్న రోజుల్లోనే నేనీభూమ్మీద కన్నుతెరిచాను. అవి ఎవరికీ మంచిరోజులు కావు. 1929 సెప్టెంబరులో ప్రచండంగా పడిపోయింది స్టాక్ మార్కెట్. ముఖ్యంగా అమెరికాలో ఆర్థికమాంద్యం మొదలై తరువాతి దశాబ్దంలో చాలాకాలం లోకాన్ని పీడించింది. ఆ కాలాన్ని ఆకలి దశాబ్దమన్నారు. అప్పటికి దాదాపు పుష్కరకాలంముందే మొదటి ప్రపంచ యుద్ధం ముగిసింది. కానీ రాజకీయ వైషమ్యాలు రాజుకుంటూనే ఉన్నాయి – రావణ కాష్ఠంలా. రెండో ప్రపంచయుద్ధం నాలుగో దశకంలో మొదలుకానుంది. ఆ ప్రపంచ యుద్ధంతో బ్రిటిష్ పాలకుల పుణ్యమా అని మనకు పరోక్ష సంబంధం తప్పలేదు. అయినా భారతీయార్థిక వ్యవస్థ గుడ్డికన్ను మూసినా, తెరిచినా ఒక్కటేనన్నట్లుంది. 1930లో ఉప్పుసత్యాగ్రహం మొదలయింది. 1920–21 ప్రాంతాల్లో సహాయ నిరాకరణోద్యమాన్ని ఒక కొలిక్కితెచ్చి బ్రిటిష్ పార్లమెంటు చర్చించకతప్పని పరిస్థితి కల్పించిన చీరాల–పేరాల వనవాసం మొదలై ముగిసిన పరిమిత ప్రాంతంలో, ఆ ఉద్యమాలతో ప్రత్యక్ష సంబంధమున్న సంపన్న బ్రాహ్మణ కుటుంబంలో మే నెల మూడో తేదీన 1932లో జన్మించానన్నారు. అప్పుడు దేవతలు పుష్పవర్షం కురిపించ లేదు. నక్కలు కూయటంలాంటి ఉత్పాతాలు కూడా పుట్టలేదని పెద్దలు చెప్పగా తరవాత ఊహ తెలుస్తున్న రోజుల్లో తెలిసింది. ఆవాహన విసర్జనలు రెండూలేని సామాన్య వాతావరణంలో పుట్టానన్నమాట. జన్మస్థలం మాతామహస్థానమైన వేటపాలెం. పితామహులది స్వర్ణ (ఆ గ్రామం సాధించిన అభివృద్ధిలాంటిది ఆదర్శంగా ఈ రచనాకాలంలో స్వర్ణాంధ్రప్రదేశ్ నిర్మాణ సంరంభం సాగుతున్నది). జన్మ సమయానికి తండ్రి చీరాల్లో నివాసగృహం ఏర్పరచుకున్నాడు. రెండు వైపులా కూడా గుడ్డలకు లోపంలేని కుటుంబంలో పుట్టినందువల్ల శ్రీశ్రీ వగైరాలను బాధించిన ఆకలి దశాబ్దం నామీద ఏ ప్రభావమూ చూపలేదు. అదీ సంగతి.

ఊహ వచ్చేటప్పటికున్న కుటుంబ పరిస్థితి ఊహ తెలిసిన కాలానికి తెలుసుకోగలిగినంత చెప్పానన్నమాట. ఆ దశను దాటి నేటికీ లోకజ్ఞత సంపాదించలేకపోయానన్న విమర్శ ఉంది. అది పూర్తిగా తప్పుకాదు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని వావిలాల గోపాలకృష్ణయ్య గారితో కలిసి కారాగృహవాసం చేసిన అనుభవం మా నాన్న నరసింహారావుగారికుంది. ఎంతో కొంత జాతీయ భావాలున్న కుటుంబంలో పుట్టా ననటాని కీప్రస్తావన తప్పిందికాదు. మా కుటుంబంలోని ఇతరులు కాంగ్రెసు కొమ్ముకాసినా, వావిలాల రామశాస్త్రిగారి కుటుంబంలా అందరూ కట్టగట్టు కొని శ్రీకృష్ణ జన్మస్థానానికి పోనందువల్ల ఆట్టే గర్వించే అవకాశం పోయింది. జైలునుంచి వచ్చిన మా నాన్నగారు రాజకీయాల్లో తప్ప ఇతర వ్యాపకాల్లో తలదూర్చలేదని మా మాతామహులు పంగులూరి వేంకట సుబ్బారావుగారు ఆక్షేపిస్తుండేవారు. వివాహ సమయానికి మా నాన్న మెట్రిక్యులేషన్ (మిటిక్లీషన్ అనేది ప్రజాదరణ పొందిన మాట) పరీక్షకైనా కూర్చోలేదట. ప్రసిద్ధ గణితశాస్త్రాధ్యాపకుడూ, రంగస్థల నటుడూ అయిన సింగరాజు నాగభూషణరావుగారు నాలుగు ముక్కలు నేర్పి కాశీలో ఆ పరీక్ష పాసయ్యేటంత విద్య నేర్పారు మా నాన్నగారికి. ఆయనే నేను

ఎస్.ఎస్.ఎల్.సి. చదివేటప్పుడు మా పాఠశాలకు ప్రధానోపాధ్యాయుడు. "నీకే కాదురా! నీ తండ్రిక్కూడా నేను గురువు"నంటుండేవాడు ప్రేమగా. దరిమిలా మా నాన్నగారు హిందీలో సాహిత్యరత్న మయ్యేదాకా వేధించి చదివించినవాడు కర్ణవీర నాగేశ్వరరావు గారు. ఆయన నన్నూ హింసించి హిందీలో నాలుగు ముక్కలు నేర్పేదాకా విశ్రమించలేదు. మా నాన్నగారికి ఆ దశలో సహాయధ్యాయి ఆ తరవాత ఆంధ్రవిశ్వకళా పరిషత్తులో హిందీ ఆచార్యులుగా పనిచేసిన జి.సుందరరెడ్డి గారు. అలా ప్రయివేటుగా చదువుతున్న రోజుల్లోనే మా నాన్నగారు తమకు రాజకీయేతర విషయాల్లోనూ ఆసక్తి ఉందని నిరూపించటానికన్నట్లు నీలంరాజు వేంకటశేషయ్య గారి వంటి బంధుమిత్రుల ప్రోత్సాహంతో ఉషాపరిణయమనే చలనచిత్ర నిర్మాణంలో చేతనైనంత కృషిచేసి పొందగలిగినంత నష్టం – ఆర్థికంగా పొందారు. నాకు బాగా ఊహవచ్చిన తరువాత కూడా ఆ సినిమా రీళ్ళను కత్తిరించి చుక్కానిలో పెట్టి చీకటి గదిలో మిత్రులను సమీకరించి ఎండలో అద్దంపెట్టి వెలుతురు పట్టి గోడమీద సినిమా చూపి ఆ పని సాధ్యమైనప్పుడు అర్ధణా దాకా సంపాదించిన గుర్తు ఇంకా చెరిగిపోలేదు. అప్పట్లో కాణీకి సవాశేరు పకోడీలు దొరికేవి. అంటే ఆర్థికమాంద్యం ప్రభావం, ద్రవ్యోల్బణ విజృంభణ అప్పటికింకా లెక్కలోకి వచ్చేంతగా లేదన్నమాట మన దేశంలో!

ఉషాపరిణయాన్ని వేటపాలెంలోని ఓ డేరా హాల్లో మొదటిరోజే విడుదల చేయించారు. గుర్రబ్బండి మీద ఘనంగా వెళ్ళి మా అమ్మతోబాటు కుర్చీలో కూర్చున్నట్లు గుర్తుంది. అంతకన్నా బాగా గుర్తున్నది బొమ్మ కనిపించినప్పుడు మాట వినిపించలేదనీ, మాటలూ పాటలూ వినిపించి నప్పుడు బొమ్మ కనిపించలేదనీ! ఆ చిత్రాన్ని విశాఖపట్టణంలోని ఏకైక చిత్రనిర్మాణశాలలో నిర్మించామనీ, తమకు ముందు వెనకల అక్కడే చిత్రాలు తీసిన వారంతా నష్టపోయారనీ మా వాళ్ళు తమలో తాము ఓదార్పు మాటలు చెప్పుకుంటుండే వారు. చిత్రమేమంటే ఆ చిత్రశాల మూతపడి కొన్ని దశాబ్దాలు గడిచిన తరువాత దానిలో సొంతదారుగా అడుగుపెట్టిన వారు మహర్దశకు రావటం. శకునాలూ, నమ్మకాలూ అంత నమ్మదగ్గవి కావనటాని కిదో నిదర్శనం. ఈ సినిమా సంగతి 1935 ప్రాంతాలది.

పితామహస్థానమైన స్వర్ణకు నా అయిదో ఏట కాబోలు పోయినట్లు గుర్తు. తిరిగి మేనాలో వేటపాలెం వస్తుండగా మొదలైన ఈదురుగాలీ, తుప్పరా రానురాను తీవ్రమై వేటపాలెం చేరీచేరకముందే గాలివానగా, తుపానుగా పరిణమించాయి. కొన్ని ప్రాంతాల్లో ఉప్పెన వచ్చింది. దాని దెబ్బకు ఉప్పురిసిపోయిన పొలాలు పండలేదు. ఆ విధంగా ఆర్థికమాంద్య ప్రభావం మా కుటుంబాన్ని కొంత బాధించింది– దాదాపు దశాబ్దం. గాలీవానావస్తే కథలేదంటారు గాని ఉంది. చాలా గొప్ప కథ అది.

## రాజకీయాల్లో కుటుంబం

బ్రిటిష్ వాళ్ళు తమ అధీనంలోని రాష్ట్రాల్లో ఎన్నికలు నిర్వహిస్తామన్నారు. పోటీచేసే అభ్యర్థికి ఇంత ఆస్తి ఉండాలనీ, ఓటు వెయ్యటానిక్కూడా కొంత ఆస్తి ఉండాలనీ నిబంధనలు పెట్టారని విన్నా. జస్టిస్ పార్టీ తరఫున అప్పటి గుంటూరు జిల్లా బోర్డుకు చాలాకాలం అధ్యక్షుడుగా



ఉన్న జాగర్లమూడి కుప్పుస్వామి గారు అభ్యర్థి. (అప్పటికి) పేదల పార్టీగా ఉన్న కాంగ్రెసు తరఫున మా పెదనాయన లక్ష్మీనారాయణగారు నుంచోవాలని ఆంధ్రకేసరి ఆదేశించారు. గెలవటం అయ్యేపనికాదని మొత్తుకుంటే ప్రకాశం గారు "మనం ఓడినా ఫరవాలేదుగాని, జస్టిస్ పార్టీ గెలవకూడదురా" అని ఉద్బోధించారట! అందువల్ల గిల్లికజ్జాలెట్టుకొని ఎన్నికల పిటీషను పెట్టు కొని అందులోనూ మావాళ్ళు ఓడిపోయారు మదరాసు హైకోర్టులో. ప్రీవీకౌన్సిల్లో కాంగ్రెస్ తరఫున వాదించటానికి బారిష్టర్లయిన నడింపల్లి నరసింహారావుగారు, మా మాతామహుల తమ్ములైన పంగులూరి శేషతల్పశాయి గారూ సాహసించలేదుట. చివరికి రిటైరై పుణేలో (అప్పటి పునహా నగరంలో) కాలం దొర్లిస్తున్న ఎం.ఆర్.జయకర్‌ను లండను తీసుకపోయి రావటానికీ ఫీజులూ వగైరాలకూ ఆ కాలంలో ఒక లక్ష రూపాయలు ఖర్చయిన వన్నారు. ఇంతాచేసి నియోజకవర్గాన్ని 'గ్రేటర్ గుంటూర్ – కృష్ణా లేబర్ కాన్సిట్యూయన్సీ' అని మార్చారు. అప్పుడే తలయెత్తుతున్న కమ్యూనిస్టు పార్టీ అభ్యర్థి పిల్లలమర్రి వేంకటేశ్వర్లు గారిని కాంగ్రెసు వారు సమర్థించి గెలిపించారు! ఆయన దాదాపు రెండున్నర దశాబ్దాలపైకాలం మద్రాసు శాసనసభలో ఏకైక కమ్యూనిస్టు సభ్యుడుగా వ్యవహరించారు. నన్ను ఫలానా అని గుర్తించినప్పుడు మీవాళ్ళ పుణ్యమా అని నాకీదశ పట్టిందంటుండేవారు. అది 1936 అనుకుంటాను. ఆ సంవత్సరం మరో దుర్ఘటన వెన్ను విరిచింది మరోవిధంగా.

చీరాల్లో ఐ.ఎల్.టి.డి. అనే పొగాకు కంపెనీ ఉండేది. తెల్లదొరలు స్థాపించింది. కూలీల సంఘం స్థాపించారు కాంగ్రెసు వాళ్ళు. దానికి మా నాన్న గారు కార్యదర్శి అయితే, అధ్యక్షులు జూపూడి యజ్ఞనారాయణ గారు. (ఆయన తరవాతి కాలంలో రాష్ట్ర జనసంఘం నేతగా, ఎం.ఎల్.సి.గా పేరు గడించారు). ఈ ఉభయులూ నడిపిన ఉద్యమం తుపాకి కాల్పులకు దారి తీసింది. నలుగురు కార్మికులు మరణించారు. అఖిలభారత జాతీయ కాంగ్రెసు తీవ్రంగా స్పందించి డాక్టర్ రామ్‌మనోహర్ లోహియాను ఏకసభ్య విచారణకర్తగా నియమించింది. ఆయన "The Chirala Shooting" అనే పేరున రాసిన గ్రంథాన్ని ఏ.ఐ.సి.సి. ప్రచురించింది. అప్పటికి మదరాసు రాష్ట్ర ప్రభుత్వంలో కార్మిక శాఖామంత్రిగా ఉన్న వి.వి.గిరి గారు నైతిక బాధ్యత వహించి తమ పదవికి రాజీనామా చేశారు – ఎవరేమి చెప్పినా వినక! ఆ మాటకు రానురాను రాజకీయాల్లో స్థానం రెండు ముక్కలుగానూ, సమానంగానూ అర్థం మారిపోయింది. నైతికమనేదీ, బాధ్యత అనేదీ అసమర్థతకు చిహ్నమై, నైతిక బాధ్యత అనేది రాజకీయాల్లో స్థానమే కోల్పోయింది. ఇప్పుడు హక్కులకున్న విలువ బాధ్యతలకు లేదని అందరికీ తెలుసు.

## అక్షరాభ్యాసం - బడిచదువు

అయిదు సంవత్సరాలు బ్రహ్మానందంగా గడిచాయి. ఇంటికి పెద్ద బిడ్డగా తల్లిదండ్రులూ, ఏకైక పౌత్రుడుగా మాతామహీ మాతామహులూ ప్రత్యేక శ్రద్ధ చూపారు. అయిదు సంవత్సరాల అయిదు నెలల అయిదు రోజులకు అక్షరాభ్యాసం జరిగింది వేడుకగా చీరాలలో. మా అమ్మమ్మ గారికి అక్షరాభ్యాసం చేసిన చోడవరపు లక్ష్మీకాంతంగారే తొలిగురువులు నాకు. ఆయనే గుంట ఓనమాలు దిద్దబెట్టి బాదంచెట్టుకింద కుక్కిమంచంలో కునికిపాట్లు పడుతుండేవాడు. లేచి ఇంటి

పనులూ, బజారు పనులూ చేసుకుంటూ మధ్యమధ్య చీపురుపుల్ల తెమ్మనేవాడు. ఆయన కునుకు తున్నప్పుడు పెద్ద వేలితో మేము చేసినగుంటలు సమానమైన లోతులో ఉన్నాయో లేవో పరిశీలించటానికి చీపురుపుల్లలు పనికివచ్చేవి. గుంట అడుగుభాగం ఎగుడుదిగుడుగా ఉంటే సందర్భానుకూలంగా గుద్దులు, గోగునార, కొబ్బరినార చేంతాడులతో దెబ్బలు, మరీ ముదిరి పోయిన వాళ్ళకు పేంబెత్తంతో, చిట్టచివరికి చేపతోకతో ప్రహరణాలు తప్పేవికావు. కొంతకాలం వేటపాలెంలోని రావినూతల వేంకటప్పయ్య గారి వీధిబడిలోనూ చదువు వెలిగించాను. ఆయన మా తాతగారి గురువు. ఆయన విధించే శిక్షలు మరీక్రూరం. గోడకుర్చీలతో మొదలుపెట్టి కోదండందాకా స్థాయి భేదాలను బట్టి శిక్షలుండేవి. పలకమీద రాసిన అక్షరాలు – ముఖ్యంగా ప, య, వ – వంటివాటి అడుగుభాగాలు ఏకపంక్తిలో సమంగా లేకపోతే వంగోబెట్టి పేంబెత్తం దెబ్బలతో పిర్రలు సమంగా ఉండేట్లు చావగొట్టి అక్షరాల్లోని లోపాలను శరీరలోపాలకు అను గుణంగా సరిదిద్దేవాడు. దెబ్బకు దయ్యం వదిలి చీరాల చదువుకే సిద్ధపడవలసి వచ్చింది. హైస్కూల్లో ఆరో తరగతిలో చేర్చటానికి సన్నాహాలు మొదలుపెట్టారు పెద్దలు. చీరాల వేటపాలేల మధ్య యథేచ్ఛగా తిరిగేందుకు రసూల్‌ఖాన్ గుర్రబ్బండి సిద్ధంగా ఉండేది. కొంతకాలం అదో రాజయోగం. అలనాటి అక్షరాభ్యాస సహాధ్యాయుల్లో అఖిలభారత స్థాయికి ఎదిగిన ఏకైక వ్యక్తి ఎలెక్షన్ కమిషనరుగా రిటైరైన జి.వి.జి.కృష్ణమూర్తి. తక్కిన వాళ్ళం మాకు దక్కినంతలో కాలం వెళ్ళబుచ్చాం.

అప్పటి ఫస్ట్‌ఫారం (నేటి ఆరో తరగతి)లో నేను చేరిన సంవత్సరం చండప్రచండమైనది ఆధునిక భారతదేశ చరిత్రలో. అది 1942. బొంబాయిలో (ఇప్పటి ముంబాయి), కరాచీలో (నేటి పాకిస్తాన్ రేవుపట్టణం) భారతీయ నావికులు బ్రిటిష్ వారిమీద తిరుగుబాటుచేసి రక్తతర్పణం వదలిన ఏడది. దేశ నాయకులందరూ జైలు పాలుకాగా ఒక్క జయప్రకాశ్ నారాయణ్ రహస్య జీవితం గడుపుతూ స్వాతంత్ర్య సమరం సాగించిన సంవత్సరమది. జూన్‌లో ప్రవేశపరీక్ష గట్టెక్కి నూనె రంగనాయకులు అండ్ పానకాలు బోర్డు హైస్కూల్లో ఫస్ట్‌ఫారంలో చేరాను. నాటి ప్రధానో పాధ్యాయుడు ప్రాతస్మరణీయుడైన సింగరాజు శ్రీనివాసరావుగారు. ఆయన బదిలీ అయినా, పదవీ విరమణ చేసినా, కన్నుమూసినా నేటికీ చీరాల పౌరుల మనస్సుల్లో హెడ్మాష్టరంటే ఆయనే. చండశాసనుడని పేరు. కానీ ఎవరినీ దండించినట్లు గుర్తులేదు. ఒక్కనోటి మాటతో, భ్రూవిక్షేపం తో రెండువేల మంది విద్యార్థులనేగాక గ్రామస్థులందరినీ తన కన్నుసన్నలతో ఆజ్ఞాపించిన మహావ్యక్తి, ఉత్తమోపాధ్యాయుడు. ఆటపాటల్లోనూ తోడుగా ఉండేవాడు. ఆ బడిలో లోయర్ ఫామ్స్‌లో (థర్డ్ ఫారంలోనూ) తెలుగులేదు. అందువల్ల సంస్కృతం తరగతిలో కూర్చొని శబ్ద మంజరి వల్లించక తప్పిందికాదు. బడిచుట్టూ విశాలమైన దాదాపు నూరెకరాల మైదానం. ఒకవైపు రైలుపట్టాలు. తోటపని అంటూ నిర్బంధం లేదుగాని వీవింగ్ క్లాసు తప్పదు. బుట్టల అల్లకం, నవారునేత మొదలైనవి విధిగా నేర్చుకోవలసిందే. నేర్పినవాడు తరవాతి కాలంలో కవిరాజ పబ్లిషర్స్ అనే పుస్తక ప్రచురణాలయం స్థాపించి లక్షలు గడించిన, చీరాల్లో కమ్మహాస్టలు పెట్టించి విద్యావ్యాపారం మొదలుపెట్టిన, చివరిదశలో మదరాసు – మదురై రైలు మార్గం



కంట్రాక్టరుగా వెలిగిపోయిన టి.మాధవయ్యా గారు. నీతిపాఠాలుండేవి – మోరల్ ఇన్‌స్ట్రక్షన్ పేరిట. ములుకుట్ల గోపాలకృష్ణయ్యా గారు, కారెంపూడి రమాకాంతం గారు నీతిపాఠాలలో దిట్టలు. ఇంగ్లీష్ నిఘంటువొకటి రాసిన కె.ఎస్.రామా, ఎం.ఏ., ఎం.ఆర్.ఏ.ఎస్.గారు ఇంగ్లీషు పాఠాలు చెప్పారు. ఆయన బిరుదుల్లోని రెండోదాని కర్థమేమో తెలుసుకోటానికి పదేళ్ళు పట్టింది!

ఆగస్టు 15వ తేదీ ప్రాముఖ్యం అప్పట్లో తెలీదు. అది సెలవు రోజుకాదు. బడికి వెళ్తుంటే పరుగులుతీస్తూ మా సీనియర్లు ఎదురువచ్చి పారిపొమ్మన్నారు. నన్ను గట్టిగా లాగి ఇంటికి పొమ్మని గద్దించినవాడు అప్పటికే లాఠీదెబ్బలు తిని పరిగెత్తుతున్న రొండా నారపరెడ్డి గారు. కుటుంబ మిత్రులు. బహుకాలం తరువాత ఆయన నీటిపారుదల శాఖామంత్రి అయినాడు కాసు బ్రహ్మానందరెడ్డి గారి మంత్రివర్గంలో. (స్వస్థలంలోనూ చుట్టుపక్కలా ఆయన్ను మురుగుమంత్రి అని ముద్దుగా పిలిచేవారు – ఆ సంగతి ఆయనకు తెలుసో లేదో!). పరుగులు తీసే విద్యార్థులు ముందూ, వెంటాడే పోలీసులు వెనకా బడివైపు రావటం చూసిన హెడ్మాష్టరు గారు పిల్లల్ని లోపలికి నెట్టి గేటుకు తాళంపెట్టి తాళం చెవిని లోపలికి విసిరిపారేసి "ఎవరి అనుమతితో నా బడి ఆవరణలో ప్రవేశించా"రని పోలీసులతో పోట్లాట పెట్టుకున్నాడు. జిల్లా బోర్డు అధ్యక్షుడే స్వయంగా లిఖిత పూర్వకంగా ఆదేశించే దాకా ఎవర్నీ లోపలకు అడుగుపెట్టనీయనన్నాడు. పోరాడి ఓడి పోలీసులు తిరిగి వెళ్ళటం కళ్ళారా చూసి జయజయధ్వానాలు చేశాం. మాకు అప్పట్లో తెలిసింది హెడ్మాష్టరు వీరత్వమేగాని దేశం సంగతి కాదనేది కాస్త వాస్తవం. అసలు జరిగిందేమంటే వీర విద్యార్థులూ యువకులూ రైలు పట్టాలు కొంతవరకు పీకి పారేశారనేది. ప్రపంచ యుద్ధం సందర్భంగా ప్రభుత్వం తవ్వించిన కందకాలు పోలీసుల నుంచి వారిని కాపాడాయి మొదటిసారిగా!

## గృహవాతావరణం

తొమ్మిది నెలలపాటు చీరాల హైస్కూల్లో చదువుసాగింది. వేసవి సెలవుల్లో వేటపాలెం చేరాం. మా అమ్మగారికది ప్రసవ సమయం. రోళ్ళు పగిలే రోహిణీకార్తెలోనే మా గుండెలూ పగిలాయి. కుటుంబం కూలినంత పని జరిగింది. ప్రసవానంతరం ఆమె కన్నుమూసింది. తొమ్మిది రోజుల తమ్ముణ్ణీ, మా అందర్నీ వదిలి అనంతసీమలకు వెళ్ళిపోయింది. తండ్రి వచ్చి కనిపించి దేశయాత్రలకు వెళ్ళాడు – మమ్మల్ని మాతామహుడి పోషణలో వదిలి. ఏక పుత్రికా వియోగంతో మాతామహి మంచం పట్టింది. సంవత్సరంన్నరలోగా తల్లిచావుపిల్లవాడూ వాడిపై వాడూ కన్నుమూశారు. మా బాల్యం బండల పాలయింది. వేటపాలెంలోని బండ్ల బాపయ్యా హిందూ మిడిల్ స్కూల్లో సెకండు ఫారంలో చేరక తప్పిందికాదు. ఆదదిక్కు ఉండీ లేని కుటుంబం. నిరంతర దుఃఖంలో వయసు మళ్ళిన తాత. ముగ్గురు తమ్ములూ, ఒక చెల్లెలూ, నేనూ. గుర్తువచ్చినప్పుడల్లా "అడవి పక్షుల కెవ్వఁ డాహార మిచ్చెను మృగజాతి కెవ్వాఁడు మేతవెట్టె?"ననే భాగవత పద్యపాదం చదివి తన్నుతా నోదార్చుకుంటుండేవాడు తాత. తండ్రి ఇంట రాజకీయ వాతావరణం ఉండేది కొంతవరకు. తాత ఇంట నిత్యశోకం. అందుకూ వీల్లేని సమయంలో సాహితీ వాతావరణంగాని, వ్యవసాయ ధోరణులుగాని ఉండేవి. తాతగారి తండ్రి

అప్పటికింకా ఆరోగ్యంగా ఉండేవాడు – నరసింహంగారు. ఆయన భార్య "నిరతాన్న దానంబు నెరపి కీర్తి గడించె, కాశి బందా పరదేశి మంత్రి" అని ద్వాత్రింశన్మంత్రుల పట్టికలో ఉన్న పరదేశిగారి మనమరాలు. ఆమె తండ్రి పేరు నాగరాజు. ఆమె ఎంత కోపంతో, అసహనంతో ఉండేదో పెత్తాత అంత శాంతంగా ఉండేవాడు. అప్పుడప్పుడు "మలకలు మా ప్రచారములు మా ముఖముల్ విషవహ్నితోయముల్, ఖలులము రోషజాతులము గర్వుల మేమొక మంచి వారమా?" అనే పోతన్న కాళియమర్దన ఘట్టంలో రాసిన పద్యపాదాలు చదివి ఆమెను బాధించే వాడు. "నలినదళాక్షి! ప్రాణులకు నైజగుణంబులు మానవచ్చునే?" అని ముక్తాయించేవాడు – నాగరాజ పుత్రివని ఆక్షేపించటానికి.

ఒక పెద్ద లోగిలిగా ముప్పాతిక ఎకరం స్థలంలో అరవై గదులతో మదురుగోడలకూ పశువుల కొట్టానికీ మధ్య ఉన్న ఆ నివేశనస్థలాన్ని గాలివానకు దెబ్బతిన్నదని మూడు భాగాలుగా విభజించి మధ్యభాగంలో నరసింహంగా రుండేవారు. ఒక వైపు ఆయన పెద్ద కొడుకైన మా తాతగారు సుబ్బారావుగారూ, రెండోవైపు ఆయన దత్తుకిచ్చిన రెండో కొడుకు కామరాజు భద్రిరాజుగారూ ఉండేవారు. రెండు వైపులనుంచీ తలుపులు పెరట్లోకి, ముందున్న స్థలంలోకీ ఉండేవి. తెలవారుతుండగా నరసింహంగారు బయలుదేరి మైలున్నర దూరంలోని సముద్రానికి స్నానార్థం వెళ్ళేవాడు. అది దినచర్య. పొలాలెలా ఉన్నాయో చూసుకొని పైగుడ్డ రెండు వైపులా రెండు మూటలుగా కట్టి ఏ పది గంటల ప్రాంతానికో ఇల్లు చేరేవాడు. ఒక మూటలో కూరగాయలు. రెండో దాంట్లో పిల్లలకోసం పళ్ళు. పన్నెండింటికి స్నానంచేసి జపంచేసుకొని భోజనంచేసి పడుకొని మూడింటికి లేచి ముఖం కడిగి భారతమో, భాగవతమో పెద్దగా చదివే వాడు. నాలుగింటికి మళ్ళీ సముద్ర స్నానానికి వెళ్ళి ఆరింటికి ఇల్లు చేరేవాడు. ఆరుబయట బల్లమీద పరుపుమీద శయనించి పిల్లలకు పద్యాలు నేర్పేవాడు. దుప్పటి కప్పి తన వేలితో దాన్ని పైకిలేపి "బాలుం డీతఁడు కొండ దొడ్డది మహాభారంబు సైరింపఁగాఁ జాలండోయని... ఈ శైలాంభోనిధి జంతు సంయుత ధరాచక్రంబు పైఁబడ్డ నా కేలల్లాడదు బంధులారా! నిలుఁ డీక్రిందన్ బ్రమోదంబునన్" అనే గోవర్ధనోద్ధరణ ఘట్టంలోని పద్యం నేర్పేవాడు. ఇతర సమయాల్లో స్ఫటికతావళం తిప్పుతూ 'ఓం నమశ్శివాయ' అని జపిస్తుండేవాడు. మా అమ్మగారు గతించిన తరవాత సరిగా ఆరునెలల మీద అరక్షణం బతకనని చెప్పి, చెప్పిననాడు బంధు మిత్రులందరికీ భోజనాలు పెట్టించి పండు వెన్నెలలో పడుకొని తావళం తిప్పుతూనే కన్ను మూశాడు! ఆయన కేజబ్బూ లేదు. స్వచ్ఛంద మరణం అనేది సాధ్యమనిపించా దన్నారందరూ. ఆ తరువాత పన్నెండేళ్ళకు మాకు కారంచేదునుంచి నడిచివచ్చి పాలుపోసే ముసలామె తానుకూడా జాగర్లమూడి కుప్పుస్వామిగారి లాగా మంచి గంధపు కట్టెలతో తగలబడిపోతానని అన్న రోజున కన్నుమూసింది, ఏ రోగమూ లేకుండానే! మరి ఆమె నేమనాలి?

**గ్రామ వాతావరణం**

నరసింహంగారి పుణ్యమా అని బాల్యంలోనే సాహిత్యాభిమానం కలిగింది. పంగులూరి వారి సత్రమని వారి పెద్దలు భోగలింగస్వామి గుడిపక్కన అయిదారు కుటుంబాలుండే



వసతులతో ఒకటి కట్టించారు. అందులో ఒక గదిలో 'సరస్వతీ గ్రంథాలయ'మని ఆరు అద్దాల బీరువాలనిండా తెలుగు పుస్తకాలుండేవి. మాతృవియోగ దుఃఖం మరిపించేందుకు నిర్బంధంగా శతకాలూ చాటు పద్య మణిమంజరి వంటి పుస్తకాలూ ఒప్పచెప్పించారు. నా మీద – నేను తెలుగు చదువుతున్నానని కోపగించుకుని – మా తాతగారా పుస్తకాలను తరవాతి కాలంలో సారస్వత నికేతన గ్రంథాలయానికి ఇచ్చివేశారు. ఆ మాతామహుల ఇంటిలోనే వావిలికొలను సుబ్బారావు గారినీ (వాసుదా సంటారాయన్ను) కొప్పరపు సోదర కవుల్లో పెద్ద వాళ్ళిద్దరినీ చూశాను మొదటిసారి – వారిని గురించి మరేమీ అప్పటికి తెలియకపోయినా. పంగులూరి వారి సత్రంలోనే కొప్పరపు వారిలో మూడోవాడైన బుచ్చిరామయ్య గారు కొంతకాలం ఉచితంగా నివసించారు. "మూర్ఖకోపుండ బుచ్చిరాముండ నేను" అనే మకుటంతో ఆయన ఆశువుగా చెప్పగా నేను వినగా నా స్మృతిలో మిగిలింది ఈ భాగమే. ఆయన కొడుకు మంగపతి మా స్కూల్లోనే చదువుతుండేవాడు. చాలా పేదరికంలో మగ్గుతుండేవారు. "మాపటిపూట కేమిగతి? మంగపతీ!" అని తల్లి పద్యంలో అడిగితే "ఇక మంచమే గతీ" అని కొడుకు పూరించటం నేను విన్నా. ఆ సత్రంలోనే కొంతకాలం జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు (కరుణశ్రీ) ఉండేవారు. వసారాలో కుక్కిమంచం మీద కూర్చుని ఆయన తన పద్యాలకు మెరుగులు దిద్దుకోవటం చూశాను. అక్కడే కొద్దికాలం ఉండి తరవాత సమీపంలోని చక్రవర్తి రంగాచార్యుల గారింట్లో అద్దెకున్న మునిమాణిక్యం నరసింహారావు గారి నెరుగుదును. ఆయన ద్వితీయ పత్నిని చూసి "ఈమెగారేనా? కాంతంగారు?" అని ఆయన్ను ప్రశ్నించిన వాళ్ళనెరుగుదును. ఆయన మొదటి సంబంధం కుమారుడు రఘునాథ యాజ్ఞవల్క్య. ఆ తరువాత చాలా కాలానికి తెలుగు ఆనర్స్ రెండో సంవత్సరంలో పోస్టుగ్రాడ్యుయేట్ విద్యార్థిగా చేరి నా సహాధ్యాయుడుగా రెండేళ్ళు గడిపాడు. రచయితగా అతడి కలం పేరు 'మురయా.'

బడి సంగతికి వచ్చేముందు పరిసర వాతావరణం విషయం చెప్తున్నాను. మేమున్నది వేటపాలెంలో భాగమైన నాయునిపల్లిలో. మా ఇంటికి పది బారల దూరంలో జాగర్లపూడి వేంకట సుబ్బయ్య 'శతావధాని' గారుండేవారు. ఆయన అవధానాలు నేను చూడనూ లేదు – విననూ లేదు. రంగాచార్యుల వారు మా తాతగారికి అక్షరాభ్యాసం చేశారట. నేను చూసేనాటి కాయన రంగురంగుల సిరాలతో రామకోటి రాస్తుండేవాడు. అన్నవస్త్రాలకు లోపంలేదుగాని అంతో ఇంతో తీసుకొని తన దగ్గరకు వచ్చిన రైతులకు రక్షరేకులు ఇస్తుండేవాడు. చిన్న అక్షరాలు రాయలేని దశలో ఇది మంత్రం, బయటపెడితే ప్రమాదమని భయపెట్టి నాచేతకూడా "శ్రీవత్స గోత్రంవారి సింహం వచ్చింది. చీడపురుగుల్లారా! పారిపోండి!" అని రాయించి రాగిరేకులో పెట్టి చుట్టించి ఇస్తుండేవాడు. (చాలా కాలం సింహాలు చీడపురుగుల్ని చంపుతాయా? అన్న అనుమానం ఉండేదిగాని, ప్రస్తుతం పురుగుమందుల కంపెనీ వాళ్ళ వాణిజ్య ప్రకటనలు చూసిన తరువాత నమ్మకాలు శాశ్వతమనే నమ్మకం కుదిరింది). ఆయన పెంపుడు కొడుకు రంగసామి ఉచితంగా హోమియో వైద్యం చేస్తున్నందుకు కోపించి బయటకు పంపాడు. రంగసామి గారిని బాబాయని పిలుస్తుండే వాళ్ళం. ఆయన పరమ సాధువు. 'ఆంధ్రభూమి'లో ఆయన చాలాకాలం

పనిచేశాడు. దశాబ్దాల తరువాత హైదరాబాద్‌లో ఆయన తిరుమల రామచంద్ర గారితో వియ్యమందిననాడు కలవగలిగాను మళ్ళీ. మన ఊళ్లోనే అయిదారుగురు అవధానులున్నారని ఎదురింటి వారు చెప్పగా విన్నాను. ఆ బిరుదుకు అర్థమేమో అప్పటికి నాకు తెలియదు.

మిడిల్ స్కూలు విశాలమైన భవనంలో సువిశాలమైన స్థలంలో ఉండేది. మూడు (బాల్) బ్యాడ్‌మింటన్ కోర్టులుండేవి. బడి తెరవటానికి అరగంటముందే 'తోటపని' పాఠాలుండేవి. చిన్న నోటు పుస్తకం, స్కేలు, దారపుండ వంటి సాధనాలు సిద్ధంగా ఉండాలి. అందుకు కేటాయించిన స్థలంలో చిన్న చిన్న మళ్ళు చేసి బడిపిల్లల చేత విత్తనాలు నాటించి, వాటి పెరుగుదలను దారంతో కొలిచి స్కేలుతో సరిచూసుకోమనేవారు. ఈ పని మానే వీల్లేదు – దేహశుద్ధికి సిద్ధంకాకపోతే. అప్పటి హెడ్‌మాస్టరు మల్లాది శ్రీరామశాస్త్రిగారు ముమ్మూర్తులా (వేషధారణతో సహా) కళా వెంకట్రావు గారిలా ఉండేవాడు. తరవాతి కాలంలో ఆయన రేషనింగ్ ఆఫీసరుగా, తుని ఎస్టేట్ మేనేజరుగా పనిచేశాడు. ఆయన తొలిరోజున చెప్పిన ఇంగ్లీషు వ్యాకరణం పాఠంలోని మొదటి వాక్యం గుర్తుందికాని అదేం వ్యాకరణమో ఇప్పటికీ తెలీదు. 'Grammar is essentially of three parts: etymology, orthography and syntax' అనేది ఆ పాఠం. అస లావరసేమిటో బోధపడలే దిప్పటికీ! ఈ బడిలో సంస్కృతం లేదు. తెలుగులో చేర్చుకోవాలంటే నాలుగు ఆట విడుపు పద్యాలైనా తప్పుల్లేకుండా చదవాలని షరతు పెట్టింది ఆదిపూడి సోదరకవుల్లో చిన్నవాడైన అబ్బరాజు సూర్యనారాయణ గారు. ఆయన అష్టావధానం కూడా చేశారట గాని నేను వినలేదు, చూడలేదు. కోపంవచ్చినప్పుడు ఆశువుగా పద్యాల్లో తిట్టడం మాత్రం నా అనుభవంలోనూ ఉంది. నిన్న చెప్పిన పద్యాన్ని తప్పుల్లేకుండా ఒప్పచెప్పకపోతే వేళ్ళు విరిచేవాడు. తరువాత తానే బాధపడి "నన్నయ, తిక్కన, పోతన మీకేం అపకారం చేశార్రా? వాళ్ళ పద్యాలను ఖూనీ చేస్తున్నా"రనేవాడు. చాలా వరకు మా తప్పులు శబ్దదోషాలు కావుగాని ఛందోదోషాలేనని ఆయనే తేల్చుకున్నాడు. సాయంత్రం బడిపూర్తికాగానే చచ్చినట్లు 'సులక్షణసారం' నేర్చుకోక తప్పింది కాదు. ఆయన సమకూర్చిన "ఆంధ్ర మహాభారత నిఘంటువు" రెండు సంపుటాలను తరవాతి కాలంలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ముద్రించారు – కొంత రగడ జరిగిన తరవాత.

పద్యవిద్యకు నా ప్రథమ గురువాయనే. గణస్వరూపం చెప్పిన తరవాత "నానన నాననా..." మొదలుగా యతిప్రాసల దగ్గర తలూపుతూ అభ్యాసం చేయాలని, దాన్ని చంపకమాలగా మార్చాలంటే "నననన నాననాన..." అని మార్చవచ్చునీ మొదట చెప్పిందాయనే.... నిద్రమత్తులో చెప్పినా గణయతిప్రాసభంగం జరక్కూడదన్నాడు. మరి మాటల్లేకుండా పద్యాలు చెప్పేదెలాగని అడిగితే ఆయన మూడు కర్తవ్యా లుపదేశించాడు. ఒకటి: "శతకాలూ దైవప్రార్థనలూ చదివి వాటిలోని మాటలను అటూ ఇటూ మార్చిన సంబోధనాంతాలతో పద్యాలు రాయటం సులభం. మొదట అలా అఘోరించండి". రెండు: "రోజూ సారస్వతనికేతనం మీదుగా కొంపలకు పోండి. అక్కడ పదినిమిషాలు పెద్దల ఉపన్యాసాలు వినవచ్చు. ఆ విన్న మాటల్లో పద్యాలు రాయటానికి పనికివచ్చే వాటిని గుర్తుపెట్టుకొని వాడండి". మూడు: "వెస, తగ, రహి వంటి పూరకాలను నేర్చుకుంటే పద్యాలను పూర్తిచేయటం తేలిక. మొదట ఇంతవరకైనా చేతనయితే తరవాత



పెద్దకవుల పద్యాలు చదివి అర్థవంతంగా ఎలా రాయాలో తెలుసుకోవచ్చు". "మీ నోటికివచ్చిన ఛందస్సులో కనిపించిన ప్రతి వస్తువునూ చేతనైనట్లు వర్ణించండి. కాలక్రమాన తప్పుల సంఖ్య తగ్గుతుం"దని ధైర్యం చెప్పినవా డాయనే. "అభ్యాసము కూసువిద్య" అని గుర్తుపెట్టుకొమ్మన్నాడు. పనిలో పనిగా మీరెంత గింజుకొని చచ్చినా కాళిదాసులూ, నన్నయలూ కారని కూడా హెచ్చరించాడు. అదేమంటే, అంతవాళ్ళయ్యే మహాత్ములు తనవంటి బడిపంతులు దగ్గర చదువుకోరని, వాళ్ళకు జననాంతర సంస్కారమో, మరేదో ఉండి అంతవాళ్ళయినారనీ నమ్మబలికాడు.

అది మొదలు వీలున్నప్పుడల్లా సారస్వత నికేతనానికి వెళ్ళి అక్కడి ప్రసంగాలు వినటం, దొరికిన పుస్తకాలు చదవటం అలవాటయింది. సమానాభిరుచులున్న విద్యార్థులం నోటికి వచ్చినట్లు తోచిన విషయాలమీద పద్యాలల్లటం, ఒకరి తప్పులొకరు చూపి తగాదాపడటం, ఈ సంగతి బయటపడి తన్నులు తినటం తప్పలేదు. చదువుమాని ఈ కవిత్వం పిచ్చేమిటని ఇంట్లో చీవాట్లు. సందుదొరికినపుడు (బాల్) బ్యాడ్మింటన్ అభ్యసించటం. ఆ విద్యలో మా గురువు బహుచమత్కారీ, వీరావేశంతో ఆడగలవాడూ అయిన పోస్టుమన్ భద్రకాళి. ఏ కొద్దిమందికో తప్ప అతడింటికి ఉత్తరాలు తీసుకొనిపోయి ఇచ్చేవాడు కాదు. పోస్టాఫీసుకెదురుగా ఎత్తరుగుల మీద కూర్చొని వెక్కిరింతలతో, వేళాకోళాలతో ఉత్తరాలిచ్చేవాడు. ఈ ఉచిత వినోదంకోసం పెద్దలూ, చిన్నలూ ఎగబడేవాళ్ళు. బడికి పోవటంకన్నా అందుకు సన్నాహాలు చేసుకోవటం పెద్ద బాధగా ఉండేది. ఒక చిన్న పింగాణీబుడ్డి మెడకు తాడుకట్టాలి. అందులో సగానికి పైగా నీళ్ళుపోసి అందులో సిరాబిళ్ళవేసి కరిగించాలి. పుస్తకాల సంచి ఒక చేతిలో ఉంటే రెండో దానితో ఈ సిరాబుడ్డినీ, పుల్ల కలాన్నీ భద్రంగా తీసుకపోవాలి. త్వరగా నడిస్తే సిరాచింది గుడ్డలమీద పడుతుంది. సిరాబిళ్ళ ఖరీదెక్కువ. అందుకని కరక్కాయసిరా తయారుచేసి ఇచ్చేవాళ్ళు. అది రాసేటప్పుడు స్పష్టంగా ఉండేదికాదు. క్రమంగా ముదిరి కామారపు జీడిలా రంగుమారుతుంది. కాగితం చినగాల్సిందేగాని సిరా వెలిసిపోతుందన్న ప్రశ్నేలేదు. గుడ్డలకు సిరామరకలైనందుకు తిట్లూ, దెబ్బలూ తప్పవు. చాలా వరకు పెన్సిలుతోనే రాత. దాన్ని చెక్కటంలో బ్లేడువల్ల వేళ్ళు తెగేవి. ముక్కు విరగటం పరిపాటి. క్లాసులో చెక్కటం కుదరదు. సాయంత్రం ఆటలో, డ్రిల్లో తప్పదు. తొందరలో సంచీలు కిందపెట్టడంలో సిరా ఒలికిపోయేది. చెరపట్టీ, కోతికొమ్మచ్చీ హుషారైన ఆటలు. దెబ్బలు తాకేవి. బ్యాడ్మింటన్ ఆడటానికి కనీసం బ్యాటుకొనేందుకైనా పెట్టుబడి కావాలి. అందరికీ అది సాధ్యంకాదు. బ్యాటు అల్లిక మరో కష్టం. రోజూ ఉదయం ఇంటి నుంచి తెచ్చి సాయంత్రం పొద్దుబోయిన తరవాత దాన్నికూడా మోస్తూ లైబ్రరీకి వెళ్తే, గాడిదలకు చదువుల్లేవుగాని ఆటలు ముఖ్యమైనవని ఆక్షేపించే వాళ్ళు – ముఖ్యంగా అక్కడ సాయంత్రాలు గడిపే ఉపాధ్యాయులు.

రెండో ప్రపంచయుద్ధం 1939 సెప్టెంబరులో మొదలయింది. 1945కు గాని ముగియ లేదు. 1942 ప్రాంతాల్లో బర్మాషెల్ కంపెనీ వంటి వాటిలో షేర్లు కొన్న వ్యాపారులు చర్చిలూ బ్రిటనూ గెలవాలని వాదిస్తే, నేతాజీ సుభాష్ చంద్రబోస్ జపాను జర్మనీల సాయంతో మనకు స్వాతంత్ర్యం సంపాదించి పెడ్తాడని కొందరు దేశభక్తులు విశ్వసిస్తే, అప్పుడప్పుడే రంగప్రవేశం

చేసి పల్లెలక్కూడా వ్యాపిస్తున్న కమ్యూనిస్టులు సామ్రాజ్యవాద వ్యతిరేకోద్యమం గురించి సభలు పెడ్తుండేవాళ్ళు. యుద్ధ విషయాలు తెలుసుకోడానికి రెండే మార్గాలు. ఒకటి ఏకైక తెలుగు దినపత్రిక ఆంధ్రపత్రికలో వచ్చే వార్తలు. వాటికోసం గ్రంథాలయానికి పోకతప్పదు – నూటికి తొంభై తొమ్మిది మంది చదువుకున్న వాళ్ళకు. అందరికీ అందుబాటులో ఉన్న రెండోమార్గం పంచాయతీ కార్యాలయంలో ఉన్న రేడియో. అందులో మదరాసు కేంద్రం వార్తలు తప్ప మరేవీ వినే వీలులేదు – ప్రభుత్వం సీళ్ళు వేసినందువల్ల. ఒకరిద్దరికి సొంత రేడియోలున్నా బి.బి.సి, బెర్లిన్ వార్తలను రహస్యంగా వినాల్సిందేగాని పెద్దగా వినిపిస్తే నేరం. ఇవన్నీ విద్యార్థులకు వినోదంగా ఉన్నా, పెద్దలకు ప్రాణసంకటంగా ఉన్నది రేషనింగ్ విధానం.

**రేషనింగు**

ఎంత ధనవంతుడైనాసరే సహకార సంఘంవారి దుకాణంలో బియ్యం నుంచి సమస్తమైన కిరాణా సామగ్రినీ కొనవలసిందే. గుడ్డలుకూడా అంతే. కిరసనాయిల్ రెండు రకాలు. పొగ ఎక్కువగా వచ్చే ఎర్ర కిరసనాయిలును పొయిరాజేసుకోవటం నుంచి దీపం వెలిగించుకొనేదాకా వాడుకోవాలి. కుటుంబంలోని జనసంఖ్యను బట్టి ఒకటో రెండో కాయలిచ్చేవారు. బడికిపోయే పిల్లలున్న ఇంటికి ఒకే ఒకకాయ తెల్ల కిరసనాయిలిచ్చేవారు. నల్లబజారు అప్పుడూ ఉండేది. దొంగతనంగా కిరోసిన్ డబ్బా కొన్నా ఇంటికి చేరేదాకా నమ్మకంలేదు. కమ్యూనిస్టులు పట్టుకొని పోలీసులకు ఒప్పచెప్పేవాళ్ళు. పోలీసు శాఖలో ఇప్పుడున్నంత అవినీతి బ్రిటిష్ వారి హయాంలో లేదు. పంచదార, మైదాపిండి, చివరికి బాంబుల తయారీలో పనికివస్తుందన్న కారణంతో దాల్చినచెక్క రేషన్లో మాత్రమే దొరికేవి. దొరకని వస్తువులను ఎలాగో సాధించి తెచ్చినవాడే మొగాడని ఆడవాళ్ళు ప్రశంసించే వాళ్ళు. తెల్ల కిరసనాయిలు హెడ్మాస్టర్ల పర్యవేక్షణలో బడిలోనే దొరికేది. బుడ్డిదీపం పెట్టగలిగిన వాళ్ళు మధ్య తరగతి. హరికేన్ లాంతరుంటే సంపన్నులన్నమాట. పండగలకూ, పబ్బాలకూ లష్టరు వెలిగించటం పెద్ద హోదాకు చిహ్నం. ప్రమిదలూ, ఆముదపు దీపాలూ సర్వసాధారణం. చమురు దీపాలు మరికాస్త ఖరీదు.

రేషన్‌కార్డు లేని బతుకు దుర్భరం. పొరుగూరు వెళ్ళి పూటకూటింట భోజనం చేయాలన్నా సంతకం పెట్టాలి. లేదా వేలిముద్ర వేయాలి – రికార్డు పుస్తకంలో. శుభకార్యాలకు ఆహ్వాన పత్రికలు పంపితే వాటి చివర ఒక షరా ఉండి తీరాలి: "మీమీ రేషన్ కార్డులను దయచేసి తీసుకొని రండి" అని. రైతులు తమ కుటుంబావసరాలకు ప్రభుత్వం నిర్ణయించినంత ధాన్యం సొంతానికి ఉంచుకొని మిగులును ప్రభుత్వం వారు చెప్పిన ధరకు, నిర్దేశించిన బియ్యం మరవారికి అమ్మి రశీదులు చూపాలి. ఒక ఊళ్ళో పొలముండి మరో ఊళ్ళో ఉద్యోగరీత్యా కాపురమున్న వాళ్ళు తహశీల్దారు/రేషనింగ్ ఆఫీసరు అనుమతితో నిర్ణయించిన పరిమితిలో రవాణా చేసుకోవచ్చు.

**డబ్బు విలువ**

ఇంత హంగామా ఉండగా మరోవైపు విచిత్ర వ్యాపారం జరిగేది. బెస్తవాళ్ళు మైలున్నర నడిచి కిరాణా కొట్టుకు వచ్చి ఒక దమ్మిడీ చేతిలోపెట్టి ఒకతోలీకి నూకలూ, మరో తోలీకి ఉప్పు,



మిరపకాయ, చింతపండు, తాలింపు సామగ్రి ఇమ్మని కొనుక్కొని పోయేవాళ్ళు. నేను తోలీ అనేమాట విన్నానేగాని నాణెం చూడలేదు. అప్పట్లో రూపాయికి పదహారణాలు. అణాకు నాలుగు కాణులు. కాణీకి మూడు దమ్మిడీలు. దమ్మిడీ అనేది రూపాయలో నూట తొంభై రెండో వంతు. అందులో సగంట తోలీ. అర్ధరూపాయి, పావలా, బేడ, అణా, అర్ధణా, కాణీ, దమ్మిడీలను నేనెరుగుదును. రూపాయికి నాలుగు పావలాలు, ఎనిమిది బేడలు, పదహారణాలు, అరవై నాలుగు కాణీలు. 'పదహారణాల ఆంధ్రుల'మనే బడాయిమాట ఆ కాలంలో పుట్టిందన్న మాట. పైగా దశాంశమానం వచ్చిన తరవాత కూడా నిలిచింది. 'నూరు పైసల ఆంధ్రు'లనే మాట పుట్టినట్లు లేదు. ఒక్కోసారి దమ్మిడీ కూడా లేని పేదలు గవ్వలు తెచ్చి ఇచ్చేవాళ్ళు సరుకులకోసం. వాటి లెక్క నాకు సరిగా తెలీదు. నూకలిస్తే కూరగాయలిచ్చేవాళ్ళు. అన్నట్లు తోలీకి తవ్వెడు (అంటే కిలో) నూకలిచ్చే వాళ్ళని చెప్పలేదు గదూ. అది నా తప్పే. గవ్వల వాడుక మరీ తక్కువే గాని వాడుకలో 'వాడు గుడ్డిగవ్వకు కొరగాడు' అనే వాక్యం ఇంకా నిలిచింది! యుద్ధ తీవ్రత పెరిగిన తరవాత కాణీ మధ్య ఖాళీ ఉంచి తయారు చేశారు. దానికి చిల్లికాణీ అని పేరు. మరో విశేషం వాటితో మెడలో దండలూ, నడుముకు ఒడ్డాణాలూ నూలు తాటితో కట్టి ఒంటిమీద ధరించే వాళ్ళు కొందరు. దమ్మిడీ రాగి నాణెమనీ రూపాయీ, అర్ధరూపాయిలు వెండి నాణేలనీ చెప్పటం మరిచాను. రూపాయి బరువు ఖచ్చితంగా ఒక్క తులం. గవర్నమెంటు ట్రెజరీల్లో – అప్పట్లో పెద్ద నగరాల్లో తప్ప బ్యాంకుల్లేవు – వెయ్యేసి రూపాయలను అల్లిన జనపనార సంచుల్లో పెట్టి తాడు ముడివేసి ఇచ్చేవారు. 'సంచీలు కుమ్మరించటం' అప్పుడు పుట్టినమాట. సంచీ అంటే వెయ్యి రూపాయలు. విడిగా వంద తులాల రాళ్ళతో తూచి నూర్రూపాయలిచ్చే వాళ్ళుగాని పాతవి / అరిగిన విమ్మని బతిమాలటం కద్దు – ఒకటి రెండు రూపాయలెక్కువ వస్తాయని.

ఒకటి, అయిదు, పది, వంద, వెయ్యి రూపాయల నోట్లుండేవి. అవి సాధారణం. అయిదు, పది వేల రూపాయల నోట్లు కొద్దిగా ఉండేవి. వాటిని రెండు మూడు ముక్కలుగా కత్తిరించి పోస్టులో పంపవచ్చు. మళ్ళీ అతికించి మంచినోట్లుగానే చెలామణీ చెయ్యవచ్చు. ఈ నోట్ల విషయంలో పదేళ్ళ తరవాత ఓ కథ విన్నాను– పినతాత బారిష్టరు చెప్పగా. అప్పట్లో (అంటే 1914కు ముందు – మొదటి ప్రపంచయుద్ధం మొదలుకాక మునుపు) రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యంలో చెలామణీలో ఉన్న కాగితం కరెన్సీలో దాని విలువ 'మొత్తంమీద' ఎంతో స్పష్టంగా లేదట. అది ఆసరాగా తీసుకొని చదువు పూర్తిచేసుకుని స్వదేశానికి వస్తున్న టంగుటూరి ప్రకాశం పంతులుగారు పౌండు నోటిచ్చి చిల్లర ఇమ్మని పోస్టువారి నడిగితే (లండన్లోని హైడ్ పార్కు బ్రాంచీలో) షిల్లింగులిచ్చారట. పెన్నీలు కూడా ఇవ్వాలని పేచీపెట్టుకొంటే వీలుకాదని రాసి ఇచ్చారట. ఆయన ఇది 'లోకవంచన' అని లండన్ హైకోర్టులో వాదించి గెలిచాట్ట. ఎందుకంటే 'the sum of' అనే భాగం లేనందువల్ల ఎన్ని రకాల చిల్లర నాణేలుంటే అన్నీ ఇవ్వాల్సిందేనన్నది గెలిచిన వాదమట. ఆ సాయంత్రానికి సాయంత్రం ఆర్డినెన్స్ జారీచేసి బ్రిటిష్ ప్రభుత్వం ఆ మాటలున్నట్లే భావించాలని ప్రకటించిందని, అప్పుడు గండం గడిచిందనీ సర్దార్ స్వరణ్‌సింగ్ అనే పేరుమోసిన న్యాయవాది – స్వతంత్ర భారతంలో మొదటి విదేశాంగమంత్రి – తాను

ప్రచురించిన "A Hundred Great Small Cases" అనే గ్రంథంలో ఈ విషయముందని దాఖలా చూశానుగాని ఆ పుస్తకం మళ్ళీ నా కంటపడలేదు. అది నా అభాగ్యమో, ఆంధ్రకేసరి దురదృష్టమో చెప్పలేను.

రేషనింగ్ గొడవల్లోపడి బడిసంగతి మరిచినందుకు క్షమించాలి. బడిలోనే ఏ సెక్షనుకా సెక్షన్ ప్రత్యేకంగా సరస్వతీ పూజచేసి తీరాలనే ఆచారం ఉండేది. విద్యార్థులు తోటల్లో, దొడ్లలో సేకరించిన పూజాద్రవ్యాల పేర్లేమిటో, వాటికున్న మూలికా వైద్యశక్తి ఏమిటో ఉపాధ్యాయులు వివరించేవాళ్ళు. పనిలో పనిగా విద్యార్థులం జీడిమామిడి కాయలు తిన్నా గింజలు ఇక్కడ వదిలేసి పొండనే వాళ్ళేగాని తిండి నిషేధించేవాళ్ళు కాదు. పేపకాయల చక్కదనం, రుచీ వర్ణనాతీతం. సీమచింతకాయ లెక్కడబట్టినా ఉండేవి – కంచెలమీద. పెద్ద పిల్లలు ఎత్తున ఉన్నవి కోసినప్పుడు చిన్న వాళ్ళకు ఇవ్వకపోతే వాటినే 'లద్దెకాయ'లనీ అవి తింటున్నారనీ గోలగా అరుస్తూ దొర క్కుండా పారిపోవటం పెద్ద వినోదం. వినాయక చవితి కూడా బడిలోనే జరిగేది. వీధిబడిపిల్లలు దసరా పద్యాలూ, పాటలూ చదువుతూ ధనుర్బాణాలతో ఇంటింటికీ ఊరేగింపుగా పోవటం "అయ్యవారికి చాలు అయిదు వరహాలూ, పిల్లవాళ్ళకు చాలు పప్పుబెల్లాలూ" అని పాడటం అనే వేడుక అప్పటికే తిరుగుముఖంలో ఉంది. ఇప్పు డున్నట్లే లేదు. జీతం లేకున్నా బడిపంతుళ్ళకు అప్పటి సమాజమిచ్చిన గౌరవమర్యాదలు అద్భుతం. ఎంత పెద్ద రైతైనా ఎదురు నడిచేవాడు కాదు. చెప్పులు విడిచి నమస్కరించేవాడు. చుట్టలు ముందుగా పారెయ్యలేకపోతే వీపు వెనక దాచేవాళ్ళు. తమకు అందుబాటులో ఉన్న ధాన్యం, కూరలూ, నారలూ ఇంటికి పంపి ఆదుకునే వాళ్ళు. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత స్వతంత్ర భారత రాజకీయవాదులు సాధించిన ఘన కార్యాల్లో విద్యావిధానాన్ని మార్చటం, ఉపాధ్యాయులను అగౌరవించటం, పాఠశాలనుంచి విశ్వ విద్యాలయ స్థాయిదాకా కులమత ప్రాంతాది భేదాలను రెచ్చగొట్టి తమతమ వారితో పదవులు నింపటం, విద్యావ్యాపారాన్ని సర్వవిధాలా ప్రోత్సహించటం. బదిలీలూ, అత్యాచారాలూ సర్వ సాధారణమైనాయి. రానురాను జీతాలూ, భరణాలూ తెగపెరిగాయి – పెరుగుతున్నాయి. అందు వల్ల సమర్థులైన మన వాళ్ళనే ప్రోత్సహించాలనేది జాతీయ విద్యావిధానానికి మూలసూత్రమైంది.

**సారస్వత నికేతనం**

వేటపాలెం బడిలో రెండు విద్యాసంవత్సరాలు మాత్రమే చదవటం సాధ్యమయింది, అది మిడిల్ స్కూల్ కాబట్టి. ఆ రెండేళ్ళలో సగకాలమైనా సారస్వత నికేతనంలో గడిచింది. తెలుగు వారిలో ప్రసిద్ధులైన కవిపండితుల్లో ఒకరిద్దరిని తప్ప తక్కిన అందర్నీ అక్కడే చూశాను, విన్నాను. స్వామీ శివశంకరస్వామి అనే తల్లావఝుల శివశంకరశాస్త్రి గారికి గ్రంథాలయంలోనే తలదాచు కొనే వసతి కల్పించారు – ఆయన కుమారుడు కృత్తివాసతీర్థులక్కడ ఉద్యోగం చేస్తూ కాపురముం టున్నా. ఆయన 'సభాపతి'త్వం గ్రంథాలయ సభలకు తప్పలేదు. మునిమాణిక్యం నరసింహారావు, కొప్పరపు బుచ్చిరామయ్యలతో కలిసిన ఈ త్రయం సాయంత్రాలు గ్రంథాలయాల్లో గడిపేవారు. ఎక్సయిజ్ డిపార్టుమెంటులో ఉద్యోగం చేస్తున్న మాచిరాజు దేవీప్రసాద్ ఏ కాస్త అవకాశం దొరికినా ప్రత్యక్షమయ్యేవాడు. అప్పటికే అతడు పేరడీ కవిగా సుప్రసిద్ధుడు. 'రాజకీయ



బాధితు'డనే రచన తెచ్చి సరిదిద్ది ఇస్తే భారతిలో ప్రచురిస్తానని స్వామీ శివశంకరులను వేధించా డొకసారి. అందులో 'ఉన్న భార్య దూరాన ఇరుక్కుపోయె'నన్న చోట యతిలేదని స్వామివారూ, ఇరుక్కుపోయి కనిపించటంలేదనీ, నా ఎదుటనే యతి ఉండగా లేకపోవటమేమనీ మాచిరాజూ వాదించుకున్నారు! జరుక్‌శాస్త్రి స్వామివారికిచ్చిన బిరుదును తీసుకుని "పీఠికా పరమేశ్వర బిరుదరాజ, మాన బభ్రాజమాన!" అని సంబోధించి, బభ్రాజమాన అనటం అగౌరవించటమంటే బాగా రాజమానమైతే బభ్రాజమాన మనవచ్చనీ, తప్పయితే క్షమించమనీ కాళ్ళు పట్టుకోవటం, 'మహాప్రభో! నీ పోలీసు పట్టు వదిలిపెట్టు, కాళ్ళు విరిగిపోతున్న'వని స్వామివారనటం, "తెలుగులో 'ప్రభో' అని సంబోధించవచ్చునా? అందుకు బాలవ్యాకరణ సూత్రం చెప్తేగాని పట్టు వదల"నని మొండికెత్తటం కళ్ళారా చూసిన, విన్న గడుగ్గాయి వ్యవహారం. శివశంకరులకు ఊరి వాళ్ళు ఆశ్రమం కట్టించి ఇచ్చారు, చీరాల దారిపక్కన. ఉగాదినా దండులో ప్రవేశించి పిలకా గణపతి శాస్త్రిగారిచేత విభ్రాంతామరుక కావ్యగానం చేయించినందుకు ఊరంతా మండిపడ్డది – అద్వైతాశ్రమంలో శృంగారకావ్యగానమేమని. నా మటుకు నాకు కావ్యం అర్థంకాలేదుగాని గణపతి శాస్త్రిగారిని చూడగలిగినందుకు సంతోషం కలిగింది. ఇలాంటి సాహితీ వాతావరణం చీరాలలో నేనెరిగిన తరవాత లేదు – 1919 నుంచి మూడేళ్ళపాటు ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాల కృష్ణయ్య గారూ, ఆయన అనుయాయులుగా అబ్బూరి రామకష్ణరావు గారూ, బసవరాజు అప్పా రావు గారూ ఉన్నప్పు డలాంటి వాతావరణం ఉండేదంటుండేవారు. అంటే నేను పుట్టక ముందున్న ఆ సుస్థితి నేను పుట్టిన తరవాత దుస్థితిగా మారిందంటే చేయగలిగిందేమీ లేదు.

వేటపాలెం బడిలో నేను ప్రవేశించక ముందునుంచీ ఈనాటి వరకూ అవిచ్ఛిన్నంగా కొన సాగుతున్న మహత్కార్య మొకటుంది. పొరుగూరి నుంచి వచ్చే బడిపిల్లలకు గొల్లపూడి వారి సత్రంలో ఉచితాన్నదానం జరిగేది. బడి తెరుస్తుండగానే సత్రం గుమస్తా వచ్చి ప్రతి తరగతిలోనూ ఎంతమందికి మధ్యాహ్న భోజనం కావాలో గుర్తు రాసుకుపోయేవాడు. ఇప్పటికీ ఆ అన్నదాన సత్రం కొనసాగుతున్నది. సారస్వత నికేతనంలో పాత పుస్తకాలనూ, పత్రికలనూ పరిశోధనార్థం వచ్చి చదివే పరిశోధక విద్యార్థులకు ఈ సౌకర్యం రాత్రివేళల కూడా కల్పిస్తున్నారు. గ్రంథాలయం వారికి తలదాచుకొనే వసతి కల్పిస్తున్నది. ప్రస్తుతమున్న గ్రంథాలయం గాలివాన తరవాత పునర్నిర్మించిన భవనం. అంతకు పూర్వం విశాలమైన ఆవరణలో ఉండి దెబ్బతిన్న ఇల్లు. మన రాష్ట్రంలో మరెక్కడైనా ఇలాంటి సౌకర్యం కల్పించే గ్రంథాలయం, పొరుగూరి పిల్లలకు అన్న వసతి కల్పించే ఏర్పాటూ ఉన్నవో లేవో తెలీదు.

హైస్కూలు చదువుకోసం నేను చీరాలకు పోకతప్పలేదు. నేను ఫోర్తుఫారం పూర్తిచేసిన తరవాత వేటపాలెంబడి హైస్కూ లయింది. చీరాల స్కూలు వాతావరణంలో పునఃప్రవేశించే ముందు కుటుంబగాథ లొకటి రెండు చెప్పాలనిపిస్తున్నది. గాలివాన తరవాత బూదరాజు వారు స్వర్ణలో తరాలు తెంచుకున్నారు – కొందరు స్వర్ణవారుగా విడిపోయారు. చీరాల్లో మా నాన్నగారు మా అమ్మగారు బతికుండగానే నేతి దుకాణం పెట్టీ, ఖద్దరు కొట్టుపెట్టీ చేతులు కాల్చుకున్నారు. రెండోది జాతీయభావ ప్రజ్వలితం. సేఠ్ జమన్‌లాల్ బజాజ్ చేతనే ఆవిష్కరింపజేయాలని ఆయన

పట్టుదల. కనీసం లక్ష రూపాయల విలువగల ఖద్దరు, చేనేత వస్త్రాలూ ఉంటేగాని సేర్‌గారం దుకు అంగీకరించలేదు. మా నాన్నగారి పట్టుదల నెరవేరింది. సంవత్సరాల పర్యంతం ఆయన బంధుమిత్రులకు రేషనింగ్ విధానానికి అతీతమైన రీతిలో వస్త్రసౌకర్యం కలిగింది. మా చెడ్డ పట్టుదల ఉన్నప్పుడు మా గొప్ప నష్టాలకు సిద్ధపడాలని మరోసారి రుజువయింది. ఆ విధంగా గుంటూరు జిల్లాకు, ముఖ్యంగా చీరాల ప్రాంతానికే పరిమితంగా వ్యాప్తిలో ఉన్న ఒక సామెత అన్వర్థమయింది – కొంపల్లె జాలయ్య బరువు తగ్గిం దనేది. సముద్ర వ్యాపారం చేసిన కొంపల్లి జాలయ్య గారు పుత్రశోక దుఃఖంతో సంవత్సరకాలం గిడ్డంగులను పాడుపెడ్తే లక్షల రూపాయల నష్టం వచ్చిందనీ, ఆ సంగతి వినగానే 'నా బరువు తగ్గిం'దని ఆయన సంతోషించాడనీ చెప్తుండే వారు. అలాగే మా ఆస్తిభారం కూడా చాలా తగ్గింది. బూదరాజు వారి సంస్థానం నూజివీడు జమీందారీ పోకడ పోయిందన్నారు. ఉమ్మడి కుటుంబం ఆస్తులు పంచుకున్నందువల్ల వాపుతగ్గి బలుపు మిగిలిందన్నారు. మా అమ్మగారి మరణంతో నాన్నగారి జీవితం మరో పుంత తొక్కింది. మాకు చీరాల్లో తాను నిర్మించిన ఇంటినీ, స్వర్ణలోని కొద్దిపాటి మాగాణీ భూమిని తన ప్లీడరన్న గారి ద్వారా దఖలు రాయించి, మాతామహుడికి నిర్వహణాధికార బాధ్యతలప్పగించి యాత్రలకు బయలుదేరాడాయన. అందువల్ల హయ్యర్‌ఫాంలో చేరవలసి చీరాలకు చేరబోతే నాకు స్వగృహ మున్నా నిలవనీడలేదు. నిత్యం వేటపాలెంనుంచి పోయి రావటమో, చీరాల్లోనే ఏదో విధంగా ఉండి చదవటమో తేలలేదు – వేసవి సెలవుల నాటికి. ఇది ఆలోచనలో ఉన్న సమయంలో సెలవులు కాబట్టి ఊరిమీదపడి దొంగమామిడి కాయలనుంచి పేపకాయల దాకా మిత్ర బృందంతో కలిసి ఏరుకుని తినటం, సాయంత్రాలు బ్యాడ్‌మింటన్ ఆడుకొని గ్రంథాలయం చేరుకుని కాలం దొర్లించటం తప్పలేదు. మోతబరువు తగ్గించుకోవాలని బ్యాటును స్కూలుకు దగ్గరగా ఉంటున్న దయాల్‌ప్రసాద్ అనే మిత్రుడి ఇంట్లో ఉంచి, ఆట మోజు తీరిన తరవాత వారింటినుంచి లైబ్రరీకి వెళ్ళటం నిత్యకృత్యమయింది. ప్రసాద్ నాన్నగారు వైద్యులు. భావకవుల మొదటి తరానికి చెందిన నాయని సుబ్బారావు గారి సన్నిహిత బంధువని తరవాతగాని తెలీలేదు. తెలుసుకొనే అవసరం కల్గిందొకనాడు. 'ప్రసాద్!' అనే కేక పెట్టే ఇంట్లోనుంచి పధ్నాలుగు పదిహేనేళ్ళ కొత్త పడుచు బయటకు వచ్చి ఏకవచన ప్రయోగం తప్పని చెప్పింది. నీవెవరంటే నా పేరు నాయని కృష్ణకుమారి అని చెప్పి కోపంగా ఇంట్లోకి పోయింది. ఆమె వరసకు ప్రసాద్ అక్కగారనీ, మళ్ళీ నాకు 1950లో వాల్తేరులో తటస్థపడుతుందనీ, అప్పుడు కూడా 'నిన్నగాక మొన్న తెలుగు ఆనర్సులో చేరిన నీకు సంస్కృత గ్రంథాలెందుకూ? అందులోనూ అలంకారశాస్త్ర గ్రంథాలెందుకూ?" అని గద్దిస్తుందనీ నాకప్పటికి తెలీదు. నాకు రెండేళ్ళు సీనియరై విశ్వవిద్యా లయాల్లో పనిచేసి చివరకు వైస్ ఛాన్సలరవుతుందని నేను కలగన్నానా? కనలేదని భావం.

సెలవుల్లో పద్యరచనా వ్యసనం పెరిగింది బడివంటి బాధల్లేనందువల్ల. అయితే వాటిలో చాలాభాగం కాగితాలు ధ్వంసంచేసి వందల వేల కొట్టివేతలతో కిట్టించినవి. బంధువూ నా కన్నా ఒకటి రెండేళ్ళు పెద్దవాడూ అయిన పంగులూరి రాముడూ (పూర్తి పేరు గుర్తు రావటం లేదు – అడిగితే మళ్ళీ తగాదా రావచ్చునని భయం) నేనూ పద్యాలు రాసి నీవంటే నీవు తప్పులు రాశావని



రెట్టించుకుంటూ కొట్టుకున్నందువల్ల మా ఘనత పెద్ద వాళ్ళకు తెలిసింది. ఇలాంటి పిచ్చివేషాలు వేస్తే డొక్కచీల్చి డోలుకట్తామనే హెచ్చరికలూ వచ్చాయి. అసలు మీరు కలిస్తే చంపుతామన్నారు. ఈ నిర్బంధాలవల్ల అటు స్నేహమూ, ఇటు వ్యసనమూ తీవ్రమైనాయిగాని తగ్గలేదు. పొలాల్లో, తోటల్లో రహస్యంగా కలిసి కండూతి తీర్చుకొనే వాళ్ళం. అబ్బరాజు గురువు గారికి వినిపించ టానికి గుండెల్లేవు. బహుశా ఇలాంటి దుస్థితిలో ఉండే "గుండె గొంతుకలోన కొట్లాడుతుంటాది" అని ఎంకిపాటల నండూరి సుబ్బారావుగారు తొలిదశలో బాధపడ్డాడేమోనని వీరాభిమానంతో మేము సేవించే మాచిరాజు దేవీప్రసాద్ చెప్పాడు! అతడి తీరేవేరు. తనతో మాట్లాడాలంటే నవ్వి పొట్టచెక్కలైనా నీకేలాటి బాధ్యతలేదని అతడిచ్చిన కాగితం మీది ఖాళీ పంక్తుల్లో సొంత దస్తూరీతో రాసి ఇద్దరు సాక్షులచేత సంతకాలు పెట్టించి తీరాలన్నాడు. ఓసారి అతడి రచన చదివి ఇలాంటి హామీపత్రం ఇవ్వని ఓ సంపాదకుడు పొట్టపగిలి చచ్చాడనీ, "అచ్చుకిచ్చైన చచ్చాడు కా"డనీ తాను రాసి ప్రచురించిన ఓ ఖండకావ్యం చూపాడు. ఆ సంపాదకుడూ బతికే ఉన్నాడని లైబ్రరీలో తెలిసింది. అందువల్ల నండూరి వారి విషయంలో దేవీప్రసాద్ మాటలు మేం నమ్మలేదు. మీరూ నమ్మకండి. సరేనా?

# 2. ఉన్నత పాఠశాలావిద్య

చీరాల బడిలో చేర్చటానికి వెంటవచ్చింది అబ్బరాజు పూర్ణచంద్రరావు గారు. ఆయన వేటపాలెం బడిలో నాకూ ఉపాధ్యాయుడే. అంతకన్నా ముఖ్యం పినతాత కామరాజు భద్రిరాజు గారి అల్లుడైనందువల్ల నాకు పెత్తల్లి భర్త వరసలో. రెండో రోజునుంచి టిఫిన్ క్యారియర్‌తో సహా గుర్రబ్బండిలో చీరాల పోయివచ్చే ఏర్పాటు. బండి నడుస్తుండగా ముందువెనకల నుంచి ఎక్కటం, దిగటం అనేది మొదట నేర్చిన విద్య. ఒకటి రెండుసార్లు పడిలేచిన తరవాత బండిపోయే దిశకే పక్కవాటుగా దూకాలనే అనుభవసూత్రం అర్థమయింది. ఐజాక్ న్యూటన్ ఈ విషయం చెప్పాడని చెప్పలేను. పది పదిహేను రోజుల తరవాత సీజన్ టిక్కెట్టుతో రైల్లో వచ్చిపోయే ఏర్పాటు చేశారుగాని, అంతలో హైస్కూలు హాస్టలు తెరుస్తున్నారని తెలిసింది. అందులో ఉండి శుక్రవారం రాత్రికి వేటపాలెం చేరి సోమవారం ఉదయం చీరాలకు వస్తే ఇంటి దిగులుండదని పెద్దలు తీర్మానించారు. చీరాల్లో నా దుస్సావాసాలను వారానికి రెండు రోజులైనా అదుపులో ఉంచవచ్చనే దురాశతోబాటు ఆ కాస్త సేపైనా వంటాపెట్టాలో సాయముంటానన్న నమ్మకముందేమో. వంట మనుషులు స్థిరంగా ఉండటం లేదని స్వయంపాకం నేర్చుకోక తప్పిందికాదు. ఆ స్థితిలో నేనూ మాతామహుడూ జంటగా ఒక మహాశాస్త్ర గ్రంథం చదివాం – అది కంది సుబ్బారావు రచించిన పాకశాస్త్రం. భావి జీవితంలో ఎంతో ఉపయోగపడ్డది పాకయాజీయమే.

చీరాల ఊరిమధ్యనున్న ఆడపిల్లల బడికి విశాలమైన ఆవరణా, గదులూ ఉన్నాయి. 1944లో బడి తెరిచేనాటికి హైస్కూల్ భవనంలో సేనలుండేవి. రెండు నెలలపాటు దరిమిలా హాస్టలైన భవనం దొడ్డివైపు వేసిన రేకుపాకల్లో మా పాఠాలు సాగాయి. పడమటి వైపున్న మొండి గోడల సందుల్లో నుంచి ఎలుకలూ, పందికొక్కులూ యథేచ్ఛగా విహరిస్తుండేవి. భూగోళం మేస్టరు అరవాయన – రాజగోపాలన్ అని. ఆయన అర్థమయిందా అని అడగటానికి బదులు 'ఎక్కిందా?' అనేవాడు. కాలికింద తిరుగుతున్న పందికొక్కును చూస్తూ 'తోకవరకు ఎక్కిం'దన్నందుకు తన్నులు తినక తప్పలేదు. స్కూలు భవనం స్వాధీనం కాగానే ఈ తాత్కాలిక నివాసాన్ని వసతి గృహంగా మార్చారు. రేకులపాకల్లో ఒకటి వంటసాల; రెండోది భోజనశాల; మూడోది ఆటస్థలం. మొదటితరం వసతి గృహవాసులు పన్నిద్దరు – నాతో సహా. అలనాటి మా చిత్రపటం ఇంకా నా దగ్గర భద్రంగా ఉంది. సహాధ్యాయుల్లో ఒకడైన మద్దు లక్ష్మయ్య తరవాత పారిశ్రామిక వేత్తగా చిలకలూరిపేటలో స్థిరపడ్డారు. మరొకడు రామారావు విశాఖ కాల్టెక్స్‌లో ఇంజనీరుగా ఉండి 1960 ప్రాంతాల్లో ఒకసారి కొన్ని క్షణాలపాటు కనిపించి 2001 మే నెలలో సపత్నీకంగా వచ్చి చూసిపోయాడు. తక్కిన వాళ్ళు సామాన్యులు. మరుసటేడు సంఖ్యాబలం పెరిగిందిగాని కలుపుగోలుతనం తగ్గింది. నేను కొద్దికాలమైనా చదివిన చోటనే (వసతి గృహమైనప్పుడు) నివసించాను. నేనున్న గదిలోనే చీరాలలో కళాశాల వెలసినప్పుడు ప్రిన్సిపల్ ఉండేవాడు. 1952లో ఆ గదిలోనే నేను ఉద్యోగంలో చేరుతున్నట్లు ఆమోదపత్రం సమర్పించి, ఆ రేకుల షెడ్డులోనే పాఠాలు చెప్పాను రెండేళ్ళు. ఆ అనుబంధానికి కారణం చెప్పలేను. జోస్యుణ్ణికాను. 1946 ఏప్రిల్



14వ తేదీన హాస్టలు. వార్షికోత్సవం జరిగినప్పుడు విద్యార్థి బృందం తరఫున నేను మొదటిసారిగా 'కుసుమాంజలి' అని అయిదు పద్యాలు చదివాను. కవిగా రోడ్డునపడ్డ మొదటి రోజన్న మాట అది. అప్పటి పద్యమొకటి పిచ్చి ముదిరిందో ముదురుతున్నదో తెల్పటానికి ఉదాహరిస్తున్నాను:

**"స్వాగత మిద్ది కైకొనుఁ డవారిత భూరి కృపా వరేణ్యులా**
**రా! గణనీయకీర్తియుతులార! మహామహులార! సర్వవి**
**ద్యాగమశాస్త్ర పండిత నిధానములార! అనుగ్రహంబుతో**
**వేగమ మాయొసంగిన పవిత్రకృతజ్ఞత లందుకోదగున్".**

మా తెలుగుపంతులు కొత్త సత్యనారాయణ చౌదరిగారు "పద్యం నడిపావుగాని, అంత పనికిమాలిన సంస్కృతమెందుకురా?" అని కంటగించుకొనికూడా 'పద్యం రాయటం కన్నా కవిత్వం చెప్పటం మిన్న. అందుకు తంటాలుపడు" అని హెచ్చరించాడు. ఆ మాట మీద నాకిప్పటికీ అఖండ గౌరవముంది.

### ఉపాధ్యాయులు

నాలుగోఫారంలో చేరినప్పుడు మాకిద్దరు సైన్సు మాష్టర్లుండేవారు. 'సామాన్య విజ్ఞాన శాస్త్ర'మనే గ్రంథం ఎన్నో స్కూళ్ళలో పాఠ్యగ్రంథంగా మంచిపేరు సంపాదించింది. రచయిత ఎం.ఎస్.ప్రసాదమూర్తి గారు మాకు గురువు కావటం గర్వకారణంగా ఉండేది. ఆలూరు రామ కృష్ణరావు గారి పేరిట 'లఘుగణితం' సుప్రసిద్ధం. పాఠ్యగ్రంథంగా మా పాలిట సింహస్వప్నమది. అసలాగ్రంథాన్ని నిజంగా రాసింది సింగరాజు నాగభూషణం గారని ఒక ప్రవాదముంది. అది నానాటికీ బలపడటానికి కారణం నాగభూషణం గారు ఏనాడూ సుద్దముక్క పట్టుకొని నల్లబల్ల మీద అంకెవేయకుండానే నోటిమాటలుగా లెక్కలు కల్పించి, క్లాసు మొత్తంలోని బండ విద్యార్థులచేత నోటి లెక్కలుగా చెప్పించగలగటం. "సున్నా వచ్చిన గాడిదకు దాని ముందు కనీసం ఏడో అంకె అయినా వేసే జ్ఞానం తెప్పిస్తా. ఒక్క నెలరోజులైనా శ్రద్ధగా నా పాఠం విని ఏడవం"దని హామీ ఇస్తుండేవాడు! అది నా విషయంలో నిజమయింది కాబట్టి నేను నమ్మాను – నమ్ముతున్నాను – నమ్మమని ప్రచారం కూడా చేస్తున్నాను. రెండో సైన్సు మాస్టరు బొమ్మలు బ్రహ్మాండంగా వేసేవాడు రంగురంగులుగా. క్లాసులకు సరిగా వచ్చేవాడుకాదుగాని మాధవయ్యగారితో కలిసి వ్యాపారరంగంలో ప్రవేశించి ఉద్యోగం మానాడు. హిస్టరీ జాగ్రఫీలకు కలిసి ఒకే పేపరుండేది – నూరు మార్కులకు. చరిత్ర రెండుభాగాలు – బ్రిటిష్ చరిత్ర, భారతదేశ చరిత్ర అని. ఒక్కోదానికి ముప్ఫయ్యేసి మార్కులు. భూగోళశాస్త్రానికి నలభై మార్కులు. చరిత్రలో భూగోళంలో బొమ్మలు గీయటం పరీక్షల్లో కూడా తప్పదు. ఎస్.వి. సుబ్బయ్యగారు మొగపిల్లలను దస్తరు చెక్కతోనూ, ఆడపిల్లలను మెత్తతోనూ మొట్టినా గొప్పగా చెప్పి చెప్పించేవాడు – చరిత్ర పాఠాలను. మొదటి భూగోళం మేస్టరు గారికి కంటి జబ్బుండేది. ఎండలో మ్యాపును చేతుల్తో తవిడి చూస్తూ క్లాసులో ప్రవేశించేవాడు. గోడకు పటం తగిలించిన తరవాత ఆయన ఎన్నడూ వెనుదిరిగి చూసేవాడుకాదు. చేతులు వెనక్కు పెట్టి ఆయన వేలుపెట్టిన చోటే ఉండవలసిన స్థలం ఉండేది. సార్ వీపుకు కళ్ళున్నాయనుకొనే వాళ్ళం. 'ఇదంతా సాధనరా... ఘనతకా'దనే

వాడాయన. సాయంత్రాలు ఆటలన్నా ఆడాలి, డ్రిల్లయినా చేయాలి మగసన్నాసులు. ఆడపిల్లలు హెడ్మాష్టరు గారి ప్రత్యక్ష పర్యవేక్షణలో పూలమొక్కలు పెంచాలి. అది రూలు. ఒకప్పటి లేవీపింటో అనే భారతీయ క్రీడాకారుడి శిక్షణలో ఎదిగి, ప్రమాదంవల్ల పోటీనుంచి తప్పించుకోక తప్పని సత్యనారాయణ గారు డ్రిల్లు మాస్టరు. ఆ స్కూలు వజ్రోత్సవానికి రాష్ట్ర ప్రభుత్వ వైద్య శాఖలో ప్రివెంటివ్ మెడిసిన్ డైరెక్టరుగా పనిచేసి రిటైరై, దరిమిలా పద్మావతీ విశ్వవిద్యాలయానికి వైస్‌ఛాన్సలరైన రాజ్యలక్ష్మి గారితో కలిసి ప్రసాదమూర్తి, సత్యనారాయణ గార్లకు సన్మానంచేసే భాగ్యం కలిగింది నాకు. ఆమెమో మా సహాధ్యాయిని. మా రైలు మాష్టారి పుత్రిక. మా హెడ్మాష్టరికి పెంపుడు కూతురు. అంతేకాక మా మిత్రుడు హైదరాబాద్‌లోని సుప్రసిద్ధ ముద్రణా లయం 'ప్రగతి' నిర్మాత హనుమంతరావు గారికి వియ్యపురాలు కూడా. తిరుపతి విశ్వవిద్యా లయంలో నేను ప్రసంగించవలసిన సభకు అధ్యక్షత వహిస్తూ "ఏమోయ్! మా వియ్యంకుడికీ, నీకూ జైల్లోనా, విడిగానా స్నేహం కలిసింది?" అని బహిరంగంగా ప్రశ్నించిన సహృదయురాలు.

ఆ కాలంలో మిత్రుల వివాహాలకు స్వయంగా పోలేనప్పుడు ఆశీర్వచన పంచరత్నాలు రాసి పంపటమనేది విధ్యుక్త ధర్మాల్లో ఒకటనే నమ్మకముండేది. రాజకీయ వాసన ఉన్న కుటుంబం నుంచి వచ్చిన పాపానికి విద్యార్థి కాంగ్రెసులో స్థానిక నాయకత్వ మొకటుండేది. తటపర్తి బసవయ్య, అంతకన్నా కొంచెం పెద్ద స్థాయిలో ఆదిపూడి సుబ్బారావు అనే వాళ్ళు మా నాయకులు. బ్రహ్మమనే తోటి విద్యార్థి అప్పటికే రాడికల్ హ్యూమనిజం వైపు ఆకర్షితుడైనాడు. ఆదిపూడి హనుమంతరావు, గురవయ్యలు స్టూడెంట్స్ ఫెడరేషన్ నాయకులు. తరవాతి కాలంలో కాంగ్రెస్ ఎం.ఎల్.సి.గా కొంతకాలమున్న సలకల బెంజిమిన్ కాంగ్రెసువాదిగా, షేక్ హసన్ సాహెబ్ సోషలిస్టుగానూ, రంగాగారి శిష్యుడుగానూ గొప్ప వక్తలనే పేరు తెచ్చుకున్నారు. కార్మికనేత సి.ఆర్. ఆ కోవకే చెందినవాడు. ఎన్నికల్లో నిలబడాలని రాడికల్ పార్టీ వారు గోడలమీద రాతలు మొదలుపెట్టినప్పుడు నాయకుల ఆజ్ఞప్రకారం మొదటి అక్షరాన్ని 'తా'గా మార్చే బాధ్యత నా భుజస్కంధాల మీద ఉండేది. హైస్కూల్లో ప్రతి శనివారం మధ్యాహ్నమూ హెడ్మాష్టరు గారి అధ్యక్షతన డిబేటింగ్ (పోటీ) ఉండేది. ఆయన ఎవర్ని ఎలా మాట్లాడమంటే అలా మాట్లాడవలసిందే. ఎంత దరిద్రంగా మాట్లాడినా వెక్కిరించే ధైర్యం ఎవరికీ ఉండేదికాదు. ఉపన్యాసధోరణి అలవరచుకోటానికి మాలో మేమే చర్చిస్తుండే వాళ్ళం. జవాహర్‌లాల్ నెహ్రూ జయప్రకాశ్ నారాయణల్లో ఎవరు నిజమైన ప్రజాస్వామికవాదులనే విషయంలో ఒకసారి చర్చలు తీవ్రమై చావగొట్టుకున్నాం. సభాపిరికి వాళ్ళకు హెడ్మాష్టరుగారో సలహా ఇచ్చారు – దగ్గరలో సెలవు రోజుల్లో ఏ రాజకీయ పక్షం వాళ్ళయినా పాఠశాల నడుపుతుంటే దానికి హాజరై విద్యనేర్చుకొని రాజకీయాల్లో తలదూర్చకుండా రమ్మని. ఆ ధీమాతో ఓసారి ఎన్.జి.రంగాగారి రాజకీయ పాఠశాలలో ఉపన్యాసం ఎలా చెప్పాలో తెలుసుకొని వచ్చాను. "మొదట తలవంచు కొని నీ కాళ్ళను మాత్రమే చూస్తూ ఒంటరిగా గొణుగుడుతో మొదలుపెట్టి, క్రమంగా ఎదుటి బల్లనో, సభలోని ఏ ఒక్క వ్యక్తినో చూస్తూ మాట్లాడటం అభ్యసించాలి. ఆ వ్యక్తి కళ్ళల్లోకి చూస్తూ మాట్లాడలేకపోతే మోరపైకెత్తి ఆకాశాన్నో, ఇంటి కప్పునో చూస్తూ ప్రసంగించాలి. మన ధోరణి



బాగున్నదనిపించిన తరవాత క్రమంగా చివరి పంక్తిలోని వాళ్ళను చూడటంతో మొదలుపెట్టి మొదటి పంక్తి దాకా చూడగలిగిన తరవాత మొహాల్లోకి చూసే ధైర్యం వస్తుంది. సిగ్గొదిలితే భయం తగ్గుతుంది. అహంకారం పెంచుకుంటే ఆత్మవిశ్వాసం పుడుతుంది. సభ్యుల ముఖవికాసా లను గమనిస్తూ నిన్ను నీవు సరిచేసుకొని ధారాళంగా తప్పో, ఒప్పో మాట్లాడగలిగితేనే రాజకీయాల్లో రాణిస్తావు" – అని ఉద్బోధించా డాయన. పచ్చయప్ప కళాశాలలో మా పెదనాన్న గారికి తానుపన్యాసకుణ్ణని చెప్పి, ఆ తరవాత నాలుగు దశాబ్దాలకు కనిపించినా గుర్తించగలిగే వాడాయన! అదే ఆయన రాజకీయ ప్రస్థానానికి పనికి వచ్చిన (జ్ఞాపక) శక్తి. ఇది 1946 నాటి సంగతి.

ఊరు మొత్తం గౌరవించే జాతీయవాది గౌస్ బేగ్ గారు. ఆయన్ను సహాయ నిరాకరణోద్యమ సందర్భంలో మొదటి 'డిక్టేటర్'గా నియమించారుట గుంటూరు జిల్లాకు. మనిషి పరమసాధువే గాని అలొక్యుడనే వాళ్ళు. ఒకమారు చీరాల మునిసిపాలిటీకి ఛైర్మన్‌గా ఎన్నుకుంటే తెల్లవారు జామునే బయలుదేరి వీధులు సరిగా ఊడ్చలేదనీ, ఇంటిపన్ను చెల్లించలేదనీ, వీధిలాంతర్లు పెట్టలేదనీ అందరి పనులూ నెత్తిన వేసుకొని బాధిస్తున్నాడని గద్దె దించేశారట. దింపినవాడు రావుసాహెబ్ రావుల లోకనాథం గారని తెలిసింది. ఆయనకు హాస్టల్లో సన్మానం జరుగుతుండ గానే, మా మిత్రులైన సెటిలర్సులో ఎవరో బిరుదుబిళ్ళను సంగ్రహించారు! గాలించారు గాని అది దొరికినట్లు తెలీదు – గుర్తూ లేదు. గౌస్ బేగ్ గారికి అందరితోపాటు 'తామ్రపత్రం' కూడా ఇవ్వలేదు మన దేశభక్తులు! ఆయన కుమారుడు ఖుర్దూస్ బేగ్ నా సహాధ్యాయి. అరవై ఏళ్ళు వచ్చిన తరవాత కూడా కౌలుకు తీసుకున్న మడి దున్నుకుని బతుకుతున్నాడు. కథాకాలానికి స్వాతంత్ర్యోద్యమం తీవ్రతరమవుతున్నది. గాంధీగారు రైల్లో రావటం, పోవటం చూశాం. ఎందుకలిగిందోగాని వెర్రి ఆనందం పుట్టింది.

## విద్యార్థి రాజకీయాలు

ఐదోఫారంలో చేరగానే మరో బెడద వచ్చిపడింది. సి–గ్రూప్ అని వారానికి రెండు గంటలు ప్రత్యేకంగా చదివి పరీక్ష రాయవలసిన సబ్జెక్టుండేది. ఎక్కాలు రానివాణ్ణి కాబట్టి నాకు భౌతిక శాస్త్రం అభిమాన విద్యగా ఇచ్చారు. ప్రయోగశాలలో ఉన్నంతకాలం మనమేదో ఘనకార్యం చేయ బోతున్నా మనిపించేది. తీరా ప్రయోగం చేయవలసి వచ్చేసరికి లెక్కలు రాని లోపం వెక్కిరిస్తుం దేది. విసుగుపుట్టేది. ఆ సమయంలో మా దౌర్భాగ్యంవల్ల హైస్కూలు నిర్వహణ జిల్లా బోర్డుకు మారింది మునిసిపాలిటీ నుంచి. హెడ్మాష్టరు గారిని కొల్లూరు బదిలీ చేశారు. మాకో చండ ప్రచండ భయంకరుడు ఆయన స్థానంలో వచ్చాడు – ఎస్.కోటయ్య. ఆయనెంత ముతక ఖద్దరు కట్టేవాడో ఆయన స్వభావం, ప్రసంగం అంతకన్నా మొరటుగా ఉండేవి. విద్యార్థులకు అసహ్యం పుట్టించాడు. ఉపాధ్యాయులకు అనిష్టం కలిగించాడు. తగుదునమ్మా (అందర్నీ 'అమ్మా' అని పిలవటం ఆయన కలవాటు!) అని ప్రార్థనతో పాఠం మొదలుపెట్టేవాడు. కమ్యూనిస్టులకని ప్రత్యేక ప్రార్థన సృష్టించాడాయన ఇంగ్లీషులో – "Oh God, if there is God - save my soul, if there is soul" అని, "He is himself souless; he has only sole" అనే వాడు కె.ఎస్.రామా.

వాక్కెంత కఠినమో హృదయమంత నిర్దాక్షిణ్యం. అప్పట్లో డిటెన్షను విధానానికి వ్యతిరేకంగా విద్యార్థుల ఉద్యమం తీవ్రంగా ఉండేది. గుర్రబ్బండి మీద వచ్చే వాడాయన బడికి. గాంధేయుడు కదా, జాలి పడకపోతాడా అని బండికి అడ్డంగా పడుకున్నారు విద్యార్థులు – డిటెన్షన్ విధానం నశించాలని నినదిస్తూ. అడ్డు తొలక్కపోతే మీ మీదుగా బండి నడుపుతానని బెదిరించాడు. ఆయనకు ఆదర్శమట బందరులో ప్రిన్సిపల్‌గా ఉన్న కాజా శివరామకృష్ణయ్య. ఆ మహనీయుడు కారే తోలుతా నన్నాట్ట. ఈ మహాత్ముడు బండి నడుపుతానన్నాడు. బండివాడు నిరాకరిస్తే తానే అందుకు సిద్ధమైనాడు. గుర్రాన్నీ, బండినీ ఎత్తి విసిరివేయగల వీరులున్నారని తెలియదాయనకు. అంతపనీ చేయవలసి వచ్చింది. పోలీసులను తెస్తానని తిరిగిపోయాడు. ఆనాటి నుంచి 21 రోజులు అవిచ్ఛిన్నంగా సమ్మె జరిపాం. ఒక్కడూ బడికిపోలేదు. ఉపాధ్యాయుల సానుభూతీ, స్థానిక రాజకీయవాదుల సహాయ సహకారాలూ లేకపోతే అది సాధ్యమయ్యేది కాదు. ఆయన స్థానంలో సింగరాజు నాగభూషణం గారు బాపట్లనుంచి వచ్చిన తరవాత దేశం చల్లబడింది.

1946 నాకు ప్రత్యేకంగా మరికొన్ని కారణాలవల్ల ముఖ్యం. విద్యార్థి కాంగ్రెసు ఎన్నికల కోసం ప్రతినిధిగా నంద్యాల వెళ్ళి రైలు స్టేషనులోనే తన్నులు తిని తిరిగిరావటం వాటిలో ఒకటి. మదరాసులోని రాజధాని కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా ఉన్న దోమా వేంకటస్వామి గుప్తగారు మా బడికి వచ్చి ఆశుకవితా ప్రదర్శన చేస్తారని కబురు వచ్చింది. మా తెలుగు మాస్టర్లు – ముఖ్యంగా కొత్త సత్యనారాయణ చౌదరిగారు – అంగీకరించలేదు. "అవధానం చేయదలిస్తే రమ్మనండి. ఆశుకవిత్వమైతే మాదాకా రానక్కరలేదు. మా విద్యార్థులే ఆమాత్రం సాధించగల"రని తిరుగు సందేశం పంపాడు! వెంటనే నన్ను పిలిపించి "మా పరువు నిలపాలి – అధైర్యపడకు. గణాలూ, ప్రాసలూ నీవు సరిగానే లాగిస్తావు. ఎటొచ్చీ రకరకాల యతులున్నాయనీ, సంధు లున్నాయనీ నీకు తెలుసో, తెలీదో. వాటి విషయం నాకు వదిలిపెట్టు. నేను నిన్ను సమర్థిస్తా"నని హామీ ఇచ్చాడు! గుప్తగారికిది అమర్యాద అని తోచిందేమో – చివరికి రాలేదు. నాకు తప్పనూ లేదు. అంతకు ముందు రాసుకవచ్చి చదివితే, ఇప్పుడు రాయకుండా చదవాల్సి వచ్చింది. సంగీతం రాదు. కంఠ మాధుర్యం లేదు. కాబట్టి పఠనమేగాని గానం నావల్లనయ్యే పనికాదు. తప్పుపట్టే వాళ్ళు లేరు కాబట్టి నిశ్చింతగా నేటి అవధానుల్లాగా నేను నిర్భయంగా అడిగిన విషయం మీద పద్యాలు చెప్పాను కందాల నుంచి సీసాలదాకా, నాలుగు ప్రధాన వృత్తాల్లోనూ. ఒక విధంగా ఈ సాహసం పొగరెక్కించిన మాట వాస్తవం.

## ఇద్దరు మహాపురుషులు

ఆ ఏడే ఇద్దరు మహాపురుషులను సన్నిహితంగా చూశాను. మొదటివ్యక్తి సర్ కట్టమంచి రామలింగారెడ్డి. ఆంధ్ర విశ్వకళాపరిషత్ ఉపాధ్యక్షుడుగా ఆడపిల్లల మిడిల్ స్కూలును ఉన్నత పాఠశాలగా అభివృద్ధికి తెస్తున్న సందర్భంలో ఆయనే ప్రారంభోపన్యాసం చేయటం మంచి దన్నారు. ఆయన చేతనే మా స్వగృహమున్న దర్బారు రోడ్డనే ఇసకపర్రను నిజమైన కంకర రోడ్డుగా మార్చినందున దాన్ని రిబ్బను కత్తిరించి తెరిపించాలని పురపాలక సంఘంవారు నిర్ణయించారు. రెడ్డిగారికి కొత్త సత్యనారాయణ చౌదరిగారే స్వాగతపత్రం రాశారు. శీర్షిక తప్ప



మిగిలిన భాగమంతా 'అచ్చ తెలుగులో' ఉందని ప్రకటించగానే రామలింగారెడ్డి గారు స్వాగత శబ్దాన్ని అచ్చ తెలుగులో ఏమనాలని ప్రశ్నించగా సభలో కలకలం పుట్టింది. సత్యనారాయణ గారి తీవ్రవాదం మాకు అనుభవైకవేద్యం. అంతకు ముందు సంవత్సరం ఆయన "దేవు డున్నాడా? లేడా" అని ప్రశ్నించి ఉన్నాడన్న విద్యార్థులను తన తర్కబలంతో ఏడిపించాడు. వేసవి సెలవుల్లో ఆయనకు జబ్బు చేసింది. మంచం దించారు. ఆ సమయంలో పక్కింటి వారాయన భార్యచేత బలవంతంగా ముడుపు కట్టించారు. లాభం లేదనుకున్న కొత్త వారికి కొత్త ఊపిరి వచ్చింది. విషయం తెలిసిందిగాని ఆగ్రహించలేదు. మరుసటేడు బడి తెరిచేసరికి ఆయన ఓ శతకం రాసి అచ్చువేయించి మాకందరకీ పంచిపెట్టి 'దేవుడు లేడంటే చంపుతా'నని సుకుమారంగా చెప్పాడు. "నా మేనన్ పరిణామశూల కుదురై నానాటికిన్ మేటియై స్వామీ! ..." అని మొదలవుతుంది ఆ శతకం. నాకిప్పు డంతవరకే గుర్తుంది. రామలింగారెడ్డి గారి ధోరణి పులిమీద పుట్రలా గనిపించింది. వాద విషయం మాత్రమే తెలిసిందిగాని వాదవిధానం, వివరాలూ తెలీలేదు.

ఇది జరిగిన వారంరోజులకు ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులుగారు వేంచేశారు ఊళ్ళోకి. జయజయధ్వానాలతో ఊరేగుతూ పేరుపేరు వరసన కొందరినీ పలకరిస్తూ, పరిసరాలను పరీక్షిస్తూ ఆడపిల్లల బడిదగ్గర బండి దిగి 'ఎవర్రా ఈబోడి రాతలు రాసింది?' అని గర్జించాడు. బడి పేరు "కీర్తి శేషులు టంగుటూరి జానకమ్మ స్మారక పురపాలకోన్నత బాలికా పాఠశాల" అని ఉంది. పంతులుగారి భార్య పేరు హనుమాయమ్మ. తక్షణం భక్తు లాబోర్డును నేలపాలు చేశారు. బోర్డు రాయించిన మునిసిపాలిటీ ఛైర్మన్ రావుల హరిప్రసాదరావు గారాయన భక్తుడే. మాకు బంధువు కూడా. ఆయన ప్రథమ పుత్రుడు నా సహాధ్యాయి. గర్జన వార్త పొక్కగానే ఆయన ఊరు విడిచి పారిపోయాడు. అప్పటికప్పుడు బడిపేరును "కస్తూరిబాగాంధీ స్మారక"మని మార్చేదాకా పంతులుగా రక్కడినుంచి కదల్లేదు. "స్వరాజ్యం అట్టే దూరంలో లేదు. వస్తుంది. ఈ ప్రపంచ యుద్ధంలో ఇంగ్లీషు వాడు ఓడిపోయినా, పోకపోయినా పారిపోక తప్పదు. వాడు గెలిచినా చచ్చీచెడి గెలుస్తాడు. వాడి బలహీనతే మన బలం" అని ఆయనో ఉపన్యాసం కూడా ఇచ్చాడు. అంతగొప్ప వాడిమాట జరిగి తీరుతుందని అందరూ నమ్మారు – మాతో సహా.

## ప్రయాణసాధనాలు

అప్పటికి సంవత్సరాలుగా రైళ్ళు గంటలేగాక రోజులు ఆలస్యంగా కూడా నడుస్తుండేవి. 20 – 30 మైళ్ళకో వాటరింగ్ స్టేషన్. ఇంజన్లో నీళ్ళు నింపాలి. నేలబొగ్గు/రాక్షసిబొగ్గు వేయాలి. నీళ్ళు కాగి ఆవిరి తగినంత వస్తేగాని బండి సాగదు. గ్రాండ్‌ట్రంక్ ఎక్స్‌ప్రెస్సే మహా అయితే గంటకు 25 – 30 మైళ్ళ వేగం అందుకోగలిగేది. ఒంటి పట్టాలు కాబట్టి ఒక రైలు స్టేషన్లో ఉంటే ఎదురు వచ్చేది అవుటర్ సిగ్నల్ దగ్గర ఆగి (అక్కడ రెండు పట్టాలుండేవి) ఎదుటి రైలు కొంతదూరంపోయిన తరవాత వెనక్కు నడిచి ప్లాట్‌ఫారం మీదికి వచ్చేది. రేషన్ రోజుల్లో మిగులు బియ్యం నల్లబజారులో దొరికేవి – చిన్న మొత్తాల్లో. కూలి పనితో జీవించే వాళ్ళు – ముఖ్యంగా స్త్రీలు – నడుములకు మూటలు కట్టుకొని బియ్యమో, నూకలో చేరవేస్తుండే వాళ్ళు. పోలీసులు పట్టుకుంటే నేరం. అసలు టిక్కెట్టుకొనటం విద్యార్థులూ, యువకులూ నామర్దాగానే భావించే

వాళ్ళు. చదువురాని వాళ్ళు, స్వాతంత్ర్యం వచ్చిన తరవాత రైళ్ళు మనవే కాబట్టి ఎందుకు డబ్బిచ్చి టిక్కెట్టు కొనాలని తర్కించేవాళ్ళు. పట్టాలు పీకిన, పీకించిన, టిక్కెట్లు కొనని, కొనిపించని దేశ భక్తుల రాజ్యం వచ్చిన తరవాత (ఆగస్టు 15, 1947) నుంచి రాజకీయ బాధితులనే వర్గాన్ని సృష్టించి, వాళ్ళకు బైరాగి టిక్కెట్లివ్వాలనే ప్రయత్నాలు ఆరంభించారు. ఆ కోరిక తీరటానికి చాలా కాలం పట్టిందనేది వేరే విషయం. ఇక బస్సులు బొగ్గుతో – చాలావరకు కట్టె బొగ్గుతో – నడిచేవి. బస్సు వెనక ఉన్న పొడుగాటి కుంపటిలో బొగ్గును రాజేసి మండిస్తే తప్ప బస్సు కదలదు. అందుకని ఇనపకడ్డీలతో బొగ్గును కలగలిపి, నుసి తొలగించి, విసరటం ఒక పని. తరవాత ప్రయాణికులు దిగి నెట్టగా నెట్టగా కొంతసేపటికి కదిలి క్రమంగా వేగం పుంజుకునేవి. అంటే నడుస్తున్న బస్సులెక్కటం చేతగాని వాళ్ళు వాటిలో ప్రయాణించటం మంచిదికాదు. గుర్రబ్బ ళ్ళుండేవి. చాలా గుర్రాలు దేశ దారిద్ర్యానికి చిహ్నంగా బక్కచిక్కి ఎండుడొక్కలతో ఉండేవి. కంకరరోడ్డు లేకపోతే అవి బండిని లాగలేవు గాని, పల్లెల్లో అవే అత్యంత వేగవంతమైన ప్రయాణ సాధనాలు. గిరీశం అందుకే బండివాడిని మంచి చేసుకొనే ప్రయత్నం చేశాడు – భావికాలంలో బుచ్చెమ్మను లేవదీసుకపోవాలంటే అదే గొప్ప సాధనం కాబట్టి. హోటళ్ళలో తినే విద్యార్థులు నాలుగైదు పేర్లతో సంతకాలు పెడ్తేగాని కడుపునిండా తిండి దొరికేదికాదు. వేడి అన్నం మీద సున్నపు నీళ్ళు చల్లి బిరుసుపాకంలో వడ్డించినందువల్ల కొంచెం తిన్నా నీళ్ళు తాగితాగి త్వరలో కడుపు నిండిన ట్లనిపిస్తుందని పూటకూటివాళ్ళు కనిపెట్టారు. సున్నపు నీళ్ళవల్ల కడుపు మండి రోగాలు వచ్చినందుకు వైద్యులూ, మందులకొట్ల వాళ్ళూ సంతోషించే వాళ్ళు. ఇలాంటి కల్తీ వ్యవహారాలన్నీ స్వాతంత్ర్యోదయంతోబాటే మన దేశంలో వికసించాయి.

ఎంకి పెళ్ళి సుబ్బి చావుకు వచ్చిందన్న సామెత పచ్చినిజం. కట్టమంచి వారు బాలికోన్నత పాఠశాలను ఆవిష్కరించగానే మమ్మల్ని హాస్టలు ఖాళీచేసి పొమ్మన్నారు. అప్పటికి సైన్యం మా స్కూలు భవనంనుంచి ఖాళీచేసి వెళ్ళింది. కాబట్టి బడి నడుస్తుంది కాని హాస్టలు మూతపడింది. చెట్టుకొకరు, పుట్టకొకరుగా ఎవరిదారి వాళ్ళు చూసుకోక తప్పింది కాదు. అప్పుడు బడివేళకు గంట ముందుగా ఒంగోలునుంచి వచ్చే 'కోచీ' అనే ప్యాసింజరు బండి, సాయంత్రం ఆరు గంటల ప్రాంతంలో బెజవాడ నుంచి చీరాలకు వచ్చేది. అదయితే రాకపోకలకు అనువుగా ఉంటుందని నెలకూ, మూడు నెల్లకూ వారివారి వసతి తాహతులను బట్టి సీజన్ టిక్కెట్లు కొన్నాం – కొనగలిగిన వాళ్ళం. మూడు వంతుల మంది టిక్కెట్లు లేకుండా ప్లాట్‌ఫారం చివరనో, క్యాబిన్ దగ్గరో తమ తమ శక్తిసామర్థ్యాలనుబట్టి రైలెక్కి అదే పద్ధతిలో క్యాబిన్ దగ్గరో, ప్లాట్‌ఫారం మొదట్లోనే రైలు దిగటం అభ్యసించారు. పక్కస్టేషనే కాబట్టి పది పదిహేను నిమిషాలు (4 మైళ్ళు దూరానికి) ఫుట్‌బోర్డు మీద ప్రయాణించటం ఆ వయసులో లెక్కలోని విషయం కాదు. పైగా వినోదం కూడా. టికెట్ కలెక్టర్లతో దోబూచులాడటం, ఔటర్ సిగ్నల్ దగ్గర గొలుసులాగి బండి నాపి అది కదలబోతుండగా మిత్రులను హెచ్చరించి రైలెక్కించుకోవటం, వీలువెంట స్కూలు దగ్గరే రైలాపి ప్రయాణ దూరం తగ్గించుకోవటం ఆనాటి సాహసకార్యాలు. రైల్వేస్టేషన్ దగ్గరి కందకాల్లో ఆటపాటలతోబాటు అధికారులకు దొరక్కుండా దాగుడుమూతలాడటం వినోదక్రీడ.



'నేను సైతం' రైళ్ళెక్కి దిగే విద్యను రెండు మూడుసార్లు పడి సాధించాను. గుర్రబ్బండి దగ్గర నేర్చింది ప్రాథమిక విద్య – ఇది ఉన్నత విద్య. ఒకసారి ప్రైవేట్ క్లాసుండి ఆలస్యమయిందని కోచీలో వెళ్ళలేదు వేటపాలెం. నేల టిక్కెట్టుతో హంటర్‌వాలీ సినిమా చూసి రాత్రి పదిగంటల ప్రాంతంలో స్టేషనుకు వచ్చి అది ప్యాసింజరనుకొని (దాన్ని టెన్ అప్ అనే వాళ్ళు) కలకత్తా – మద్రాసు మెయిలెక్కాం. వేటపాలెం స్టేషన్లో అది వేగం పెంచటంతో దాని నిజస్వరూపం తెలిసింది. ఈలల్తో ఒకర్నొకరు హెచ్చరించుకొని ఔటర్ సిగ్నల్ కూడా దాటిన బండిలోనుంచి (ఫుట్ బోర్డుమీది నుంచి) ఇసక దిబ్బల మీదికి మదరాసు వైపు ముఖంపెట్టి దూకేం – ఎవరికీ దెబ్బలు తగల్లేదు. మట్టి దులుపుకొని ఇంటికి వెళ్ళిన మర్నాడు ఈ రహస్యం బయటపడింది. ఫలితం అనుభవించాం. అందుకే కదా 'లలాట లిఖితా రేఖా పరిమార్ష్టుం నశక్యతే' అన్నారు?

వేటపాలెం విద్యార్థులు ఇలా చేస్తున్నారని తెలిసిన ఎం.ఎస్.ఎం. రైల్వే వాళ్ళు (Madras and Southern Maharashtra Railway అనే ప్రయివేట్ కంపెనీ అది. పొడి అక్షరాలను మార్చి – సెప్టెంబరు – మార్చి పరీక్షలకు చిహ్నంగా అలవాటుగా తప్పే విద్యార్థులు సాంకేతికంగా ప్రయోగించే వాళ్ళు) ప్రత్యేక పోలీసు దళాన్ని రహస్యంగా బండిలో పంపారు. విషయం తెలియక ఇద్దరికోసం గొలుసులాగి రైలాపాం. రైలెక్కుతున్న వాళ్ళను బంధించారు. వాక్యూం బ్రేకును తీసి చీరాల్లో ప్లాట్‌ఫారం మీద ఆపి, బండి ఆగీ ఆగకముందే పోలీసులూ టికెట్ కలెక్టర్లూ అన్ని పెట్టెలూ గాలించి అనుమానించిన వాళ్ళను మరి నలుగురిని బంధించారు. మిగిలిన వాళ్ళం బడికీ, కార్మిక సంఘాల వారికీ (అప్పటి ఐ.ఎల్.టి.డి. కంపెనీలోనే ఆరు వేల మంది కార్మికు లుండేవాళ్ళు), నానా రాజకీయ పక్షాల వారికీ కబురు పెట్టి స్టేషన్ దగ్గరి కందకాల్లో తలదాచు కొని వచ్చేపోయే అన్ని రకాల రైళ్ళమీదా రాళ్ళు విసిరాం. కొందరు బాపట్లదాకా బస్సుల్లో పోయి అదనపు సేనలను తెచ్చి మోహరించారు. రైలుస్టేషన్ ధ్వంసమయింది. సాయంత్రం ఆరుగంటల కల్లా చుట్టుపక్కల ఊళ్ళనుంచి కూడా వీరకుమారులు వేంచేశారు. లాఠీఛార్జీ నిష్ప్రయోజనకర మయింది. అంతలో ఒంగోలు వైపునుంచి వస్తున్న ఓ గూడ్సు బండిలో మా మిత్రుల్ని తెనాలికి తీసుకపోతున్నట్లు తెలిసింది. పోరాడి విడిపించుకున్నాం. అప్పటికే చీకటిపడింది. అది నవంబరు 25వ తేదీ. చివరికి అదనపు పోలీసుదళం వచ్చేలోగా తుపాకి కాల్పులు మేంచేస్తాం, అనుమ తించమని స్థానిక పోలీసులు మేజిస్ట్రేటుని అర్థించారు. బడిపిల్లల్ని కాల్చటమేమిటి పొమ్మన్నాడు. ఆరున్నర ప్రాంతంలో ప్రత్యేకదళం వచ్చి గాలిలోకి పేల్చారుగాని మేం సురక్షితంగా కందకాల్లో ఉండి, వాటిలోనుంచే ఉత్తరదిశగా ఔటర్ సిగ్నల్ వైపు పురోగమించాం ఒకరిద్దరం. కొందరు ఊళ్ళోకి వెళ్ళి కాలినడకతో ఆలస్యంగా ఇల్లు చేరారు. కొందరైతే పట్టాల వెంబడే నడిచి వెళ్ళటం చూశాను. నేను ఔటర్ దగ్గర ఆగిన కోచ్‌లో ఎలాగో ఎక్కగలిగాను. రైలు చీరాల్లో ఆగకుండా షట్టర్లు దించిన పెట్టెలతో వేటపాలెం చేరింది. తక్కిన వాళ్ళేరని దిగిన నన్ను పీక్కుతిన్నారు. ఊరుసగం స్టేషన్లోనే ఉంది. రకరకాల కథనాల్తో నమ్మించి ఇల్లు చేరాం. అది పెద్ద కేసయింది. అనుమానమున్న గాడిదలందరూ హెడ్మాస్టరును కలవమన్నారు. కలిశాం. అందరూ బడికి హాజరైనట్లు రికార్డు చేయించి, తరవాత నాటకీయంగా దూషించాడు గాని, న్యాయస్థానంలో

ఆయన చెప్పిన మాటలు నమ్మకం పుట్టించాయి – అది బాపట్ల కోర్టు కాబట్టి, ఆయన ఆ ఊరి శ్రీనివాసరావు కాబట్టీ. హెడ్మాస్టరు పేరు మోసిన నటుడనీ, ఆయన సాక్ష్యం నమ్మరానిదనీ పోలీసులు హైకోర్టుకు వెళ్ళారు. సరిగ్గా ఒక్క సంవత్సరానికి – 1948 నవంబరు 25వ తేదీకి – నిందితులందరూ నిర్దోషులనే తీర్పు వచ్చింది. అప్పటి అనుభవం ఆ తరవాత నాలుగైదేళ్ళకు బ్రహ్మాండంగా పనికి వచ్చిన వైనం ఇప్పుడే చెప్పను. చెప్పనంటే చెప్పను.

నాగభూషణం గారు బదిలీ అయి మళ్ళీ శ్రీనివాసరావుగారు 1948 జూన్‌కు చీరాల చేరారు. మహానటుడు చచ్చిన, టి.సి. తీసుకొనిపోయిన, చదువు మానేశామని రాసిచ్చిన విద్యార్థులందరినీ డిటెయిన్ చేసేవాడు! అటు విద్యాశాఖ వారూ, ఇటు విద్యార్థులూ మధ్యలో వారి తల్లిదండ్రులూ అందరూ హర్షించారు. కాబట్టి చీరాల ప్రశాంతంగా ఉంది – బడివరకైనా. ఎస్.ఎస్.ఎల్.సి. పరీక్షకు కూర్చోవలసిన సంవత్సరమది. అప్పుడు వెర్రి ముదిరింది. అర్ధ సంవత్సరం పరీక్షల్లో తెలుగు రెండో పేపరు (ఉపవాచకం మీద ప్రశ్నలుండేది) నేను పద్యాల్లో రాశాను. అందుకు కొత్త సత్యనారాయణగారు సంతోషించి 95 శాతం మార్కులు ప్రసాదించారు. కానీ అదే పని చేసినందుకు మొదటి పేపర్లో సున్నా మార్కులిచ్చారు – తాళ్ళూరి రాఘవయ్య గారు. ఆయన నా సమాధానాలు సరిగా ఉన్నవో లేవో చూడలేదుగాని బాలవ్యాకరణం ప్రకారం అందులో ఉన్న ఒక్కో వ్యాకరణ దోషానికి అరమార్కు చొప్పున కత్తిరించి పారేశారు. సారస్వత నికేతనంనుంచి తెచ్చి చదివిన ఇంగ్లీషు పుస్తకాలూ మా నాన్నగారు చదివిన రాబిన్‌సన్ ఇంగ్లీషు గ్రామరులో చివర ఉన్న ఛందోAలంకారాలూ చదివినందున ఇంగ్లీషులో పండితుణ్ణయినా ననుకున్నాను. అలాగని ఎవరూ అనలేదు– నమ్మలేదు. జాగ్రఫీ పేపరు ఇంగ్లీషులో రాశాను. తెలుగులో లేదు కాబట్టి నేను దిద్దను పొమ్మన్నాడు పంతులుగారు. తెలుగులోనే రాయాలనే నిబంధన లేదన్నాను నేను. పంచాయతీ హెడ్మాస్టరు దగ్గరకు పోయింది. ఆయన సర్దిచెప్పి పరీక్షకు పంపుతానన్నాడు గాని నా గొడవలు నావి. అవి వేరు.

## నిషేధంలో కమ్యూనిస్టులు

అప్పట్లో వేటపాలెం వాతావరణం దుర్భరంగా ఉంది. ఇద్దరు కమ్యూనిస్టు మహా నాయకులు ఊరికి పడమట ఉన్న ఆకు తోటల్లో రహస్య జీవనం మొదలుపెట్టారు. వారు పుచ్చలపల్లి సుందరయ్య, బద్దం ఎల్లారెడ్డి గార్లు. ఊరికి తూర్పున మా పొలాల్లోని గుడిసెలో అప్పుడు చేనేత రంగంలో పనిచేస్తున్న కమ్యూనిస్టు పార్టీ రాష్ట్ర కమిటీ సభ్యుడు కస్తూరి కుటుంబరావు గారు భూగర్భ జీవనం గడుపుతున్నాడు. ఆయన మాకు దూరపు బంధువు. ఆయన కుటుంబం ఊళ్ళోనే ఉండేది. దాదాపు వందెకరాల ఆస్తిని వదులుకొని, మొదట గ్రంథాలయోద్యమంలో ఉండి దరిమిలా చేనేత రంగానికి దారిమళ్ళినవా డాయన. పెద్ద నాయకు లిక్కడ దాక్కొన్నారని తెలిసిందిగాని ఎంత వెతికినా స్థానిక పోలీసుల కెవరూ దొరకలేదు. మలబార్ పోలీసు దిగి ఊరిని అల్లకల్లోలం చేయటం మొదలుపెట్టింది. స్థానిక నాయకుడు సోడెం రంగయ్య వడ్రంగి. అతడి మీద కూడా అరెస్టు వారంటుంది. కానీ ఆయన పోలీసు స్టేషన్‌కి ఎదురుగా ఉన్న జెండా



రావిచెట్టు కిందనే కూర్చొని నాగళ్ళూ, కుర్చీపీటలూ చేస్తుండేవాడు. అత డెవరని ఎవరూ అడగలేదు కాబట్టి ఎవరూ చెప్పలేదు. ఊరివారి బాధ చూడలేక సారస్వత నికేతనం కార్యదర్శిగా ఉన్న అడుసుమిల్లి శ్రీనివాసరావుగారు కాంగ్రెసు నాయకుడి హోదాతో ప్రభుత్వంతో రాయబారాలు నడిపారు. ఆలోగా మధ్యాహ్న భోజనం తీసుకొనిపోయిన మా పూర్వ సహాధ్యాయి అలికిడికి లేచి నాలుగు వైపులా చూస్తుంటే అతణ్ణి పోలీసులు కాల్చి చంపారు. ఆ సందడిలో పెద్ద నాయకులిద్దరూ పరారైనారు. వారిని గాలించటం ఒక బాధ్యతయితే, ఊళ్ళోనే ఉన్నాడనుకున్న కుటుంబరావు కోసం వెతుకులాట తీవ్రమయింది. ఆయన తన దగ్గరి ఆయుధాన్ని ఇచ్చివేస్తే అరెస్టుచేసి కేసు నడుపుతామన్నారు పోలీసులు. అది నమ్మిన శ్రీనివాసరావు గారి హామీ మేరకు పట్టపగలు నడివీధిలో కనిపించి పిస్టలు విసిరి పారేసిన కుటుంబరావు గారిని అక్కడికక్కడే కాల్చి చంపారు పోలీసులు వేలమంది చూస్తుండగా. పైపెచ్చు ఒంగోలు సమీపంలోని చింతల పాలెంలోని చింతలతోపులో పోలీసులతో హోరాహోరీ యుద్ధంచేసి ఆ బక్కవీరుడు వీరమరణం పొందినట్లు పత్రికల్లో, రేడియోలో ప్రకటించారు. మనసు విరిగింది. ప్రభుత్వం మీదా, కాంగ్రెస్ మీదా ద్వేషం పుట్టింది. తెలంగాణా పోరాట దళాల్లో చేర్చుకుంటే పగతీర్చుకుంటానని కొందరి వెంటపడ్డాను. ఈ గొడవల్లో పరీక్ష తప్పాను. ఆ ఏడు మొదటిసారిగా ఎస్.ఎస్.ఎల్.సి. పరీక్షా పత్రాలు బయటపడ్డాయి. ఒంగోల్లో ఆ పత్రాలను ఎద్దుల వీపుల కతికించి ఊరేగించారు. మొదటిసారిగా మళ్ళీ పరీక్షలు జరిపారు. అందులో పరాజయం తప్పలేదు. స్వాతంత్ర్యం రావటం, పరీక్షలు ఇలా జరగటం కాకతాళీయమన్నారు గాని, మనం సంపాదించింది స్వేచ్ఛా విశృంఖలతలేగాని నియమబద్ధ స్వాతంత్ర్యం కాదని కొందరు దుఃఖించారు. వాళ్ళ ఆత్మలు శాంతించు గాక. ప్రజానీకం క్షోభించాలనే నిర్ణయిస్తే చేసేదేమీ లేదు. ప్రజలే దేవుళ్ళు.

అప్పట్లో తప్పటం, ప్యాసవటం ఇన్ని శాతం మార్కులు వచ్చాయన్న బండలెక్కమీద ఆధార పడి ఉండేదికాదు. పరీక్షలు 600 మార్కులకు 6 విషయాల్లో. పెద్ద పరీక్షలో విద్యార్థికి వచ్చిన మార్కుల శాతం మొత్తంమీద 35కు తక్కువైనా, ప్రెసిడెన్సీ సగటు కన్నా తక్కువున్నా తప్పినట్లే లెక్క. అందులోనూ రెండు భాషా పత్రాల్లోనూ భాషేతరమైన నాలుగు పత్రాల్లోనూ విడివిడిగా ప్రెసిడెన్సీ సగటుకన్నా తక్కువ వస్తే మొత్తంమీద 35 శాతం కన్నా ఎక్కువ మార్కులు వచ్చినా తప్పినట్లే లెక్క. భాషేతరాల్లో ప్రెసిడెన్సీ సగటుకన్నా తక్కువ మార్కులు వచ్చినందువల్ల మొత్తంమీద 36.3 శాతం మార్కులు వచ్చినా 1947 మార్చి పరీక్షలో నేను తప్పక తప్పలేదు. అలా తప్పటంలోని ఘనత ఏమంటే భాషాపరిజ్ఞానం బాగానే ఉన్నా శాస్త్రజ్ఞానం లేక తప్పి నందుకు భాషోపాధ్యాయులు గర్విస్తూనే విచారించారు – నాలాగే. ఆ సంవత్సరం పెద్ద పరీక్షలకు కూర్చునేటంత వయసులేదని హెడ్మాస్టరు సిఫారసు మీద వయోనిబంధనను సడలిస్తూ డి.ఇ.ఓ. ఆజ్ఞలు జారీచేశాడు. ఆయి లేనందువల్ల తప్పటం సబబేనని బంధుమిత్రు లోదార్చారు. అప్పట్లో మోడరేషన్ విధానంలేదు. అత్తెసరు మార్కులతో ప్యాసయ్యేకన్నా తప్పటమే గౌరవప్రదమనే సిద్ధాంతం ప్రతిపాదించే అవకాశం దొరికింది పైపెచ్చు. మరో విధంగా తప్పటం నా కుపయోగ పడింది.

చదివే వయసుందా లేదా అని ఆలోచించకుండా పరీక్షలకు పంపినందుకు మండిపడినట్లు నటించి ఇంటినుంచి పారిపోయాను. ఆయా కమ్యూనిస్టుల సహాయ సహకారాలతో రజాకార్ వ్యతిరేక సాయుధ సమరంలో పాల్గొంటానని మిర్యాలగూడా చేరాను. నా శరీర సౌష్ఠవం చూసి నాయకులు గుండెలు బాదుకున్నారు. వారిలో కొందరు విద్యార్థి కాంగ్రెసు నుంచి వచ్చిన వాణ్ణి ప్రోత్సహించి బలిపశువును చేస్తే తప్పేముందన్నారు. ఎలాగయితేనేం దొడ్డా నరసయ్య గారి దళం వెంట ఉండమన్నారు. నేను తుపాకి కాల్చగలనంటే మొదట సిగరెట్లు కాల్చటం మానేయ మన్నారు. అవసరమనుకుంటే బర్మా ఇస్తామన్నారు. అడివి పట్టున నాలుగైదు రోజులున్నానో లేదో పృష్ఠభాగం మీద తూటాలు పేలాయి. దొంగతనంగా సిగరెట్టు కాల్చుకునే దురుద్దేశంతో అగ్గిపుల్ల గీచి ప్రాణం మీదకు తెచ్చుకున్నానన్నమాట. ఎలాగయితేనేం మరి మూడు నాలుగు రోజులకు కొంపచేరాను. రంగారావు డాక్టరు గారు అసలు రోగం కనుక్కున్నారు. ఎవరికీ ఏమీ చెప్పవద్దని అప్పుడే మార్కెట్లోకి వచ్చిన పెన్సిలిన్ తెప్పించారు – మదరాసు నుంచి. ప్యాసింజర్ బండిలోని ఐస్ కంపార్టుమెంటులో కొని, బూజుబూజుగా ఉండే చిన్న సీసాను ఫ్లాస్కులో మంచుగడ్డల మధ్య ఉంచి తెచ్చి, దానిలోకి డిస్టిల్డ్ వాటర్ ఎక్కించి గూళ్ళు పడేట్లు తిప్పి కలిపి సూదిమందుగా మార్చి పొడిచాడు. రెండోసారి పొడిచేటప్పుడు మొదట పొడిచిన చోటు గుర్తుండాలని పెరుమాళ్ళసెట్టి పెన్సిలుతో (దానికి వయొలెట్ పెన్సిలనేది మామూలు పేరు) గళ్ళు గీచాడు. తడి తగిలితే ఆ పెన్సిలు గీతలు ఎర్రబడేవి. ఒక పట్టాన చెరిగిపోయేవి కాదు. ఎలాగయితేనేం? పది పదిహేను రోజులకు మనుష్య ప్రపంచంలోకి వచ్చాను. ప్రయివేటుగా పరీక్ష కూర్చునే కన్నా బళ్ళో చదవటమే మేలన్నారు. ఈ విషయంలో నేను తెలిసి ఆలోచించి చేసిన సాహసమేమీ లేదు. నావల్ల ఇతర దళ సభ్యులకు తలనెప్పులు తప్పలేదు. పది మందిలో మాటతప్పి నిరాయుధుణ్ణి చంపినందుకూ, పైకెన్ని చెప్పినా నిజాం తొత్తరికం చేస్తున్నందుకూ ప్రభుత్వ వర్గాలమీద పుట్టిన ద్వేషం ఇంత తెగింపిచ్చింది.

ముందుగా అన్ని మతాల, కులాల, శాఖల, అంతశ్శాఖల విశిష్టతలను తెలుసుకొని కోరిన చోట పుట్టనట్లే రాజకీయ ప్రవేశంకూడా అనాలోచిత చర్యే. అదుపులో లేని విషయంకూడా. వయస్సు, ద్వేషం, పరీక్షలో వైఫల్యం, రైల్వే పోలీసుల మీద రాళ్ళు విసిరిన అనుభవం గెరిల్లా పోరాటానికి పనికి వస్తుందన్న అర్థరహిత విశ్వాసం వగైరాలు యౌవనప్రాదుర్భావ సమయంలోని మానసిక స్థితికి తోడయినా యన్నమాట. వేసిందే గెంతు అన్న సామెత నిజమయింది. ఇదుగో పసుపు అదుగో ముసుగన్నట్లు చేద్దామనుకున్న వీరోచిత సంగరం వెర్రివేషంగా పరిణమించి కొంత కళ్ళు తెరిపించింది. కానీ అసలీ రాజకీయ సిద్ధాంతాలేమిటి? ఆచరణలో వేటిని ఎంత వరకు నమ్మవచ్చున్న జిజ్ఞాస మొదలయింది. నిజాం నవాబు దానమివ్వటానికి తన దగ్గర పైసా లేదన్నాడని పత్రికల్లో వచ్చింది – వినోబా భావే అన్నట్లు. అతడిచ్చానన్న వేల ఎకరాలూ ఆయనవి కావనీ, బ్రిటిష్ ఆశ్వికదళానికి ఏనాడో కౌలుకిచ్చినవనీ తెలిసింది. మనీఆర్డరు ఖర్చుకు బేడా చెల్లించి కాణీ మనియార్డర్లు పంపాం విద్యార్థులం. కుడినుంచి ఎడమకు ఏవో పిచ్చిగీతల సంతకంపెట్టి దానికింద మొహరు వేయించి పంపిన తిరుగు రసీదులు వచ్చాయి. ఎవరు



నష్టపోయినట్లు? ఇలా లోకవంచన చేసిన వాణ్ణి ఏం చేసినా తప్పులేదన్న భావం కలిగింది. రజాకార్ల బాధలు పడలేక, ఆంధ్ర మహాసభలో కలిసి ఎదురుదాడులు చేయటానికి ఇష్టంలేక, ఎక్కడో తలదాచుకొని కొంతకాలం గడిపి అనుకూల సమయంలో తిరిగి వెళ్ళి తమ భూములను పునస్సంపాదించుకోవచ్చున్న దురాశ వదలక, చాలా మంది మధ్య తరగతి వాళ్ళు మా ఊళ్ళలో అద్దెలకుంటున్నారు – తెలంగాణా నుంచివచ్చి. వారి కథనాలొక రకంగా ఉంటే, వాళ్ళు రజా కార్లలా బహిరంగ శత్రువులుకారని, ప్రజాపీడనలో ఆరితేరిన భూస్వాములనీ మరోవైపున కమ్యూనిస్టులు ప్రచారం చేస్తుండే వాళ్ళు. వీటన్నిటి మిశ్రమఫలితం నావంటి పిల్ల సన్నాసుల ననేకమందిని ఆకర్షించింది. మనస్సు ఎటూ తేల్చుకోలేక తికమకపడుతున్న సమయంలో కాకినాడలో విద్యార్థి కాంగ్రెసు సమావేశాలు జరుగుతాయని, నంద్యాల్లో తిన్నదెబ్బలను వడ్డీతో సహా తిరిగి చెల్లించాలనీ, సమావేశానికి రమ్మనీ మిత్రులు ప్రోత్సహించారు. అక్కడ అన్నంతపనీ చేశారుగాని ప్రభుత్వం సెక్షన్ 144 విధించింది. దూరపు బంధువులను యాచించి రెండు చీరలు పాతవి సంపాదించి వాటిని చుట్టుకొని కాకినాడలో రైలెక్కి సామర్లకోటలో పాయిఖానాలో వదిలిపెట్టి బతుకుజీవుడా అని బయటపడ్డాం, నేనూ నా బావగారూ. తక్కిన వాళ్ళ సంగతి మా కనవసర మనిపించింది. క్రమశిక్షణలేని కాంగ్రెసు కన్నా మరే పార్టీ అయినా మంచిదేనన్న విశ్వాసం పుట్టింది. అందుకు నిదర్శన లేమని ఆలోచిస్తుండగా ప్రత్యక్షంగా చూసిన ఓ పాత కథ గుర్తుకు వచ్చింది.

## కాంగ్రెసు రాజకీయాలు

1942లో ఫస్టుఫారం చదివేటప్పుడే ననుకుంటాను. మా బడి ఆవరణలో ఆంధ్ర కాంగ్రెసు మహాసభలు జరిగాయి. బహిరంగ సభకు చుట్టుపక్కల పది గ్రామాలనుంచి బండ్లు కట్టుకొని మరీ వచ్చారు వేల సంఖ్యలో జనం. వేదికమీద సభాధ్యక్షురాలుగా గుమ్మిడిదల దుర్గాబాయమ్మ గారున్నారు (అప్పటికామె సుబ్బారావుగారినీ, వారి 'గోష్ఠి'నీ వదిలిపోలేదు – ఆ తరవాత చాలాకాలానికిగాని దుర్గాబాయ్ దేశముఖ్ కాలేదు). ప్రథమోపన్యాసం డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య గారిది. చక్కని విగ్రహం. కంచుగంటలాంటి గొంతు. అంకెల గారడీల్లో దిట్ట. మా ప్రాంతంలో ఎన్ని (చేనేత) మగ్గాలున్నాయో, ఒక్కో మగ్గాని కెన్ని అతుకులున్నాయో, వాటికి కొట్టిన ఇనపమేకులను బ్రిటన్నుంచి దిగుమతి చేసుకున్నందువల్ల మనకెంత ఆర్థికనష్టం కలిగిందో ఖంగున మోగుతూ ఊపిరాడకుండా ప్రసంగిస్తే వినేవాళ్ళ తల తిరిగిపోయింది. తరవాతి వక్త కళా వేంకట్రావు గారు సర్దుకొని లేస్తుండగా అధ్యక్షురా లాయన్ను పరిచయం చేయటానికి ముందే "కాంగ్రెసు వాదులంతా ఇకనుంచి కలిసికట్టుగా ప్రచారం చేయా"లని ఉద్బోధిస్తూ నోరు జారి 'వ్యభిచారం' చేయాలన్నారు! సభలో కలకలం పుట్టింది. వేదిక దగ్గరకు ఓ కారు వచ్చింది. మరోవైపునుంచి టంగుటూరి ప్రకాశంగారు చుట్ట పారేస్తూ వస్తున్నారు. ఆయన్ను చూడగానే జయజయధ్వానాలు మారుమోగాయి. ఆయన వేదిక నెక్కుతూనే మైకులాక్కొని "దుర్గాబాయమ్మ చాలా ఉత్తమురాలు. చేసిన పనే చేయమన్నది ఇతరులను. మిగిలిన వాళ్ళే దుర్మార్గులు. నన్ను అధ్యక్ష పదవినుంచి దించామని పట్టాభి చెప్పాడా?" అని ప్రశ్నించాడు. 'తన్నండి, కొట్టండి' అని

జనం ముందుకు వస్తుండగా పట్టాభిగారు, కళావారూ, గుమ్మడిదలవారూ ప్రచండ వేగంతో కారులోకి దూకారు. అప్పటికే అందులో రంగా గారున్నారు. కారు హోరుమని అరుస్తూ బాపట్లకు పరుగులు తీసింది. ప్రకాశంగారు "వాళ్ళను పోనిండ్రా. మీకు చెప్పాల్సినవీ, చెప్పుకోవాల్సినవీ చాలా ఉన్నా"యని జనాన్ని శాంతింపజేశారు. కాంగ్రెసులోని అనైక్యాన్నీ, ముఠాతత్వాన్నీ ఆ దృశ్యం కళ్ళకు గట్టించింది. ఆ కాలంలో పి.సి జోషీగారు బహిరంగసభల్లో కమ్యూనిస్టు సిద్ధాంతాలు ప్రచారం చేస్తుండేవాడు. ఆయన అనుచరుల క్రమశిక్షణ ఆకట్టుకునేది.

రాజకీయాలు కాలక్రమాన కలుషితమైనాయి. మనకు తగ్గ ప్రభుత్వాలే మనకు లభిస్తూ వచ్చాయి. అంటే మన సమాజం ఇప్పుడెలా ఉందో అందరికీ తెలుసు. అప్పుడెలా ఉండేదో తలుచుకుంటూ కొంత ఆలోచించి గుర్తుకు తెచ్చుకొని రాస్తాను. ఓపిక పట్టండి. 1948 మార్చిలో ఎస్.ఎస్.ఎల్.సి. పరీక్ష రాసిన తరవాత పిల్లలమందరం స్వర్ణ వెళ్ళాం. నాకు మాత్రం అది రెండోసారి చేసిన ప్రయాణం. పెళ్ళి వేడుకలకు ఎంత సంతోషించామో నీటి ఎద్దడికి అంత బాధపడ్డాం – ఊరిపక్కనే బకింగ్‌హాం కెనాల్ (స్థానిక భాషలో కృష్ణకాలవ) ఉండగా. ఆ ఏడు ఎండలు మండిపోతుండగా తిరుగు ప్రయాణంలో దారి తప్పగొట్టుకొని మధ్యాహ్నం రెండు మూడు గంటల వేళకు చచ్చీ చెడి ఇంటికి చేరాం. దారిలో ఎద్దులూ మేమూ కనిపించిన మురిగ్గుంటలన్నింటిలో నీళ్ళు తాగాం – వెంట తెచ్చుకున్న వైపోతే. ఫలితం అయిదుగురుమూ టైఫాయిడ్ పాలవటం. చేయలేక ముసలి తాతా, మంచం మరణంగా ఉన్న అమ్మమ్మా బాధ పడటం తప్ప లేదు. ఫలితం నెలాపదిహేను రోజులు ఆలస్యంగా గుంటూరు హిందూ కళాశాలలో ఇంటర్మీడియట్‌లో చేరటం. గుంటూరు చేరేలోగా ఒకసారి పారచూసుకొని నా చిననాటి చీరాల, వేటపాలెం గ్రామాల సామాజిక జీవితం గురించి గుర్తు తెచ్చుకోవటం ధర్మమేమో. అందుకే కొంచెం ఓపిక పట్టండని అభ్యర్థించాను.



# 3. నాటి సమాజం

గుంటూరుకు చేరే నాటికి నాకు పదహారేళ్ళు నిండాయి. కనీసం పది సంవత్సరాలైనా పరిసరాల్ని గమనించానన్నమాట. చీరాల్లో తల్లిదండ్రుల దగ్గర ఉన్నప్పుడు తెలవారు జామునే నిద్రలేపినది ప్రభాత్ ఫేరీలు (భేరీలనటం అక్కడి, అప్పటి అలవాటు). "వందేమాతరం, మనదే రాజ్యం" అని మధ్యమధ్య నినదిస్తూ, గాంధీ నెహ్రూ వగైరాలకు జేజేలు చెప్తూ దేశభక్తి గీతాలు ఆలపిస్తూ రాట్నంజెండాతో ఊరేగుతుండే వారు. తరవాతి కాలంలో తెలిసింది పాడేపాటలు చాలావరకు 'రైతు భజనావళి'లోనివనీ, వాటిని గుదిగుచ్చి ప్రకటించింది ఎన్.జి.రంగాగారనీ. అవిగాక 'వినయాశ్రమ భజనావళి' మరొకటుండేది – స్వామీ సీతారాం అనే గొల్లపూడి సీతారామ శాస్త్రి బారిస్టరు గారు ప్రచురించినది (స్వాతంత్ర్యం వచ్చిన తరవాత "మందేరాజ్యం"గా మారిందని నిందించే వాళ్ళింకా బతికే ఉన్నారు. వాళ్ళను లెక్కచేయాల్సిన పనిలేదు). ప్రభాత్ ఫేరీల ప్రస్తావన తెచ్చి మా నాన్నగారు చెప్పిన పాత విషయం ఒకటుండేది. దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారి నాయకత్వంలో రామదండు ప్రభాత్ ఫేరీలు జరిపే సమయంలో తప్పెట వాయిస్తూ ముందు నడవటానికి మొదట సాహసించింది శిఖాకొలను(?) పట్టాభి రాములు గుప్తగారనే వైశ్యులని. ఆ తరవాత గొర్రెముచ్చు వెంకట సుబ్బయ్య అనే హరిజనుడు కులస్థుల మాట కాదని తప్పెట వాయించినందుకు ఆయన్ను కులం వాళ్ళు బహిష్కరించారనీ, అది ఆయన కులవృత్తి అయినా కూడా అలా వేధించారని చెప్పారు. గొర్రెముచ్చు వారిని ఆదుకుని కారంచేడులోని తన ఇంటికి తీసుకపోయిన వ్యక్తి పోతిన వెంకట సుబ్బయ్య అనే కమ్మ కులస్థుడు. ఆయన పెద్ద కొడుకు రామచంద్రరావు హైస్కూల్లో నా సహాధ్యాయి. ఆయన మా నాన్న గారికి మంచి స్నేహితుడు.

ప్రభాత్ ఫేరీల తరవాత చీరాల వాతావరణంలో ప్రముఖంగా కనిపించినవి తాలింఖానాలు. కుస్తీపట్లు, కర్రసాము, కత్తిసాము నేర్పే అలాంటి గరిడీలు చీరాల్లో నేనెరిగినవి అయిదారున్నాయి. పండగ రోజుల్లో, దేవుళ్ళ ఊరేగింపుల్లో ఆయా విద్యా ప్రదర్శనలు విధిగా ఉండేవి. ఆ తాలింఖానాల్లో తయారైన వాళ్ళు ఊళ్ళోకి వచ్చిన సర్కసు కంపెనీ వాళ్ళతో, తొడాలు ప్రదర్శించి 'బస్తీమే సవాల్' అని హుంకరించే ఆఫ్ఘన్ జెట్టీలతో తలపడుతుండేవాళ్ళు. బెజవాడలోని అలాంటి తాలింఖానాల్లో తయారవుతున్న దండమూడి రాజగోపాల్, కామినేని ఈశ్వర్రావులు బరువులెత్తటంలో ఆసియా ఛాంపియ న్లయ్యారు. అటువంటి శిక్షణనుంచే అంతకు ముందు కోడె రామమూర్తిగారు ప్రపంచ ప్రఖ్యాతి సంపాదించారు. ఆ ఊళ్ళో మా ఇంటి ముందున్న విశాలమైన ఖాళీ స్థలంలో (దాన్ని రోడ్డుగా మార్చినప్పుడే కట్టమంచి రామలింగారెడ్డి గారు ప్రారంభోత్సవం చేసింది) – ముఖ్యంగా దసరా పండగ రోజుల్లో చుట్టుపక్కల దేవాలయాల నుంచి ఉత్స(వ) విగ్రహాలు ఊరేగుతూ వచ్చి సమావేశమయ్యేవి వీరరాఘవస్వామి గుడి ముందట. అందుకే దానికి దర్బారు రోడ్డనే పేరు పెట్టారుట. ఆ సమయంలో సంతలు జరిగేవి. ఆయుధ విద్యా ప్రదర్శనలు జరిగేవి. ఆ ప్రాంతంలోని అనేక దేవాలయాలను నిర్మించింది

చిలకలూరిపేట, దగ్గుబాడు ప్రాంతాలనుంచి వచ్చిన ముస్లిం శిల్పులు. వాళ్ళు తడిగుడ్డలతో తాంబూలం స్వీకరించి నక్షాగీసి గర్భగుడి వచ్చేచోట నిలబడి ప్రమాణం చేసేవాళ్ళు – నిర్మాణం పూర్తయ్యేలోగా కాపురం చేసిన వాళ్ళను కులం/మతం నుంచి బహిష్కరించటానికి సిద్ధంగా ఉన్నామని. అదేవిధంగా భావనారుషి దేవాలయం పూర్తి చేయటానికి పన్నెండేళ్ళు పట్టే ఆ సమయంలో ఎంగిలిపడ్డ యువదంపతులను వెలివేశారని, వాళ్ళు వేరే గూడెంలో బతకవలసి వచ్చిందనీ చెప్తుండేవాళ్ళు. దసరా పండగనాడు పులివేషాలు వేసేవాళ్ళలో ఎక్కువమంది ముస్లిములు. పీర్ల పండగనాడు గుండం తొక్కేవాళ్ళలో అధిక సంఖ్యాకులు హిందువులు. చీరాల్లో చేనేత పనివాళ్ళూ ఇతర కులాలవాళ్ళూ క్రైస్తవులూ ఇంచుమించు సమ సంఖ్యలో ఉండేవాళ్ళు. ఐ.ఎల్.టి.డి. కంపెనీ కూలీల్లో క్రైస్తవుల సంఖ్య ఎక్కువ. స్టువర్టుపురం సెటిల్మెంటు వాళ్ళు చిల్లర దొంగతనాలు చేస్తారని నేరస్థ జాతులని బ్రిటిష్‌వాళ్ళు వేధించారు. ఆ చట్టం ప్రకాశంగారు అవిభక్త మద్రాసు ప్రీమియర్‌గా (ముఖ్యమంత్రినలా పిలిచే వాళ్ళప్పుడు) ఉన్నప్పుడు రద్దయింది. దుష్ప్రచారం జరిగినంతగా సెట్లర్లవల్ల స్థానికులకు కష్టనష్టాలు జరగలేదు.

కుస్తీ పందేలకూ వీధిమొగ గారడీ ప్రదర్శనలకూ సమయ సందర్భా లుండేవి కావు. ఆఫ్ఘన్ జెట్టీల సవాళ్ళు కూడా చాలావరకు లాలూచీ కుస్తీలే (ఇప్పటి క్రికెట్ ఆటలోని మ్యాచ్ ఫిక్సింగ్ లాంటి వ్యవహారా లనిపించటం మామూలు). చీరాల్లో వస్త్ర వ్యాపారం జోరుగా ఉండేది– (అప్పటి నెల్లూరు జిల్లాలోని) కనిగిరి వంటి గ్రామాల నుంచి వచ్చి చీరాల్లో స్థిరపడి స్థానికులకన్నా ఎక్కువ ధనవంతులైన వైశ్యప్రముఖులను 'ఈస్టిండియా కంపెనీ వా'ళ్లని పిలవటం కద్దు. చుట్టుపక్కల చాలా గ్రామాలకన్నా పెద్దదయినందువల్ల, వైద్యవసతు లెక్కువగా ఉన్నందువల్ల చీరాల బస్తీకింద లెక్కే. అక్కడ క్రైస్తవ మత సంస్థ ఏదో నిర్మించిన బేర్ హాస్పిటల్ చాలా పెద్దది (ఇప్పుడు పాడు బడ్డది). మా చిన్నతనంలో చాలాకాలం అక్కడ ప్రధాన వైద్యురాలుగా ఉన్న మలయాళీ డాక్టరమ్మ 'కోరా' పేరిటనే ఆసుపత్రిని పిలుస్తుండేవాళ్ళు. ఆమె భర్త డాక్టర్ థామస్ కురువిళ్ళ ఐ.ఎల్.టి.డి.లో ప్రధాన వైద్యుడు. ఎందరున్నా కోరా గారికి వచ్చినంత పేరెవరికీ రాలేదు. వందల సంఖ్యలో ఆ ఆసుపత్రికి వచ్చే పేద కుటుంబాల సౌకర్యార్థం దాని సమీపంలో పెద్ద సత్రం కట్టించిన దాత రామకృష్ణారెడ్డి గారు. 'పిచ్చిబాబు' ఆస్పత్రిలో వైద్యంకోసం చాలామంది వస్తుండే వాళ్ళు – ఆమె పేరేమిటో తెలీదు. 1942 ఆగస్టులో కాబోలు చీరాల చుట్టుపక్కల గ్రామాలు సంక్షోభంలో పడ్డాయి. రచయిత పేరు గుర్తులేదుగాని 'చేతావని' అనే పుస్తకం తెలుగులో కూడా వచ్చింది. ఇతర భారతీయ భాషల్లోనూ వచ్చిందనీ, పుస్తకం పేరుకు 'హెచ్చరిక' అని అర్థమనీ తరవాత తెలిసింది. ఫలానా రోజున సముద్రం పొంగి ఈ ప్రాంతమంతా ధ్వంసమైపోతుందని ఆ గ్రంథం హెచ్చరించిందట. ఆ రచయిత చెప్పిన దుర్ముహూర్తానికి ముందే ఆస్తి పాస్తులున్న వాళ్ళు వీలునామాలు రాశారు. ఇళ్ళకు తాళాలు పెట్టి ఏడుస్తూ పడమటి దిక్కుగా వేల సంఖ్యలో జనం కదిలితే అదేవిధంగా పడమటి ఊళ్ళయిన స్వర్ణ, కారంచేడుల నుంచి సముద్రమున్న తూర్పు దిశకు జనప్రవాహం కదిలింది (అలాంటి దృశ్యం తరవాత చాలా కాలానికి 'పానీ ఆరా' అనే కేకలతో హైదరాబాద్‌లో ఇరవయ్యో శతాబ్ది ఏడో దశకంలో పునర్దర్శితమయింది!). అదే



సంవత్సరం ఇంచుమించు అదే సమయంలో చీరాల పౌరులు రైలుపట్టాలు పీకటానికి బయల్దేరినప్పుడు కొన్ని ప్రాంతాల్లో దోపిడీలు జరిగాయని చెప్పారు. ('పానీ ఆరా' అన్నప్పుడు అబీడ్స్‌లో అలాగే జరిగిందన్నారు). చేతావని గ్రంథకర్తను బ్రిటిష్ వాళ్ళు పట్టి బంధించి ఉరితీశారనే ప్రచారం జరిగింది. నిజమో కాదో తెలీదు. (అలాంటిదే మాతాహరి అనే గూఢ చారిణి విషయంలోనూ జరిగిందని చెప్తుండేవాళ్ళు). మొత్తంమీద ఇంగ్లీషు వాళ్ళమీద ఎంత ద్వేషమున్నా వాళ్ళ పరిపాలన సమర్థులని ఒప్పుకోక తప్పేదికాదు. మా ఇల్లున్న వీధిలోనే పోలీసు స్టేషనుంది. ఉదయం సాయంత్రం సగం మంది పోలీసులు లాఠీలూపుతూ విధిగా డ్రిల్లు చేసేవాళ్ళు. బహుశా అందువల్లనేమో కడుపుతో ఉన్న పోలీసులు కనిపించే వాళ్ళు కాదు.

చీరాల్లో లెక్కకు కొన్ని నాటక కంపెనీలున్నా వాతావరణం చాలావరకు వ్యాపార దృష్టితోనో రాజకీయ ధోరణిలోనో సాగేది. భజన సంఘాలున్నా వాటి హంగామా తక్కువ. కోలాటం చాలా వరకు ఆడపిల్లల బడిలో గేటుమూసి నేర్పేవాళ్ళు. విప్పచెట్టుకు కట్టిన రంగురంగుల తాళ్ళతో కోలాటంవేస్తూ జడలల్లటం దూరంనుంచి అరుగులెక్కి చూసే ప్రయత్నం చేసే వాళ్ళం. పాటలు విన్నందుకే ఆనందంగా ఉండేది. శ్రీరామనవమి మాత్రం ఘనంగా జరిగేది. ఆ నవరాత్రుల్లో తరంగ కాలక్షేపం, సంగీత కచేరీలు, భజనలు, హరికథలూ ఉండేవి. పురాణ పఠన శ్రవణాలు పరిమిత సంఖ్యాకులకు మాత్రమే అందుబాటులో ఉండేవి. మా ఇంటిపక్కన ఉన్న దూరపు బంధువు చీరాల వెంకట్రావు గారు చాలాకాలం గడ్డు పేదరికంలో ఉండి గుడ్డల వ్యాపారంలో బాగా సంపాదించి మా ఇంటికన్నా పెద్ద ఇల్లే కట్టి పందిళ్ళువేసి 'త్యాగరాయ నారాయణ దాస ఆరాధనోత్సవాల' పేరిట సొంత ఖర్చులతో వారంరోజులు సాంస్కృతికోత్సవాలు నిర్వహించాడు చాలా కాలం. అంతకు ముందూ ఆ తరవాతా అంత పెద్దఎత్తున ఉత్సవ నిర్వహణ జరిగినట్లు నేనెరగను. వాడరేవులో సముద్రస్నానార్థం ఆ.కా.మా.వై. పూర్ణిమలకు వచ్చిపొయ్యే జనంవల్ల సంవత్సరం మొత్తంలో జనసంచారం ఓ వారం రోజులు గొప్పగా ఉండేది. అప్పటికి ఊరిమధ్య ఒకే ఒక సినిమాహాలు గోపాలకృష్ణా టాకీస్ – అందులోనే అప్పుడప్పుడు నాటక సంఘాల వాళ్ళు వచ్చి టిక్కెట్లతో ప్రదర్శన చేసి పొయ్యేవాళ్ళు. పాండవోద్యోగ విజయాలవంటి పౌరాణికాలూ, వింధ్యారాణి వంటి జానపదాలూ ఎప్పుడైనా ప్రదర్శించేవాళ్ళు.

వేటపాలెం చిన్న ఊరు. చీరాలతో పోలిస్తే పేదల ఊరు. అయినా అక్కడి వాతావరణం వేరు. విప్రవినోదుల్నీ, వీధిభాగవతాలనూ, హరికథలనూ, పురాణ కాలక్షేపాలను, ఒకటి రెండు సార్లు (తోలు) బొమ్మలాటలను, బుట్టబొమ్మలనూ, సంక్రాంతి వేడుకలనూ, పులివేషాలనూ, గుండం తొక్కటాన్ని, పీర్ల పండగనూ, ఆట గుర్రాలనూ అక్కడే చూశాను. గ్రామ జనంలోనూ చుట్టుపక్కలా దేవాంగుల సంఖ్య ఎక్కువ. వీరభద్ర పళ్ళేలనూ, నారసాలనూ, దండుబాట దగ్గరి అమ్మవారి గుడిముందు సిడిమానుకు భక్తులు వేలాడటాన్నీ అక్కడే చూశాను. అక్కడే గ్రామ మున సబు (Village Magistrate అనేది సాంకేతిక నామం) బండకొయ్యవేసి శిక్షించటం, పశువులను బందెలదొడ్లో బంధించటం చూశాను. వేటపాలెం రైల్వేస్టేషన్‌కు పడమట పెద్ద గోదాం ఉండేది. అందులో గంజాయి నిల్వలుండేవి. మునసబు, కరణాలకు ఎవరి మీదనైనా కోపంవస్తే

వెట్టిమోతాదుల ద్వారా అర్ధరాత్రులు రెండు గంజాయి మొక్కల్ని ఇంటి కప్పుమీదికి విసిరివేయించే వాళ్ళు. మరునాడు వచ్చి పోలీసు స్టేషన్‌కు పద అని బెదిరించే వాళ్ళు. అంతకన్నా సుకుమారమైన పద్ధతి ఒకటుండేది – ముఖ్యంగా చదువురాని వాళ్ళను ఏడిపించటానికి. రచ్చబండమీద రెడ్డిగంతో విశ్రమిస్తూ తలపైకెత్తి చూస్తే చెట్టుకొమ్మకు వేలాడుతూ (వారే కట్టించిన) కాగితం కనిపించేది. అది ఆకాశరామన్న ఉత్తరం. దాన్ని దింపించి చదివి 'ఇప్పుడేమంటా'వని బాధితుణ్ణి ప్రశ్నించటమది. పొలాలూ, తూర్పున చిట్టడవీ విహారానికి సౌకర్యంగా ఉండేవి. కొన్ని పొలాల్లో నీలితొట్టెలూ, రాగిబానలూ ఉండేవి. వరికోతలైన తరవాత నీలాకు మొక్కలు నాటేవాళ్ళు. తొలకరిలోగా ముదురాకు దూసి తొట్టెల్లో వేసి నీరు నింపి బండలు బరువుపెట్టే వాళ్ళు. కింది తూములనుంచి బయటికి వచ్చిన నీలిమందును రాగిబానల్లో ఉడకబెట్టి చల్లార్చి చిన్నచిన్న ముక్కలుగా విభజించి సంచులకెత్తే వాళ్ళు. వానపడితే నీలిపంట సర్వనాశనమైనట్లే. కానీ నీలాకు చాలా మంచి పచ్చి ఎరువు. నీలిమందు మంచి వాణిజ్యపంట. అది దెబ్బతిన్నా పొలాలు బాగా పండేవి. జర్మనీ నుంచి ప్రపంచ యుద్ధానంతరం కృత్రిమంగా తయారుచేసిన రంగులు వచ్చిన తరవాత నీలిమందు వ్యాపారం పూర్తిగా దెబ్బతిని అంతరించింది. దేశవాళీ రంగుల తయారీ బాగా ఉన్నంతకాలం అద్దకం పరిశ్రమ ఒక్క వెలుగు వెలిగింది. చీరాల్లో రంగులద్దిన చీరలను – గసికలకు చుట్టి ఇసకలో ఆరబెట్టే వాళ్ళు – మా బడికి పొయ్యేదారిలో. ఆ భోగం ముగిసిన తరవాత పొగాకు నారు పోయటం జరిగింది కొంతకాలం. ఫలితంలో బడికి ముందుగా బయలుదేరి రాళ్ళు విసిరి చింతకాయలు రాల్చుకోవటానికి చాలా చెట్లుండేవి – అవన్నీ అంతరించాయి. ఇప్పుడక్కడ పదుల సంఖ్యలో గుడ్డలకొట్లు వెలిశాయి. వ్యాపారం పెరిగితే వ్యవసాయం పాడుపడా లనేది మన దేశవాళీ సిద్ధాంత మనిపిస్తుంది.

భిన్న కులాలవాళ్ళు వరసలతో పిలుచుకోవటం పరిపాటిగా ఉండేది. వేటపాలెంలో ఫరీద్ సాహెబ్‌గారు ఎక్కడెక్కడి నుంచో బక్కచిక్కిన ఆవులను తెచ్చి తన గోశాలలో పోషించిన వైనం కళ్ళారా చూశాను. అంతగా గోపూజ చేసిన హిందువులను నేను చూడలేదు. రైతుబిడ్డ, మాలపల్లి వంటి సహజ సుందర చలనచిత్రాలను బాల్యంలో చూశాను. తెలుగు సంస్కృతిని వాటి ద్వారా కొంతవరకైనా తెలుసుకొని అభిమానించటం సాధ్యమయింది. నేటి తెలుగుచిత్రాల విషయం పాఠకులకు, శ్రోతలకు, దర్శకులకు ప్రత్యేకించి చెప్పనక్కరలేదు. అప్పట్లో ఎద్దుబండ్లూ, లాగుడు బండ్లూ సాధారణ వాహనాలు. సైకిళ్ళు ఉండేవి. గుర్రబ్బండ్లు పెద్ద ఊళ్ళకే పరిమితం – కంకర రోడ్లు లేనందువల్లనేమో. బస్సుల సంఖ్య అల్పాల్పం. దూరంనుంచి ఎప్పుడో రైలు కూతవినిపించేదిగాని వేటపాలెంలో రాత్రులు నిరంతరం సముద్రపు హోరు వినిపించేది. ఇంటికి రెండు ఫర్లాంగుల దూరాన ఇనపగుతిక కోటేశ్వరరావు గారు హరికథ చెప్తుంటే ఇంట్లో విశ్రమిస్తూ వినటం సాధ్యమయ్యేది. ఎప్పుడైనా వేమూరు గగ్గయ్య, సూరిబాబుల నాటకాలు వస్తే టిక్కెట్టు కొనలేని విద్యార్థులూ, పేదలూ అరమైలు దూరంనుంచి వారి పద్యాలు వినగలిగే వాళ్ళు. పరిసరాల నిశ్శబ్దత కొంత, వారి కంఠస్వరశక్తి కొంత సాయపడేవని చెప్పాలి. మంగళవాద్యఘోష నాయీ బ్రాహ్మణుల్లో, ముస్లిములలో ఎక్కువ – ఇతర కులాల్లో కన్నా. వైద్యం – ఆయుర్వేద వైద్యం



– మంచి ఉన్నత స్థితిలో ఉండేది. వేటపాలెంలో రోశయ్య వైద్యం, చీరాల్లో శివరామయ్య వైద్యం ప్రఖ్యాతిలో ఉండేవి. పుట్టకురుపును భూపుటంపెట్టి తుడిచిన చాకుతో పెకలించి గుంటపడ్డ చోట సీసం మలాంతో పట్టీవేసి రిటైరై జబ్బుపడ్డ ఒక జిల్లా జడ్జి గారికి రోశయ్య (అందరూ మంగలిరోశి అనే పిలిచేవారు. ఎవరూ అందుకు బాధపడినట్లు లేదు) గారు వైద్యంచేసి బతికిస్తే, రోగి కుమారుడు భారతీయ సేనాదళంలో వైద్యాధికారిగా బ్రిగేడియర్ హోదాలో ఉన్న ఎ.ఎస్.రావు (అద్దంకి శేషగిరిరావు) విస్తుపోయాడు. నా వైద్యం వల్ల ప్రమాదం జరిగితే నన్ను కాల్చి చంపండన్న రోశయ్య ఆత్మవిశ్వాసం నేటి ఆయుర్వేద వైద్యుల్లో ఎందరికుందో చెప్పలేం. గుంటూరు పెద్దాసుపత్రి నుంచి లాభంలేదనిపించుకొని తిరిగి వచ్చిన తెల్లకామెర్ల రోగిని రోశయ్యగారు బతికించారు. ఎప్పుడైనా అలోపతి వైద్యంచేసే మా గృహవైద్యులు రంగారావు గారూళ్ళో లేకపోతే ఇన్సులిన్ ఇంజక్షన్లకోసం రోశయ్య గారినే ఆశ్రయించే వాళ్ళం. డోసెంత ఇచ్చావని రంగారావు గారడిగితే గొట్టంలో పట్టినంత ఎక్కించి ఇచ్చాను, ఇబ్బంది ఉండదని హామీ ఇచ్చేవాడు! ఉమాపతి వైద్యులు (హోమియో వైద్యులకిది సాధారణ నామధేయం అప్పుడు) ఉండేవారుగాని వారి సంఖ్యా ప్రభావమూ రెండూ తక్కువే. మూలికావైద్యం చేసేవాళ్ళు చాలా మంది ఉండేవాళ్ళు. దానికి సంచికట్టు వైద్యమని పేరు.

## సాహితీ సభలు

చీరాల్లో కన్నా వేటపాలెంలో సాంస్కృతిక వాతావరణం అధికం. అవధానాలూ, ఆశుకవితా ప్రదర్శనలూ జరుగుతుండేవి వేటపాలెంలో – ప్రధానంగా సారస్వతనికేతన గ్రంథాలయంలో. పగలంతా మగ్గం గుంటలో శ్రమించి చదివేందుకు సమయంగానీ, ఆర్థికశక్తిగానీ లేని పౌరులు గ్రంథాలయ సమావేశాల్లో ప్రదర్శించే, ప్రదర్శించిన శ్రుత పాండిత్యం అద్భుతమనిపించేది. ఒకసారి తెలుగులెంక తుమ్మల సీతారామమూర్తి చౌదరి గారు ప్రసంగించటానికి వస్తే, ఆయన మాట్లాడటానికి లేస్తుండగానే ఒక సభ్యుడు లేచి "అయ్యా, తిక్కన భారతంలో మీ దృష్టిలో చెత్తపద్య మనిపించే దొకటి చదివి, మీరు రాసిన మంచి పద్యం కూడా చదివి, మీరేవిధంగా అభినవ తిక్కన బిరుదుకు తగిన వారో వివరించి మాకు జ్ఞానం ప్రసాదించండి" అన్నాడు. "ఎవరో ఇస్తే కాదనలేక తీసుకున్నానుగాని నేనంతవాణ్ణి కానని ఎరుగుదును. ఒక నిండు సభలో ఇచ్చిన బిరుదాన్ని మళ్ళీ ఆ సభలోనే వదులుకోబోతున్నాను. నేను గాంధీ కవిని. తెలుగు లెంకను. నాకారెండే తగిన, చాలిన బిరుదు" లని చెప్పిన వక్త మరుసటి నెల నరసరావుపేటలో జరిగిన సాహితీ సభలో తన మాట నిలుపుకున్నాడని పత్రికలో (పత్రిక అంటే ఆంధ్రపత్రి కొక్కటే ఆ రోజుల్లో) వచ్చింది! తుమ్మలవారి వినయం, సభ్యుడి తెంపరితనం వంటివి నేటి సభల్లో వింటామా? చూస్తామా? మా తాతగారు చెప్పారు – ఇలాంటిదే చెళ్ళపిళ్ళ వారికీ జరిగిందని. మా ఊళ్ళో తిరుపతిశాస్త్రిగారు అస్తమించిన తరవాత కొంతకాలం వేంకటశాస్త్రి గారు అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి గారితో కలిసి అష్టావధాన, శతావధాన ప్రదర్శనం చేశారు. సభ్యుల్లో ఒకరు 'చిన్నవాడైనా అవ్వారి మంచి పద్యాలు చెప్తున్నాడు కదా? అతడికే వదిలిపెట్టి అవధాన భారమంతా మీ పెద్దరికం నిలుపుకోరాదా?" అని ముఖాన పట్టుకొని అడిగారట. పరమలౌక్యులైన

చెళ్ళపిళ్ళ వారు "సరిగ్గా ఇలాంటి ప్రసంగం ఎక్కడ, ఎప్పుడు వస్తుందా అని ఎదురుచూస్తుంటే ఇప్పటికి నా కోరిక తీరింది. సంతోష"మని "అర్జునా! నీ అస్త్రవిద్యా ప్రదర్శన నిర్విఘ్నంగా కొనసాగించు"మన్నాడట! సభ్యుడు "ఇంతకూ తమకున్న ద్రోణాచార్య దనిపించుకోవాలన్న తపన ఇప్పటికి నెరవేరిం దన్నమాట!" అని మొత్తం వ్యవహారాన్ని వాచ్యం చేశాట్ట. అలాంటి సభ్యులను మెప్పించిన వక్తే వక్త. అలాటి సభే సభ అనిపించదా మరి?

## సాంస్కృతిక విశేషాలు

బాపట్లలో మలేరియా తీవ్రంగా ఉంటే 'ఏ పట్ల చావకుండిన, బాపట్లకు పంపవలయు" మొదలుగా పద్యాలు చెప్పిన వాళ్ళున్నారు – పేర్లు మరిచాను. గట్టు నడిపి తనకున్న కొద్దిపాటి భూమినీ ఆక్రమించాడని కోపగించిన ఓ సామాన్యుడు "ఆదట నీయీభక్తుం, దూదుక తాగేటి గంజి కొడిగట్టిన ఆ, మాదర్చే దిలుఁగూల్పవె, వేదమయీ! కాళికాంబ! వినుతనితంబా!" అని పద్యం రాసి దారినపోయే వారందరికీ చదివి వినిపించి అప్రతిష్ఠపాలుచేసి తన పొలం తిరిగి సంపాదించగలిగాడు. పేరు సరిగా గుర్తులేదు. ఇలాంటి శాపానుగ్రహ పద్యాలు రాసేవాళ్ళు చాలామంది ఉండేవాళ్ళు– విని ఆనందించేవాళ్ళున్నందువల్ల. తిరుపతి వేంకటకవులూ, కొప్పరపు సోదర కవులూ ఈ వాతావరణానికి కారకులు. గాలివానకు ముందే బందా శ్రీరాములు గారనే సంపన్న కుటుంబికుడు మృగయాపురీ హిందూ నాటక సమాజం స్థాపించి ఓ పెద్ద పూరిపాకలో నాటకాలాడుతూ, ఆడిస్తూ ఉండేవాడని చెప్తుండేవారు. నా బాల్యంనాటికి ఆ సమాజమూ లేదు. ఆ పాకాలేదు. నాటకాలకన్నా హరికథ లెక్కువగా ఉండేవి వేటపాలెంలో. ఆ శ్రీరాములుగారు, బండ్ల బాపయ్య హిందూ మిడిల్ స్కూలుకు కార్యదర్శిగా ఉండి విద్యార్థులచేత నాటకాలాడించేవాడు. పెద్ద వయసులో తాను నాట్యంచేస్తూ బడిపిల్లలకు నేర్పుతుండేవాడు. బాపట్లలో కొర్రపాటి గంగాధర రావుగారనే డాక్టరు ఉదయం, సాయంత్రం సైకిలుమీద ఇంటింటికీ తిరిగి వైద్యంచేస్తూ దీపాలు పెట్టే వేళకు నాటకరచనా నటనా కార్యక్రమాల్లో తలమునకలుగా ఉండేవాడు. నాటకాభిమానం వృత్తికిగానీ, వైద్య వృత్తి నాటక ప్రదర్శనలకు గాని అడ్డువచ్చేది కావు. ఆయన కాదర్శం ప్రజానాట్యమండలి నిర్మాత డాక్టర్ గరికపాటి రాజారావు గారు – రాజమండ్రి వాస్తవ్యులు. జమున, అక్కినేని వంటి వారు ఆయన తర్ఫీదులోనే ప్రశస్తికి వచ్చారని చెప్తారు.

వేటపాలెంలో హరికథలు చెప్పే స్థానికులుండేవారు. వారికి తోడ్పడే వాద్యగాళ్ళుండేవాళ్ళు. నరసరావుపేట హైస్కూలుకు హెడ్మాస్టరుగా నాయని సుబ్బారావుగారి తరవాత పనిచేసిన కురంగేశ్వరరావు గారి రామదాసు హరికథ చాలా ప్రఖ్యాతం. ఆయన సెలవు రాగానే, పుట్టగానే కోస్తా పర్యటన చేస్తుండేవాడు హరికథ చెప్తూ. వీరావేశంతో నాట్యంచేసి చివరకు అపస్మారంలోకి పొయ్యేవాడు. ఆయన భక్తి పారవశ్యం ముఖ్యంగా స్త్రీలలో ప్రత్యేకాభిమానం సంపాదించింది. శ్రీరామనవమికి బాపట్లలో విధిగా హరికథ చెప్పేవాడు. మదరాసు రాజధాని కళాశాలలో పనిచేసి పదవీ విరమణ చేసిన వావిలికొలను సుబ్బారావు గారు (వాసుదాసు) మా ప్రాంతాల్లో శిష్య సంచారం చేస్తూ రామాయణోపన్యాసాలు చెప్తుండేవాడు. మా బంధువుల ఇళ్ళల్లో ఉండి



తెల్లవారు జామున స్నానంచేసి తిరునామాలు పెట్టుకొని భంగుసేవించి మంధర వ్యాఖ్య రాస్తుండేవాడు. అప్పుడాయన ఏకాంతానికి భంగం రాకూడదని పిల్లల్ని బయటకి పోయి ఆడుకోమని పంపేవారు. ఆ కారణంవల్లనేమో ఆయన ఎప్పుడూ రావాలని పిల్లలం కోరుకుంటుండేవాళ్ళం. ఆయన చాలామందికి వైష్ణవదీక్ష ఇస్తుండేవాడు. చాలాకాలం తరవాత ఆయన పోతన జన్మస్థలం ఒంటిమిట్ట అనే వాదం లేవదీశాడనీ, పచ్చి గ్రాంథిక భాషావాది అనీ తెలిసింది గాని ఆయన రచనలు చదవటం దుర్భరంగా ఉండేవి. అర్థమై చచ్చేవికావు. కొప్పరపు సోదర కవులు వస్తే అన్నదమ్ములు ఊపిరాడకుండా పోతన భాగవత పద్యాలను పుస్తకం చూడకుండా చదవటం విన్నాను. ఆ పద్యాలు వారి ఆశుకవిత్వం కాదనీ వారికి పోతన మీద ఉన్న శ్రద్ధా తాత్పర్యాలంతటివనీ చెప్పేవాళ్ళు ఉపాధ్యాయులు. 'సంపదమరేభ్యులార! ఓ సభ్యులార!' అనే మకుటంతో గ్రంథాలయంలో అడిగిన విషయం గురించి ఆశువుగా పద్యాలు చెప్తుండేవారు. కవితావేగంలో వారు తిరుపతి వేంకటకవులకన్నా గట్టివారేగాని వారిలాగా శాశ్వతంగా ఉండే గ్రంథరచనకు దిగని కొరత కొరతేననీ అబ్బరాజు సూర్యనారాయణ గారు వివరిస్తుండేవారు. స్థానికుల్లో నాకన్నా కనీసం పదేళ్ళు చిన్నవాడైన పృథ్వి వేంకటేశ్వర్లు సంప్రదాయ నటుడుగా సంగీతజ్ఞుడిగా మంచిపేరు సంపాదించి పెట్టాడు ఊరికి.

## పాతపరీక్షా పద్ధతి

మా బాల్యంలో పంగులూరి వారి సత్రంలో ఇటికంపాటి ఘనాపాఠి నిశానీ గారుండేవారు. ఆయన సామవేదంలో మరీ గట్టివాడని, తర్కంకూడా ఉత్తరభారతంలో చదివి వచ్చాడనీ చెప్తుండేవారు. అంతటివాడు నిశానీ ఏమంటే వేదవిద్య శ్రుతమేననీ, ఆ మాటకు వస్తే తిరుపతి వేంకటకవుల గురువైన చర్ల బ్రహ్మయ్యశాస్త్రి గారెంత పండితులైనా అక్షరజ్ఞానం లేనివాడేనని మా గురువుల వివరణ. మీరు పరీక్షలు రాయలేదా అని ఘనాపాఠీ గారినడిగితే "నా మొహాన బ్రహ్మదేవుడే రాయలేకపోయా" దనేవాడు. మరి మీకు వేదం వచ్చని ఎలా తేల్చారంటే "నేను సామంలో నారసపరీక్షలో, నింబపరీక్షలో నెగ్గానోయ్" అని వెన్ను చరచుకొనేవాడు. "సామవేదం సంగీతమయం కాబట్టి ఆ వేదం వల్లించేటప్పుడు అనుకోకుండా తల ఊపవచ్చు. అలా ఊపితే నా బోడితల మీద పెట్టిన నిమ్మకాయ దొర్లిపోతుంది. అదే జరిగితే తప్పినట్లే లెక్క. మెడకు రెండువైపులా నారసాలుంచి సామగానం చేయమనేవాళ్ళు. తల కదిలిస్తే గొంతులో ఆ సూదులు దిగుతాయి. మొదటిది నింబపరీక్ష. రెండోది నారసపరీక్ష. ఆ రెండూ నెగ్గిన నా సంగతి పిల్లకుంకల కేం తెలుస్తుంది?" అనేవాడు. చల్లా పున్నయ్య గారనే ఉపాధ్యాయుడు మా ఇంటి దగ్గర్లో ఉండేవాడు. ఆయన పెద్ద కుమారుడూ, నేనూ సహాధ్యాయులం. ఆ చనువుతో పరీక్షల గురించి చెప్పమంటే "నూటికిన్ని మార్కులు కావాలని అఘోరించే మీకు పరీక్షల సంగతెందుకురా? కందుకూరి వీరేశలింగం గారి కాలంలో తప్పటం, నెగ్గటం అనే రెండే ఉండేవి. దౌర్భాగ్యకాలం వచ్చి ముప్పై అయిదు మార్కులతో నెగ్గామనిపించుకొని విర్రవీగుతున్న వెర్రిబాగుల వాళ్ళురా మీరు" అని మండిపడేవాడు. ఆయన శిక్షలు విధించే తీరే విచిత్రం. నూటికెన్ని మార్కులు తక్కువ వస్తే అన్ని గుంజిళ్ళు తీయాలి క్లాసులో. చెవులు పట్టుకొని వంగి మోచేతులు నేలకు తగలకపోతే

– అవన్నీ సరిగా పెట్టని గుంజిళ్ళు. మురిగిపోయేవి! పదిసార్లు – ఒకటి అనేవాడు. మళ్ళీ మొదలు! "కాయకష్టం చేసుకుని బతకవలసిన సన్నాసులు కాబట్టి ఒళ్ళు గట్టి పడేందుకు ఈ శిక్ష వేస్తున్నాను. మీకు ఎటూ చదువురాదు. ఇలాగైనా బాగుపడండి" అనేది ఆయన సూక్తి. మరో చిత్రం లెక్కలో 90 కన్నా ఎక్కువ మార్కులు వచ్చిన వాళ్ళను పేం బెత్తంతో మోదటం, వంగోపెట్టి పిడిగుద్దులు గుద్దటం. 99 వచ్చిన వాడికి మణుగుగుద్దు, "ఇంకాస్త ముక్కితే వంద మార్కులు వచ్చేవిగదా!" అంటూ! తొడపాశం ప్రత్యేకశిక్ష. మొగపిల్లల్ని ఆడపిల్లల బల్లవైపు నెట్టడం, ఆడ పిల్లలచేత చెంపదెబ్బలు వేయించటం అలవాటు. ఆడపిల్లల్ని తిట్టేవాడు కాదు, కొట్టేవాడు కాదు. "తల్లీ! ఇష్టంలేకపోతే చదువు మానెయ్యి, చాకలి పద్దు రాయగలంత చదివి బడి వదిలిపోతివా శనివదుల్తుంది" అనేవాడు.

1920లోనే ప్రచండ రాజకీయ చైతన్యం ప్రదర్శించిన చీరాల్లో కూడా ఆంధ్ర సాంస్కృతిక వారోత్సవాలు ఎందుకో జరిగేవికావు. ఎవరైనా ఆ విషయం ప్రస్తావిస్తే సిగ్గుపడవలసి వచ్చేది. ఈ రెండూళ్ళలోనూ కవులేగాని అప్పట్లో కవయిత్రు లున్నట్లులేదు. చీరాల–పేరాల వనవాసకాలంలో రామనగరంలో బసవరాజు రాజ్యలక్ష్మమ్మ గారుండేవారు. అదంతా రెండేళ్ళు మాత్రం. బాపట్లలో ఉన్న కనుపర్తి వరలక్ష్మమ్మ గారు మంచి పేరు ప్రతిష్ఠలు సంపాదించారు – తెలుగులో లేఖారచన అనే సాహితీ ప్రక్రియకు ఆరంభకురాలిగా, స్త్రీహితైషిణీ సంఘ స్థాపకురాలుగా, స్త్రీవిద్య నాద రించిన వ్యక్తిగా. ఆమె గుంటూరు జిల్లా బోర్డులో కూడా కొంతకాలం సభ్యురాలు. వివాహంవల్ల చీరాలకు వచ్చిన నాళం కృష్ణారావు గారి కుమార్తె ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ గారు ఎక్కువకాలం అక్కడలేరు – బాపట్లకు వెళ్ళారు. చీరాలకు వచ్చిన గాంధీజీకి స్వాగత సత్కారాలందించటానికి ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారి కోరిక మేరకు పుష్పమాలాంకృతుణ్ణి చేసిన ఆండాలమ్మ మొత్తం భారతదేశంలో కారాగృహానికి వెళ్ళిన మొదటి మగువ (అని తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు కీర్తించారు). ఆ తరవాత చాలాకాలం గడిచినా మరో స్త్రీరత్నం రాజకీయ రంగంలో ఆ ప్రాంతంలో పనిచేసినట్లు లేదు.

గర్భదరిద్రుడినుంచి పరమైశ్వర్యవంతుడిదాకా అందరూ రేషనింగ్ విధానంవల్ల రకరకా లుగా బాధలనుభవించారు. ఆముదపు ప్రమిదల దగ్గర చదువుకోక తప్పిందికాదు – తెల్ల కిరోసిన్ దొరక్క. మెట్టూరు మల్లు కంపెనీ వారి లాంగ్ క్లాత్ గుడ్డలో గ్లాస్గో మల్లు ధోవతులో ఉన్న వాళ్ళకైనా లెక్క ప్రకారం దొరికేవి. ఖద్దరు గుడ్డల కొరతలేదుగాని చేనేత వస్త్రాలు ఎక్కువగా స్త్రీలే ధరించేవాళ్ళు. పేదలు పుట్టగోచీతో సరిపెట్టుకోక తప్పేదికాదు. పాలడబ్బాల కొరత. వాటిలో గొల్లభామ మార్కు డబ్బాలకు గిరాకీ ఎక్కువ. భారతదేశం హద్దుల్లో (ఒక్క రోజు ఇంఫాల్‌లో జరిగిన పోరాటం తప్ప) రెండో ప్రపంచయుద్ధం నీడైనా పడని కాలంలో కరువులూ, కొరతలూ తప్పని దుష్కాలంలో రైల్వే వారు చేసిన సహాయం అద్భుతం. అప్పుడు మా ప్రాంతాల్లో ఉన్నది మదరాస్ అండ్ సదరన్ మరాఠా రైల్వే అనే ప్రయివేట్ సంస్థవారి రైల్వే విభాగం. ఆ కంపెనీ వారు నెలనెలా నిశ్చిత సమయంలో ప్రతి స్టేషన్‌లోనూ ఒక గూడ్సు బండిని సైడింగులో నిలిపేవాళ్ళు. ఒక్క ప్యాసింజరు కంపార్టుమెంటుంటే అందులో లెక్కలు చూసే, సరుకులు తూచే మనుషులుండే



వాళ్ళు. రైల్వే పోర్టర్లు కూడా తమ కుటుంబావసరాలను స్టేషన్ మాస్టరు చేత రాయించుకొని సమర్పిస్తే వాళ్ళకు నిత్యావసర వస్తువులను టోకు రేటుకు సరఫరా చేసేవాళ్ళు. వాళ్ళకు రావలసిన జీతభత్యాల్లో సరకుల విలువ పోను మిగిలినది నగదు రూపంలో చెల్లించే వాళ్ళు అక్కడికక్కడ. తమకవసరం లేని వాటిని కూడా బంధుమిత్రులకోసం రైల్వే ఉద్యోగులీ పద్ధతిలో తీసుకొని లాభపడుతుండే వాళ్ళు. దేశం స్వతంత్రమై రైల్వే వ్యవస్థను జాతీయం చేసిన తరవాత కూడా ఇటువంటి ఏర్పాటు లేకపోవటం విచారకరం.

తంతితపాలా సౌకర్యాలు నేటితో పోలిస్తే తక్కువేగాని కార్డు కాణీకి వచ్చేది. పోస్టాఫీసుల దగ్గర ఉత్తరాలు రాసిపెట్టే, చదివిపెట్టే వాళ్ళుండేవాళ్ళు. రైళ్ళలో ఉండే ప్రత్యేక తపాలా పెట్టెలో వేసిన ఉత్తరాలు త్వరగా చేరేవి. జీవితం మెల్లగా సాగినా నిశ్చింతగా సాగేది. కులమతాభిమానా లున్నాయి గాని ద్వేషాలుగా అవి మారలేదు. పంచాయతీరాజ్ ఎన్నికలు వచ్చిన తరవాత ఓట్ల కోసం, వాటిద్వారా సంక్రమించే అధికారంకోసం అభిమానాలను దురభిమానాలుగా, ద్వేషాలుగా మార్చారు రాజకీయ వాదులు రెచ్చగొట్టి. అప్పట్లో మొత్తం కోస్తాలో ఒక్క నెల్లూరులోనే ఎప్పుడైనా మతకలహాలు వచ్చేవి. బ్రిటిష్‌వాళ్ళు అధికారంలో ఉండగా ఆ జిల్లాకు హిందూ ముస్లిముల్లో ఎవరినీ కలెక్టరు, సూపరింటెండెంట్ వంటి పెద్ద పదవుల్లో నియమించలేదు. మత ప్రసక్తి వచ్చినా ఎంత సులభంగా సమసిపోయేదో కళ్ళారా చూసిన ఓ దృశ్యాన్ని చిత్రించి నిరూపించగలను. చీరాల బాలికోన్నత పాఠశాల దగ్గర నాలుగు రోడ్ల కూడలి అప్పట్లో విశాలమైన బహిరంగ స్థలం. ఒకనాడొక ఆఫ్ఘన్ వచ్చి తనను కుస్తీలో ఓడిస్తే చేతికున్న తోడా తీసివేసి కాలికి మొక్కుతానన్నాడు. జనం గుంపుకట్టారు. చాలాసేపు ఎవరూ పోటీకి సిద్ధపడలేదు. శరభయ్య గుప్త అనే వస్తాదు సవాలు చేశాడు. ఓడితే మతం మార్చుకోవాలనే కొత్త షరతు పెట్టాడు ఆఫ్ఘన్. కొంతసేపు పెనగులాడిన తరవాత గుప్తగారు చిత్తయినారు. సాహెబుగారు గుండెమీద కాలుబెట్టి నిల్చొని గుప్తగారి ముఖంమీది విభూతిరేఖలను తుడిచివేస్తుండగా గుర్రంమీద వచ్చిన కోటంరాజు బైరాగి పంతులుగారి కంటబడిం దీదృశ్యం. యాభై అరవై సంవత్సరాల వ్యక్తి కోపంగా కిందకు దూకి పైగుడ్డలు తీసిపారవేసి లంగోటాతో ప్రత్యక్షమై వాడి గురువును నన్ను చిత్తుచేయ్ – చేతనైతే అన్నాడు. అందరూ ఆశ్చర్యపడ్డారు – రెండు నిమిషాల్లో ఆఫ్ఘన్ను గుండ్రంగా తిప్పి నేలకేసి కొట్టా డాయన. శరభయ్య లేచి "నాకు తమరు నేర్పిన మొదట పట్టిదే కదా!" అని విస్తుపోతే "నీవంటి వెధవకు నేర్పినందుకు ఏడుస్తున్నాను. వాడని విద్య లేనిదాంతో సమానం. మళ్ళీ నా కంటబడకు. శరభా సాహెబ్ అని పేరు మార్చుకొని ఊరు వదిలి పోవటానికి ఇరవై నాలుగ్గంటలు గడు విస్తున్నా. తరవాత బతక" వని గర్జించి తన దారిన తాను పోబోతుంటే 'పంతులు గారూ! సాయిబు మతం మార్చరా?' అన్నారు కొందరు. "చచ్చిన పామును చంపను. అలాంటి దౌర్భాగ్యుడు మన మతంలోకెందుకు?" అని గుర్రమెక్కి వెళ్ళాడు. అది కలహం కాలేదు. ఈసడింపు కాదా అంటే అవును. అంతటితో ఆ కథ ముగిసింది. ఇలాంటివి నాటి సమాజ వాతావరణానికి నిదర్శనాలు.

వేసవి సెలవు లైపోతున్నాయి. కాలేజీలో చేరాలి కానీ ఇంకా శక్తి రాలేదు. అయినా టి.సి. వగైరాల సేకరణ, దరఖాస్తు ఫారాలు నింపటం, గుంటూరులో ఎక్కడుండాలో నిర్ణయించు కోవటం మిగిలాయి.

# 4. కళాశాలలో

దాదాపు నెలరోజులు ఆలస్యంగా గుంటూరుచేరి మాతామహుల ఇంట్లో బసచేసి హిందూ కాలేజీకి వెళ్తే "నీ పేరిట దరఖాస్తేలేదు. సీటెలా వస్తుం"దని కోప్పడ్డారు నరసయ్యగారనే హెడ్డు గుమాస్తా గారు. ఇంటికి వచ్చి మొత్తుకుంటే మా పినతాతగారు ప్రిన్సిపల్ గారికి ఫోనుచేసి ఎగిరిపడ్డాడు. అప్పుడాయన ఆ కళాశాలకు కార్యదర్శి – పబ్లిక్ ప్రాసిక్యూటరున్నూ. మర్నాడు ప్రిన్సిపలును స్వయంగా కలిశాను. ఆయన పేరు వల్లభజోస్యుల సుబ్బారావు గారు. ఆయన ఓపిగ్గా యావద్వ్యవహారం విచారించి రెండు మూడు అవకతవకలు కనిపెట్టాడు. ఒకటి: మా వాణ్ణి ఫస్టుగ్రూపులో చేర్చుకొమ్మని తాతగారి హుకుం. నాకు ఎస్.ఎస్.ఎల్.సి.లో సిగ్రూపు ఫిజిక్స్. కాబట్టి దరఖాస్తును పరిశీలనలో పెట్టారు. ఇప్పుడు కావాలంటే బి.పి.సి. (బాటనీ, ఫిజిక్స్, కెమెస్ట్రీగాని, ఫిజిక్స్ స్థానంలో వ్యవసాయ శాస్త్రంలోగాని) సీటిస్తానన్నాడు – అదిన్నీ మా తాతగారు అంగీకరిస్తే. ఆయన ప్రతినిధిగా మరో పినతాతగారి కుమారుడు అక్కడే రసాయన శాస్త్ర విభాగంలో ఉన్నాడు. "ఆయనను నేను ఒప్పిస్తా. అలాగే చేయండి" అంటే సరేన్నారు. రెండు: ఇది మరీఘోరం. దరఖాస్తులోనూ, ఎస్.ఎస్.ఎల్.సి. రిజిస్టరులోనూ నా పేరు రాధాకృష్ణన్ అని ఉంది. అదేమని బుర్రగోక్కుంటే జాతకంలో నా పేరు రాధాకృష్ణరావు. మొదట హైస్కూల్లోనూ, తరవాత మిడిల్ స్కూల్లోనూ అది రికార్డుల ప్రకారం రాధాకృష్ణమూర్తి. పద్యాలు రాసే, చదివే కొత్త మోజులో "కందుకూరి వీరేశలింగమును నేను" అన్నట్లు యతిస్థానంలో సరిపోయేట్లు సవరించుకొని "బూదరాజు రాధాకృష్ణమూర్తి నేను" అని మార్చుకున్న పాపంనాది. హెడ్మాష్టరు శ్రీనివాసరావు గారు "ఎస్.రాధాకృష్ణన్ అంత వాడివి కావాలిరా!" అని రిజిష్టరులో మూర్తిని తొలగించి నకారప్పొల్లు తగిలించాడు. ఇదంతా మనవి చేస్తే ప్రిన్సిపల్ గారికి తిక్కలేచింది. "చంద్రన్" లాగా వెధవ అరవ పేరేమిటి నీకు. చివరి పొల్లు నేను పీకేస్తున్నా"నని రికార్డులో రాధాకృష్ణ అని రాయించాడు. వై.ఎస్.ఆర్.చంద్రన్ అనే ఇంగ్లీష్ లెక్చరరుండేవాడు ఆ కాలేజీలోనే. ప్రిన్సిపల్ గారిదీ అదే సబ్జెక్టు కాబట్టి వారి జాతివైరం నా పేరు మార్చింది!

ఈ సంగతులన్నీ చర్చకు వచ్చినప్పుడు నా పేరు అన్ని విధాలా మారటమే మంచిదయిందని పెద్దలు సంతోషించారు. నేను అయిదారేళ్ళ వయస్సులో ఉండగా ఆస్తి తగాదాల్లో బావమరదుల ఇల్లు స్వాధీనం చేసుకొని అందులో మనస్ఫూర్తిగా మూడు రోజులుందామనుకున్న మా తాతగారు నన్నుకూడా ఇంకొల్లుకు తీసుకువెళ్ళారు. ఆయన ముందు వాకిట్లో వాదోపవాదాలు చేస్తుండగా, మా అమ్మమ్మగారు దొడ్డివాకిట మంచినీళ్ళు తేవటానికి చెరువుకెళ్ళింది. ఆమె అటుపోగానే ఆమె జ్ఞాతులు ప్రవేశించి అక్కడ తారాడుతున్న నన్నో అలమార్లో పెట్టి, నోట్లో గుడ్డలు కుక్కి బయటి గొళ్ళెం పెట్టిపోయారట. కొంత సమయానికి నాకోసం గాలింపులు మొదలైనాయి. ఆయుధం కోసం అలమార తెరిస్తే అందులో నేను విలవిల్లాడుతూ కనిపించానట. ఆ తరవాత జరిగిన దారుణాల సంగతి అనవసరం. 'రావు'కోసం వచ్చిన యమభటులు 'మూర్తి'ని తీసుకపోవటం తగదని తిరిగి వెళ్ళారని తీర్మానించారట. టైఫాయిడు సమయానికి 'మూర్తి'కోసం వస్తే



నకారప్పొల్లు కాపాడింది. ఇప్పుడదికూడా పోయింది కాబట్టి సుఖపడతావురా అని మా అమ్మమ్మలూ, పిన్నులూ తీర్మానించారు. ఇలాంటి పొరపాట్లు యమభటులకు అలవాటై పాపాత్ములు బతికి పుణ్యాత్ములు చస్తున్నారనేది సత్యమట. ఈ సంగతి సినిమా వాళ్ళకూ్కడా తెలుసుకాబట్టి పరమసత్య మనాలి.

జింబో నగర ప్రదేశంలాంటి నా కళాశాలాప్రవేశం కొంత అలజడీ, వినోదమూ పుట్టించక పోలేదు. ఆ కాలేజీలో బహుకాలం చదివిన, ఇంకా చదువుతున్న క్రీడాకారు లిద్దరుండే వాళ్ళు. వాళ్ళ వల్లనే అఖిల భారత స్థాయిలో ఆ కాలేజీకి వాలీబాల్ క్రీడలో పేరు ప్రతిష్ఠలు వచ్చాయి. ఆ జంట బుచ్చిరామయ్య, చలమయ్యలు. అందులో మొదటాయన తరవాత జాతీయ కోచ్ అయినాడు. కొత్తగా వచ్చిన దరఖాస్తుల్లోని క్రీడాసక్తులను మొదట వాళ్ళే పరీక్షించేవారు. చీరాల్లోని డ్రిల్ మాస్టరు సోమయ్యగారు ఏ కళలో ఉండి ఎస్.ఎస్.ఎల్.సి. రిజిష్టరులో నమోదు చేశారోగాని అప్పటికే నేను అయిదున్నర అడుగుల ఎత్తున్నాను. పదమూడున్నర అడుగులు లాంగ్‌జంప్‌లో దూకాను. క్రికెట్ బంతిని నూరడుగుల దూరం విసిరాను. అన్నిటికన్నా ముఖ్యం వందమీటర్ల పరుగుపందెంలో (అంకెలు స్పష్టంగా లేక) 11 సెకన్లో 17 సెకన్లో నా రికార్డు. మొదటి అంకె నిజమైతే కొంత శ్రమించి విద్యనేర్పితే లేవీ పింటో అంతవాణ్ణి కావచ్చు. వాలీబాల్లో పనికిరావచ్చు. ఇలా ఆలోచించి వారు నా దర్శనభాగ్యంకోసం నెలరోజులు పరితపించి నన్ను చూడగానే మాన్పడిపోయారు! క్రీడారంగం నా శక్తిసామర్థ్యాలను గ్రహించగల స్థితిలో లేదని తేలిపోయింది.

## ఉపాధ్యాయవర్గం

ఎలాగయితేనేం? ఇంటర్ (మీడియట్) సైన్స్ విద్యార్థినైనాను. తెలుగుక్లాసులో ప్రవేశించే ముందూ దాన్నుంచి బయటపడేటప్పుడూ పద్యాల్లో గొణిగేవాణ్ణి – గుర్తింపుకోసం. తెలుగు ఉపన్యాసకులు పిల్లలమర్రి వేంకట హనుమంతరావుగారు (శారదాపీఠం నా ఇల్లంటూ అంటూండేవాడు. నవ్యాంధ్ర సాహిత్య వీధుల రచనలో తమ మామగారైన కురుగంటి సీతారామ భట్టాచార్యుల వారికి నాలుగో సంపుటిలో సహరచయిత. ఉపవాచక బోధకులు అద్భుతంగా పాడగల ట్యూటరు వావిలాల సోమయాజులు గారు. (ఆయన మైలవరం నాటక కంపెనీలో నటించినవాడని తరవాత చాలా కాలానికిగాని తెలియలేదు). ఇంగ్లీషుకు శ్రీనివాసన్ అనే శాఖాధిపతి వస్తే ఆయన నిమిషానికి పదిసార్లు వాడే ఊతపదాలు – ది దట్ దీ, అండ్ దేర్‌ఫోర్ అండ్ దేర్‌ఫోర్లు – విని చావలేక ఆయన వద్దని పోరాడి చివరికి ప్రిన్సిపల్ గారినే వరించాం. ఆయన తలఊపుడు ఒక్కటే విసిగించవచ్చునేమోగాని షేక్స్పియర్ నాటకాలు చెప్తున్నప్పుడు ఒక్కో జాతీయానికి, పద బంధానికి, సామెతకు సంస్కృతాంధ్ర భాషల్లోని సమానార్థకాలను కూడా ఎత్తి చూపేవాడు! అంత విజ్ఞానిని నేను మరొకర్ని చూడలేదు – వినలేదు. మొదటేడు ఇంగ్లీషు పాఠం చెప్పిన మరొకరు వేదాంతం రామచంద్రరావుగారు. ఆయన బందరు నుంచి, ఏ.సి. కాలేజీ నుంచి ఇక్కడకు వచ్చారు. ఆయన ప్రసంగ వేగం మంత్రముగ్ధుల్ని చేసేది. వృక్షశాస్త్రం పది రోజులైనా చెప్పారో లేదో గాని వేంకటరావుగారు ఆంధ్ర విశ్వకళా పరిషత్తుకు వెళ్ళారు. గొప్ప టీచరు. ఒక గంట వారి పాఠం విన్న తరవాత రెండేళ్ళు ఇతరులు చెప్పేది

వినవలసి రావటం విద్యార్థులు చేసుకున్న మహాపాతకం. అక్కడ నాలా పద్యాల పిచ్చిలో ఉన్న జూలూరి హనుమంతరావు తోడు దొరికాడు. అప్పటి రసాయనశాస్త్ర గురువు పి.సాంబశివరావు గారికి రెండు ప్రత్యేకత లుండేవి. ఒకటి దొంగ హాజరు చెప్పటానికి వీల్లేకుండా అంకెల వరస తప్పించి ఖంగుమనే గొంతుతో త్వరత్వరగా అటెండెన్స్ తీసుకున్నా తప్పుగా వేయకపోవటం. రెండు ప్రతి విద్యార్థి పుట్టిన రోజునూ పుట్టుమచ్చలనూ గుర్తుకు తెచ్చి నోళ్ళు మూయించ గలగటం. మరోటి ప్రత్యేకతో కాదోగాని చిత్రమనిపించేది. "సోడియం ఈజ్ ఎ డెడ్లీ పాయిజన్, క్లోరీన్ ఈజ్ డెడ్లియర్, బోత్ ఆఫ్ దెం కంబైన్ టుగెదర్ టు ఫాం ద కామన్ సాల్ట్ అండ్ దేర్ ఈజ్ గాడ్" అని ఒక్క గుక్కలో చెప్పటం! మొదట ఆకట్టుకున్న ఉపాధ్యాయులు వీరు.

కాలేజీలో చేరిన పది రోజుల తరవాత ప్రయోగశాలకు పరుగులు తీస్తూ మెట్లు దిగు తుండగా ఒక పండితుడు పైకెక్కుతూ ఎదురుపడ్డాడు. లక్ష్యపెట్టకుండా దిగబోతుంటే ప్రిన్సిపల్ లాగి లెంపకాయ కొట్టాడు – "ఎదురు నడిచి నాశనమై పోదలుచుకున్నావా?" అని గద్దిస్తూ. అప్పుడే తెలిసింది ఆ పండితుడు పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులు గారనీ – కాశీ కృష్ణాచార్యుల వారికి మేనల్లుడూ, అల్లుడూ అవుతాడనీ – గుంటూరులో ఆయన్ను కన్నెత్తి చూసినా, ఆయనకు కోపం తెప్పించినా వంశనాశనమై పోతామన్న ప్రగాఢ విశ్వాసముందనీ – రౌడీలక్కూడా! నేనెరిగి నంతలో ఆయన మెడవాల్చి తనదారిన తాను పోవటమేగాని ఎవరినీ పలకరించిన దాఖలా కూడా లేదు. ప్రిన్సిపల్ దౌర్జన్యానికి ప్రతీకారం చేయాలని మామలతో చెప్తే "ఏడిశావ్. అది నీ తరంగాదు. మొదట ఆచార్యుల వారింటికి వెళ్ళి క్షమాపణ చెప్పిరా. కవిత్వం అఘోరిస్తున్న గాడిదవు కాబట్టి నాలుగు సంస్కృతమ్ముక్కలైనా ఆయన దగ్గర నేర్చుకో. బాగుపడతావు. చదువు వచ్చినా రాకపోయినా తెల్లవారు జామున నిద్రలేచి ఓ రెండు మైళ్ళు నడిచి, ఆరోగ్యమైనా సంపాదిస్తా" వన్నారు. చినమేనమామ చాటుకు పిలిచి "ఆ వెధవ సిజర్సు కాల్చినా, ఆయనకు కనపడే ముందు నాలుగు తులసి దళాలు తినిపో. వాసనపోతుంది" అని సలహా ఇచ్చాడు. 1942 నుంచీ నాకా విద్య ఉందనీ, సిజర్సు కాల్చనివాడు కవిగాడనే గట్టి నమ్మకముందనీ ఆయనకు తెలుసు. నాకన్నా రెండు మూడేళ్ళు పెద్దేగాని సిగరెట్లు నేతాగినన్ని తాగేవాడు కాదు. ఆ విధంగా ఆచార్యుల వారిని దర్శించి ఆయన కుమారుడు శ్రీనివాసాచార్యులతో స్నేహం కట్టి నాలుగు సంస్కృతమ్ముక్కలు నేర్చుకున్నాను. ఎంతగా ప్రయత్నించినా ఆయన్ను ఆటపట్టించాలనే భావం కూడా కలిగేది కాదు. ఆయన ఇల్లూ, కాలేజీ తప్ప మరోచోటికి వెళ్ళేవాడు కాదు. ఊరే ఆయన్ను దర్శించేది!

రెండో సంవత్సరం చదివే ముందు వేసవి సెలవుల్లో వేటపాలెంలో నిర్వహించవలసిన విద్యార్జన విశేషాలను గురువులు నిర్దేశించారు. మెకాలే రాసిన జాన్సన్, గోల్డ్‌స్మిత్తుల జీవిత చరిత్ర బళ్ళో చదివారు కాబట్టి వాళ్ళ గ్రంథాలు లైబ్రరీలో చదవమన్నారు. Rassellas తప్ప జాన్సన్ పుస్తకం మా ఊళ్ళో దొరకలేదు. అది అర్థమై చావనూ లేదు. హెస్కెత్ పియర్సన్ రాసిన జాన్సన్ జీవిత చరిత్ర సరదా పుట్టించింది. Vicar of the Wakefield, Deserted Village గ్రంథాలయంలో ఉన్నయ్. చదివాను. అర్థమైనంత అయింది. కానిది కాలేదు. మా పినతాత



గారు డబ్లిన్‌లో ఉండగా ఓ నమ్మకం కుదిరి రస్కినూ, స్పెక్టేటర్‌లో అడిసన్ రాసిన వ్యాసాలూ చదివితే మంచి ఇంగ్లీషు పట్టుబడుతుందని నచ్చజెప్పాడు. స్టీల్ వ్యాసాలు చదవవద్దని నిషేధిం చాడు. అంత పట్టుదలగా ఉంటే అర్థమైనా కాకపోయినా మాథ్యూ ఆర్నాల్డ్ నవలలు చదవ మన్నాడు. Ivanhoe, Kenilworthలు ప్రయాసపడి చదివి బోధపడలేదని తేల్చుకున్నాను. కాశీ కృష్ణాచార్యుల వారి బాలబోధిని (మూడు సంపుటాలు) చదివితే అక్కిరాజు ఉమాకాంతంగారు చెప్పిన 'దూడ పేడ సంస్కృతమైనా వస్తుం'దని అబ్బరాజు వారు ప్రోత్సహించారు. ఎందరి ప్రసంగాలో విన్నందువల్ల ఎంతో కొంత శ్రుతపాండిత్యం కలిగించిన సారస్వతనికేతనం సభలూ ఆ గ్రంథా లయమూ నా మొదటి విశ్వకళాపరిషత్తులు.

కాలేజీలో చేరిన తరవాత ఒకటి రెండు నెలలకే డిఫ్తీరియా వచ్చిందని గుంటూరు పెద్దాసు పత్రిలో పడేశారు మా పినతాతగారు. అప్పటికి ఆ సిరంకోసం బొంబాయికి పంపి తెప్పించు కోవాల్సి వచ్చేది. ఆలస్యమవుతుంది కాబట్టి మరోమార్గం చూస్తామని పెన్సిలిన్ స్ప్రే చేసి బాధించారు డాక్టర్లు. చూడవచ్చిన విద్యార్థి మిత్రులద్వారా, బంధువులద్వారా వేటపాలెం కబురుపెడ్తే మా తాతగారు రంగారావు డాక్టరుగారితోసహా వచ్చారు. చిన్న డాక్టరు పరీక్షించ టానికి ఆసుపత్రిలోని పెద్ద డాక్టర్లు అంగీకరించలేదు. ఇతని ప్రాణానికి నేను బాధ్యత వహిస్తానని ఆయన రాసిస్తే మా తాతగారూ అలాగే చేస్తే ఇంటికి పంపారు. పెద్దాసుపత్రుల హడావిడేగాని వాడికి జలుబుచేసి గొంతు పట్టిందంటాడు రంగారావు డాక్టరు. మరో అభిప్రాయంకోసం డాక్టర్ వాడపల్లి వేంకటేశ్వరరావు దగ్గరికి వెళ్తే మా వేటపాలెం డాక్టరుదే సరైన నిర్ణయమన్నారు. ఆవకాయ, గొడ్డుకారం వగైరాలతో రెండు రోజుల్లో తేరుకున్న తరవాత నేను బంధువుల ఇంట్లో ఉండి పథ్యంకూడు తిననన్నా. చదువయినా మానుకుంటానుగాని ఈ విపరీత సంరక్షణ భరించ లేనన్నాను. అంత మొండి పట్టుకు రెండు కారణాలున్నాయి. ఒకటి సిగరెట్ కాల్చుకునే స్వాతంత్ర్యం దెబ్బతినటం. రెండోది కవితా వ్యసనం. రెండో సంగతి వివరాలు నా రెండో విశ్వవిద్యాలయం అనుభవాలకు సంబంధించినవి.

## రెండో విశ్వవిద్యాలయం

గుంటూరు రైల్వేస్టేషనుకున్న ఆవరణలో అమరావతి రోడ్డువైపు రైలుగేటుకు దగ్గరగా ఖాళీస్థలం ఉండేది. దానిచుట్టూ రోడ్డువైపు కటకటాల గేటుండేది. రాత్రి 8 గంటలకు గేటుకు తాళం పెట్టేవాళ్ళు. సాయంత్రం 5 తరవాత అక్కడ ఓ సాహితీసభ నిత్యం జరిగేది. అది సభకూడా కాదు. గోష్ఠి అనవచ్చు. అందులో నాకూ, జూలూరి హనుమంతరావుకూ ప్రవేశమిచ్చారు. అది సాక్షి వ్యాసాల్లోని వాణీప్రసాదకాలాచార్యాదుల చర్చాగోష్ఠిలాంటిది. ఒక్క పూర్ణ ప్రజ్ఞాచార్యుల వారు తప్ప ఆ గోష్ఠిలో అక్కడ పాల్గొనని సాహితీపరు డాకాలంలో గుంటూరులో లేడు. సభాధ్యక్షు డంటూ నిశ్చితంగా ఎన్నికైన/ఎంపికైన వ్యక్తిలేడు గాని విద్వత్పోషణభారం వహించగల చావలి వేంకటశాస్త్రిగారు ఆ పదవిని తామే స్వచ్ఛందంగా స్వీకరించేవారు. 'వెంచాశా' అనే సంక్షిప్త నామంతో కథకుడనే పేరు గలవాడేగాని అంతకు మించిన ఆర్థిక పుష్టీ, శరీరపుష్టీ ఉన్నవా డాయన. నగరంలోని ఇంపీరియల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా (ఇప్పటి స్టేట్ బ్యాంక్ ఆఫ్

ఇండియాకది పూర్వరూపం) స్థానిక శాఖాధిపతి ఆయన. జిల్లా కలెక్టరు కన్నా పెద్ద జీతంగల వ్యక్తి. ఆయన వెల్లకిలా పడుకొని గోష్ఠి నిర్వహించేవాడు. మంచికథలు వెంచాశా పేరిట ప్రచురితమైతే, రకరకాల కలంపేర్లతో రేరాణి, అభిసారికల్లో ఆయన రచనలు వచ్చేవి. అశ్లీలమని జరిమానా పడితే ఆయనే చెల్లించేట్లూ, న్యాయవిచారణ అవసరపడ్డప్పుడు ఏ అభాగ్యుణ్నో రచయిత అని పత్రికాధిపతి నిర్దేశించి శిక్షానుభవానికి పంపేటట్లూ ఆ ఖర్చులు కూడా శాస్త్రిగారే భరించేట్లూ ఏర్పాట్లుండేవి. ఆయన పుణ్యమా అని తెనాలిలోని ముగ్గురు ప్రసిద్ధులతో మా అందరికీ పరిచయమయింది. వారు జ్యోతి అభిసారికా పత్రికాధిపతి ఆలపాటి రవీంద్రనాథ్ గారు, రాంషా (అసలు పేరు దర్భా రామశాస్త్రి. ఆయన దరిమిలా పితాపురం ద్వారా సామర్ల కోటకు చేరి పత్రికనూ, పుస్తక ప్రచురణ సంస్థనూ నిర్వహించాడు), ముద్రాపకరచయితా రేరాణి సంపాదకుడూ అయిన ధనికొండ హనుమంతరావు ఉరఫ్ 'ధహ'గారు. శాస్త్రిగారు లేనప్పుడు ఆతిథ్యమిచ్చి తా నేచదరంగంలోనో నిమగ్నుడై కూడా చర్చలు వింటూ ఉండేవారు కృష్ణ సోమ యాజి గారు. ఆయన ఆంధ్ర ఇన్సూరెన్స్ కంపెనీకి స్థానిక శాఖాధిపతి. విద్యాగోష్ఠుల్లో అభిప్రాయ భేదాలువస్తే పరిష్కారానికి అందరం ఏకగ్రీవంగా అంగీకరించిన ఉన్నతపీఠం పూర్ణప్రజ్ఞులది. ఆయన ఎన్నడూ రాలేదుగాని మేమే పోవలసి వచ్చిన సందర్భాలున్నాయి. అప్పుడు ప్రమాదం లేకుండేందుకు ఆ రైల్వే యార్డులో తులసితోట పెంచాం. రోడ్డు కావల హోటలుండేది. ఇప్పుడున్న ఓవర్‌బ్రిడ్జి అప్పుడు ఊహలో మాత్రం ఉండేది. మదరాసు గవర్నరు ఆర్చిబాల్డ్‌నై వాహన పరంపరకు తన సైకిలును అడ్డపట్టి, ఓవర్‌బ్రిడ్జి నిర్మించనందుకు అసమ్మతి తెలుపుతూ ఆంధ్రాంగ్లభాషల్లో మహోపన్యాసం చేసి అరెస్టయిన ప్రసిద్ధ చరిత్రాధ్యాపకుడు మారేమండ రామారావుగారి వీరత్వాన్ని అక్కడే చూశాం.

ఏమాత్రం వీలున్నా గోష్ఠికి విచ్చేసే పెద్దలో తర్కవ్యాకరణ సాహిత్య శిరోమణి కృష్ణమా చార్యులు గారు మా అందరిలో విద్యాధికుడు. ఉన్నవ లక్ష్మీబాయమ్మ స్థాపించిన శారదా నికేతనా నికి ఆయన ప్రిన్సిపల్. హిందూ కళాశాలలోని పి.వేం.హ. గారూ వావిలాల సోమయాజులు గారూ తరుచుగా వచ్చేవారు. ఓరుగంటి నీలకంఠశాస్త్రి గారు అరుదుగా విచ్చేసేవారు. ఎక్కిరాల కృష్ణమాచార్యులు గారు తమ జ్యోతిర్విద్యా వ్యవహారాల్లో తీరిక చిక్కితే కనిపించి వెళ్ళేవారు. ఏ.సి.కాలేజిలోని జమ్ములమడక మాధవరాయశర్మ, వేదాల తిరువేంగళాచార్యులు గారలు వచ్చేవారు. ఎప్పుడైనా వచ్చి తెల్లగుడ్డలూ, వాటి మడతలూ మాయకుండా కూర్చొని మౌనంగా విని వెళ్ళేవారు తెలికచర్ల వేంకటరత్నం గారు. ఎప్పుడో వచ్చి అందరితోనూ వివాదాలు పెట్టు కొనిపోయే శిష్ట్లా ఉమామహేశ్వరరావు, చదలవాడ పిచ్చయ్య గారూ పేరు మోసిన వాళ్ళు. కుందుర్తి ఆంజనేయులు, నీలంరాజు లక్ష్మీప్రసాద్ (కలంపేరు ప్రణీల్) చదరంగం ఆడుతూ చర్చల్లో పాల్గొనేవారు. కుందుర్తిని చూడటానికన్నట్లు నరసరావుపేట నుంచి అప్పుడప్పుడు బెల్లంకొండ రామదాసుగారు విచ్చేసి కవ్స్ (అంటే కవులు) ఎలా ఉన్నారని పలకరించిపోయే వారు. ధనకుధరం వేంకటాచార్యులు, శ్రీరామకవచం వేంకటేశ్వరశాస్త్రి, అంబటిపూడి వేంకటరత్నం, పోలూరి ఆంజనేయప్రసాద్, వీరమాహేశ్వరుడైన ముదిగొండ వీరభద్రమూర్తి



గారలు నిత్యం వచ్చేవాళ్ళు. శుక్రవారం సాయంత్రానికి అమరావతినుంచి విధిగా వచ్చేది జంధ్యాల పాపయ్య శాస్త్రి (కరుణశ్రీ) గారూ, వారి స్కూలు హెడ్మాస్టరైన మహావాది వెంకటరత్నం గారు. వచ్చి ఉన్నంతసేపూ మా దృష్టినీ, లోకం దృష్టినీ ఆకర్షించే వ్యక్తి గుర్రం జాషువాగారు. ఆ వయసులోనూ పరుగులాంటి నడకతో వచ్చి కంచుగొంతుతో శ్రావ్యంగా, ఆశువుగా సంస్కృ తాంధ్రాల్లో శ్లోకాలూ పద్యాలూ చదివి, అనుమానాలు తీర్చమంటే మా పూర్ణప్రజ్ఞు ణ్ణడగండని వెళ్ళే కాశీ కృష్ణాచార్యులవారి రాకపోకలు అదనపు ఆకర్షణ. రానందుకు మేం సంతోషించిన ఉపాధ్యాయుల్లో మందలపర్తి ఉపేంద్రశర్మ గారొకరు. ఏదో విషయం ఎవరో కదిపితే మెప్పు గానో, దెప్పుగానో వేడివేడి చర్చలు జరిగేవి. నాటి సాహితీ జగత్తులోని ప్రఖ్యాత రచయితలనూ రచనలనూ విమర్శాత్మకంగా చర్చించి ఘర్షణపడటం, తరవాత నవ్వుకుంటూ ఇళ్ళకుపోవటం సాధారణచర్య. మా అందరికీ టీలిప్పించి తానుమాత్రం బాదంఘీర్ తాగటం వెంచాశా గారికి వినోదం. ఒక్కోసారి రాత్రి 9 గంటలదాకా గోష్ఠి సాగేది. అందులో పాల్గొనాలంటే బంధువుల ఇంట్లో ఉండరాదని నా సిద్ధాంతం.

మా గోష్ఠికి నేను సీనియర్ ఇంటర్‌లో ఉండగా 'అమరేంద్ర'గా పరిచితుడైన చతుర్వేదుల నరసింహశాస్త్రిగారు కొత్త సభ్యులైనారు. ముదిగొండ వారు అడపాదడపా బెజవాడ వెళ్ళి విశ్వనాథ వారి దర్శనం చేసుకొని ఆయన సరికొత్త రచనల విషయం పోగుచేసుకొని వచ్చేవారు. ఒకసా రాయన రాస్తున్న రామాయణ కల్పవృక్షంలోని ఒక పద్యం తమకు బాగా నచ్చిందని చదివి వినిపించారు. ఆ సంగతి ఆయన కంఠస్వర ప్రభావంవల్ల అమరావతి, బెజవాడ, పొన్నూరు, నరసరావుపేటల దాకా వినిపిస్తుందని అంతేగొంతున్న ధనకుధరం వెక్కిరించాడు. ఆ పద్యం చివరి 'మఘవన్మాణిక్య!' అనే సంబోధన వ్యాకరణ విరుద్ధం కాదా అని ప్రశ్నిస్తే పైనబడి కొట్టినంత పనిచేశాడు. సాత్వికులైన వ్యాకరణ శిరోమణి నేనన్నది నిజమంటే అది శైవవైష్ణవ వివాద దృష్టి అన్నాడు. అప్పుడు (తొలుత) విశ్వనాథ భక్తుడే అయిన కుందుర్తి సుప్రీంకోర్టుకు వెళ్ళి తేల్చుకుందామన్నాడు. మరునా డుదయం కాఫీ టిపిన్లు ముగించుకొని ఓపినన్ని సిగరెట్లు తాగి (ఇది తాగేవాళ్ళ సంగతి) తులసాకులను మేకల్లా నములూ పళ్ళెవారి ఇంటికి వెళ్ళాలి. ఇది తెలుగు కవి ప్రయోగం కాబట్టి బాలప్రౌఢ వ్యాకరణాదు లేమంటున్నాయో చర్చించి (ఆయనతో వాదించగల సత్తా మాకెవరికీ లేదనేది వాస్తవం కాబట్టి వినటమే చర్చ), సంస్కృత వ్యాకరణాల్లో లఘుకౌముదితో మొదలుపెట్టి మహాభాష్యం దాకా వెళ్ళి, ప్రాతిశాఖ్యా వ్యాకరణాల్లో ఉందా అని పెద్దగా మాకు వినిపించేట్లు ఆలోచించి, తిరుగుబాటలో రామాయణ భారత కాళిదాసీయాల్లో కవిప్రయోగంకోసం గాలించి చివరకు "నాయనలారా! నా ఎరికలో సమర్థించగల వ్యాకరణ సూత్రంగాని, మహాకవి ప్రయోగంగాని గుర్తుకు రానందువల్ల ఈ ప్రయోగం అవ్యాకృత మనిపిస్తున్నది. విశ్వనాథవారు విద్వత్కవులు కాబట్టి వారితోనే చర్చించి వారేమన్నదీ నాకు తెలియజేస్తే సంతోషిస్తాను" అన్నారు. అతినవీన వ్యాకృతి నుంచి అత్యంత ప్రాచీన వ్యాకరణాల దాకా ప్రస్తావించి తిరిగి కావ్యమార్గంలో వచ్చిన మరో విద్వదుపాధ్యాయుణ్ణి నేనెరగను.

**రచనాకండూతి**

అప్పట్లో ఉత్తర ప్రత్యుత్తరాలూ, దూషణ భూషణలూ పద్యాల్లో సాగించటం గొప్పతనమనే దుర్భ్రమ ఉండేది మా మిత్రులందరికీ. పొన్నూరి నరసింహారావు, అచ్యుతుని బాబూరావు, పి.వి.సముద్రయ్య వగైరాలకు రాసిన పద్య ప్రత్యుత్తరాలు ఇంకా నా దగ్గర ఉన్నాయి. కొన్నిసార్లు ఇంగ్లీషులో కూడా చెత్తాచెదారం రాసి ఉచ్చారణ తెలియకుండానే గణస్వరూపం ఊహించి ఉత్తరాలు రాసుకుంటుండే వాళ్ళం. అది కేవలం కండూతి అనీ, తప్పుల కుప్పలుగా రాస్తుండే వాళ్ళమనీ గ్రహించి మానటానికి నాలుగైదేళ్ళు పట్టాయి. చిన్నా పెద్దా ఆలోచన లేకుండా ఆశీర్వచన పద్యాలు తెలుగులో (అంతకన్నా ఘోరమైన తప్పులతో) సంస్కృతంలో రాయటం నా దుష్ప్రవర్తనలో భాగమయింది. ఒక మిత్రుడి వివాహానికి మణిత్రయమనే ఆశీర్వచనం రాసి మిత్రుడూ, బంధువూ అయిన ఆలూరి సాంబశివరావు వివాహానికి ఇంటూరు వెళ్ళినప్పటి ఒకానొక అనుభవం పులకరింపజేసింది. మొదటిశ్లోకం చదవటం పూర్తి అయ్యీ కాకముందే ఎక్కడో, ఎన్నడో చూసినట్లనిపించిన ఒక సమున్నత వ్యక్తి "బాబూ! నేనోసారి నీ పద్యాలు చదివి, పెద్దవాణ్ణి కాబట్టి నేను ఆశీర్వదించినట్లు చదివితే నీకభ్యంతరమా?" అన్నాడు. లేదన్నాను. ఆయన పద్యగానం విని పరవశించాను. నేను రాసిన చచ్చుపద్యం ఇంత గొప్పగా ఉంటుందా అని ఆశ్చర్యపడి ముళ్ళపూడి బుడుగులా లేచాను. అది 2-3-1949 నాటి విషయం. పద్యం చదివిన తరవాత "మన మెప్పుడైనా కలిశామా? నన్ను గుర్తించగలవా?" అంటే ఆయన ఫొటో చూసిన గుర్తుతో "నండూరి సుబ్బారావుగారేమో ననుకుంటున్నా" నన్నాను. సరిగ్గా పోల్చుకొని చెప్పమని నవ్వితే 'ఎంకిపాటల సుబ్బారావుగారే" నన్నాను. ఆనాడు నా జన్మ ధన్యమయిందనిపించింది. ఆ పద్యం అంత అద్భుతంగా ఉండటానికి కారణం ఆయన కంఠమాధుర్యమేగాని నా కవితాశక్తి కాదని అప్పుడే ఆయనకు చెప్పాను. ఇప్పటికీ విశ్వసిస్తున్నాను. ఆ పద్యమిది. (చిత్తగించి నామాట ఎంత నిజమో తేల్చుకోండి):

**"వాణీ లసత్పాణి వీణా పరిక్వాణ పాణింధమ క్రియా పాటవమ్ము**
**రామాహృదారామ రంగస్థలన్యస్త రమ్యపాతివ్రత్య లక్షణమ్ము**
**నీహారికా భారతీ హారి నిరవద్య శరదభ్ర పరిశుభ్ర సౌష్ఠవమ్ము**
**గణనీయ గార్హాస్థ్యకర్మాద్యనుష్ఠాన పరిణతీ విస్ఫుట ప్రౌఢిమమ్ము**
**లభ్యమానమ్ముగాగ విలాసవినయ, విస్ఫుట విశిష్ట గార్హస్థ్య విధులయం' ద**
**నంతలక్ష్మను' చేదోడునై మెలంగ, 'సాంబశివరాయ' డుండుత సాటిలేక".**

భోజన సమయంలో పక్కన కూర్చొని "పద్యరచనా ధోరణి అలవరచుకున్నట్లే కంఠస్వరాన్ని కూడా అదుపులో ఉంచుకోగలిగితే మంచిది. అయినా నాకు పద్యాలమీద మోజు లేదయ్యా! నీకు సంగీతంమీద లాగా" అన్నాడు. ఏడవాలో, నవ్వాలో ఇప్పటికే తేలని విషయాల్లో ఇదొకటి నా ప్రాణానికి. హిందూ కళాశాల మేగజైనుకు పద్యాలు రాయటం మానలేదు. అప్పట్లో గర్భబంధ రచనలతో ఏకంగా ఒక క్షుద్ర ప్రబంధమే రాశాను. ఇంకా నా దగ్గర అలనాటి లిఖిత కావ్యముంది. ఇప్పు డెప్పుడైనా అది కంటబడితే కళ్ళు చెమరుస్తాయి - ఏడ్చినట్లున్నందుకు. దానికి



రఘు విలాసమని పేరుపెట్టి చివరకు సౌదామిని అని మార్చాను. మిత్రుడి వివాహ సందర్భంగా ఒక మారు అడిగొప్పుల పోకతప్పలేదు. మహాకవుల వాక్కు శాశ్వతత్వం సంపాదించుకుంటుం దన్న విశ్వాసం మళ్ళీ కలిగిం దక్కడ శ్రీనాథుడి చాటువు గుర్తుకు వచ్చి - అడిగొప్పుల హోరుగాలి మారలేదు, గుడిమీది కోతీ అలాగే ఉంది. తక్కిన దృశ్యాలు కాలగర్భంలో కలిసిపోయినట్లనిపించాయి.

ఆకాలానికి మరోకొత్త అలవాటు మొలకెత్తింది. వచ్చీరాని ఇంగ్లీషు పరిజ్ఞానంతో, తెలిసీ తెలియని సంస్కృత జ్ఞానంతో ఆయా భాషల్లో చదివిన పుస్తకాల్లోని నచ్చిన భాగాలను తెలుగు పద్యాల్లోకి అనువదించాలనే దుగ్ధ పుట్టింది. ఫిడ్జెరాల్డ్ ఇంగ్లీషు అనువాదం చదివి ఒమార్ ఖయ్యాం రుబాయీలను తెలుగులోకి దించి ప్రయోగాత్మకంగా కొన్నిటిని కాలేజీ మేగజైన్‌కు ఇస్తే 1949లో అచ్చయ్యైనాయి. అచ్చులో సొంత పద్యాలు చూసుకొని విర్రవీగటం మొదలైంది. 'మధుగీత' అనే శీర్షికతో అచ్చయిన ఆ పద్యాల్లో ఒకటి ఇలా ఉంది:

**చిర సంతాపముతోడ, రేపొదవు నిస్సీమార్తివృద్ధిక్షయ**
**స్ఫురణమ్మెం దలపోసి, నే డతి మనఃక్షోభమ్మునం జొక్కు నో**
**నరుడా! ఎచ్చటినుండి వచ్చితివొ? జన్మం బేలనో? ఎందుకై**
**మరణింతో? అపు డేడ కేగెదవొ? - తప్పం ద్రావుమీ విస్మృతిన్.**

ఇదే ధోరణిలో కాళిదాస కుమారసంభవంలోని హిమాలయవర్ణనకు ముగ్ధుణ్ణై 'హిమాలయాలు' అనే శీర్షికతో అదే పత్రికలో ప్రచురించిన పద్యాల్లో ఒకటి (ఇది 1950 నాటిది):

**సంజవెలుంగులో శిఖరసానువులం దరుణారుణప్రభా**
**పుంజము లుద్భవించి పరిపూర్ణములై జలదమ్ముఁ గప్పుచో**
**రంజిలి సిద్ధయోగులు నిరంతర తీవ్రతపః ప్రవృత్తు లౌ**
**చుం జరియింతు రాగగనచుంబి మహాశిఖరాగ్రసీమలన్.**

మూల రచయిత కెంత అపచారం చేశానో ఆలోచించే కొద్దీ ఇప్పుడు దుఃఖం వస్తున్నది గాని అప్పటి అహంకారం అనుక్షణ విజృంభమాణంగా ఉండేది.

దీపావళి నాలుగైదు రోజులుందనగా స్వగ్రామానికి వెళ్దామనుకున్నాను. బంధువులందర్నీ పలకరించాలని గుంటూరు నగర పర్యటన చేస్తే అందరూ "అక్కడ మటుకు నీకు అమర్చే వాళ్ళెవరున్నారు? ఇక్కడ మా ఇంటికి వచ్చి పిల్లలతో కలిసి పండగ చేసుకో" అన్నారు. ఎవరింటికి పోతే తక్కినవాళ్ళలో ఎవరికైనా కోపం రావచ్చుకాబట్టి, నా స్వతంత్ర జీవనం గురించిన చర్చలు రావచ్చు కాబట్టి, ఇక్కడే ఉండి కవితాగోష్ఠి సాగిద్దామనుకున్నాను. ఆనాడు కవులందరూ విజృంభించారు. ఫలితం రాత్రి 9 గంటలయింది లేచేసరికి. హోటళ్ళు అప్పటికే మూసినందున తిండిలేదు. శ్రీమద్దత్తాత్రేయ మిరపకాయ బజ్జీ దుకాణముంది అమరావతి రోడ్డు బ్లూలైట్ దగ్గర. అక్కడ కడుపు పట్టిన మేరకు బజ్జీలు తిని సిగరెట్లు కొనుక్కొని గదికి పోదామనుకుంటుంటే బ్రాడీపేట మూడోలైనులోని బృందావనమనే ఆడపిల్లల హాస్టలు వాళ్ళు కేరింతలుకొడ్తూ రెండో ఆట సినిమాకు గుంపుగా పోవటం కనిపించింది. ప్రహ్లాదుడికిలాగా మాతృభావన మాత్రమే

కలిగింది – బహుశా అర్ధాకలివల్లనేమో. గదికి వెళ్ళి తోచక ఏదో పుస్తకం తీశాను చదువుదామని. అది క్లాసు పుస్తకం కాదు. మా నాన్నగారు బెనారెస్ మెట్రిక్ చదివినప్పటి ఇంగ్లీషు పద్య సంకలనమది – Lahiri's Select Poems అని. నా కర్మకొద్దీ పేజీలు తిప్పుతుండగా "On receipt of my mother's picture" అనే ఖండిక కనిపించింది. అది పూర్తిగా చదివానని గాని, అర్థం చేసుకొన్నానిగాని ఇప్పటికీ చెప్పలేను. మనసు మాతృవియోగం మీదికిపోయింది. కష్టం వచ్చినా, సుఖంవచ్చినా చేతనైన పని పద్యా లల్లటం (రాసిందంతాగాని, కొంతగాని కవిత్వం కాదని ఇప్పటి నా విశ్వాసం). 'గతస్మృతి' అనే పేరున పద్యాలు రాశాను. రాత్రి పదకొండున్నర అయింది. ఆకలి దంచేస్తున్నది. ఏవో నాలుగు అరటిపళ్ళు దొరికితే తీసుకొని మళ్ళీ దత్తాత్రేయుల సేవచేసి (ఆ దుకాణం రాత్రి ఒంటిగంటదాకా ఉండేది పరీక్షల సీజన్లో) తిరిగి గదికి చేరి పాత పద్ధతిలో మరో పుస్తకం తీశాను. అది కాకినాడ టౌన్ కాంగ్రెస్ కమిటీ కార్యదర్శి ఏడిద కామేశ్వర రావుగారు రాసిన అల్లూరి సీతారామరాజు జీవితచరిత్ర. అందులో గుండెలో గుండు దెబ్బతో పడి ఉన్న రాజుగారి ఫొటో ఉంది. ఆ పుస్తకాన్ని బహిష్కరించారు బ్రిటిష్ వాళ్ళు. పెంకుటింటి చూరు కింద దాచి రక్షించుకున్నాననీ, పోలీసుల చేతిలో లాఠీ దెబ్బతిన్నాననీ మా నాన్నగారు చెప్పిన మాట. అది గబగబా చదివి ఏకబిగిన పద్య రూపంలో పెట్టాను. దాని శీర్షిక 'ఆటుపోట్లు'. అది గ్రంథ రూపంలో 'అమూల్యం'గా ప్రచురితమైన తరవాత బెజవాడ రేడియో కేంద్రంలో మా గురువుగారు 'అమరేంద్ర' (చతుర్వేదుల నరసింహ శాస్త్రిగారు) సమీక్షిస్తూ ప్రశంసించిన (రేడియో వారప్పటికీ ఇప్పటికీ ప్రశంసలనేగాని అభిశంసనలను సహించరు–ప్రసారం చేయరు!) పద్యమిది:

**అది వర్షర్తువు; రాణ్మహేంద్రవరమం దత్యంతమై ఆంధ్ర నీ**
**రద సందోహ విమర్శనాజటిల వర్షచ్ఛాయలన్ హూణజా**
**తిదురాచార పశుప్రవర్తనలు నర్తించెన్ – పరాధీన దు**
**ర్మదశక్తుల్ తృణజాతులై పరికరింపన్ క్రొవ్వు చేకూరదా?**

**జాషువా దయ**

ఒంటిగంట దాటిందేమో బజ్జీలకొట్టూ లేదు. కాళ్ళీడ్చుకుంటూ రైలుస్టేషనుకు పోతే మూస్తున్న బేకరీలో చల్లారిన టీ నీళ్ళు తప్ప ఏమీ దొరకలేదు. సిజర్స్ తాగే నాకు బేర్స్ పెట్టే ప్రాప్తమయింది. గదికి చేరి, నిద్రపట్టక ఎప్పుడో విన్న అర్థం పర్థంలేని ఒక విషాద వృత్తాంతాన్ని పద్యీకరించాను. ఈ మూడు ఏడ్పులకూ కలిపి అశ్రుధారలనే పేరు పెట్టి మా అమ్మగారికి అంకిత మిస్తూ పద్యం రాశాను. ఆ తరవాత ఎప్పటికీ నిద్రపట్టిందో తెలీదు. ఎంతసేపు నిద్రపోయానో చెప్పలేను. పైన ఎవరో పడ్డట్లు బరువు బాధ కలిగి కళ్ళు తెరిచానటగాని వ్యక్తిని గుర్తు పట్టలేదని తరవాత తెలిసింది – మీదపడ్డ వ్యక్తి గుర్రం జాషువా గారు. సగం కుట్లూడిన నరసరావుపేట క్యాంప్ కాట్మీద పడుకొని మగతలో పడ్డానన్న మాట. అప్పటికి రెండు మూడు రోజులుగా గోష్ఠికి రాని కారణం కనుక్కుందామని చూడవచ్చి తాను మంచంమీద కూర్చుంటే పట్ట చినిగి పోయింది. ఇద్దరం కిందపడ్డాం. లేవదీసి జ్వరంకూడా ఉందని భుజాన వేసుకున్నాడు.



గింజుకుని బ్రాడీపేటలోని డాక్టరు ఆమంచర్ల చలపతిరావు గారి దగ్గరకు తీసుకుని పోయాడు. ఆయన ఇచ్చిన మందులు తాగించి గదికి చేర్చాడు. ఇది మలేరియా రోగం. తిండిలేక బలహీన పడి (నేను ఆ జ్వరం రాకముందు మహాబలుణ్ణయినట్లు భావించుకున్నాడేమో!) ఇలా ఇలకరు చుకపోతున్నాడని ఒక భయంకర టానిక్కిచ్చాడు. అది క్వినోహెమోజన్ అనే ద్రావకం. అది తాగితే నాలుగు రోజుల వరకూ ఆపాదమస్తకం చేదెక్కిపోతుంది. తినాలి. లేదా రోగం తగ్గదు. మందు తాగాలి. లేదా మలేరియా పోదు. మందు తాగి తినటం ఎంత దుర్భరమో తిని తాగినా అంతే. నాలుగు రోజులపాటు ఇంచుమించు అంటిపెట్టుకొని ఉండి కాపాడా డాయన. అది మరిచిపోలేని మహత్తర సంరక్షణ.

కాలేజీకి పోయి రాగానే గోష్ఠికి హాజరుకావటం మొదలుపెట్టాను – రాసిన పద్యాలతో సహా. "పద్యం చదవటమైనా చేతగాని వాడివి. నేను అరండల్పేటలో ఇక్కడ కూచొని చదువు తాను, అగ్రహారంలోని గురువు గారికి (పూర్ణప్రజ్ఞులకు) వినిపించేట" ట్లన్నవాడు ధనకుధరం వేంకటాచార్యులు. బెజవాడకు వినిపించేట్లు పద్యం చదవగల నా ఎదుటనా నీ ప్రగల్భాలని హుంకరించాడు ముదిగొండ వీరభద్రమూర్తి. మీరెవరూ నాలాగా సంగీత పూర్వకంగా కావ్య గానం చేయలేరని వాదించి జాషువా గారు "రెండు రూపాయలు ఖర్చుపెడ్తే తొక్కుడు హార్మొనీతో సహా హార్మొనిస్టు దొరుకుతాడు. అందుకు సిద్ధపడితే నేను పద్యం ఎలా చదవాలో ప్రదర్శిస్తా" నన్నారు. ఆ పాటి సొమ్ము నా దగ్గరే ఉందని ఇచ్చాను. మరునాడు జాషువా గారు మాట నిలుపు కున్నారు – ఈలవేసి సంప్రదాయ నాటకరంగ పద్ధతిలో ఫలానా రాగం, శ్రుతి ఇంత అని చెప్పి పద్యగానం చేస్తుంటే జనం చేరారు గుంపుకట్టి. 'ఎలా ఉన్నాయి పద్యాలు? నా కావ్యగానం ఎట్లా ఉంద'ని ప్రశ్నించి 'రాత ఇతడిది, కూత నాది' అని మీసం తిప్పేవాడు పద్య పద్యానికి. ఇదో వినోదం. గుంటూరు ప్రజలకు గుర్రం జాషువా అత్యంతాభిమానపాత్రుడు. కాసు బ్రహ్మానందరెడ్డి గారు ఆయనకు గుంటూరులో ఉద్యోగ మిప్పించారు. టొబాకో కింగనే బిరుదున్న ఏకా ఆంజనేయులు గారు ఆయనకు ఇల్లు కట్టించి పెట్టారు. ఏ గుంటూరు హోటల్లోనైనా తృప్తిగా తిని బిల్లు కాగితం వెనక సంతకం పెట్టే చాలు 'గుజా' అని, హోటలు వారికి ఆంజనేయులు గారే బిల్లు చెల్లించేవారు. కొన్ని గ్రంథాల ప్రచురణకు ఆయనే సొమ్మిచ్చాడు. జాషువా కవిత్వం రవ్వలు రాలుస్తుంది గాని ఆయన మాత్రం పరమసౌమ్య శాంతమూర్తి. మీసాలూ కోటూ ఆయన నిజస్వరూపాన్ని మార్చి చూపుతాయి. అవి లేని ఆయన్ను చూడటం అసంభవం.

గుంటూరులో ఏటేటా రామకోటి ఉత్సవాలు జరిగేవి. తెల్లవారు జామున మొదలై అర్ధ రాత్రిదాకా సాగేవి. తక్కిన కార్యక్రమా లెలా ఉన్నా 'జకారత్రయం' వారి మహోపన్యాసాలు గంటలకొద్దీ సాగాల్సిందే. జమ్ములమడక మాధవరాయశర్మ, జటావల్లభుల పురుషోత్తం, జొన్నల గడ్డ సత్యనారాయణ మూర్తిగారల ఉమ్మడి పేరది. ప్రభాకర ఉమామహేశ్వర పండితుల ఆవేశ పూరిత ప్రసంగాలు సరేసరి. ఈ సంరంభం రాష్ట్రీయ స్వయం సేవక సంఘానికి వెన్నెముకగా ఉండేది. నిషేధమున్నా అప్పుడప్పుడు స్వయం సేవకులు బహిరంగ విన్యాసాలు చేస్తుండేవారు. ఒకసారి వారిమీద లాఠీఛార్జీ జరుగుతుండగా కోర్టునుంచి ఇంటికి వస్తున్న మా సినతాతగారు

స్వయంగా చూశారు. దారినపోతున్న ఆయన చిన్న కుమారుడు శ్రీనివాసమూర్తీ నేనూ బాష్ప వాయువంటే ఏమిటో మొదటిసారి రుచి చూశాం. ఊరేగిన వాళ్ళందరూ మైనరు కుర్రాళ్ళే. వాళ్ళను అరెస్టుచేసి సెషన్స్ కోర్టులో ప్రవేశపెట్టే ప్రభుత్వం తరఫున వాదించటానికి మా పినతాతగారు నిరాకరించారు – పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా ఉండి. జరిగింది పోలీసుల దౌర్జన్యమనీ, అందుకు ప్రత్యక్షసాక్షిననీ, కలెక్టరు ఇదేమంటే పదవికి తక్షణం రాజీనామా చేశాడు. ప్రకాశంగారి దగ్గర ఆయన జూనియర్‌గా పనిచేసి తరవాత పొగాకు కంపెనీకి న్యాయ సలహాదారుగా ఉన్నాడు. ప్రీమియరైన ప్రకాశంగారే పబ్లిక్ ప్రాసిక్యూటరుగా నియమించా డాయన్ను. అయినా సరే శాశ్వత ప్రాతిపదికమీద పొగాక్కంపెనీతో ఉన్న సంబంధాల కన్నా, ప్రకాశంగారి మీది గురుభావం ముఖ్యమనిపించలే దాయనకు. పదవికి రాజీనామా చేశాడు. అంతకు రెండు రోజుల ముందు మాచెర్ల వైపునుంచి నిజాం పరగణాలోకి పోలీసు చర్య నిమిత్తం బయలుదేరుతున్న భారతీయ సేనాముఖం నేత అయిన ఒక మేజరుకు విందు చేశాడు. ఆ రోజు సైనికుల క్రౌర్యం ఎలా ఉంటుందో రుచి చూశాను. నన్ను అమాంతం పైకెత్తి ఒళ్ళో కూర్చోబెట్టుకున్న మేజరు “బాబూ! రోజుకో గ్లాసెడైనా ముస్లిం రక్తం తాగు. నీ ఆరోగ్యం బాగుపడుతుంది. దేశం దృఢపడు తుంద”న్నాడు! “పంజాబులో దేశ విభజన కాలంలో మాకూ మా కుటుంబాలకూ వాళ్ళు చేసిన అపకారం, అన్యాయం మీ అనుభవంలో ఉంటే మీకు ఇలా చెప్పాల్సి వచ్చేదికా”దనీ అన్నాడు.

## విద్యార్థుల పోరాటం

గుంటూరు సామాజిక వాతావరణంలో మూడు వర్గాల ఘర్షణలు మొదలవుతున్న రోజు లవి. క్రైస్తవ మత ప్రాబల్యానికి చిహ్నంగా విద్యాసంస్థలు – ఏనాడో వెలసినవి – విస్తరిస్తున్నాయి. కుగ్లర్ ఆసుపత్రికి బ్రహ్మాండమైన ప్రఖ్యాతి వచ్చింది. ముస్లింలు బలంగా ఉన్న ప్రాంతాల్లో వైషమ్యం తీవ్రంగానే ఉంది. ఆర్.ఎస్.ఎస్. అందువల్ల కొంత బలపడటం మొదలైంది. రౌడీ మూకలూ, ముఠాలూ కొట్లాడుకోవటం పరిపాటి. సోడాసీసాలతో, సైకిల్ చైన్లతో పోరాడుకుం టుండే వాళ్ళు. బ్రాహ్మణులు మంచి స్థితిలో ఉన్నా వైదిక నియోగి భేదాలు బాగా ఉండేవి. తిరుపతి వేంకటకవులకూ, కొప్పరపు సోదర కవులకూ మధ్య వచ్చిన విద్యాస్పర్ధ ఇందుకు ప్రధాన కారణమంటారు. హిందూ కళాశాల పాలకవర్గం ఈ కారణంగా చీలి కార్యదర్శిత్వం నియోగి వైదికు లొకరి తరవాత మరొకరు పంచుకొనే ఏర్పాటు జరిగింది. ఆంధ్ర సాంస్కృతిక వారోత్స వాలు తప్పనిసరిగా జరిగేవి – విద్యా సంస్థల్లో. 1949లో జరిగిన సభల్లో పాల్గొన్న గుర్తులేదుగాని 1950లో మూడు రోజులపాటు హిందూ కళాశాలలో సాంస్కృతిక వారోత్సవాల విషయం చిత్ర మైన ఘర్షణలకు దారితీశాయి. మూడోరోజు కవిసమ్మేళనానికి మూడు గంటలు కేటాయించారు. సభలకు ఎవరు రావాలనే విషయం ప్రిన్సిపల్‌గాక కార్యదర్శి నిర్ణయించేవాడు. అప్పటికి ఒకటి రెండు ఆశుకవితా ప్రదర్శనలూ, చిన్న అవధానమూ చేసిన బాలకవులం ఉన్నాం కాబట్టి మాకూ అవకాశమిమ్మని కోరాం. కార్యక్రమ నిర్ణయం రెండు నెలల క్రితమే జరిగింది కాబట్టి మార్చే ప్రసక్తి లేదన్నాడప్పటి కార్యదర్శి మాధవపెద్ది హనుమంతరావు గారనే ప్రఖ్యాత న్యాయవాది. కేటాయించిన మూడు గంటల్లో ఒక అరగంటైనా విద్యార్థుల కావ్యగానాని కిమ్మంటే “నేనేం



మంగలినా? కత్తిరించటానికి?” అని మండిపడ్డాడు. అప్పుడు కట్టుగట్టుకొని చాలామంది విద్యార్థులం గాంధీపార్కులోని స్వరాజ్య మైదానంలో సమావేశమై ప్లీడర్ల బోర్డులను మంగలి షాపులకు, అక్కడివి ఇక్కడికీ రాత్రి పది గంటల తరవాత మార్చాలనీ, వీలైనంత నిశ్శబ్దంగా ఈ పని జరగాలనీ, ఎవరెవరు ఏ ప్రాంతంలో ఇలా చేసినా రాత్రి ఒంటిగంటలోపల అమరావతి రోడ్డుమీది బ్లూలైట్ దగ్గర కలిసి కార్యక్రమం ఎంత జయప్రదంగా జరిగిందో సరిచూసుకోవాలనీ నిర్ణయించుకున్నాం. ఒక బృందం రాలేదు. వెతుక్కుంటూ వెళ్తే వాళ్ళతో ఒక పెద్దాయన ఘర్షణ పడుతున్నాడు. ఆయనకు నమస్కరించి నిష్కారణంగా ఒక కులాన్నీ విద్యార్థికవులనూ తూలనాడి నందుకు ఇలా చేస్తున్నామనీ, ఇది పూర్తిగా గాంధేయ పద్ధతిలో శాంతియుతంగా సాగుతున్నదనీ, రేపు రాత్రికి మళ్ళీ యథాస్థితికి అన్నిటినీ మారుస్తామనీ విన్నవించుకొన్నాం. ఇది నిజమా అని రెట్టించి నేను సొంత కళ్ళతో మీరు చేసిన మార్పును పరీక్షించి నిజమైతే నా బోర్డును పెకలించ టానికి సాయంచేస్తానన్నాడు! ఆయనిచ్చిన సాధనాలతో వేపచెట్టుకున్న నేం ప్లేటు తుప్పు మేకులను పెకలించాం. ఇంతకూ ఆయన పేరు చెప్పలేదు కదూ? క్షమించండి. బోర్డు మీద శ్రీ డి.పి.కాక్షుడు (దామరాజు పుండరీకాక్షుడు) బి.ఏ., బి.ఎల్.” అని మొదటి పంక్తిలో, 'Poet, Patriot and Pleader' అని రెండో పంక్తిలో ఉంది. “శ్రీగాంధీ సేవలు మరువాం మరువాం” వంటి పాటలు రాసి జైలుకు పోయి వచ్చిన వీరుడాయన.

ఇంత రభస జరిగిన తరవాత అడివి బాపిరాజు గారి అధ్యక్షతన జరిగిన కావ్యపఠనంలో విద్యార్థులకు స్థానం ఇవ్వక తప్పింది కాదు. బాపిమామ ఎంత సాత్వికుడో సభాధ్యక్షుడుగా అంత కఠినుడు సమయపాలనలో. ఒక నిమిషం ముందు వేలు చూపి పూర్తి చేయకపోతే తరవాతి వక్తను ఆహ్వానించేవాడు. ఆనాడు మొదటిసారిగా ఆయన్ను చూశాం. అప్పుడాయన కూడా కావ్యగానం చేస్తే బాగుంటుందని అభ్యర్థిస్తే అందరి పఠనం పూర్తయిన తరవాత ఇచ్చిన సమ యంలో మిగిలితే చివరకు పాడతానన్నాడు. ఎవరికి వాళ్ళు జాగ్రత్తపడి సమయం మిగిల్చాం. “ఉప్పొంగి పోయింది గోదావరీ” అని ఆయన పాడుతుంటే తన్మయత్వం పొందాం. ఆనాటి మరో గొప్ప కవీ, గాయకుడూ మాధవపెద్ది బుచ్చి సుందరరామ శాస్త్రిగారు. పద్యం చదివే ముందు ఆయన తాను దిక్కుమాలిన పొట్టనింపటంకోసం అభిమానులేగాని భాషాజ్ఞానం లేని వాళ్ళు దగ్గర వసుచరిత్ర పద్యాల్లో దాతల పేరు ఇరికించి డబ్బు సంపాదించిన పాతకానికి కడుపులో పుండై ఒకటి రెండు నెలలకన్నా బతకవని వైద్యులు తేల్చి చెప్పారనీ, దాసరి తప్పు దండంతోసరి అని సభాముఖంగా తన దుష్కార్యాన్ని చెప్పి క్షమించమని అజ్ఞాతదాతలందరినీ కోరుతున్నాననీ ఆయాసపడుతూ చెప్పి కంటనీరు పెట్టించా డందరికీ. తరవాత మోహనరాగంలో ఒకే ఒక పద్యం చదివి మంత్రముగ్ధుల్ని చేశాడు. చెళ్ళపిళ్ళ వారు ఈ శిష్యుణ్ణి అంతకు ముందు విశ్వనాథ వారినీ మీరు కవిత్వంమాని హెచ్.ఎం.వి.రికార్డులిస్తే కోటీశ్వరు లవుతా రన్నారని చెప్తుండేవారు.

## చెళ్ళపిళ్ళ అస్తమయం

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు అవిభక్త మదరాసు రాష్ట్రంలో మొట్టమొదటి ఆస్థానకవి అయి నప్పుడు బెజవాడలో గొప్ప సభ జరిపి సన్మానించారు. అప్పటికే ఆయన చాలా అనారోగ్యంతో

బాధపడుతున్నాడు. నాటి సభలో రెండు విశేషాలు జరిగాయి. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి శిష్యులకే పదవినిచ్చి గురువుకివ్వక పోవటం అప్రశస్తమని కరపత్రాలు పంచారు. ఆంధ్రుల అనైక్యానికీ, అసందర్భ ప్రసంగాలకీ ఇది మచ్చుతునక. సంస్కృతాస్థాన కవి కృష్ణశాస్త్రి అనే తమిళ పండితుడు తెలుగువాళ్ళలో ఇందరు కవిసార్వభౌములూ కవిసమ్రాట్టులూ ఉండడం అర్థరహితమని నిండుసభలో ఆక్షేపించాడు. అప్పుడు పరమసాధువనే పేరుగల వేలూరి శివరామ శాస్త్రి గారు అనర్గళంగా సంస్కృతంలో ఎవరెందుకు అంతబిరుదు సంపాదించారో, ఇతర ప్రాంతాల్లో అలాటి బిరుదులు లేకపోవటం ఆయా భాషా కవుల అశక్తత మాత్రమని ఎందుకన రాదో చెప్పమని నిగ్గదీశాడు. ఆయన్ను ఆ సందర్భంలో చూసిందే మొదటిసారి. ఆ తరవాత చెళ్ళపిళ్ళ అభినందన సంచిక ప్రచురిస్తున్నామంటే నేనూ కొన్ని పద్యాలు రాసిపంపాను. తిరుగు టపాలో తిప్పి పంపుతూ కాటూరి వేంకటేశ్వరరావు గారు ఒక ఉత్తరం కూడా రాశారు: ధనాభావ స్థలాభావాలవల్ల సుప్రసిద్ధుల రచనలు మాత్రమే ప్రచురిస్తున్నామనీ, తిప్పి పంపినందుకు అన్యథా భావించవద్దనీ. సంచిక కొన్నాను. దాని ఉపయోగం 1968–69లో తెలిసివచ్చింది. అందులో దివాకర్ల వేంకటవధానిగారు వాడుకభాషలో (!) రాసిన వ్యాసముంది. తెలుగు అకాడమి భాషా స్వరూప నిర్ణయం జరుగుతున్నప్పుడు ఆయన అడుగడుగునా అడ్డు తగులుతుండేవాడు. అకాడమి ఉద్యోగులు చాలా తప్పులు దిద్దక వదిలి వేస్తున్నారని అధ్యక్షులైన విద్యామంత్రి పి.వి. నరసింహారావు గారికి రాస్తూ ఒక పెద్ద పట్టిక ఇచ్చాడు. నేను సమాధానం చెప్పవలసి ఉంది – విద్యావిషయక పాలకవర్గం వారి ఎదుట. ఆ వర్గానికి పింగళి లక్ష్మీకాంతంగారు అధ్యక్షులు. భద్రిరాజు కృష్ణమూర్తిగారు సభ్యులు. మంత్రిగారు స్వయంగా విచ్చేసి అవధానిగారి వాదం వారి ముఖతః విన్నారు. నేను పూర్వోక్త సంచికనూ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రచురణల్లో అవధానిగారు రాసిన పీఠికలనూ గుర్తులుపెట్టి అవధానిగారు సుప్రసిద్ధులనీ నేను కాననీ కాటూరి వారి ఉత్తరం చూపి, తప్పులని అవధానిగా రాక్షేపించిన దుష్ట ప్రయోగాలను ఆయనే చేసినట్లు నిదర్శన చూపాను. ఆయన వాదం పరాస్తమయింది. ఒక్కోసారి ఒకనాటి అశక్తత మరోనాడు మహత్తరశక్తి కావచ్చు. ఈ సంఘటనే అందుకు నిదర్శనం.

ఇంకా ఒక మూడు వారాల్లో పరీక్షలు మొదలవుతా యనుకుంటుండగా చెళ్ళపిళ్ళవారు ఫిబ్రవరి 15న అస్తమించారు. హిందూ కళాశాలలో స్మారక/సంతాప సభ జరిగింది. సభాధ్యక్షులు కాశీ కృష్ణాచార్యుల వారు. వారు దివాకరాస్తమయం తరవాత కొంతకాలం చెళ్ళపిళ్ళ వారితో కలిసి అవధానాలు చేసినవారు. ఆకస్మికంగా, అనూహ్యంగా వేటూరి ప్రభాకరశాస్త్రి గారు వచ్చారు. ఆయన్ను మొదటిసారి అప్పుడు చూశాను. ప్రధానవక్తగా ఆయన్నే మాట్లాడమన్నారు. గాద్గద్యంతో ప్రసంగించారు. తరవాతి ఉపన్యాసం పూర్ణప్రజ్ఞాచార్యుల వారిది. ఆయన తిరుపతి వేంకటకవులు ప్రతిభావ్యుత్పన్నతల్లాగా సాహితీ ప్రపంచాన్ని పాలించారనీ, వారిలో తిరుపతి శాస్త్రిగారి వ్యుత్పన్నత మహత్తరమైతే వేంకటశాస్త్రిగారిది అసాధారణ ప్రతిభ అనీ అంటుండగానే ప్రభాకరశాస్త్రి గారు అడ్డు తగిలారు. "మీ ప్రసంగం వేంకటశాస్త్రి గారు అవ్యుత్పన్నులనీ తిరుపతి శాస్త్రిగారు అప్రతిభులనీ ఆక్షేపిస్తున్నదా?" అని ప్రశ్నించారు. పూర్ణప్రజ్ఞులు నేనలా భావించి



మాట్లాడలేదుగాని నేనన్నమాట హయగ్రీవసాక్షికంగా తప్పుకాదన్నారు. ఆయన అలా కంట గించుకోవటమే ఎవరికీ తెలియని, ఎవరూ ఊహించని విషయం. ఆయన కోపగిస్తే చాలా ప్రమాదమన్న విశ్వాసం ఆయన మేనమామా మామా అయిన కృష్ణాచార్యులకూ ఉందనీ ఆయన తొట్రుపాటే చెప్తుంది. కాశీవారు వేటూరివారి చేతులు పట్టుకొని ఆశువుగా చెప్పిన పద్యం ఇంతకాలంగా నా దగ్గర భద్రంగా ఉంది. అది ఇది:

**అర్ణోరాశిగభీరుఁ డీతఁడు మహత్త్వాకాంక్షి కాకుండుటన్**
**నిర్ణేతృత్వము జోలి కేగఁ, డయినన్ నిర్ణేయ భాషావిశే**
**షార్ణోరాశిఁ దరించినాఁ, డెఱుఁగుమయ్యా! సాహితీ స్ఫూర్తిలోఁ**
**బూర్ణప్రజ్ఞుఁ డితండు; లౌక్యవిధులం బోలేఁడు మమ్ముంబలెన్.**

అంతటితో ఆ సభ ప్రశాంత స్థితికి వచ్చింది.

నేను దీపావళి నాటినుంచి మహాకవిమార్గం వదిలి బేర్పు సిగరెట్లు కాల్చి వేసవి సెలవుల నాటికి 350 రూపాయలు ఆదా చేయగలిగాను – ఇంటి నుంచి వచ్చే సొమ్ము నుంచి రాసిన పద్యాలు అచ్చు వేసుకోవాలంటే 500 కాపీలకు అన్ని వందల రూపాయలు ఖర్చవుతుందని గుంటూరులో తెలిసింది. తాతగారు పైసా ఇవ్వరని తెలుసు. అందుకే ఈ జాగ్రత్త. కవితా కండూతీ, కీర్తికాంక్షా మనిషిని ఎంత దుర్భరీకరిస్తాయో తెలిసివస్తున్నది. అప్పటికి హిందూ కళాశాల మేగజైన్‌లో కొన్ని పద్యా లచ్చయినవి. రాసిన పద్యాల్లో తప్పులుంటే సరిదిద్దమని స్వామీ శివశంకరులను ప్రాధేయపడ్డాను. గతస్మృతిలో "రేపట వచ్చెద వనుచున్, మాపట చనుదెంతు వంచు మాయికవృత్తిన్, పాపాత్ములు మరపించుట, కై పన్ని రభూతకల్పనావళి వింటే?" అన్న పద్యంలో "పాపాత్ములనే మాట పెద్దలను దూషించినంత పాతకం" – అని 'నా పంతము మఱ పించుటకై' అని దిద్దారు. అది అలాగే సవరించుకున్నాను. అయినాసరే, పీఠికనో పరిచయాన్నో రాయనన్నాడు. ఆ రోజే నిర్ణయించుకున్నాను. రచన నిలిచినా చచ్చినా పీఠికలవల్ల కాదని. ఈ నాటికీ నేనెవరినీ నా రచనలకు పీఠికలు రాయమని కోరలేదు. కొన్ని సంస్థలు ప్రచురించినప్పుడు వాటి పాలకులు రాసే మాటలను నేను అడ్డనూ లేదు. వేసవి సెలవుల్లో ఏప్రిల్ నెలలో 'అశ్రుధారలు' ప్రచురించాను. ఒక్క కాపీ నేనమ్మలేదు. అమ్మి పెట్టే ఏర్పాట్లూ లేవు. అది మొదలు ప్రచురణకర్త దొరికితే తప్ప స్వయంగా ప్రచురించి చేతులు కాల్చుకోగూడదనే నిర్ణయానికి వచ్చాను. గుంటూరు వదిలి పొయ్యేముందు గోష్ఠి వారందరం పూర్ణప్రజ్ఞుల తీర్పుకోసం మరో సారి వారిని సందర్శించాం. విషయం కుందుర్తి రాసే వచనం కవిత్వం కాదని ముదిగొండ వారు చేసిన ఆక్షేపం సరైందా? కాదా? అని ప్రశ్నకు సమాధానంకోరి. "కాదంబరి రాసిన భట్టబాణుడు కవి అయితే కుందుర్తీ కవే" నన్నాడాయన. కవితాగుణం ప్రధానంగాని రచనా రూపం కాదన్నాడు. చంపూ కావ్యాల్లోని 'అనవుడు, నావుడు, వెండియు, మఱియు" అనే అతుకు మాటలెలా కవిత్వంకాదో, వ్యాసభారతంలోని చకారకుక్షి ఊతపదం ఎలా కవిత్వం కాదో పరిశీలిస్తే పద్యరూపంలో ఉంటేనే కవిత్వం అనుకోవటం భ్రమ అన్నాడు. ఆ తరవాత రెండు మూడు రోజులకు తట్టాబుట్టా కట్టుకొని నా ద్వితీయ విశ్వకళాపరిషత్తును వదిలి స్వగ్రామం

చేరాను.

ఒక వ్యక్తి ఎంత శ్రమించి ఎంత చదివినా ఆ చదువు పరిమితమే. పదిమంది చదువుకొన్న వాళ్ళతో సాంగత్యం కలిగితే పదివేల గ్రంథాలు చదివిన జ్ఞానం కలుగుతుంది. చదివిందంతా నిలవదు. మా తాతగారు కొన్ని అనుభవ పూర్వక ప్రసంగాలు చేశారు: "పోగా మిగిలింది ఆస్తి, మరిచిపోగా మిగిలింది చదువు, గొరగంగా మిగిలింది జుట్టు" అని. అలాగే 'రాసి ఇచ్చినవాడు అచ్చా; ఇచ్చి రాసినవాడు లుచ్చా" అని. ఎవరికెంత ఇవ్వాలో తేల్చుకుని, లెక్క పుస్తకంలో ఇచ్చినట్లు రాసి మూటగట్టి విడిగా ఉంచితే మరపువల్ల పైకం పోగొట్టుకొనే ప్రమాదం ఉండదని ఆయన సిద్ధాంతం.

గుంటూరులో ఉండగానే మా పినతాతగారి కడపటి కూతురు వివాహమయింది. ఆహ్వాన పత్రికలను అడ్రసు రాసి పోస్టులో వేసే బాధ్యత నాకిచ్చారు. ఐర్లండు దేశానికి అప్పుడు ప్రధానిగా ఉన్న కాస్టెల్లోకూ పంపమన్నారు. పంపిన వారు పబ్లిక్ ప్రాసిక్యూటర్ అని రాస్తే శుభాకాంక్షలతో సమాధానం వచ్చింది. తన సహాధ్యాయి భారతదేశమంతటి సువిశాలదేశంలో ఇంత గొప్ప పదవి సాధించి న్యాయసంరక్షణ చేస్తున్నందుకు గర్విస్తున్నా నన్నాడు. ఇదేమంటే "ఐర్లాండులో పబ్లిక్ ప్రాసిక్యూటరంటే అటార్నీ జనరల్. ఆ విషయం మరిచాను. దిక్కుమాలిన ఇంగ్లీషు – దాని స్పెల్లింగులెంత ఛండాలమో భాషాప్రయోగం కూడా అంత తర్కహీన"మని విసుక్కున్నాడు!



# 5. సమాజ వాతావరణం

గుంటూరు సాహిత్య వాతావరణం మీది మోజు తక్కిన విషయాల సంగతి పట్టించుకోనీలేదు సరిగా. 1947లో స్వాతంత్ర్యం వస్తుందని 1942 నాటి విఫలయత్నాల తరవాత ఏ మహా నాయకుడూ ఊహించినట్లు లేదు. దేశ నాయకుల జీవిత చరిత్రలు శ్రద్ధగా చదివితే వాళ్ళు స్వాతంత్ర్యం లభించిన తరవాత ఏమి చేయాలని సంకల్పించారో స్పష్టంగా తెలియదు. ఛార్లీ ఛాప్లిన్ ఆత్మ కథలో గాంధీ, నెహ్రూ, సరోజినీ నాయుడి వంటి భారత నేతల గురించి అతడు పరిశీలనాత్మకంగా రాసిన విషయాలు ఇందుకొక మంచి నిదర్శనం. రెండో ప్రపంచ యుద్ధం 1945లోనే ముగిసినా, అందులో బ్రిటిష్ మిత్రమండలి విజయం సాధించినా, "సమర విజయీ హేతి దళితః" అన్నట్లు చావుదప్పి కన్నులొట్టబోయి గెలిచామనిపించుకున్నట్లే అయింది. బ్రిటన్లో పురుషుల సంఖ్య తగ్గింది. ఆర్థిక శక్తి దుర్భరమయింది. నౌకాదళం పేరుకు మిగిలింది. నాటి విమానాలు సుదూర ప్రయాణాలు అంచెలంచెలుగా ఆగుతూ చేయగలవేగాని పెద్ద ఎత్తున సైనికులను, సాధన సంపత్తినీ తరలించగల స్థితిలో లేవు. భారతీయ నావికుల తిరుగుబాటు మరోసారి జరిగితే దాన్ని అణచివేయగల శక్తి సామర్థ్యాలు లేవు. భారతీయుల అనైక్యం, మత విద్వేషాలు, క్రమశిక్షణరాహిత్యం తమవారికి సంక్రమిస్తే సామ్రాజ్య మేమవుతుందన్న భయ మేర్పడింది. అందువల్ల మేకపోతు గాంభీర్యం ప్రదర్శించి, శక్తివంచన లేకుండా భారత సమాజాన్ని విభజించి, ఊహించనంత వేగంతో స్వదేశీయులకు రాజ్యమిచ్చి తాము తరలిపోయారు. పాకిస్తాన్ ఏర్పడింది– తూర్పు పడమరల్లో. స్వదేశీ సంస్థానాలు అసంఖ్యాకంగా ఉండి స్వతంత్రంగా ఉండదలిచాయో, ఏ రాజ్యంలో విలీనం కాదలిచాయో స్పష్టంగా తేలలేదు.

మన దేశాన్ని వదిలిపోయే ముందే బ్రిటిష్ పాలకులు మనకో రాజ్యాంగ పరిషత్తును ఏర్పాటు చేశారు– 1946లోనే. అందులో కాంగ్రెస్, ముస్లింలీగ్ ప్రతినిధులూ, స్వదేశ సంస్థానాల ప్రతినిధులూ సభ్యులు. ఇతర రాజకీయ పార్టీలకు అందులో ప్రవేశంలేదు. పరిషత్తును ముస్లిం లీగ్ బహిష్కరించింది. ఒక లెక్క ప్రకారం 21 శాతం ప్రజల ప్రతినిధులు రాజ్యాంగ నిర్మాతలయ్యారు. రాజ్యాంగ రచయితల్లో (ముసాయిదా రాసిన వాళ్లలో) సర్ బెనగల్ నరసింగరావు ముఖ్యుడు. దాని పరిష్కర్తల్లో సర్ అల్లాడి కృష్ణస్వామి అయ్యర్, గోపాలస్వామి అయ్యంగార్, అధ్యక్షుడైన భీమారావ్ అంబేద్కర్ బ్రిటిష్ వ్యతిరేకులు కారు. జాతీయ సంగ్రామంలో ప్రత్యక్షంగా పాల్గొన్న వాళ్ళుకారు. కె.ఎం.మున్షీ ఒక్కడే కాంగ్రెసు వాది. రాజ్యాంగ సభాధ్యక్షుడు బాబూ రాజేంద్రప్రసాద్ సభా వ్యవహారాలను నిర్వహించగలవాడేగాని రాజ్యాంగ రచయిత కాదు. వీరి తయారీలో సిద్ధమైన భారత రాజ్యాంగం 1950లో ఆమోదం పొందింది. 1947 నుంచీ అధికారంలో ఉన్న జవాహర్‌లాల్ నెహ్రూ ప్రభుత్వంలో సర్ జాన్ ముత్తయ్, సర్ షణ్ముగం చెట్టి వంటి వారు మంత్రులైనారు. విభక్త భారతంలోని ఉభయ పక్షాలకూ సర్ క్లాడ్ అకిన్ లెక్ సేనాధిపతి. 1936లో బ్రిటిషిండియాలోని 16 రాష్ట్రాల్లోనూ కాంగ్రెస్ అధికారంలోకి వచ్చినా మంత్రివర్గంలో జమీందార్ల ప్రతినిధులూ జస్టిస్ పార్టీ నేతలూ కీలక స్థానాల్లో ఉన్నారు. కాంగ్రెసు వాళ్ళకు

ఆందోళనానుభవమేగాని పరిపాలనానుభవం లేదు. 1948లో జాతిపిత హత్య జరిగింది – పెద్దదిక్కు పోయింది. పంచాయతీ ఎన్నికలతో క్రమంగా పుంజుకున్న కులరాజకీయాలు బలపడటం మొదలయ్యాయి. దేశ రాష్ట్ర రాజకీయాల్లో అందాకా ఉన్న బ్రాహ్మణ ప్రాబల్యం చాలా వరకు తగ్గిపోయింది. టంగుటూరి ప్రకాశం వంటి వాళ్ళు తాము చేసిన త్యాగాలవల్ల నాయకత్వం నిలుపుకోగలిగినా త్యాగశీలంలేని పట్టాభివంటి వాళ్ళు బలహీనపడక తప్పలేదు. రాజకీయ నాయకత్వానికి ప్రధానమైనవి విద్య, ఆర్థిక శక్తి, అనుచర గణం అనేవి. విద్యారంగంలో కమ్మవారు పోటీపడి నెగ్గుకువచ్చారు. ప్రపంచయుద్ధ కాలంలో మెట్టపంటలకు ధరలు పలికిన తరవాత పట్టుదలతో ఆర్థికశక్తి సంపాదించారు. శ్రమించి చిన్నచిన్న వ్యాపారాలనుంచి ధనవంతమైన, ఆరక్షణకరమైన సినిమా రంగాన్ని అదుపులోకి తెచ్చుకున్నారు. కులాధిక్య భావన సంపాదించటానికి రంగాగారు ప్రతిపాదించి ప్రచారం చేసిన కాకతీయులు కమ్మవారేనన్న పురావైభవప్రశంస, దుగ్గిరాల బలరామకృష్ణయ్య సచ్ఛాస్త్రివంటి వారు పైకి తీసిన బౌద్ధ మహోద్ధరణ భావం బాగా పనికి వచ్చాయి. చివరకు పూజారి పనిలో గూడా కమ్మవారు పోటీ పడ్డారు. కమ్మ బ్రాహ్మణులు వెలిశారు. సాహిత్య రంగంలో కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి, తుమ్మల సీతారామమూర్తి చౌదరి, ఏటుకూరి వేంకట నరసయ్య వంటివారి ప్రాబల్యం తక్కిన వారికి ఎంతో ప్రోత్సాహమిచ్చింది.

ఆంధ్ర రాష్ట్ర సాధనకోసం 1913లో బాపట్లలో మహాసభ జరిగిన తరవాత ఆంధ్రప్రశస్తి ముఖ్యంగా భావకవులకు పవిత్ర కర్తవ్యమయింది. అది పాతకాలపు ఆంధ్రరాజుల రాజ్యాల ప్రశస్తిగా మారిందన్న స్ఫురణకూడా కలగలేదు కమ్యూనిస్టు నేతలైన పులుపుల శివయ్య, వేములపల్లి శ్రీకృష్ణ వగైరాలకు. శాతవాహనుల తరవాత అంతటి ప్రశస్తి సంపాదించిన కాకతీయులకు చేసిన వీరారాధన కమ్మవారికి ప్రోత్సాహకమైంది. వెలగపూడి రామకృష్ణ, ముళ్ళపూడి హరిశ్చంద్ర ప్రసాద్ వంటివారు నెలకొల్పిన పరిశ్రమలు కులగౌరవాన్ని పెంచాయి. గాంధీ అహింసా సిద్ధాంతానికి ఆలంబనగా బౌద్ధ ప్రసక్తి వచ్చి అనేక కావ్యాలు వెలిశాయి. అన్ని కులాలవాళ్ళూ తమ తమ పూర్వౌన్నత్యాన్ని ప్రాచీన శాసనాలనుంచి కావ్యాల నుంచి వేద పురాణాదులనుంచి సేకరించి ప్రసంగించి ప్రచారం చేయటానికి కుల సంఘాలను స్థాపించుకున్నారు. ఎవరి కెక్కడ సంఖ్యా బలముందో వారక్కడ కనీసం గ్రామ పరిపాలనలోనైనా భాగస్వామ్యం, భాగదేయం సంపాదించే అవకాశాలు వచ్చాయి. మరోవైపు తెలంగాణాలో ఆంధ్రమహాసభతో కలిసి కమ్యూనిస్టులు నిజాం వ్యతిరేక, రజాకార్ వ్యతిరేక భావాలతో సాయుధ సంఘర్షణకు సిద్ధపడ్డారు – రణదివే తీర్మానం ప్రకారం. కమ్యూనిస్టు పార్టీ నిషేధానికి గురైంది. గాంధీజీ హత్య తరవాత రాష్ట్రీయ స్వయం సేవక సంఘాన్ని నిషేధించారు. ఈ కాలంలో కమ్యూనిస్టు వ్యతిరేక ధోరణికి రాడికల్ హ్యూమనిస్టులు (ఎం.ఎన్.రాయ్ అనుచరులు) ఆజ్యంపోశారు. వారిది మేధావుల కూటమి కాబట్టి సాధారణ ప్రజలను కూడగట్టుకోలేకపోయారు.

## అవ్యవస్థ

రాజ్యాంగం ద్వారా సంక్రమించిన రిజర్వేషన్ విధానంవల్ల అగ్రవర్ణాలకు చెందని వారికి



బోలెడు సహాయం లభించటం మొదలైంది. "కలౌ సంఘ బలం బల"మన్నట్లు కులసంఘాలు ఏర్పడితేగాని మనుగడ సుఖంగా సాగదనే విశ్వాసం ప్రబలింది. రెడ్లు మొదటినుంచీ భూస్వామ్య వ్యవస్థలోని దౌర్బల్యాలతో పరస్పర శత్రుభావంతో ముఠాలుగా విడిపోయినందువల్ల సంఘటితంగా సమాజంలో కలిసిపోలేదు. కాంగ్రెసు పార్టీ స్థాపన సమయంనుంచీ ముఠా రాజకీయాల్తో తలమునకలుగా ఉండేది. ఆంధ్రకేసరి స్వీయచరిత్రను జాగ్రత్తగా పరిశీలిస్తే రసబిహార్ ఘోష్ ఆధిపత్యంలో కాంగ్రెసు మితవాదులు లాల్, బాల్, పాల్ నాయకత్వంలోని అతివాదులనే ఇంగ్లీషు వారికన్నా ఎక్కువగా ద్వేషించి, తమ వారికి చిన్నా పెద్దా పదవులు సాధించుకొని, ముస్లిములకు సాయపడక, చివరికి ముస్లింలీగ్ స్థాపనకూ దేశ విభజనకూ దారితీశారని తెలుస్తుంది. విభజన సమయంలోని మారణహోమంలో మతశక్తులు బలపడి ఆమేరకు కాంగ్రెసునూ, జాతీయ భావాలనూ బలహీనపరిచాయి. రాజకీయ ప్రయోజన దృష్టితో కులసంఘాలతో బాటు వృత్తి సంఘాలు (రైతు సంఘాలు, వ్యవసాయ కూలీ సంఘాలు, కార్మిక సంఘాలు వగైరా) కుప్పలు తెప్పలుగా పుట్టుకొని వచ్చాయి. దేశ నాయకులెవరూ తమ జీవిత కాలంలో స్వతంత్రులమవుతామని విశ్వసించనందువల్ల స్వతంత్ర భారతం ఆయా రంగాల్లో ఎలా వ్యవహరించాలో ప్రజలకు బోధించలేదు – నచ్చజెప్పలేదు. ఫలితం అవ్యవస్థ, క్రమశిక్షణరాహిత్యం, అనైక్యం, అవకాశవాదం. సమాజంలో వేదకాలం నాటి మత విశ్వాసాలకన్నా అంతకు ముందే మొహెంజదారో – హరప్పా నాగరికతలోనే అంకురించిన కులతత్వం క్రమాభివృద్ధి పొందింది. స్వకులాభిమానం అన్యకుల ద్వేషానికి దారితీసింది. లెక్కకు రాజకీయ స్వాతంత్ర్యం లభించినా ఆర్థిక స్వాతంత్ర్యం ఈనాటికీ మనకు అందని మానిపండే. మొగలాయీల కాలంలో నిర్బంధంగా ఒక విశాల భూభాగంలో పౌరులైన అంగవంగ కళింగ కాంభోజాది ఛప్పన్నారు 'దేశాల' వాళ్ళు బ్రిటిష్ వారి హయాంలో భారతీయులంతా ఒకటి అనుకోవటం మొదలుపెట్టారు – 1904–05 నాటి బెంగాల్ విభజనకాలం నుంచీ, 'వందేమాతరం' అనే నినాదం ఉద్యమ రూపం ధరించినప్పటి నుంచీ. అంటే 1950 నాటికి – భారత రాజ్యాంగం అమల్లోకి వచ్చేనాటికి – మన జాతీయతావాదమో దృక్పథమో కేవలం 40–45 సంవత్సరాల చరిత్ర కలది మాత్రమే. ఈ భావసౌధానికి గట్టి పునాదులు లేవు. భిన్న భాషలు, మతాలు, ప్రాంతాలు, కులాలు, జాతి లక్షణాలున్న ప్రజలు స్వాతంత్ర్య సాధనకోసం ఏకోన్ముఖంగా కొంతకాలం పోరాడిన మాట వాస్తవం. అనుకోకుండా అధికారం దక్కించుకున్న కాంగ్రెసు వాళ్ళు తామే స్వాతంత్ర్యసాధకుల మనుకోవటం ఆత్మవంచన – లోకవంచన. ఆ భావన జనసామాన్యంలో ఇతర రాజకీయ పక్షాలమీద అభిమానం చూపవలసిన పరిస్థితికి దారితీసిందన్నా తప్పులేదు. స్వాతంత్ర్య సాధన పూర్తికాగానే ఎవరికి వారే యమునా తీరే అనుకోవటం మొదలైంది. గద్దె నెక్కిన వారు దాన్ని నిలుపుకోడానికి బ్రిటిష్ వాళ్ళకన్నా అన్యాయంగా ప్రవర్తించారు. తక్కిన వాళ్ళు అధికారం చేజిక్కించుకోటానికి మార్గాలన్వేషించటం మొదలైంది.

తొలిసారి రాజ్యాధికారం రాష్ట్రాల్లో దొరికినప్పుడు కాంగ్రెస్ నేతలు నెలకు 500 రూపాయల కన్నా ఎక్కువ జీతం తీసుకోమని, సామాన్య జీవితం గడుపుతామనీ ప్రకటించారు.

అధికారం రుచి మరిగిన తరవాత పాత జమీందార్ల కన్నా, సంస్థానాధీశులకన్నా భోగభాగ్యాలు సంపాదించటానికి సమస్తవిధాలా ప్రయత్నించారు. విజయనగరం రాజావంటి ఐశ్వర్యవంతులు తాము సోషలిస్టుల మన్నారు. జస్టిస్ పార్టీలో ఉండి బ్రిటిష్ వారి ఆదరాభిమానాలు సంపాదించిన భూస్వాములు క్రమంగా కాంగ్రెసులో ఉన్నత స్థానాలు సంపాదించారు. ఆ మేరకు సామాన్య ప్రజలు కమ్యూనిస్టుల వైపు మొగ్గి కాంగ్రెసు ప్రతికూలభావాలు పెంచుకున్నారు. సిద్ధాంతాలు గాలికి పోయాయి. విద్యావంతులకన్నా ధనవంతులే బలవంతులనే మాట మరోసారి రుజువైంది.

## విద్యారాజకీయాలు

స్వాతంత్ర్యం రాకముందు గుంటూరు జిల్లాలో జస్టిస్ పార్టీ నేత పాములపాటి వెంకట కృష్ణయ్య చౌదరి జిల్లా బోర్డు అధ్యక్షుడుగా ఉండి వందల సంఖ్యలో పాఠశాలలు పెట్టించాడు – ధనవంతుల్ని ప్రోత్సహించి. మొదట దాతృత్వభావనతో మొదలైన విద్యాసంస్థలను తమ అధీనంలో ఉంచుకోవాలంటే ఉపాధ్యాయులు 'మన వాళ్ళు' కావాలనే అభిప్రాయం పుట్టి పెరిగి విస్తరించింది. ఆ విధంగా విద్యావకాశాలు పెరిగినా విద్యాసంస్థల యాజమాన్యం కాలక్రమేణా వ్యాపారంగా, సొంత ఆస్తిగా మారిపోయింది. 1947దాకా అన్ని రాజకీయ పక్షాలూ వయోజన విద్యా ప్రచారం చేశాయి. తెలంగాణాలో ప్రభుత్వ నిర్బంధాలను కూడా ధిక్కరించి ఆంధ్రమహా సభలాంటి సంస్థలు అక్షర యజ్ఞం ఆరంభించాయి. స్వతంత్ర భారతంలో ఆ బాధ్యత జాతీయ ప్రభుత్వానికి వదిలిపెట్టారు. జీతభత్యాలు తక్కువైనా సమాజంలో ఆదరాభిమానాలకూ, గౌరవ మర్యాదలకూ లోటులేదు. అందువల్లే తమ దారిద్ర్యాన్ని లెక్కచేయక ఉపాధ్యాయులు మనసా వాచా కర్మణా ఆదర్శబోధకులుగా పనిచేశారు. విద్యారంగంలో రాజకీయ కుల ధనాల ప్రమేయం పెరిగింది. మరోవైపు 'గుమస్తా విద్యావిధానాన్ని సమూలంగా నిర్మూలించాలనే దృఢ నిశ్చయంతో విద్యావంతులు కాని ఏలికలు గంటకో విధంగా దాన్ని సంస్కరించారు రకరకాల మార్పులతో. రాజ్యాంగమిచ్చిన బాధ్యతను విస్మరించి ఉచిత ప్రాథమిక విద్యాదానాన్ని సంస్కరణల పేరిట అమలుచేయలేదు. వయోజన విద్యా విషయమే మరిచారు. ప్రజలు విద్యావంతులైతే తమ పరిపాలనపద్ధతులను ప్రశ్నిస్తారన్న భయం పట్టుకుంది. అందువల్ల ప్రాథమిక విద్యను పునాదులతో సహా ధ్వంసంచేసే ప్రయత్నం చేశారు. మరోవైపు క్రైస్తవ మత ప్రచారకులు విద్యా, వైద్య సౌకర్యాలను యథావిధిగా నిర్వహిస్తున్నందువల్ల నిమ్నకులాల్లో విద్యావంతుల శాతం పెరగటం మొదలైంది. ఆ మేరకు అగ్రవర్ణాల ఆధిపత్యానికి గండిపడ్డది. విద్యార్థి సంఘాలు వెలిశాయి. ఉపాధ్యాయ సంఘాలు మొలకెత్తాయి. హక్కులకోసం, వసతులకోసం, సమానత్వంకోసం పోరాటం మొదలైంది. కులాలవారీగా చీలిపోతున్న సమాజంలో విద్యా రాజకీయాలు ప్రవేశించి అనైక్యానికి రాచబాట వేయటం ఆరంభించాయి.

వ్యవసాయ రంగంలో మార్పులు మొదలైనాయి. మెట్ట పంటలకు, వాణిజ్య పంటలకూ విలువ పెరిగింది. రెండో ప్రపంచ యుద్ధ కాలంలో బర్మా (ఇప్పటి మియన్మార్), అన్నాం, సయాం వగైరా ప్రాచ్య దేశాలనుంచి బియ్యం దిగుమతి ఆగిపోయింది. చివరకు గోంగూరక్కూడా మొహంవాచిన పరిస్థితి వచ్చింది. వ్యవసాయంలో స్వయం సమృద్ధి సాధించకపోతే భవిష్యత్తు



అంధకార బంధురమవుతుందని విద్యావంతులవుతున్న రైతులు గ్రహించారు. పచ్చి ఎరువుల స్థానంలో రసాయనిక ఎరువులను, పురుగుమందులనూ వాడి ఎక్కువ ఫలసాయం పొందే ఆలోచనలు మొదలైనాయి. నాగార్జునసాగర నిర్మాణంకోసం ప్రభుత్వం మీద ఒత్తిడి పెరిగింది. శ్రీరామపాదసాగర్ రాకపోతే పేదరికం పెరుగుతుందని రాజకీయ నాయకులు ప్రచారం మొదలుపెట్టారు. కుటీర పరిశ్రమల స్థాపనకోసం ఆందోళన పెరిగింది. యుద్ధ కాలంలో రేషనింగ్‌లో చౌకగా లభించిన లాంగ్‌క్లాత్, పేరాచ్యూట్ శిల్కు వగైరాలవల్ల చేనేత పరిశ్రమ దెబ్బతినటం మొదలైంది. ముతక ఖద్దరు ధారణ దేశభక్తికి చిహ్నమనే భావం సన్నగిల్లిపోతున్నది. (గాంధీ ఎన్నడూ పెట్టుకోని) గాంధీ టోపీ రాజకీయ నాయకుల తలలమీదినుంచి వారి సేవకుల తలలమీదికి మారింది. అద్దకం పరిశ్రమ కృత్రిమవర్ణాలవల్ల చాలావరకు దెబ్బతిన్నది. హస్త కళలకు మాటల్లో మాత్రమే ప్రోత్సాహం లభించింది. కులవృత్తులు మూలపడటం మొదలైంది. కేంద్ర ప్రభుత్వం రష్యా తరహాలో భారీ పరిశ్రమలు స్థాపించి సత్వరాభివృద్ధి సాధించగలమని భావించింది. జపాన్ పద్ధతిలో చిన్నవాటి నుంచి పెద్ద పరిశ్రమలవైపు పురోగమించాలంటే అది మూర్ఖత్వమనే ఈసడింపు వచ్చింది. చలనచిత్ర రంగం, హోటలు పరిశ్రమ, కొంతవరకు సిమెంటు తయారీ భారీగా విస్తరించాయి. రైళ్ళలో ప్రయాణికులందరికీ ఒకటే రకం సౌకర్యాలుండాలన్న కాంగ్రెసు నేతలు పాత ఫస్ట్, సెకండు, థర్డ్ క్లాస్ బోగీలతో బాటు ఇంటరు, స్పెషల్ ఇంటర్ క్లాసులను అదనంగా కల్పించి ఆయా ఆదాయవర్గాల మధ్య భేదభావం పెంచారు. బస్సుల సంఖ్యా పెరిగి గుర్రబ్బండ్లు తగ్గిపోయాయి సంఖ్యలో. "బస్సు వచ్చి బండ్ల వాళ్ళ కడుపు కొట్టిందోయ్" అనే పాటలు మోగిపోతుండేవి. సమాజంలో నైతిక విలువల కన్నా ఆనందకరమైన అమ్యూజ్‌మెంటు పార్కుల్లో అర్ధనగ్న దృశ్యాల ఆకర్షణ పెరిగింది. సంప్రదాయ నాటక రంగం నుంచి చలనచిత్ర రంగానికి వలసలు మొదలైనాయి.

సమాజంలోని ఈ మార్పుల కనుగుణంగా సాహిత్యంలో మార్పులు మొదలైనాయి. దేశ భక్తి పూర్వక రచనలూ, బౌద్ధ సాహిత్యం, కాల్పనిక సాహిత్యం, భావకవిత్వం లాంటివి తిరుగుముఖం పట్టాయి. వచన సాహిత్యం, అభ్యుదయ రచయితల సంఘం, వచన నాటక ప్రదర్శన వంటివి క్రమంగా ప్రజాభిమానం సంపాదించటం మొదలైంది. రణరంగాలను తలపించే ఆశుకవితా అవధాన ప్రదర్శనలు తగ్గుముఖం పట్టాయి. సినిమా పాటల ప్రభావం శాస్త్రీయ సంగీతాన్ని పక్కకు నెట్టింది చాలావరకు. సంప్రదాయ విద్యలైన హరికథలు, పురాణశ్రవణాలు, శాస్త్రీయ నృత్యాలు మొదలైనవి క్షీణముఖంలోకి వచ్చాయి. జమీన్‌దారుల సంఖ్య తగ్గటం, కౌలుదారీ విధానంలోని మార్పుల వంటివి కళాపోషణావకాశాలను తగ్గించాయి. ఊరూరా సాంస్కృతిక ప్రదర్శనలకు ఆలవాలంగా ఉన్న దేవాలయాల ఆస్తులు రాజకీయ శక్తిమంతులకు ధనార్జన మార్గాలైనందున పాడుపడటం మొదలయింది. బ్రిటిష్ వారి పాలనలో కింది స్థాయి ఉద్యోగులు ఆశించిన ప్రతిఫలాలు క్రమంగా ఉన్నత స్థాయి మంత్రులదాకా విస్తరించటం మొదలైంది. రూపాయి విలువ తగ్గిపోతున్నది. నకిలీ వస్తువుల తయారీ, కల్తీ వస్తువుల విక్రయం వంటివి విపరీత ప్రమాణంలో పెరగటం అనుభవంలోకి వచ్చింది. సామాజికులకు ధన సంపాదన దృష్టి

పెరిగింది. ద్రవ్యోల్బణం వల్ల ధరలు పెరిగేకొద్దీ ధన సంపాదనావసరం అనులోమానుపాతంలో పెరక్క తప్పనిస్థితి వచ్చింది. ఒక్క మాటలో స్వాతంత్ర్య సాధనకు ముందున్న ఆదర్శాలూ, ఆశయాలూ అదృశ్యమవుతున్నా యన్నమాట – ప్రచండ వేగంతో.

బ్రిటిష్ వారిది గుమస్తా విద్యావిధానమని ఆక్షేపించి గాంధీజీ చెప్పిన బేసిక్ (మౌలిక) విద్యావిధానం ప్రవేశపెడుతున్నా మన్నంతసేపు పట్టలేదు మనవాళ్లకు దాన్ని పరిత్యజించటానికి! అసలు భారతజాతీయ కాంగ్రెసు ప్రథమ నిర్మాత ఆంగ్లేయుడు హ్యూం. పెద్ద నాయకురాలుగా ఎదిగినామె అనీ బిసెంట్. ఆదిలో గుమస్తా పదవులకోసమే కాంగ్రెసు పుట్టింది. మూడేళ్ళ కాంగ్రెసు రాజ్యంలో అభివృద్ధి సాధించింది సదరు గుమస్తాల పాలనే. దాన్నే ఇంగ్లీషులో బ్యూరోక్రసీ అన్నది. అందుకు ప్రధాన కారణాలు రెండు: కాంగ్రెసు నేతలకు పరిపాలనానుభవం లేకపోవటం, తాముగా నియమ నిబంధనలు సవరించగలమన్న సాహసం – కాదు – ఆత్మ విశ్వాసం లేకపోవటం. పేరుకు ప్రజాస్వామ్య పద్ధతులను పాటిస్తున్నామన్నా భూస్వామ్య వ్యవస్థలోని పెత్తందారీ విధానాలు తప్ప నూటికి తొంభై మందికి ప్రజాస్వామ్య విధానాలు తెలియవు. తెలియకపోవటంతో వారి అశక్తతకన్నా, ఆ విధానం ఈ దేశంలో స్వతస్సిద్ధంగా పుట్టిపెరిగిన పాలనపద్ధతి కాకపోవటమే ముఖ్యహేతువు. భరతమాత, భరతజాతి, భారతదేశం అనేవి 20వ శతాబ్ది మొదటి దశాబ్దానికి ముందు వాడుకలో లేని మాటలు. భరతవర్షం, భరతఖండం అనే వున్నాయి. వాటి నిర్వచన, హద్దులు మనకు స్పష్టంగా తెలీదు. ఆనందమఠమనే బెంగాలీ నవల వెలువడకముందు దేశాన్ని/భూదేవిని రాజుగారి భార్యగానే పరిగణించాం. రాజ్యలక్ష్మి రాజపత్ని. మన రాజ్యాలు తప్పన్నారు. రాచరికం తప్ప మరో విధానం మన పూర్వు లెరగరు. గ్రామ స్థాయిలో పెత్తందారీ విధానమే ఉండేది. రాజ్యాల సరిహద్దులు మారుతుండేవి. రాచరికం వంశపారంపర్యంగా కొనసాగేది. అదే గ్రామాధికార వ్యవస్థకు సంక్రమించింది బ్రిటిష్ రాజ్యంలో (అది తప్పని ఘోషించి అనేకానేక ప్రభుత్వ శాఖల్లో, ప్రభుత్వ రంగ సంస్థల్లో, చివరికి మంత్రి పదవుల్లో కూడా అదే ఆనువంశిక వ్యవస్థను పెంచి పోషిస్తున్నాం – ఇప్పుడు కూడా).

మన దుస్థితికి బీజం ద్వంద్వ ప్రమాణాల్లో ఉంది. అందరికీ దేవుడున్నాడు – దేవాలయా లున్నాయి – హరిజనులకు తప్ప! మన సమాజంలో మాత్రమే అగ్రవర్ణా లనే, నిమ్న జాతులనే ద్వంద్వ విధానముంది. మనం చెప్పే ధర్మాలకూ, ఆచరించే పనులకూ భిన్న ప్రమాణాలున్నాయి. మన రాజులూ, నేతలూ చివరకు దేవుళ్ళూ ఆశ్రితపక్షపాతం గలవాళ్ళు. పొగడిన వాళ్ళను కాపాడి తెగడిన వాళ్ళను చంపటం, ఆ కార్యక్రమానికి శిష్టరక్షణ, దుష్టరక్షణ అని పేర్లు పెట్టడం మన ఆచారం. దీన్ని ఇంగ్లీషు వాళ్ళు హిపోక్రసీ అంటారు. వ్యక్తిపూజ తప్పంటాం, ఇతరులు చేస్తే. అదే సమర్థనీయమంటాం మనంచేస్తే. అధికారులను రక్షించటానికీ, అనధికారులను శిక్షించటానికీ మన కనేక నియమనిబంధనలున్నాయి. వాటిని మార్చే సాహసం మనకులేదు. వాటిని విశదీక రించే అధికారంకన్నా సమర్థత గుమస్తాలకే ఉంది. దేన్ని ద్వేషిస్తామో దాన్నే ఆరాధించటం, ద్వేషం ద్వారా త్వరలో మోక్షం పొందటం హిరణ్యాక్ష హిరణ్యకశిపుల కాలంనుంచీ మన పురాణాలు నేర్పిన తరణోపాయం. అందువల్లనే గుమస్తా విద్యావిధానాన్ని ద్వేషిస్తూనే దాన్ని భద్రంగా



అమలుపరుస్తాం. పాఠశాల విద్యలో ప్రధాన భాగంగా ఉన్న నైతిక బోధను (Moral Instruction) ప్రణాళిక నుంచి తొలగించింది స్వతంత్ర భారత ప్రభుత్వమే. విద్యావంతుల నాగరక పాలన విధానంగా ప్రజాస్వామ్యం పాశ్చాత్య దేశాల్లో క్రమ పరిణామంలో నిలదొక్కుకుంది. నిరక్షరాస్యులను నిర్దాక్షిణ్యంగా పాలించే మన దేశంలో ప్రజాస్వామ్యం నామసామ్యంగల పెత్తందారీ విధానం. తొలిదశలో నేతలు తమ అభిప్రాయ భేదాలను బహిరంగ సభల్లో వివరించి వేరుకుంపటి పెట్టుకుంటున్నామని ప్రకటించేవారు. అప్పుడు రంగులు మార్చినా నమ్మిన విశ్వాసాల కోసమేగాని ప్రతిఫల కాంక్షతో కాదు. "రైతులోక బాంధవుడగు గోగినేని రంగా, కోటుమార్చి ప్లేటుమార్చి, కులుకు విలాసంగా"నని దరిమిలా శ్రీశ్రీ ఆక్షేపించాడు. ఫిరాయించిన మాట పచ్చినిజం. అందువల్ల పైసా సంపాదించాడని గాని, పదవులు పొందాడనిగాని భావించటం పచ్చి అబద్ధం. ఇప్పుడా తీరు మారింది.

స్వాతంత్ర్యం వచ్చిన తరవాత సమాజ స్వరూపంలో వస్తున్న మార్పులు వేగవంతమవు తున్నాయి. రాజకీయ వాదోపవాదాలు తీవ్రతీవ్రంగా జరుగుతున్నట్లే సాహితీ సభలు కూడా రణరంగాల్లా తయారైనాయి. 1950 జనవరిలోనేమో దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు గుంటూరు వచ్చారు. నేను విన్నంతలో తెలుగు కవుల్లో అంతటి మహావక్త మరొకడు లేడు (తరవాత కాలంలో ఆయన గొంతు మూగపోవటం మన దురదృష్టం). భావకవిత్వాన్ని ఘోరంగా విమర్శించిన అక్కిరాజు ఉమాకాన్తం గారి నేటికాలపు కవిత్వమనే వాఙ్మయ దర్శనాన్ని భావకవితాపితామహు డనిపించుకున్న రాయప్రోలు సుబ్బారావు గారు కూడా ప్రతిఘటించలేదు దేవులపల్లి లాగా. ఆ గ్రంథం 1926 నాటిదైనా దేవులపల్లి క్షమించి వదల్లేదు. ఊరూరా బహిరంగ సభలు నడిపి తన నూతన కవితా ధోరణిని సమర్థించుకున్నది ఆయనొకడే. కురుగంటి సీతారామాచార్యుల వారూ, వారి జామాత పిల్లలమర్రి వేంకట హనుమంతరావుల రచనగా నాలుగు సంపుటాల్లో 'నవ్యాంధ్ర సాహిత్య వీధులు' 1949 నాటికే వెలువడ్డాయి. నాలుగో సంపుటితో మాత్రం హనుమంతరావు గారికి ప్రత్యక్ష సంబంధముంది – రచయితగా. వేదిక మీద పిల్లలమర్రి వారిని పరిచయం చేయ గానే "ఓహో! భటాచోరుగారి అల్లుళ్ళా మీరు? మీ ముందు కుప్పిగంతు లెవరు వేయగలరు?" అంటూనే ఉపన్యాసం ఆరంభించాడు. కోపకారణం దేవులపల్లి పద్యమొకటి ఉదాహరించి అందులోని ఒక పోలిక వాల్మీకంత ప్రాచీనమని ఆక్షేపించటం. ఆ ధోరణికి, వాక్ప్రవాహానికి విస్తుపోయిన కరుణశ్రీ "అతడి తిట్లుకూడా కవిత్వమేనయ్యా!" అన్నాడు. "అయితే మీమీద కూడా కవిత్వం చెప్పించమంటారా?" అన్నాడు ధనకుధరం. సభ జరుగుతుండగా ప్రశ్నలు, అడ్డు కోటాలు, ఆక్షేపణలు ఆ రోజుల్లో సర్వసాధారణం. తరవాత తెలిసింది హైదరాబాద్‌లో సురవరం ప్రతాపరెడ్డి గారు 'సాహితీ గూండాల సంఘ'మంటూ ఒకటి స్థాపించి పరస్పర ప్రస్తుతులతో ముషాయిరా ధోరణిలో జరిగే సభల మీదా వాటి కార్యకర్తల మీదా ధ్వజమెత్తారని.

మొత్తంమీద ఆ కాలంలో ఏదో ఒక సభ జరుగుతూనే ఉండేది. ఇప్పటిలా పత్రికలూ, విలేఖరులూ, టీవీలూ, వీడియోలు లేవు కాబట్టి ప్రత్యక్ష పురాణాలే గతి అనిపించి ఉంటుంది. అప్పట్లో ఎన్నో సాహితీ పత్రికలున్నా వాటిలో 'భారతి' మకుటం లేని మహారాణి. 'భారతి

వచ్చిందా?' అని అడగనివాడు అపాంక్తేయుడైన సాహితీపరుడు. అందులోని శాస్త్ర ప్రసంగాలు తలకెక్కినా, ఎక్కకపోయినా తలిసెట్టి రామారావు గారి వ్యంగ్య చిత్రాలకోసమైనా భారతికోసం ఎగబడుతుండేవాళ్ళం.

**కొత్త పరిణామాలు**

నిత్యజీవితావసర వస్తువుల వాడుకలో స్వరూప స్వభావాల్లో పెద్దయెత్తున త్వరత్వరగా మార్పులు వచ్చాయి రెండు దశాబ్దాల్లోగా. నిద్ర లేవగానే ముఖ ప్రక్షాళనకు వాడే కచ్చిక, బొగ్గుపొడి, వేపపుల్ల, గానుగపుల్ల వంటి వస్తువుల స్థానంలో పళ్ళపొడి పల్లెటూళ్ళక్కూడా వ్యాపించింది. అక్కడక్కడ సంపన్నులు టూత్‌బ్రష్షుల వాడకం మొదలుపెట్టారు. చద్దికూడు స్థానం ఇడ్లీలూ, దోసెలూ ఆక్రమిస్తే కాఫీ నాగరకతా చిహ్నమయింది. కాఫీ గింజలను వేయించి చిన్న మరతో పొడిగొట్టి వాడేవాళ్ళు సంపన్నులైతే, కాఫీ బిళ్ళలు తెచ్చి కరిగించి వాడే వాళ్ళు మధ్యతరగతి వాళ్ళు. ఎంత చిన్న ఊళ్ళోనైనా కాఫీ హోటలో, టీ బడ్డీయో కనిపించటం ఎక్కువైంది. నూకలిచ్చి కూరగాయలుకొనే వస్తుమార్పిడి విధానం పెద్ద ఊళ్ళలో చాలా తగ్గిపోయింది. మాఘ ఫాల్గుణాల్లో తప్ప విరివిగా దొరకని కూరనారలు ఇతర సమయాల్లోనూ మార్కెట్లలో దొరకటం పెరిగింది. బంగాళాదుంప, బీట్‌రూట్, నూల్‌కోల్ వంటివి కొత్తగా వాడుకలోకి వచ్చాయి. వరుగుల వాడకం చాలా తగ్గిపోయింది, కూరనారలు సంవత్సరం పొడవునా దొరుకుతున్నందువల్ల. కొబ్బరి తురమటానికీ, రసం పిండటానికీ రకరకాల చిన్న సాధనాలు దొరకటం మొదలయ్యాయి. పిల్లలు పచ్చి గింజలను తంపెట పెట్టించుకొని తినటం మానారు, కొట్లలో అవి దొరికేవి కాబట్టి. పిడకల దాలి, పొట్టు పొయ్యి, కట్టెల పొయ్యి వంటివి వెనకబడి బొగ్గుల కుంపట్లు, కిరోసిన్ స్టవ్వులూ వాడుకలోకి వచ్చాయి. నీళ్ళు కాచుకోడానికి కాగుల స్థానంలో బాయిలర్లు వచ్చాయి. వాటిలో నేలబొగ్గు వాడకం పెరిగింది. కిరసనాయిలు డబ్బాలో ఎదురు బొదురుగా గొడుగు చువ్వలు గుచ్చి వాటిమీద గుడ్డపరిచి ఇడ్లీ పిండి ఉడికించే రోజులు వెనకబడి ఇడ్లీ పాత్రలు వచ్చాయి. వంట శుభ్రంగా, సులభంగా చేయటానికి రుక్మిణీ కుక్కర్లు వచ్చాయి – మధ్య తరగతి ఇళ్ళల్లోకి. రకరకాల రూపాలతో కిరోసిన్ దీపాలూ, లష్టర్లూ వచ్చాయి. పెట్రోమాక్స్ లైట్లు వచ్చాయి. గ్రామఫోనులు, వాటిమీద తిరిగే ప్లేట్లు ఊరికొకటైనా ఏర్పడ్డాయి, శాస్త్రీయ సంగీతంనుంచి లల్లాయి పదాలదాకా వినటానికి. ఇవి వచ్చిన తరవాత కచేరీలు తగ్గాయి. మదరాసు కేంద్రం నుంచి మాత్రమే రేడియో వార్తలూ, ఇతర కార్యక్రమాలూ వస్తుండేవి. తెలుగు ప్రాంతంలో రేడియో కేంద్రం లేదప్పటికి. నాటక సంఘాలు నానా గ్రామాల్లో పర్యటించి తాత్కాలికంగా వేసిన వేదికలమీద తడికల ప్రహరీమధ్య ప్రదర్శనలిచ్చేవి. టిక్కెట్లు మీద విధిగా కింద భాగాన "షరా మామూలే" అని రాసేవాళ్ళు. అంటే ఏ కారణం చేతనైనా ప్రదర్శన ఆగిపోతే ప్రేక్షకులకు డబ్బు తిరిగి ఇవ్వమని దాని భావం. చిన్నచిన్న డైనమోలతో కరెంటు దీపాలు వెలిగించి నాటక ప్రదర్శనలూ, సినిమాలూ, సర్కసులూ నడిపేవాళ్ళు. పక్కా సినిమా హాల్లో నేల టిక్కెట్లు అన్నిటికన్నా చౌక. బెంచీ, కుర్చీ టిక్కెట్ల వెల ఎక్కువ. రిజర్వుడు సీట్లని పెద్ద కుటుంబాల వారికోసం ప్రత్యేకమైన ఏర్పాట్లుండేవి. అర్థంగాని హిందీ సినిమాల కథను



తెలుగు ప్రేక్షకులకు రసవత్తరంగా వర్ణించి చెప్పేందుకు ప్రత్యేకంగా ఒక వ్యక్తిని నియమించేవాళ్ళు. సాధారణంగా మైకుల వాడుక బహిరంగ సభల్లో తప్ప ఇతరత్రా చాలా తక్కువ. రేకు గొట్టాల ద్వారా పెద్ద గొంతుతో కథా పరిచయం చేసే కొలువులో గుర్రం జాషువా వంటి మహాకవి కూడా పనిచేశాడంటే సాహితీపరుల పేదరికాన్ని వేరే వర్ణించనక్కరలేదు.

పసిబిడ్డలకు డబ్బాపాలు పట్టే విధానం వచ్చింది. అంతకు ముందు కాలంలో పాలిచ్చే దాదులుండే వారని వినికిడి. గొల్లభామ మార్కు పాలడబ్బాలను అందరూ కొనలేరు. సిలోన్ (ఇప్పటి శ్రీలంక) నుంచి సీలు చేసిన డబ్బాల్లో రకరకాల పళ్ళ రసాలూ – పళ్ళూ వచ్చేవి. అవి చాలా ఖరీదు. దీపావళి సామగ్రిని ఎవరికి వారు సొంతంగా చేసుకోవటం పరిపాటి. గీచి విసిరేస్తే అదుపు లేనట్లు అన్ని వైపులా చిటచిటలాడుతూ ఎగిరేవి దమ్మిడీ సైజులో ఉండే కప్పగంతులు. తరవాత ప్రమాదకరంగా ఉన్నాయని వాటి వాడకం తగ్గించారు. చిన్న రోలూ రోకలీ – రోలు గుంటలో మందుకూరి ఏ గోడకో కొట్టి ధామ్మని పేల్చటం విద్యార్థులకు బ్రహ్మాండమైన వినోదమిచ్చేది. పేదలకు తాటాకు టపాకాయలూ, తాటిబుర్రలో మందుకూరి తాడుకట్టి గిరగిరా తిప్పితే రవ్వలు రాల్చే తిప్పుడు పొట్లాం అందుబాటులో ఉన్న వస్తువులు. మదురుగోడకు వరికంకులను వేలాడదీసి పిచ్చుకలకూ, ఉడతలకూ ఆహారం పెట్టడం రైతుల ఇళ్ళల్లో సాధారణం. పెద్ద రైతులను భూస్వాములనీ కాపుగారనీ పిలిచేవాళ్ళు. సన్నకారు రైతులను సంసారులనే వారు. బెంగాలీ సాహిత్య ప్రభావం వచ్చిన తరవాతనే కమ్మవారిలో బాబులూ, చౌదర్లూ వెలిశారు. అంతకు ముందు సామాన్య కుటుంబికుణ్ణి నాయుడనీ, పెద్ద సంసారిని కాపనీ, మరీ పెద్ద వారినైతే జమీన్‌దారులనో ఫలానా వారిది సంస్థానమనో వ్యవహరించటం కద్దు. పలకరింపులో ఖామందుగారని గాని, వరసలతో గాని పిలిచేవారు. యుద్ధానంతరం నిత్య జీవనావసరాలు పెరిగాయి. వస్తు సంపద పెరిగింది. అలవాట్లు మారాయి. డబ్బుకున్న కొనుగోలు విలువ తగ్గింది. భేషజాలు పెరిగాయి. సంపన్న భూస్వాములు సమీప పట్టణాల్లో మొదట ఘనతకోసం, తరవాత అవసరమనిపించీ నివసించటం పెరిగింది. సమాజం నగరీకరణవైపు మొగ్గడంతో వ్యాపార వసతులూ పెరిగాయి. పల్లెలు క్రమంగా పాడుపడుతూంటే అక్కడ కుల రాజకీయాలు స్థిరనివాసం ఏర్పరచుకున్నాయి. ఈ మార్పులన్నిటి చరిత్రా చెప్పాలంటే పది మహాభారతాలంత రాయాలి. ఓపిక లేదు. క్షమించండి.

# 6. ఆంధ్ర విశ్వకళా పరిషత్తులో

**అ**ప్పట్లో పరీక్షల నిర్వహణ, ఫలితాల ప్రచురణ నిర్దిష్ట సమయంలో జరిగేవి. విద్యార్థుల సంఖ్య తక్కువ కావటం, ఇన్ని రకాల కోర్సులూ విషయాలూ లేకపోవటం అందుకు కారణం కావచ్చు. మార్చి నెలాఖరుకు థియరీ పరీక్షలు, ఏప్రిల్ మధ్య కాలానికి ప్రాక్టికల్ పరీక్షలూ పూర్తయితే మే మొదటివారంలోనే ఫలితాలు తెలిసేవి. మార్కులను బట్టి ఇంటర్వ్యూలు లేకుండా పైచదువులకు పోయే అవకాశం ఉండేది. నాకు ఇంట్లో భావికర్తవ్యం చెప్పే వాళ్ళు లేరు. అక్కడా ఇక్కడా విన్న మాటలమీదా సలహాలమీదా ఆధారపడి వచ్చిన మార్కుల కనుగుణంగా ఉండే కోర్సులను స్వబుద్ధితో ఎంపిక చేసుకున్నాను. వృక్షశాస్త్రంలో బి.ఎస్‌సి. దొరకవచ్చు; నిశ్చయంకాదు. ఫిజిక్సు కెమిస్ట్రీల్లో లెక్కలు రానివాడికి స్థానం దొరకదు. ఇలా ఆలోచించి ఆంధ్ర విశ్వవిద్యాలయంలో భూగర్భ శాస్త్రంలో బి.ఎస్‌సి. ఆనర్సుకు, నా అభిరుచి ప్రధానంగా తెలుగులో బి.ఏ. ఆనర్సుకూ దరఖాస్తు చేశాను. రెండూ లభించాయి. వసతి గృహంలో ఉండటానికి ప్రత్యేకంగా దరఖాస్తు చేయాలని నాకు తెలీదు; ఎవరూ చెప్పలేదు. జూన్ మొదటివారంలో నాలుగైదు రోజులకు కళాశాల తెరుస్తారనగా బండెడు తెలుగు కావ్యాలతో సహా రైలెక్కాను – అప్పట్లో రిజర్వేషన్ విధానం లేదు. కిందా మీదాపడి వాల్తేరు రైల్వే స్టేషన్‌లో దిగి ముక్కూమొహం ఎరగని మరి ఇద్దరితో కలిసి జట్కా బండిమీద కొండ ఎక్కినట్లున్న రోడ్డు మీద సగం దూరంపైగా దిగి నడిచి ఎలాగో చేరాం ఉదయం 9 గంటల ప్రాంతానికి. హాస్టల్ కార్యాలయం సంతలా ఉంది. సామానులు ముందు వరండాలో ఉంచి ఏమిది అంటే కాషన్ డిపాజిట్టు కట్టాలన్నారు – 150 రూపాయలు. చేతుల సందుల్లో నా చేయీ పెట్టి, పేరు చెప్పి డబ్బు చెల్లించి రశీదు పుచ్చుకున్నాను. తరవాత ఓ అరగంటకు వార్డన్ గారు వచ్చారు – ముత్తుస్వామి అనే ఇంగ్లీషు శాఖలోని రీడర్ ఆయన. ఫలానా వారికి ఫలానా గది కేటాయించామని, నా దగ్గరకు వచ్చేసరికి దరఖాస్తు లేదు కాబట్టి సీటు లేదన్నాడు! దరఖాస్తు చేయని వాడి దగ్గర డబ్బు తీసుకొని రశీదెలా గిచ్చారని ఎదురు సవాలు చేశాను. రోడ్డు మీదనో కోర్టులోనో తేల్చుకుంటాను గాని వెనక్కు తిరిగే ప్రశ్నేలేదన్నాను. విషయాన్ని పునః పరిశీలించేదాకా 17 W.D.Shedsలో ఉండమని చీటీ ఇచ్చారు. అక్కడి మహాత్ముడు నన్నూ నాలాంటి మరో గుత్తికొండ శ్రీరాములునూ చూసి కూడా థర్డ్ ఆనర్సు వాళ్ళను నా గదిలోకి రానీనని తాళం వేసుకొని స్నానానికి వెళ్ళాడు. మేం కూడబలుక్కుని తాళం పగలగొట్టి లోపల ప్రవేశించాం. తోడుదొంగ భూగర్భంలో తిరిగిన కమ్యూనిస్టని తెలిసి స్నేహం పెంచుకున్నాను.

### మలుపు తిరిగిన చదువు

మిగతా చిల్లర వివరా లక్కరలేదుగానీ విద్యాసంస్థల్లో రాజకీయవాదుల ఆధిపత్యానికి చిహ్నమైన గొడవను చెప్పాలి. భూగర్భ శాస్త్రంలో ఆనర్సు సీట్లు 24 ఉంటే 30 మందిని ప్రవేశ పెట్టాడు శాఖాధిపతి మహదేవన్. ఆ కాలంలో విశ్వవిద్యాలయ కళాశాలల ప్రిన్సిపలుక్కూడా సిండికేట్ సభ్యత్వం లేదు. సూరి భగవంతం అంతటి వాడికే లేదు. నూజివీడు జమీన్దార్ మేకా



రంగయ్యప్పారావు గారి సిఫారసు మీద ఆయన చెప్పిన వారందరికీ సీట్లిచ్చినందువల్ల సంఖ్య పెరిగింది. ఆ పెరుగుదల చస్తే ఆమోదం పొందదన్నారు. ఎందుకంటే ఉపాధ్యక్షుడైన కట్టమంచి రామలింగారెడ్డి గారు ఫాలాక్షుడు చెప్పినా వినడన్నారు. "మీరంతా ఈ ఏడు బి.ఎస్‌సి. విద్యార్థులుగా ఉండండి. మీలో డిస్టిన్క్షన్ (అంటే 60 శాతంపైగా) సంవత్సరాంత పరీక్షల్లో సాధించిన వాళ్ళు ఆనర్సులో ఉంటారు. మిగిలిన వాళ్ళు బి.ఎస్‌సి.లో ఉంటా" రన్నారు. "సిఫారుసుల మీద సీట్లు తెచ్చుకున్న వాళ్ళను బి.ఎస్‌సి.లోకి మీరు పంపగలరా? కోర్సే కావాలనుకుంటే విజయ నగరంలోనే చదువుకోవచ్చు గదా? ఇక్కడికి ఎందుకు వచ్చినట్లు?" అని ఎదురు అన్నాను. "నిన్ను వెళ్ళగొట్టున్నాను, క్రమశిక్షణ పాటించనందుకు. ఈ యూనివర్సిటీలో నీకు పుట్టగతులుండ" వన్నాడు. "నా ఇష్టం వచ్చిన మరో కోర్సులో చేరి ఈ మూడేళ్ళూ నిన్ను నిద్రపోనీ"నని నేనూ శపథం చేశాను. "తెలుగానర్సులో చేర్తాను, నేను కట్టిన సొమ్మును ఆ శాఖకు బదిలీ చేయ"మని పోరాడి సాధించాను. "తెలుగు శాఖాధిపతి గంటి జోగి సోమయాజీ, మహదేవనూ అరవంలో మాట్లాడుకుంటుంటారు. మంచి స్నేహితులు. ప్రమాదం" అని హెచ్చరించారు. ప్రిన్సిపల్ కె.రంగధామరావుగారిని మా కుటుంబంతో పరిచయమున్న కురుగంటి హనుమంతరావు గారనే వాణిజ్యశాఖాధ్యాపకుడితో వెళ్ళి కలిశాను. వెంట వచ్చినాయన మా కుటుంబానిది లిటి గేషన్లో పెట్టింది పేరనీ, టంగుటూరి ప్రకాశం పంతులు గారికైనా చెప్పి కార్యసాధన చేసు కోగలననీ, మా పినతాతగారు విశ్వవిద్యాలయం గుంటూరులో ఉండగా హాస్టలు వార్డన్ అన్యాయ ప్రవర్తనను ఎదుర్కొని తీసి వేయించాడనీ చెప్పాడు. ఈ చిన్న విషయం నాకూ తెలీదు. ఎందుకు చెప్పారంటే "అప్పటి వార్డనేనయ్యా ఈ గంటి జోగి సోమయాజి గారు. మీ తాతగారు ఫలానా అని తెలిస్తే నీ మీద ఈగవాలనీ"దని ఓదార్చాడు. నేను సైన్స్ వెలగబెట్టున్నా ననుకున్న మా తాతగారికి ఆరు నెలల తరవాత తెలుగు తగలేస్తున్నానని తెలిసింది– నా సీనియర్లయిన పంగులూరి శ్రీరామ మూర్తి (ఇతడితోనే నేను గణవిభజన విషయంలో కొట్లాడింది), అబ్బరాజు సూర్యనారాయణ గారి కుమారుడూ చెప్పగా. ఆ రోజుల్లో సాలుకు రెండే టెరమ్లు. లాంగ్‌టర్మ్ డిసెంబరు 20 దాకా. షార్ట్ టర్మ్ జనవరి 20 నుంచి ఫిబ్రవరి నెలాఖరుదాకా. అందువల్ల ఆలస్యంగా తెలిసందన్నమాట – సెలవుల్లో ఇంటికి పోయినప్పుడు. ఆయన మండిపడి సారస్వత నికేతనంలోనుంచి నాకు చిత్తు కాగితం కూడా అందగూడదని ఆంక్ష విధించాడు. ఆ ఊళ్ళోనూ, గ్రంథాలయంలోనూ ఆయన మాటకు తిరుగులేదు. ఒక విధంగా నాకిది వరం. లైబ్రరీలో కూర్చొని వందల పేజీలు ఎత్తి రాసుకున్నాను పాఠ్యగ్రంథాల నుంచి.

మేం చేరేనాటికి తెలుగు శాఖలో ఇద్దరు లెక్చరర్లు. మొదటాయన అప్పటికే పిహెచ్.డి. సంపాదించిన కాకర్ల వేంకట రామనరసింహం గారనే పింగళి లక్ష్మీకాంతం గారి భక్తశిష్యుడు. రెండో ఆయన 1948–50 మధ్యకాలంలో గుంటూరు హిందూ కళాశాలలో తెలుగు ట్యూటరుగా చేరి భాషావిద్యార్థిగా సోమయాజి గారి అనుగ్రహం సంపాదించి ఇక్కడ ప్రవేశించిన వ్యక్తి భద్రిరాజు కృష్ణమూర్తి గారు. ఇద్దరు పండితు లుండేవారు. వ్యాకరణ పండితుడుగా సుప్రసిద్ధుడైన దువ్వూరి వేంకట రమణశాస్త్రిగారు. మరో వ్యక్తి మధుసూదన షడంగి అనే సంస్కృత పండితుడు

– ఒరియా వాడు. మా చేరికవల్ల సంఖ్య పెరిగి మజ్జిగ పలచబడి ప్రమాణాలు పడిపోతున్నాయని రోజూ గుర్తు చేసేవారు దువ్వూరి వారు. మేం ఏడుగురం, విద్యార్థినికాక. నేనూ (లెక్కలో నన్ను మరిచిపోతే తప్పు వస్తుంది కాబట్టి ముందే చెప్పుకుంటున్నాను), తూమాటి దొణప్ప, భద్రిరాజు కృష్ణమూర్తి గారు మిడిల్ స్కూల్లో ఉండగా ఒంగోల్లో భాగవతుల మార్కండేయ శాస్త్రిగారి మేనల్లుడుగా మానిటరుగా ఆయనకు తెలుగు చెప్పాననే జన్నాభట్ల పురుషోత్తమశర్మ, సాక్షాత్తూ దువ్వూరి ప్రథమ పుత్రుడైన పార్వతీశ్వరరావు (మేం పార్వతీశమని పిలుస్తున్నందుకు రోజూ బాధపడ్డ వ్యక్తి), తోకల భాస్కరరావు (కలం పేరు స్ఫూర్తిశ్రీ), తోటకూర వేంకటేశ్వరరావు, వెంపటి కృష్ణమూర్తి అనే ఏడుగురం. సహాధ్యాయిని స్వరాజ్యలక్ష్మి. మేం ఫోర్త్ ఆనర్సులో ఉండగా పోస్టు గ్రాడ్యుయేట్లుగా వచ్చి కలిసిన వాళ్ళిద్దరు. 'మురయా' అనే కలం పేరుగల మునిమాణిక్యం రఘునాథ యాజ్ఞవల్క్య ఒక రైతే, రెండో వ్యక్తి సుబ్బారాయుడా? ఆయన బందరు నుంచి వచ్చి చేరాడు. ఆయనకూ, మాకూ ఉన్న వయస్తారతమ్యం వల్ల పేరు గుర్తు రానంత దూరంలో ఉంది. ఆ ఏటి ఫైనల్ ఆనర్సులో నాయని కృష్ణకుమారి, పుచ్చలపల్లి విద్యుల్లత, డి.వీరయ్య, ఏటుకూరి బ్రహ్మానందం, కోటగిరి విశ్వనాథరావు గార్లుండే వాళ్ళు. ఫోర్త్ ఆనర్సు వాళ్ళలో ప్రసిద్ధులు ఎస్.వి. జోగారావు, తంగిరాల నారాయణశాస్త్రి గారలు. ఆ బ్యాచీ వారితో సంబంధాలు చాలా తక్కువ. దొణప్పగారు మా ముందు బ్యాచీ వారైనా అనారోగ్యంవల్ల మధ్యలో మాని మాతో చేరి మూడేళ్ళూ సహాధ్యాయులుగా ఉన్నారు.

## స్థల విశేషాలు

పొరపాటయింది. నేరుగా చదువు సంగతికి వచ్చాను గాని ఊళ్ళోని తొలి అనుభవాలు చెప్పలేదు. వసతి గృహంలో తాత్కాలికంగా చేరుతుండగానే వార్డ్‌బాయి వచ్చి 'బాబూ! డొక్కు కొన్నారేటి?' అని అడిగాడు. అదొక రేకు డబ్బా అని స్నానాదులకు అవసరమైన సాధనమనీ తెలిసిందప్పుడు. 'ఆ చేత్తోనే కూజాలు తెమ్మంటారేటి?' అన్నాడు. తాగే నీళ్ళకోసం అది అవసరం. సరేనన్నాం. ఇక్కడ ఎప్పుడు పడితే అప్పుడు నీళ్ళు రావు కాబట్టి ఓ టర్కీ టవలునూ, మరో నాప్కిన్నూ కొనుక్కోవటం మంచిదన్నాడో సీనియర్. స్నానం చేస్తుండగా నీళ్ళు ఆగిపోతే న్యాప్‌కిన్తో ఒళ్ళు తుడుచుకోక తప్పదని ప్రయోజనం చెప్పాడు. మరునాడు ఉదయమే ఇన్ గేటు ద్వారా బయటకు వెళ్ళి (అది ఆచారమన్నారు. అవుట్‌గేట్ ద్వారానే సాధారణంగా రాకపోకలు జరగాలనీ, పొద్దుట వచ్చే 'చాకలి బస్సు'కోసం, పది గంటలకు లోపలికి కార్లో వచ్చే ప్రిన్సిపల్‌కోసం ఇన్‌గేట్ కొన్ని గంటలపాటు తెరిచి ఉంటుందనీ బోధపడ్డది) మగ్గయ్య కొట్టు పక్కనున్న మంగలిషాపులో ప్రవేశిస్తే "ఏటి బాబూ! దయసెయ్యండి. బుర్ర సెక్కమంటారా? కొట్టమంటారా?" అనే ప్రశ్న ఎదురైంది. ఏదైనా ప్రమాదమేననిపించి "ఆ ముందాయన కేంచేస్తే నాకూ అదే చెయ్య"మన్నాను. అర్ధ రూపాయితో ఆయుష్కర్మ పూర్తయింది (పరీక్షలప్పుడు పెంచిన తలబరువూ, పిల్లిగడ్డం పీడా వదిలాయన్నమాట). ఆ తరవాత మగ్గయ్య కొట్లో బేడా పరక చెల్లించి సిజర్ సిగరెట్లూ గుర్రంబుర్ర మార్కు అగ్గిపెట్టే కొని, పాత గుంటూరు అలవాటుకొద్దీ నడిరోడ్డున నిలబడి ధూమపానం చేస్తుంటే దూరంనుంచి బడబడ ధ్వని వినిపించింది. గొర్రెలు



తోలుకుంటున్న కుర్రవాడు "నారీ బాబూ! నారీ" అంటూ ఇవతలకు లాగాడు. అప్పుడు తెలిసింది అది 'లారీ' అని. ఈలాంటివి మాండలికాలు తెలుసుకోవాలనే కోరిక పుట్టించి వాటి ప్రాముఖ్యం తెలిపిన సంఘటనలు. మధ్యాహ్న విహారంలో నెమన్ సోడా తాగి విశ్వవిద్యాలయం చుట్టూ ప్రదక్షిణంచాలని పది మందిమి ఒకరినొకరు పరిచయం చేసుకుని బయలుదేరాం. మాలో ఇద్దరు సీనియర్లున్నారు.

మేం చదివేదీ ఉన్నదీ ఆంధ్రసిటీలోనని తెలిసింది. ఇక్కడికి కనిపించేది సముద్రమూ, దాని ఒడ్డున ఉన్న పాంబీచీ అని బోధపడ్డది. యూనివర్సిటీ కానుకొని తూర్పున ఉన్నది చినవాల్తేరు, పిచ్చాసుపత్రి మీదుగా అటు వెళ్తే పెద వాల్తేరు వస్తుంది. దాన్ని గొల్లవాల్తేరనీ పిలుస్తారు. అక్కడ నుంచి ఉదయం అయిదున్నరకు బయలుదేరిన చాకలి బస్సు హాస్టల్లో తిరిగి మాసిన గుడ్డలు తీసుకుని హార్బరుదాకా పోతుంది. తిరిగి సాయంత్రం 6 గంటలకు ఇస్త్రీ గుడ్డలతో వస్తుంది. ఇదొక్కటే విశాఖలోకి పోయే ఏకైక ఆధునికసాధనం. గవర్నరు బంగళామీదుగా జట్కాలో పోవచ్చు. లేదా పెట్టిబండిలో పోవచ్చు. చినవాల్తేరులో పెట్టి బండ్లు లేవు. నడవటం సర్వోత్తమ మార్గం. ఇంగ్లీషు ప్రొఫెసరు గారు వింటుండగా పిచ్చాసుపత్రి అనగూడదు. దానికీ యూనివర్సిటీకి ఒక మూల ప్రహరీగోడలో సందుంది. ఎప్పుడైనా ఆ 'సిస్టర్ ఇన్‌స్టిట్యూట్' నుంచి మన వైపు అతిథులు వస్తుంటారని ఆయన సిద్ధాంతీకరించాడు. ఆయన పేరు కె.ఆర్.శ్రీనివాసయ్యం గారంటే చాలు. వివరాలు చెప్పనక్కరలేదు. అలా వెనకవైపు నుంచి తిరిగి హాస్టలుకు వస్తుంటే ఒక వైపు రిజిస్ట్రారాఫీసు, మరోవైపు వార్డన్ నివాసం రోడ్డు కిరువైపులా ఉంటాయి. ఎర్స్కిన్ స్క్వేరును చూసి ఇన్ గేటు వైపు రావటం అంత మంచిదికాదు. రిజిస్ట్రార్ కూర్మా వేణుగోపాలస్వామి గారుండే బంగాళా పెంకులపాక దారిలో ఉంది. అది ప్రమాదకర స్థలం. ఎందుకంటే ఆ పక్కనే విద్యార్థినుల వసతి గృహముంది. జనసంచారం అనుమానాలకు దారితీయవచ్చు. అదీగాక అదే రోడ్డుమీద ఫాకల్టీ క్లబ్బు. గురుదేవులుంటారు. వారికి మన మీద సద్భావం కలక్కపోతే రెక్కిస్తారు (అంటే రికమెండెడ్ బి.ఎ./బి.ఎస్‌సి/బి.కాం. లాంటి చిన్న డిగ్రీలిస్తారు. ఆ క్లబ్బుకు వెనకాల వైస్ ఛాన్సలర్ కట్టమంచి వారుంటారు. పగటిపూట షెడ్లలో కన్నా చెట్లకింద చదువుకోవటమే మేలు. రాత్రులు మండ్రగబ్బలు, పాముపిల్లలూ, తేళ్ళూ చూసిపోడానికి వస్తాయి. రాత్రి పది గంటల తరవాత నక్కల ఊళలు వినిపిస్తాయి. ఇదీ వాతావరణం అని తెలుసుకొని రాత్రి ఏడు గంటల్లోగా తిండికి తిరిగివస్తే రెండు బొచ్చెల అన్నం పెట్టారు. పగలయితే పిండాల్లా మూడు బొచ్చెలు బోర్లించేవాళ్ళు. పెండకాయ, పీరకాయ కూరలు తప్పవు. ఆదివారాలు పెండకాయ, ఆలుగడ్డ కూరలుంటాయి. అల్లం/ఉల్లి పచ్చడి, కొబ్బరి పచ్చడీ శాశ్వత ప్రాతిపదిక మీద లభ్యం. పండగలూ, పబ్బాలు వస్తే మునక్కాడల పులుసూ ఏదో ఒక స్వీటూ ఉంటాయి. ఉదయం 6–7 మధ్య టీ నీళ్ళూ ఇడ్లీలూ ఉంటాయి – కొబ్బరి పచ్చడితో సహా. 9 గంటల తరువాత పిండ ప్రదానం – 10 దాకా. 12.30 – 1.30 మధ్య లెక్కప్రకారం మూడు పూరీలు. తిండి పుష్టిగల వాళ్ళు గ్వెస్టు టిక్కెట్టు కొనుక్కొని ఆ తిండీ తామే తినవచ్చు. అదీ చాలకపోతే అవుట్ గేటు దగ్గర బొంతరటిపళ్ళూ రొట్టెలూ (ఉంటే) తినవచ్చు. క్రీం బ్యాచీ (మొదటి వచ్చిన) వాళ్ళకు మీగడ

దొరకవచ్చు.

మర్నాడు నగర పర్యటనకు వెళ్ళాం. గుంటూరులో ఉన్న రాజకీయ వాతావరణం విశాఖలో లేదు. ఆ రకం చర్చలూ ఘర్షణలూ కనిపించలేదు – వినిపించలేదు. పూర్ణా మార్కెటు ప్రాంతంలో ఎటుచూసినా బంకులూ, పేవ్‌మెంటు మీది అంగళ్ళూ. వాటిలో నూటికి తొంభై శాతం దేశ విభజన సందర్భంలో ప్రాణాలతో కట్టుగుడ్డలతో వచ్చిన సింధీ కాందిశీకుల దుకాణాలు. అక్కడక్కడ ఓఢ్ర వాతావరణం. శ్రీశ్రీకి అబ్బూరి చూపిన "ఇక్కడ పేకేజీ పెట్టెలు అమ్మబడును" లాంటి సింగిల్ పన్నా సైను బోర్డులు. టర్నర్ సత్రం దగ్గర "నీలకంఠ యోగీశ్వర జీవరక్షక ఫార్మసీ" అనే అనుష్టుప్ శ్లోకార్ధరచన కనిపించింది. కొండ ఎక్కినట్లనిపించింది కింగ్ జార్జ్ ఆసుపత్రి దగ్గర. మళ్ళీ వాలు. సముద్రతీరం. ఆవా మహలు. అట్టు, ఉల్లిపచ్చడి వంటివి వడ్డించే హోటళ్ళు. ఒక్క హిందూ రీడింగ్ రూం ప్రాంతం హాయిగొల్పింది – సాహితీ వాతావరణంతోనూ వావిళ్ళ వారి పుస్తక విక్రయశాలతోనూ. తిరిగింది చాలని సముద్రం ఒడ్డునే వాల్రు చేరుకున్నాం, ఎక్కడెక్కడ సినిమా హాళ్ళున్నాయో గమనించీ గుర్తించీ. మరునాడు కొత్తగా చేరిన విద్యార్థులకు వైస్‌ఛాన్సలర్‌గారు స్వయంగా ఆహ్వానం చెప్తాడన్నారు. 1948లో సింధియా కంపెనీ వాళ్ళు తయారు చేసిన మొదటి పడవ 'జల ఉష' సముద్ర ప్రవేశోత్సవానికి వచ్చిన ప్రధాని నెహ్రూతో సి.ఆర్.రెడ్డి గారు బహిరంగ వాగ్వాదానికి దిగి ఆంధ్ర రాష్ట్రం కావాలన్నాడని చెప్పారు. తెన్నేటి విశ్వనాథంగారు ఊళ్ళో ఉంటే కొంత రాజకీయసంరంభ ముంటుంది గాని ఎప్పుడో తప్ప విశాఖలో నిత్యసాహిత్య ఘోష ఉండదన్నారు. అంటే మనక్కావలసిన వాతావరణాన్ని మనమే కల్పించుకోవాలని హాస్టలు భవనాల మధ్యగల ఓ పెద్ద చెట్టుమీద చాకుతో 'పాలిటిక్సు చెట్టు' అని పేరు చెక్కి, దాని మొదట్లో ఒక బండరాతిని చేర్చి అదే అధ్యక్షపీఠమో, శంఖపీఠమో అనుకొందా మనుకున్నాం. రాజకీయాలు వద్దనుకున్నప్పుడు అక్కడే తెలుగు చదివే, తెలుగును అభిమానించే వాళ్ళు తోకపద్యాల పోటీ, ఆశుకవితా ప్రదర్శన వంటివి ఏర్పాటు చేసుకుందామని గదిగది దగ్గరా ఆహ్వానం చెప్పాం. ఆనాడే ఆరంభించాం గాంధీ గ్రంథాలయమనే హాస్టలు గ్రంథాలయా నికి ఎదురుగా పాలిటిక్స్ చెట్టునీడన మా కార్యక్రమాలు.

**ఆహా! ఏమి స్వాగతం!**

కట్టమంచి వారి ఆహ్వానం మొదటి వాక్యంలోనే రక్తి కట్టించింది. "మీరిక్కడి వసతులను వినియోగించుకొని స్వయం కృషితో విద్వాంసులు కావాల్సిందేగాని ఆచార్యులు సిద్ధాంతాలు వల్లిస్తే, ఉపాచార్యులు చదువుతుంటే, ఉపన్యాసకులు ఉపన్యాసం దంచుతుంటే మీకు బోధించే వాళ్ళుండరని హామీ ఇస్తున్నాను. నా హయాంలో గ్రంథాలయం, ప్రయోగశాలలూ, ఆయా శాఖల కార్యాలయాలూ రాత్రింబగళ్ళు తెరిచి ఉంటాయి. ఉపయోగపెట్టుకోండి" అని ఉద్బోధిం చాడు. ఆయన ఇంగ్లీషులో చెప్పిన మాటలు నాకు గుర్తున్నంతవరకు ఇవి: 'I welcome you and assure that Professors profess, Readers read, Lecturers lecture but no bastard ever teaches you: there are no tutors as at Cambridge or Oxford. During my period as vice-chancellor the Labs, Library and departmental offices will be open all the



twenty four hours. Make use of them and educate yourselves.' శేషాచార్యులనే విద్యార్థి నాయకు డనుకుంటాను. 'Bastard' శబ్ద ప్రయోగాన్ని అధిక్షేపించాడు. కట్టమంచి వారు సీరియస్‌గా చూసి "మానవ శాస్త్రంలోని మొదటి వాక్యాలైనా చదివి ఉంటే తప్పుపట్టే వాడివికావు. వలసలు, ఆక్రమణలు, సామ్రాజ్య స్థాపనలు, యాత్రలు వగైరాలు నిత్యశ్రాద్ధంగా జరిగిన మానవ జాతి చరిత్రలో రక్తంగాని, భాషగాని శుద్ధంగా ఉండవు. అంతా సాంకర్యమే జరిగింది. కాబట్టి ఇంగ్లీషు వాళ్ళు సరదాగా ప్రయోగించే పలకరింపుమాట bastard అవాస్తవికం కాదని తెలుసుకో. మీరేమనుకున్నా నేను నా పూర్వులైన స్త్రీలంతా పవిత్రంగా ఉన్నారని నమ్మను!" అని విరుచుకపడ్డాడు. శేషాచార్యుల కేప్రమాదమూ జరగలేదు. తరవాతి రోజుల్లో చెట్లకింద కూర్చుని చదువుకొనే విద్యార్థులను వాహ్యాళికి వచ్చి పలకరించి మీకేమైనా పుస్తకాలు కావాలా అని అడిగి అడ్రసు తీసుకొని వెళ్ళేవాడు. పక్షం రోజుల్లోగా క్లాసుకు కబురందేది. "ఫలానా విద్యార్థి కావాలను కున్న ఫలానా పుస్తకం వచ్చింది. రేపు తీసుకొని పదిహేను రోజుల్లోగా తిరిగి ఇవ్వాలి. అంత కాలం మరెవ్వరికీ అది అందుబాటులో ఉండ"దనే సర్క్యులర్. మరో విశేషం. సంస్థ పేరును ఆంధ్ర విశ్వకళా పరిషత్తుగా మార్పిస్తూ చట్టం సవరింపజేసిన వాడాయనే. 'విద్యాలయ' శబ్దం లోని అపశ్రుతిని మార్చానుగాని ఎందుచేతనో భాషాప్రవీణ, కళాప్రపూర్ణల విషయం స్ఫురహలోకి రాలేదని కూడా అంటుండేవాడు. అంతకన్నా పెద్ద విషయం ఉపాధ్యక్షుడు విద్యావిషయాల్లోనూ, పరిపాలనలోనూ తలమానికమని చట్టంలో ఉంది కాబట్టి తాను పాఠాలు చెప్పాల్సిందేనని బుధవారం రెండు శాస్త్రాల్లో (అర్థశాస్త్రం, తత్వశాస్త్రం) ఫైనలియర్ వాళ్ళకు పాఠాలు చెప్పేవాడు. అదే విధానాన్ని సర్వేపల్లి రాధాకృష్ణయ్య అవలంబించాడు. ఆగస్టులో కట్టమంచి వారు మైసూర్ విశ్వవిద్యాలయానికి ప్రోఛాన్సలరుగా వెళ్ళారు. ఆయన తరవాత ఆ పదవి స్వీకరించిన వాసిరెడ్డి శ్రీకృష్ణగారు కూడా బుధవారాలు అర్థశాస్త్రం బోధించారు. ఆయన తరవాతి వాళ్ళెవరూ ఆ పాపం చేయలేదు. వాళ్లంతా పరిపాలనైకదృక్పథం కలవాళ్ళని గుర్తించాలి. కొత్త సచ్చిదానందమూర్తి గారు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయానికి వి.సి.గా వెళ్ళినప్పుడు ఆయన కూడా అక్కడ బుధ వారం తత్వశాస్త్రం బోధించాడు. మరెవరూ అలాంటి పిచ్చి పని చేయలేదని వాకబు చేసినంతలో తెలిసింది. 1953లో విశ్వవిద్యాలయం వదిలివెళ్ళి 1959–60లో తిరిగి పరిశోధనార్థం వచ్చే నాటిక్కూడా గ్రంథాలయం రాత్రి 10 గంటలదాకా తెరిచి ఉంటే ప్రయోగశాలలు రాత్రంతా తెరిచి ఉండేవి. ఇప్పుడటువంటి దుర్లక్షణాలు కన్నంతలో, విన్నంతలో ఐ.ఐ.టి.లలో తప్ప మరెక్కడా లేదని తెలిసినప్పుడు చచ్చేటంత సంతోషం కలిగింది – దేశం అభివృద్ధి పథంలో ప్రయాణిస్తున్నదని.

**గ్రంథాలయం**

క్లాసులు మొదలైన తరవాత పది రోజులకు లైబ్రరీ టిక్కెట్లిచ్చారు. తెలుగు పుస్తకా లేమున్నాయో చూద్దామని వెళ్ళి నిరుత్సాహపడి తిరిగివస్తూ సంస్కృత గ్రంథాలు చూడబోయాను. అప్పటికి జమ్మలమడక మాధవరాయశర్మ గారి 'నవరస గంగాధరం' కొద్దిగా చదివిన జ్ఞానంతో మూలగ్రంథం కనిపిస్తే షెల్ఫులోంచి తీశానో లేదో నాయని కృష్ణకుమారి గారు నిలదీశారు –

"భండార్కర్ మొదటి పుస్తకం చదివితే గొప్ప థర్డ్ ఆనర్సులో. నీకేమర్థమవుతుంది? నాకవసరం– ఫైనలియర్ కాబట్టి" అంటూ లాక్కోబోయారు. "తెలుగానర్సులో చదివే సంస్కృతం బండారం ఇంతేనని తెలియక తీసుకున్నానే అనుకోండి. నాకు అర్థమవుతుందో కాదో తేల్చే అధికారం మీకేముంది?" అని రెట్టించాను. పెద్దగా మాటలు వినపడి లైబ్రేరియన్ అబ్బూరి రామకృష్ణరావు గారు మా ఇద్దరినీ తమ గదికి తీసుకుపోయారు. ఆయన కామె తెలుసు – ఆమె తండ్రిగారూ తెలుసు – భావకవుల మొదటి తరంవాళ్ళు కాబట్టి ఇద్దరూ. నేను కొత్త. ఫలానా అని చెప్పు కున్నాను: 'సరే! నీవే తీసుకుని చదువు. కానీ గ్రంథాలయంలో కేకలూ, కూకలూ నిషిద్ధం. ఏమైనా కావలిస్తే నన్ను కలిసి అడుగు' అని పంపారు. లైబ్రేరియన్ అనుక్షణం తిరుగుతూ ఉండాలంటూ తన దారిన తాను వెళ్ళారు. తెలుగానర్సు వాళ్ళ సంస్కృతజ్ఞానం దూడపేడ సంస్కృతమాత్రమని తెలిసింది. అది మొదటి విశేషం. అబ్బూరి వారి దర్శనమయింది అది రెండోది. గ్రంథాలయాధి కారి నిరంతర పర్యవేక్షకుడుగా అవిశ్రాంతంగా ఉండాలనే నియమముందనీ దాన్ని ఆయన పాటిస్తున్నాడనీ తెలిసింది. అది మూడోది. అక్కడ పని చేస్తున్న ఇబ్రహీం సాహెబ్ 'బి' అంటే ఏమిటని అడిగి తనదీ మా గ్రామమేనని చెప్పి నాఅంతటివాడి పరిచయం గొప్పదని సంతోషిం చాడు. అప్పటికి ఆస్తులు చాలామటుకు హరించినా 'బూదరాజువారి సంస్థాన' మనే మాట స్థానికంగా బతికుందని తెలియటం అయిదోది. అతగాడు ఆ తరవాత మూడు నెలలకు మరో విశేషం చెప్పాడు. కొత్త వి.సి. కృష్ణాగారు రోజూ మధ్యాహ్నం ఒంటి గంటకు వచ్చి మూడు గంటలదాకా అబ్బూరి వారితో వారి గదిలో ఉండి అక్కడి నుంచి కార్యాలయానికి వెళ్తుంటారనీ, పాత వీ.సీ. గారు కారు పంపి అబ్బూరి వారిని పిలిపించుకొంటూ ఉండేవారనీ, "మన లైబ్రరీయన్ సంగతే వేరు. ఆయన ఆంధ్రరత్న తరవాత చీరాల పేరాల ఉద్యమానికి సారథి అని మా నాన్నగారు చెప్పా"రనీ వివరించాడు. మరో హెచ్చరిక 'అబ్బూరి వారికి ఆట్టే దగ్గర చేరకండి. సోమయాజి గారివల్ల ప్రమాదం. వారిద్దరికీ పడ'దని కూడా జాగ్రత్త చెప్పాడు! ఆనర్సు విద్యార్థి శాఖాధిపతి దయలేకపోతే నాశనమవుతాడని హాస్టల్లో అనుకుంటుండేవాళ్ళు పెద్దగానే! దేవుడు కూడా ఆశ్రితవత్సలు డైనప్పుడు గురువు కాకూడదా అని సరిపెట్టుకోవటం పరిపాటి. రాజకీయ వాసనవల్ల, గాలికి మాట్లాడే స్వభావంవల్ల నెల రోజుల్లో వందల మందితో ముఖ పరిచయం సంపాదించగలిగాను. అప్పట్లో స్టూడెంట్స్ ఫెడరేషన్ (SF), డెమొక్రాటిక్ స్టూడెంట్స్ యూనియన్ (DSU) అనేవి రెండే ప్రాబల్యంలో ఉండేవి. నేను ఫెడరేషన్లో క్రియాశీలంగా ఉండి రెండో పక్షం వాళ్ళని 'దస్యు'లని వ్యవహరిస్తుండేవాణ్ణి. దాని నాయకుడు తరవాత రైల్వే కార్మికనేత అయిన ఎ.వి.కె.చైతన్య. మేం చెప్పులు తీసి కొట్టుకోబోయిన సందర్భా లనేకం వచ్చాయిగాని, మా వ్యక్తిగత స్నేహసంబంధాలు జీవితాంతం నిలిచాయి. అది ఆనాటి తీరు.

**ఊరూ వాడా**

శని ఆదివారాల్లో విశాఖ వెళ్ళి పురిపండా అప్పలస్వామి, మసూనా వంటి సాహితీపరులతో సంబంధాలు పెట్టుకున్నాను. "కవి గారిని' దర్శించాను. అప్పటికే ఆయన పెద్ద వయసులో అస్వస్థుడుగా ఉన్నాడు. చర్ల గణపతి శాస్త్రిగారి దర్శనం కలిగింది. ఆయన పాండిత్యం



ఆకర్షించింది – ఆయన స్ఫురద్రూపంలాగా. అప్పటి సాహితీ ప్రపంచంలో నేను పేరు వినీ, రీడింగ్ రూంలో ఏదో ఒక పుస్తకం చదివీ, చూడదలచని వ్యక్తి స్థానాపతి రుక్మిణమ్మగారనే కవయిత్రి. కాలక్రమాన కమ్యూనిస్టు నేతలైన ఎం.వి.భద్రం, భద్రమూర్తిశర్మ, ఎలమంచిలి విజయకుమార్ (అప్పటి జిల్లా కార్యదర్శి పార్టీకి) వంటి పెద్దలతోనూ ఆకెళ్ళ కృష్ణమూర్తివంటి కార్యకర్తలతోనూ పరిచయం కలిగింది. అప్పటికే జె.వి.కె.వల్లభరావు, ఆయన భార్య డాక్టర్ లక్ష్మివంటి ప్రజాభిమాన పాత్రులైన వారి ప్రాముఖ్యం తగ్గించారు కమ్యూనిస్టు పార్టీలో. స్టూడెంట్ సెల్స్ నడిచేవి. యూనివర్సిటీలో స్టూడెంట్స్ యూనియన్ సభ్యత్వం నిర్బంధం విద్యార్థులందరికీ. ఎన్నికలు జరిగేవి. అధ్యక్షతకు పోటీచేసే వ్యక్తి ఇంగ్లీషులో మంచి వక్తగా ఉండాలని పోటీ నిర్వహించే వాళ్ళు. లెక్కకు తెలుగు భాషాసమితి అని మరో సంఘం ఉండేది. దానికి తెలుగు శాఖాధిపతి గౌరవాధ్యక్షుడు. ఆయన నియమించిన ఫైనలియర్ తెలుగానర్సు విద్యార్థి అధ్యక్షుడు. అలాగే నియుక్తుడైన ఫోర్త్ ఆనర్సు విద్యార్థి కార్యదర్శి. తక్కిన కార్యవర్గాన్ని విద్యార్థులందరూ ఎన్నుకుంటారు. కీలక పదవులు తెలుగానర్సువాళ్ళ చేతిలో ఉండటం, వారికి నిబంధనల ప్రకారం బహిరంగసభలు జరుపుకొనే అధికారమున్నా ధైర్యం, అభిరుచి లేకపోవటం కారణంగా అది లేనిదానితో సమంగా ఉండేది. ఎప్పుడైనా కవి పండితులు వస్తే, వారిమీద శాఖాధిపతికి అభిమానం ఉంటే, చిన్న గదిలో సభ జరిపేవారు. ఈ దుస్థితి తప్పించి యూనివర్సిటీ వదిలి వెళ్ళేలోగా ఇదే అసలు విద్యార్థి సంఘమని నిరూపిస్తానని సవాలు చేశాను బహిరంగంగా. ఎస్.ఎఫ్. వాడు ప్రగల్భాలు పలక్క మరేం చేయగలడని దస్యు లాక్షేపించేవాళ్ళు. తెలుగు భాషా సమితి చెళ్ళపిళ్ళ స్మారక పద్యరచన పోటీలు నిర్వహిస్తుండేది. అలాగే తెలుగులో వ్యాసరచనలో పోటీలు జరిపేది. పద్యరచనలో మూడేళ్ళూ బహుమతుల సంపాదించి బహుమానంగా డబ్బుకు బదులు పుస్తకాలు కొనుక్కున్నాను – సంస్కృతాంధ్రాల్లో. బహిరంగ సభలన్నీ స్టూడెంట్స్ యూనియన్ ఆధ్వర్యంలోనే జరిగేవి. దానికి యూనివర్సిటీ కాలేజీల ప్రిన్సిపల్ గౌరవాధ్యక్షుడు. సాంస్కృతిక సభల విషయంలో – ముఖ్యంగా నాటకాల పోటీ విషయంలో – చండశాసనుడైన రిజిస్ట్రారు కూర్మా వేణుగోపాలస్వామిగారు మరెవరినీ వేలుపెట్టనిచ్చేవాడు కాదు. రాష్ట్ర వ్యాప్తంగా అన్ని అనుబంధ కళాశాలలనుంచీ వచ్చిన వాళ్ళు ఎర్స్కిన్ స్క్వేర్లో బహిరంగ రంగస్థలంలో ఆంధ్ర, సాంస్కృతికవారోత్సవాల్లో భాగంగా నాటకాల పోటీల్లో పాల్గొనేవాళ్ళు. 1950లో గుంటూరులో చదువుతుండగానే వేమూరి (గగ్గయ్యగారి కుమారుడు) రామయ్యధారా రామనాథ శాస్త్రి నటించిన చారిత్రక నాటకంలో 'ఏగ్రస్త్రా'వేషం కట్టి నేను విశాఖ వెళ్ళాను నాటక బృందంతో. ఆ ఏడు మొదటి బహుమానం మా నాటకానికే వచ్చింది. విడియోగ్రఫీ అవకాశంలేని పాతకాలమది. మరునాడు మళ్ళీ ప్రదర్శించమని ఆడియో రికార్డింగ్ చేయించారు గోపాలస్వామి గారు. విశ్వవిద్యాలయంలోని విద్యార్థులకు ఆయనేగాక అబ్బూరి రామకృష్ణారావు గారు కూడా శిక్షకులుగా ఉండేవారు.

నాటి విశ్వవిద్యాలయ వాతావరణం హాస్టల్లోని పరిచయాలూ ఆహ్లాదకరంగా ఉండేవి. భిన్న శాఖలకు చెందిన వాళ్ళం ఒకరినొకరు అడిగి ఇతర శాస్త్ర విషయాలు తెలుసుకోవటం కద్దు.

కులమత ప్రాంత విభేదాలు స్నేహాలకు అడ్డురాలేదు. పదిహేను రోజులకోసారి రాత్రి బహిరంగ స్థలంలో విందు జరిగేది. ఆ సాయంత్రం వైస్‌ఛాన్సలర్ నుంచి కొత్తగా చేరిన అధ్యాపకుడి దాకా ఆరు బయటి భోజనాలకు వచ్చే వాళ్ళు. అక్కడికక్కడే నిర్భయంగా తమ సమస్యలను గురించి విద్యార్థులు బహిరంగంగా చెప్తే వైస్ ఛాన్సలర్ అప్పటికప్పుడే తన నిర్ణయం ప్రకటించేవాడు. రెండు నెలలకోసారి ఏ మాధవధారలకో, సీతమ్మ ధారలకో వెళ్ళే వాళ్ళం. అవి ఇప్పుడు నగరంలో భాగమైనాయి. సింహాచలానికి రోడ్డు మార్గాన ఉపాధ్యాయులూ వంట సామగ్రీ వగైరాలు వస్తే విద్యార్థులం జట్లుజట్లుగా కొండ ఎక్కి దిగి మళ్ళీ ఎక్కి అక్కడికి చేరేవాళ్ళం. సముద్ర తీరంలో ఆడుతూ, పాడుతూ భీమ్లీకి మూడుసార్లయినా పోయివచ్చాం. ఆ సమయంలో హోదాల్లేవు. సరదా కబుర్లలో, ఆట పాటల్లో అందరూ పాల్గొనేవారు. అప్పుడే శాస్త్ర చర్చలూ, ప్రశ్నలూ, సమాధానాలూ ఉండేవి. మొదటి సంవత్సరం తెలుగుశాఖ ఆర్ట్సు కళశాలలోనే ఉండేది. మాకు బి.ఏ. విద్యార్థులతో సమానంగా ఇంగ్లీషు, చరిత్ర పరీక్షలుండేవి. ప్రశ్నపత్రాలు ఒక్కటేగాని ప్యాసు మార్కులు డిగ్రీ వాళ్ళకు 35 శాతమైతే, ఆనర్సు వాళ్ళకు 40 శాతం. ఈ రెంటినీ ప్రిలిమ్స్ అనే వాళ్ళు. ఇవి ప్యాసుకాకపోతే ఫైనల్ ఎగ్జామ్‌లో కూర్చోనీరు. వీటిని మొదటేడే పూర్తి చేసినవాడు అదృష్టవంతుడు. ఆయేడు ఇతర పరీక్షలు – అభిమాన విద్యకు సంబంధించినవి – ఉన్నా అవి నామమాత్రం. ఫోర్త్ ఆనర్సులో ప్రిలిమ్స్ పీడా వదిలిన వాళ్ళకు నామమాత్రపు పరీక్షలే కాబట్టి ఫైనల్ పరీక్షలకు బాగా సిద్ధంకావచ్చు. అప్పటి ఆర్ట్సు కాలేజీ ప్రిన్సిపల్ గొర్తి వేంకటరావుగారు. ఆయన సౌకర్యార్థం మొదటేడు మేము ఆర్ట్సు కాలేజీలోనే చదివాం. తరవాతి రెండేళ్ళూ అవుట్‌గేట్ దగ్గరి బంగళా పెంకుల పాకల్లో సైన్సుకాలేజీ వైపు మొహంపెట్టి రెండు శాఖలుండేవి – వేదాంతం,  చాదస్తం అని! మాది చాదస్తం. వేదాంతం అంటే వివరణ అక్కరలేదు. ఫైనలియరు వాళ్ళలో స్పెషల్ సబ్జెక్టులు ఒకేసారి చదువుకోవలసిన ఈ ఉభయశాఖల వారికే ఒక్కటే గది ఉండేది. ముందువచ్చిన వాళ్ళకది దక్కితే మిగిలిన వాళ్ళు తిక్కవరపు సభదాకా పోయి చదువు కోవాలి. గేటుకు రెండో పక్క యూనివర్సిటీ డాక్టరు క్వార్టర్సు. ఆయన ఇంటి పక్క రోడ్డు దాటగానే పిచ్చాసుపత్రి – అంటే గణితశాస్త్రం వారి గదులు. ఇంగ్లీషు పాఠం చెప్పిన వారు కొట్టరువు విశ్వనాథం గారు. తిక్కనగారి గంటముంది వచ్చి చూసిపొండని ఇంటికాహ్వానించేవాడు. ఆయన విశ్వనాథ సత్యనారాయణ గారితో కలిసి కొంతకాలం జంటకవిగా వ్యవహరించిన కొడాలి ఆంజనేయులుగారి వియ్యంకుడని తరవాత తెలిసింది. ఆయన విద్యార్థులు డాక్టరేట్లు పుచ్చుకొని రీడర్లయినా, ఆయన నిశ్చలంగా అలాగే ఉన్నాడు చాలాకాలం. కారణం పరిశోధన పద్ధతిలో ఆయన ఎంపిక చేసుకున్న తప్పు విధానమంటారు. ఇంగ్లీషు సాహిత్యంలోని ఆలంకారిక సిద్ధాంతాలను పరిశోధన వస్తువుగా తీసుకొని, తృప్తిలేక గ్రీక్ ల్యాటిన్ సాహిత్యాల్లోకి ప్రయాణించి, దరిమిలా అంతా అభారతీయమేనా అని సంస్కృతాలంకార శాస్త్రాలను తరచి చూచి బయట పడటానికి ఆయనకు పదిహేను, ఇరవై సంవత్సరాలు పట్టాయి! ఎలా పరిశోధించగూడదో తెలుసుకోటానికి ఈయన పరిశ్రమను తెలుసుకోవాలని కె.ఆర్.శ్రీనివాస్ అయ్యంగార్ (పరిశోధన పర్యవేక్షకుడు) అందరికీ చెప్తుండేవాడు! అపారమైన విద్యాజ్ఞానం, అనంతమైన



హాస్యధోరణి విశ్వనాథంగారి సొత్తు. చరిత్ర పాఠం చెప్పిన వారు ఓరుగంటి రామచంద్రయ్య గారు. మైనరుగా ఉండగానే అన్న సుబ్రహ్మణ్యంగారితోబాటు (ఆయనా అప్పటికి మైనరే) ప్రతివాది భయంకరాచార్యుల వారి నాయకత్వంలో కాకినాడ దగ్గర వైస్రాయి స్పెషల్‌ను పడ గొట్టాలని బాంబు విసిరిన వీరుడాయన. పట్టుబడి బోర్‌స్టల్ స్కూలు జీవితం గడిపి, స్వాతంత్ర్యం వచ్చిన తరవాత సర్వేపల్లి రాధాకృష్ణయ్య దయవల్ల విముక్తుడై లండన్‌లో పిహెచ్.డి. చేసిన వాడు. ఆయన పాఠం వీరావేశ ప్రదర్శనలా ఉండేది. ఉత్తప్పుడు బొంగురుగొంతుగాని, పద్యం చదివినా (భక్తి) గీతాలు పాడినా ఆపాత మధురంగా ఉండేది ఆయన కంఠస్వరం. ఒక ప్రణాళిక ప్రకారం చదువు చెప్పాలన్న మాటేలేదు. శాతవాహనుల విషయం మూడు నెలలు చెప్పి డిసెంబరులో సెలవుల నాటికి విజయనగర చరిత్ర పూర్తి చేయలేదు. తరవాత ఆయన జబ్బు పడితే గొర్తి వేంకట్రావు గారు నెలా పదిహేను రోజుల్లో మళ్ళీ మొదలుపెట్టి పూర్తి చేశారు కోర్సు. ఉపాధ్యాయుడంటే అలాగుండా లనిపించేది. అరటిపండు వలిచిపెట్టినట్లు ప్రధానాంశాలు చెప్పి మా చేత చెప్పించిన నైపుణ్యం మరువరానిది. మరిచిపోలేనిది. ఆయన ధోరణి సంభాషణాత్మకం. చిల్లర విషయాల జోలికి పొయ్యేవాడు కాదు (ఓరుగంటి వారు పోర్చుగీసు రాయబారి హత్యకు శ్రీకృష్ణదేవరాయలు బాధ్యుడా కాడా అనే విషయాన్ని మూడు వారాలపాటు వివరించారు! అది ఆయన పరిశోధనాంశమని తరవాత తెలిసింది).

## చదువులు, పరీక్షలు

తెలుగుశాఖలో ప్రవేశించగానే నా 'అశ్రుధారలు' ఉపాధ్యాయులకు సమర్పించాను. మొదటివారంలో విద్యార్థులను తలకొకరీతిగా పరీక్షించారు (ఇప్పటిలా ఎంట్రెన్స్ పరీక్షల వంటివి లేవుకాబట్టి). మొదటి గంటలో గంటి జోగి సోమయాజి గారు ఒక్కొక్కరు ఎక్కడెక్కడి నుంచి వచ్చారో, ఏమి చదివి వచ్చారో తెలుసుకున్నారు. ఇంటరులో తెలుగు అభిమాన విద్యగా ఉన్నవాళ్ళు ఇద్దరు, ముగ్గురు తేలారు. నా వంతు వచ్చింది. మాకు తెలుగు చెప్పిందెవరని అడిగి తెలుసుకున్నాడు. పళ్ళెవారి ప్రస్తావన రాగానే 'నీకు సంస్కృతం వచ్చుటోయ్?' అన్నాడు. 'కొద్దిగా'నన్నాను. 'వ్యాకరణమో' అన్నాడు. 'అదీ అంతే'నన్నా. 'తిఙ్ఞలంటే ఏమిటి?' అని అడిగితే 'తి జకృత్' అన్నాను. లిప్తకాలం తీవ్రంగా చూసి 'కృత్తంటే ఏమిటి?' అంటే 'కృ దతిఙ్" అన్నాను. క్లాసంతా గొల్లుమంటే, 'మీరు గొల్లున ఏడవాలోయ్! ముఖ్యంగా భాషాప్రవీణ అఘోరించి వచ్చిన పురుషోత్తమశర్మ, తరవాత రమణ శాస్త్రిగారి పుత్రరత్నం పార్వతీశ్వరరావూ' అన్నాడు. మరి నన్ను ప్రశ్నించలేదు. తరవాత వేంకటరమణ శాస్త్రిగారి క్లాసు. ఆయన ఏదో అడిగి చెప్పింది విని 'ఏస్' అంటుంటే "Yes" అన్నారో "Ass' అన్నారో తెలిసేది కాదు – ఉచ్చారణను బట్టి. తాను నలభై సంవత్సరాలుగా వ్యాకరణ పాఠం చెప్తుంటే తమ గురువుగారైన వఝల చినసీతారామస్వామి శాస్త్రిగారు "ఇటీవల నీకేదో కొంచెం వ్యాకరణతత్వం బోధపడుతున్నట్లుం"దన్నారని చెప్పారు – తెలుసు ననవద్దని నిషేదించటానికి! మాకు ప్రాచీన కావ్యాలు, వ్యాకరణాలంకార శాస్త్రాలు ఈ మూడేళ్ళూ తామే చెప్తామన్నారు. ఇక షడంగిగారు. ఆయనకు నత్తి. 'సంస్కృతం బచ్చా?' అని అందర్నీ అడిగారు. ఉడులోమీ శబ్దం చెప్పగలిగితే

వచ్చినట్లు లెక్కన్నారు. ఆయన సంస్కృత ప్రాకృత వ్యాకరణాలూ కావ్య భాగాలూ చెప్తామని, సంస్కృతాన్ని భండార్కర్ పుస్తకాల ద్వారా బోధిస్తామనీ అన్నారు. 'బల్లము, గోడము' వంటి తెలుగు ప్రయోగాలు చేసేవారు. తాతా సుబ్బా రాయుడు శాస్త్రిగారి శిష్యుడనీ, జ్యోతిశ్శాస్త్రంలో అఖండుడనీ, ఇంగ్లీషు మెట్రిక్ వరకే చదివాడని, ఒరియావాడని, ప్రోఛాన్సలర్ జయపూర్ విక్రమదేవ్ మహారాజా వారు ఉద్యోగమిప్పించారని, శాఖాధిపతిగా ఉన్న పింగళి లక్ష్మీకాంతం గారు పదహారు సంవత్సరాలు పాఠం చెప్పే అవకాశ మివ్వక జీతం తినమని ఈసడించేవాడనీ, సరిగ్గా ఆ కారణంవల్లనే గంటి జోగి సోమయాజిగారు రెండేళ్ళుగా ఆయనకు బోధనావకాశం కల్పించారనీ తెలిసింది. కాకర్ల వేంకట రామనరసింహం గారు తెలుగులో ఈ విశ్వకళా పరిషత్తులో పిహెచ్.డి. తీసుకున్న వారిలో మొదటివారు. పింగళి వారికి శిష్యుడూ, భక్తుడూ. బద్ధకంలో అద్వితీయుడు. క్లాసుకు పిలుచుకరావాలి. ఆలస్యంగా వచ్చి ఛార్లెస్ ల్యాంబ్ పద్ధతిలో త్వరగా వెళ్ళిపోయేవాడు. ఆయన మూడేళ్ళూ మేం ఏ సంవత్సరం చదువుతున్నామో సరిగా గుర్తించలేదు. పేర్లు మార్చి అటెండెన్స్ తీసుకునేవాడు. మొదటి సంవత్సరం పూర్తయ్యేసరికి ఆంధ్రసాహిత్య చరిత్రలో నన్నయ సంగతి కొంత అయింది. రెండో ఏడు "ఎక్కడినుంచి మొదలుపెట్టా"లని అడిగితే పార్వతీశ్వరరావు "నారాయణభట్టు దగ్గర్నుంచి" అని, చీవాట్లు తిన్నాడు. తిక్కన గురించి తన వంటి వాళ్ళూ ఏమీ చెప్పలేరనీ, తెలిసి చెప్పగలిగిన వారొక్క పింగళివారేనని, కాబట్టి మాకు తెలుసుకొనే అవకాశం లేదనీ నచ్చచెప్పాడు! 'పులిహోర త్రివిధంబు' వంటి సూత్రీకరణలు చేస్తుండేవాడు. దాదాపు రెండున్నర దశాబ్దాల తరవాత తాము రాసిన సాహిత్య చరిత్రను కేంద్ర ప్రభుత్వానికి ఆర్థిక సహాయం నిమిత్తం సిఫారసు చేయమని ఉత్తరం రాస్తే, ఆ ఉత్తరంతో సహా గ్రంథాన్ని పంపాను. తక్కిన ఉపాధ్యాయులనూ అప్పటి పరిశోధక విద్యార్థి కొత్తపల్లి వీరభద్రరావునూ (విజయనగర కళాశాలలో కొత్తపల్లి వారు శాఖాధిపతులుగా ఉంటే తాము ట్యూటరుగా ఉండవలసి వచ్చిందని చెప్తూ) వెక్కిరించటం, దూషించటం ఆయన బోధించిన వైనం. భద్రిరాజు కృష్ణమూర్తిగారికీ మాకూ రెండున్నర సంవత్స రాలు సాగిన సంబంధం జనరల్ నాలెడ్జ్ పేరిట మాచేత ఆయా గ్రంథాలమీద వారం వారం వ్యాసాలు రాయించి సవరించి ఇవ్వటం, చివరి సంవత్సరం చదువులో ద్రవిడ భాషల గురించి ప్రత్యేకించి మాలో కొందరికి పాఠం చెప్పటం, రమణశాస్త్రి గారు చెప్పటానికి కుదరని, ఇష్టపడని ఆధునిక కావ్యాలను బోధించటం. కోర్సు విషయం కొంత వివరించా లనిపిస్తున్నది.

సాలుకు రెండుసార్లు డిపార్ట్‌మెంటల్ పరీక్షలు జరిగినా వాటికి ప్రాముఖ్యంలేదు. కాకపోతే విద్యార్థి శక్తి సామర్థ్యాలను గురించి ఉపాధ్యాయులకు అంచనా వీలవుతుందేమో. సద్భావ దుర్భావా లెలా ఉన్నాయో విద్యార్థులకూ తెలుస్తుంది. మూడో ఏడు చివరి పరీక్షలే జాతకం తేలుస్తాయి. అంతకాలం చదివినవన్నీ గుర్తుంచుకోకతప్పదు కాబట్టి ధారణ పెరుగుతుంది. మొదటి ప్రశ్నపత్రం పాఠ్యగ్రంథాలమీద. అవి మూడేళ్ళ మీద 80 దాకా ఉండగా, సాధారణ పరిజ్ఞానం పేరిట వారంవారం ప్రతి విద్యార్థీ ఏదో ఒక నిర్ణీత గ్రంథాన్ని చదివి వ్యాసం రాసి చూపాలి. అవి పాఠ్య గ్రంథాలుకావు కాబట్టి అదనంగా చదివే అలవాటు పుట్టుంది. అన్నటికన్నా తలనెప్పి కలిగించేవి Annotations. ఇప్పటికీ గుర్తు 'కలుషపు బావురు పిల్లికి చిలుక విధంబున' అనే పద్యఖండ మడిగారు ఎక్కడిదని. కళాపూర్ణోదయంలో ఈ భాగం రెండు భిన్న సందర్భాల్లో వస్తుంది. సరిగా రెండూ పేర్కొంటే దక్కేవి 3 మార్కులు. అంతకన్నా ఘోరం పాఠ్యగ్రంథాలకు సంబంధించిన ఇతర గ్రంథ విషయా లడగటం. "మీ పాఠ్య గ్రంథాల్లోని అవాల్మీక రామాయణ విశేషాల నుగ్గడించ"మని ఒక ప్రశ్న. అలాగే వ్యాకరణ పరీక్షలో బాలప్రౌఢల్లో లేనివీ, ఉన్నా పరస్పర విరుద్ధమైనవీ, ప్రౌఢలో నిష్కారణంగా పునరుక్తమైనవీ ఏ సూత్రాలని అడిగేవాళ్ళు. కొన్ని ప్రశ్నలైతే ఆ రెంటిలోనూ మొత్తం మీద ద్రుతసంధి విషయంలోనో, కృత్ప్రత్యయాలకు సంబం ధించో చెప్పిన వ్యాకరణాంశా లేమనే ప్రశ్నలుండేవి. వైయక్తిక విషయాలేగాక సమాహారం మీద తెలుసుకోదగ్గవి గుర్తుండాలన్నమాట. "క్రీస్తు శకం 7వ శతాబ్దికి ముందు తెలుగుభాష లేదని నిరూపించ"మనే దోప్రశ్న. అప్పటినుంచీ ఉందనటానికి నిదర్శనాలు చెప్పమని కవిహృదయ మన్నమాట! కుమార సంభవంలోని మీ పాఠ్యభాగాన్ని పురస్కరించుకుని 'ఉపమా కాళిదాసస్య' అన్న అభియుక్తోక్తి సమర్థనీయతను చర్చించునది" అంటే ఏదీ గుర్తుకు రాక ఏడుస్తూ బయటకి వస్తే షడంగి మాస్టరుగారు "ఆ భాగంలో ఉన్నట్లు మల్లినాథ సూరికూడా చెప్పలేదని రాయ లేదా?" అని మరో ప్రశ్న తగిలించారు. ప్రాకృత వ్యాకరణ మనేది నామమాత్రం. చెప్పిందీ అడిగేదీ అయిదు మార్కుల వ్యవహారం. రెండేళ్ళపాటు సోమయాజి గారి ఆంధ్రభాషా వికాసాన్ని క్లాసులో ఒక విద్యార్థి చదువుతుంటే ఆయనే స్వయంగా వివరించగా వినాలి. ఇందుకు విరుద్ధం రామనరసింహంగారి బోధన. పాతనోట్సులు సంపాదించి పింగళివారు చెప్పినది నేర్చుకోమనే వారు సాహిత్యచరిత్రగా. మళ్ళీ పాతనోట్సు లున్నాయని తాను చెప్పినవి రాసుకోవటం లేదని నిందించే వాడు. ఇంతకూ ఆయన చెప్పిందేమిటో మేం రాసుకోవలసిందేమిటో ఎవరికీ తెలీదు. మా చావు మేం చచ్చాం. అంతే. మూడో ఏట ప్రత్యేక విషయం ఎంపిక చేసుకోవాలి. భాష, సాహిత్యం అనే వాటిలో ఏదో ఒకటి. భాషమీద అభిమానం చూపితే పింగళివారికి దేశ వ్యాప్తంగా ఉన్న శిష్యులందరితోనూ వైరం తప్పనిసరి. సాహిత్యం అభిమానిస్తే గంటివారి అసహ్యానికి గురికావాలి. ఇలా ఆ శాఖలోని ఉపాధ్యాయులూ, శిష్యులూ రెండుగా చీలి పరస్పరం సంఘర్షిస్తూ ఉండేవాళ్ళు.

ఆనర్సు పరీక్షల ప్రత్యేకత మరొకటుంది. ఇంటరు తరవాత మూడేళ్ళ కోర్సుగా చదివే విద్యార్థి చిట్టచివరి పరీక్ష నాడైనా తాను 'విత్ డ్రా' చేసుకుంటున్నట్లు రాసి ఇచ్చి మరుసటేడు పరీక్షకు కూర్చోవచ్చు. పూర్తిగా సన్నద్ధం కాకపోయినా, అనుకున్న క్లాసు రాదనిపించినా ఈ ఆయుధాన్ని వినియోగించవచ్చు. కానీ మొదటి డిగ్రీ చదివి పోస్ట్‌గ్రాడ్యుయేట్‌గా చేరిన వారికీ అవకాశం లేదు. లేదని తెలీక మురయా డిగ్రీ పోగొట్టుకున్నాడు విత్‌డ్రా చేసుకుని. సైన్సు విద్యార్థుల్లో విత్‌డ్రా అయిన వాళ్ళెక్కువ మంది ఉంటే ఆ ఏటి పరీక్షల్లో మౌలిక/ ప్రాథమిక ప్రశ్న లున్నాయని అర్థమట. అంటే Newton's Law of Coolingను వివరించమంటే పరీక్ష మానేవాళ్ళు. అత్యంతాధునిక విషయమడిగితే దబాయించి రాసేవా ళ్ళన్నమాట. ప్రయోగశాలలో కావలసిన ప్రాథమికోపకరణాలనూ, సల్ఫ్యూరిక్ ఆసిడ్‌వంటి ద్రావణాలనూ కావలసిన

మూలపదార్థాల పట్టికలిచ్చి సేకరించి తయారుచేసుకోవలసిందే విద్యార్థి. "1953లోనో ఆ తరవాతనో Instrumentation Dept.ను కొత్తగా పెట్టిన తరవాత విద్యార్థులకీ బెడద తప్పిందిగాని, ప్రాథమికాంశాలు – ఇంటర్లో చదివిన విషయాలు మరచిపోయి ఇబ్బందిపడ్డామని చెప్తుండేవాళ్ళు. బి.ఏ. ఆనర్సు పూర్తిచేసిన తరవాత ఒక సంవత్సరానికి జరిగే స్నాతకోత్సవంలో 25 రూపాయలు కట్టించుకొని ఎం.ఏ. డిగ్రీ ఇచ్చేవాళ్ళు. అందులో ఆనర్సులో ఫలానా క్లాసులో ప్యాసయినట్లు మాత్రం ఉండేది. అందువల్ల మాతరంవాళ్ళం ఇతరప్రాంతాల్లో ఉద్యోగార్థుల మైనప్పుడు చాలా బాధపడ్డాం, ఆ విధానాన్ని వివరించలేక. సైన్సు వాళ్ళకు మాత్రం ఎం.ఎస్సి. చదవక తప్పదు. పరిశోధన రెండు రకాలు ఆర్ట్సులో – ఎం.ఏ. ఆనర్సులో తప్ప రెండో తరగతిలో ప్యాసయిన వారికి సీటిచ్చేవారు కాదు. పిహెచ్.డి.లో సీటు కావాలంటే ఆనర్సులో మొదటి తరగతిలో ఉత్తీర్ణులై సిద్ధాంతవ్యాసం సమర్పించేలోగా ఎం.ఏ. డిగ్రీని కూడా తీసుకోవాలి. పరిశోధన డిగ్రీ తప్ప తక్కిన వాటికి డబ్బు చెల్లించి స్నాతకోత్సవానికి హాజరుకాకుండానే పోస్టు ద్వారా పొందవచ్చు. పిహెచ్.డి, డి.ఎస్సి. వంటివి ప్రత్యక్షంగా మాత్రమే స్వీకరించగల డిగ్రీలు.

ఆంధ్ర విశ్వకళాపరిషత్తు రెసిడెన్షల్ యూనివర్సిటీ కాబట్టి నూటికి తొంభయి మంది ఉపాధ్యాయులు సమీపంలోని క్వార్టర్సులో ఉండేవాళ్ళు. ఇళ్ళకు పోయి అడిగి తెలుసుకొనే అవకాశాలుండేవి. ఊళ్ళోనే ఉండేవాళ్ళు ఉపాధ్యాయుల్లో కొంతమంది. విద్యార్థులు కొందరు యూనివర్సిటీ బస్సులో వచ్చి వెళ్ళేవారు. అలా వచ్చే విద్యార్థులను డే స్కాల ర్సంటారు. వారికి స్వగృహ భోజన సౌకర్యమున్నా రాత్రులు గ్రంథాలయ సౌకర్యం ఉండేదికాదు. ఒక లాభానికి ఒక నష్టం తప్పదు. ఉపాధ్యాయ నివాసాలకు దూరంగా ఉండటం అదనపు నష్టం. విద్యార్థినులకోసం సముద్రతీరంలోని జయపూర్ మహారాజా భవనం ఆవామహల్లో వసతి కల్పించారు. అందుకో కథ చెప్పేవాళ్ళు. వైస్‌ఛాన్సలర్ ఇంటికీ విద్యార్థుల వసతి గృహాలకూ మధ్యలో ప్రత్యేకంగా వసతి గృహం కట్టించి విద్యార్థినుల నుంచటాన్ని మేం చేరకముందు ప్రిన్సిపల్‌గా ఉన్న సూరి భగవంతంగారు వ్యతిరేకించారుట. ప్రతిపాదన పంపమని కట్టమంచి వారు ఒత్తిడిచేస్తే పదవికి రాజీనామా ఇచ్చి, సాయంత్రం ఆవామహల్ ప్రాంతంలో సముద్రతీరంలో విశ్రాంతి తీసు కుంటున్న విక్రమదేవ్ వర్మగారికి ఆ విషయం చెప్పి సెలవు తీసుకుంటా నన్నారట. ఆయన వి.సి.తో అప్పటికప్పుడు మాట్లాడి రాజీనామాను ఉపసంహరింపజేసి తన మహలును మరునాడు తెల్లవారేసరికి ఖాళీచేసి వెళ్ళారుట. ఇంత రభసకు కారణం కట్టమంచి వారి శీలానికి సంబంధించిన సందేహం! రెడ్డిగారి షష్టిపూర్తి సందర్భంలో మొదట ఉద్దేశించిన ప్రదేశంలోనే విద్యార్థినులకు మధ్యాహ్న సమయాల్లో విశ్రమించటంకోసం విశ్రాంతి భవనం కట్టి దానికి షష్టిపూర్తి మహలని పేరుపెట్టారు! అది 1950కి ముందే సిద్ధమయింది. విద్యార్థినుల వసతి గృహానికి రాకపోకలు కష్టంగా ఉండేది – యూనియన్ సభ్యత్వంకోసం బతిమాలుకో పోయేవాళ్ళ క్కూడా. ఆ దారిన పోయివస్తుండే విద్యార్థులను సి.సి.లనే వాళ్ళు (Convenient cousinsకు సంక్షిప్త నామంగా).

విపరిణామమనే పేరున భారతి 1951 ఫిబ్రవరి సంచికలో నావి పదిపద్యా లచ్చయినాయి. కొండెక్కినంత సంబరం కలిగింది. సంచిక వెలువడ్డ పదిహేను రోజుల్లో అర్ధనూటపదహార్లు బహుమతిగా పంపారు. ఉక్కిరిబిక్కిరయ్యాను. అప్పటి ధోరణి ఎలా ఉండేదో మొదటి చివరి పద్యాలను చూసి పాఠకులే నిర్ణయించుకోగలరు.

**నాడు ప్రాత స్సమీర గానమ్ము నిత్య**
**నూతనమ్మగు మంగళగీతి నాకు**
**మధుమధూళీరసప్రాయ మగు నుషస్సు**
**షారబిందువు లమృతభాజనము లపుడు.**
**...............**
**తనకు రత్నాల తొడుగులు తార్చు జాతి**
**నాశమగు వేళ కిలకిల నవ్వు నేమి**
**పరభృతరుతాలలో వని? ప్రకృతియేని**
**కరుణసూపదు దీనసంఘముల మీద!**

ఈ సంఘటన ఆనందం కలిగిస్తే బ్రహ్మానందం కల్పించిన మహత్తర విషయం మరొక టుంది. ఆ ఫిబ్రవరి నెలలోనే భారతజాతి గర్వించవలసిన ఒక మహాపురుషుణ్ణి చూడటమేగాదు – ఆయన ప్రసంగం – అందులోనూ తెలుగులో చేసింది – విన్నాను. ఆయన సర్ సి.వి.రామన్. విశాఖలో పుట్టి, మిసెస్ ఏ.వి.ఎన్.కళాశాలలో ఇంటర్మీడియట్ చదివి, తండ్రితోపాటు కలకత్తా వెళ్ళి, అక్కడ బి.ఏ. చదివి, విశ్వవిద్యాలయంలో ప్రవేశం దొరక్కపోయినా నిరుత్సాహపడక స్వయం కృషితో స్వశక్తితో నిర్మించుకున్న సాధనాలతో నోబెల్ బహుమానం సంపాదించగలిగిన మహామేధావి, నాబోటివాళ్ళక్కూడా అర్థమయ్యేట్లు విశాఖ తెలుగు మాండలికంలో శాస్త్ర విషయాలు చెప్తుంటే విన్నాను. ఉత్తర కాలంలో కాళ్ళావేళ్ళా పడ్డా తెలుగులో శాస్త్ర విషయాలు రాయండంటే భీష్మీకరించుకొన్న సామాన్య శాస్త్రజ్ఞులను చూశాను. కొందరయితే వ్యాసం రాస్తే ఎన్ని డాలర్లిస్తావని అడిగారు! అణాకాణీ ప్రతిఫలం అపేక్షించకుండా శాస్త్రవిషయాల్లో అభిరుచి కలిగించేందుకు బహిరంగ సభలో తెలుగులో మాట్లాడిన ఆంధ్రేతరుడితో వీరిని పోల్చి చూసి నప్పుడు ఏ భావం కలుగుతుందో పాఠకులే నిర్ణయించాలి. ఆయన గౌరవాచార్యుడుగా వచ్చి పరిశోధకులతో చర్చించి ఏదో ఒకనాడు తెలుగులో ఇలా ప్రసంగించి వెళ్ళేవాడు. ఆవిద్యా సంవత్సరం తొలి నెలల్లో ఒక రసాయన శాస్త్రజ్ఞుడు యూనివర్సిటీ బస్సు ఆగీ ఆకముందే దూకి క్లాసులోకి పరిగెత్తుతుండేవాడు. ఆయన ఎవరంటే ఉత్తరాంధ్రలో వచ్చే సమస్త రోగాలూ తనకే ఉన్నవని చెప్పి ఆయుర్వేద వైద్యుల దగ్గర మందులు సేకరించి వాటి రసాయనిక లక్షణాలను పరీక్షించి కృత్రిమంగా మందులు తయారు చేసేందుకు ప్రాథమిక సమాచారం శాస్త్రీయంగా విశ్లేషించి చెప్పిన శేషాద్రిగారు. ఆయన ఢిల్లీ విశ్వవిద్యాలయానికి వెళ్ళి F.R.S. తెచ్చుకున్నాడని కీర్తించే వాళ్ళు. ఆ కాలంలో విశ్వకళాపరిషత్తు రాజనీతి శాస్త్ర విభాగంలో రీడరుగా చేరాడు సర్వే పల్లి రాధాకృష్ణయ్య గారి కుమారుడు గోపాల్‌గారు. ఆయనా ఆయన రష్యన్ భార్యా ఫాకల్టీ క్లబ్బులోనే నివసించే వాళ్ళు. తండ్రి అంత మహావక్త కాదుగాని కట్టమంచి వారిలా బహు

చమత్కారి. మాక్ పార్లమెంటులో ఆయనా కె.వి.గోపాలస్వామిగారూ అన్యోన్యం విసురుకొన్న చమత్కార సంభాషణలు మరచిపోవటం కష్టం.

**అసాధారణ విశేషాలు**

1951–52 విద్యాసంవత్సరంలో అసాధారణ మనిపించిన విశేషాలు రెండు మూడు కన్నా లేవు. విద్యార్థి సంఘం ఆహ్వానం మేరకు వచ్చి ప్రసంగించిన జె.బి.కృపలానీ ఆకట్టుకున్నాడు. ఆహార మంత్రిగా ఉన్న కె.ఎం.మున్షీగారిని విందు కాహ్వానించాం హాస్టలు విద్యార్థులం. ఆయనగాని ఆయన వెంట వచ్చిన ఆచార్య రంగాగారుగాని అందుకంగీకరించలేదు. రేషనింగ్ కష్టాలు చెప్పుకుంటామని వారికి తెలుసు. తామేమీ చేయలేమని కూడా వారికి తెలుసు. ముఖం తప్పించినందుకు 'క్షామశాఖా మంత్రి నశించాలి' అని కాస్సేపు అరిచి సరిపుచ్చుకున్నాం. ఆంధ్ర సాంస్కృతిక వారోత్సవాల్లో మొదటిసారిగా ద్వారం వేంకటస్వామి నాయుడు గారి ఫిడేలు విని పరవశించాం. పరీక్షల తొందరలేదు కాబట్టి వందల పేజీల నోట్సు ఎత్తి రాసుకున్నాను. పనిలో పనిగా పాత ప్రశ్న పత్రాలను రాసుకొని, కొత్తగా తట్టిన ప్రశ్నలు వేసుకొని, వాటికి క్లుప్తంగా సమాధానాలను అంశాలవారీగా రాసుకున్నాను. అవి వందల విడి కాగితాల్లో ఉండగా తరవాత చేరిన వారికిచ్చి నాలుగైదు బ్యాచీల వారికి ఉపయోగపడ్డవని తరవాత తెలుసుకున్నా. తరిమెల నాగిరెడ్డిగారి మహోపన్యాసం జరుగుతుండగా రశీదు పుస్తకాలమీద సంతకాలు పెట్టించి (మధ్యలో మాబాధ పడలేక విసుక్కుంటూ ఎక్కడ ఎందుకు సంతకం పెట్టారో గమనించని వాళ్ళూ ఉన్నారు) ఎస్.ఎఫ్. సభ్యత్వం అంటగట్టాం. అంతటి మహావక్తను రాజకీయవాదుల్లో అప్పటికీ ఇప్పటికీ మరొకర్ని వినలేదు. ప్రసంగంలో హాస్యం జల్లుకురిసేది. ఇవన్నీ ఒక ఎత్తు. మార్చి నెలలో డిపార్టుమెంటల్ పరీక్షలవుతుండగానే ఎస్.గోపాల్ గారి నాయకత్వంలో ఇరవై మందిమి ఢిల్లీ వెళ్ళాం – మొదటి పార్లమెంటును దర్శించటానికి. అదో ఎత్తు.

సభాధ్యక్షులు మవ్లంకర్ మహాశయులు. గ్యాలరీలో కూర్చొని పత్రికల్లో చూసిన బొమ్మలు ఆధారంగా నెహ్రూ, పటేల్ వంటి అధికార పక్షం వారినేగాక ఎస్.ఎ. డాంగే, శ్యాంప్రసాద్ ముఖర్జీ, హీరేన్ ఛటర్జీ, అశోక్ మెహతా, రాం మనోహర్ లోహియా వంటి మహావక్తల ప్రసంగాలు గంటసేపు విన్నాం గాని – వెక్కిరించకండి – నా బతుక్కు మూడు వంతులు పైగా వారి ప్రసంగాల భావం కూడా అర్థంకాలేదు. అమ్మతోడు.

ఆ వాతావరణం అర్థంకాబోతుండగా ఒక చిత్రం జరిగింది. సభాపతి మవ్లంకర్ అనుమతి మీద నెనెప్పుడో చిన్నప్పుడు ఉపవాచకంలోనో, సైన్స్ పుస్తకంలోనో బొమ్మ చూసిన వ్యక్తి ఒకరు లేచి 'ఒక చిన్న కోరిక' అని మొదలుపెట్టి "భారత ప్రభుత్వం వారు నా సంస్థకు కాక మరే ఇతర పరిశోధన సంస్థకు గాని విశ్వవిద్యాలయానికి గాని ఒక్క నాలుగు కోట్ల రూపాయలు విరాళమిస్తే నేను ప్రతిఫల నిరపేక్షంగా శక్తి వంచనలేకుండా సాయపడి మన దేశాన్ని అణుశక్తి రంగంలో అభివృద్ధి చేస్తాను. ఆ సొమ్ము సైక్లోట్రాన్ కొనటానికేగాని దాని నిర్వహణక్కూడా కా" దన్నాడు. ముక్తసరిగా నాలుగు మాటలు చెప్పి ఆ కూర్చున్న వ్యక్తి మేఘనాథ్ సాహా అని తోటి వాళ్ళు చెప్పారు. నెహ్రూగారు వీరావేశంతో లేచి "అహింసా మార్గంలో స్వాతంత్ర్యం సంపాదించిన మన



ప్రభుత్వం ఇలాంటి పిచ్చి/తలతిక్క ధోరణిని హర్షించ" దన్నాడు. ఆయన foolish అనే పదం వాడాడు. ఎవరూ ఏమీ కల్పించుకోలేదు. నిశ్శబ్దంలో తరవాతి అంశాన్ని సభాపతి ప్రకటించాడు. నెహ్రూగారు ఐక్యరాజ్య సమితి ప్రధాన కార్యదర్శి నుంచి వచ్చిన ఉత్తరంలోని ఒక వాక్యం చదివి ప్రపంచ పంచాంగ రచనకు మన దేశం తరఫున సారథ్యం వహించేందుకు మేఘనాథ్ సాహా వంటి శాస్త్రవేత్తను పంపమని కోరారని చెప్పాడు. తాను సంతోషంగా బలపరుస్తూ సాహాగారి అంగీకారం కోరుతున్నా నన్నాడు. సభాపతిగారు నవ్వి 'ఇంతకూ గౌరవ సభ్యుడెక్కడ?' అంటే విస్తుపోయాం. ఆయన సభలో లేడు. ఎప్పుడు బయటికి వెళ్ళాడో మేం గమనించలేదు. నెహ్రూ గారు అరగంటలో ఆయన్ను తోడుకొని వస్తాననీ, ఇతర కార్యక్రమాలు జరగనిండని తానూ బయటకు వెళ్ళాడు. కొంత సేపటికి ఉభయులూ సభాప్రవేశం చేశారు. నెహ్రూగారు తమ అభ్యర్థనను మరోసారి చెప్పారు. సాహాగారు "ఇంత మహత్తరమైన దేశానికి ఒక మూర్ఖుడు (బహుశా fool అన్నాడనుకొంటా నింగ్లీషులో) ప్రతినిధిగా ఉండటం తగ"దని కూర్చున్నాడు. నెహ్రూగారు పూర్వంకన్నా ఎక్కువ వీరావేశంతో లేచి "నేను సాహా గారిని fool అనలేదు. ఆయన ప్రతిపాదన foolish అన్నాను. అలా అనటం May's Paliamentary Practice ప్రకారం తప్పుకాదు. ఒక వేళ ఆవేశంతో నా వంటి greater fool నిందిస్తే మటుకు సాహాగారు లక్ష్య పెట్టడం అన్యాయం కాదా?" అన్నాడు. నిర్ఘాంతపోయాం. మవ్లంకర్‌గారు నవ్వి "సాహాగారూ! ఇది సభాపతి అభ్యర్థన" అనగానే లేచి తలవంచి "శిరసావహిస్తా" నని కూర్చున్నాడు. ఇటువంటి దృశ్యం మన పార్లమెంటరీ చరిత్రలో పునరావృతం అవుతుందా? మనకు అంత భాగ్యమా అంటారా?

తెలుగానర్స్ మేలు చేసిందో కీడు చేసిందో చెప్పలేను. పరీక్షల్లేని సంవత్సరం కదా అని చదువు రంధిలో పడ్డందువల్ల కవిత్వం పిచ్చి కొంత తగ్గింది. ప్రాచీన సాహిత్యం చదివి అర్థం చేసుకొనే ప్రయత్నంలో నా రచనాశక్తిని పూర్వుల కవితాశక్తితో పోల్చుకొని సిగ్గుపడటం మొదలయింది. 'సత్తాసై' చదువుతుంటే నా అజ్ఞానం, అశక్తత క్షణక్షణం గుర్తుకు వస్తుండేవి. వీరారాధనలో పడ్డాను కొంతకాలం. కాలేజీ మేగజైన్లో, 'సుభాషిణి'లో ప్రశస్తి పద్యాలు ప్రచురించాను – అందులోని మాటలనూ, భావాలనూ ఆలంబనంగా తీసుకొని. మచ్చుకు 1951 సెప్టెంబరులో ఆ పత్రికలో ప్రచురించిన పద్యాల్లో ఒకటి (శీర్షిక హాలుడు):

**కావేరీనికురుంబ నర్తనకళా కౌశల్యముల్ గాయనీ**
**ప్రావీణ్యమ్ములు రాజదృష్టికి సహింపన్ రానివై, నచ్చెనా**
**రేవాశైవలినీ తరంగనటనారీతిన్ విడంబించు నా**
**ప్రావృట్కాల మయూర నాట్యములలో పల్లీ జనానందముల్?**

నన్ను నేనెంత అదుపులో పెట్టుకుందా మనుకొన్నా బాల్యంలో పట్టుబడ్డ అలవాట్లు ఒక పట్టాన మార్చుకోలేకపోయాను. ఎప్పుడో తిక్కతిరిగి కృష్ణా పత్రికలో కూడా నాలుగు పద్యాలు పడితే జన్మ తరిస్తుందనీ, ఆ తరవాత క్రమంగా ఈ ధోరణి తగ్గించుకోవచ్చనీ భావించాను. ఈ కోరిక కూడా నెరవేరింది. ఆ వారపత్రికలో 1951 నవంబరు 17న పది పద్యాలు ప్రచురించి

నూటపదార్లు బహూకరించారు కాటూరి వేంకటేశ్వరరావు గారు. ఆయన నచ్చినవన్న పద్యాలు రెండివి (శీర్షిక 'తాటస్థ్యము'):

**తుంగతరంగ సంచయముతో పృషతమ్ము జనించి, వీచికల్**
**పొంగి సమీపభూమిఁ బరిపూతముసేయునెడన్ – విభిన్నదే**
**శాంగసమాన చిత్రముల చందమునన్ గనుపించి, వెంటనే**
**భంగము నొందుచో – జగదభావభయమ్మునఁ గంప మొందితిన్.**
**భావపథమ్ములో కలకుపాటు పొసంగుట చేతనో, తుషా**
**రావృత పర్వతాంతికమునందు వసించుటనో, తరంగ గ**
**ర్జావిశదీకృతాఖిల ధరాపరిదేవనమున్ గ్రహించియే**
**మో, వివశమ్ము కంపిత మహోనినదాస్పద మయ్యె బుద్ధియున్.**

ఎవరిదో ఆంగ్లకవిత్వం చదవగా వచ్చిన ఆవేశం, అనువాదానుకరణతపనా కొన్ని పద్యాలు రాయించగా 'నిశీథ'మనే శీర్షికతో సుభాషిణిలో ప్రచురించాను. అందులోని పద్య మొకటి:

**పవవెల్లన్ పనిచేసి చేసిన శ్రమాంభస్స్నానమే ఉద్ధత**
**వ్యవసాయవ్యసనమ్ము మార్జనముసేయన్, గాఢగంభీర నీ**
**రవ నీరంధ్ర తమస్తిరస్కరిణి చేరందీసి నిద్రామృత**
**ద్రవమత్తుండను కప్పిపుచ్చెదను రక్తస్పందనారావమున్!**

ఈ కవివేషంతో వేసవి సెలవులకు వేటపాలెం చేరుకున్నా. అప్పుడక్కడ చాలా హడావిడి జరుగుతున్నది. స్వామీ శివశంకరస్వామి షష్టిపూర్తి నిర్వర్తించి ఆయన కవితా రచనలను రెండు సంపుటాలుగా ప్రచురించేందుకు సారస్వత నికేతనం తరఫున కార్యదర్శి అడుసుమల్లి శ్రీనివాస రావుగారు బాధ్యత తీసుకున్నారు. ఆయనచేత పీఠికలు రాయించుకున్న వారందరినీ తప్పక ఆహ్వానించమని అడక్కుండానే సలహా ఇచ్చాడు మాచిరాజు దేవీప్రసాద్. మూడు రోజులపాటు సాయంత్రం 5 గంటలనుంచి సభలు జరిగాయి. నోరి నరసింహశాస్త్రి, పిలకా గణపతిశాస్త్రి, జంధ్యాల పాపయ్య శాస్త్రి, దేవులపల్లి కృష్ణశాస్త్రి, ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ, గిడుగు సీతాపతి, గుర్రం జాషువా ప్రభృతు లెందరో ప్రసంగించారు తమ తమ కావ్యాల గురించి. చిట్టచివరి రోజున చిట్టచివరి వక్త దేవులపల్లి – ఆయనప్పుడు 'మల్లీశ్వరి ఫేం'లో ఉన్నాడు. అదనపు ఆకర్షణ అది. రెండు గంటలపాటు అనర్గళంగా ఉపన్యసించి గురుదేవులు రవీంద్రనాథ్ ఠాకూర్, రఘు పతి వేంకటరత్నం నాయుడుగార్లను ప్రశంసించి కన్నీరుపెట్టుకొని, అక్కిరాజు ఉమాకాంత పండితుణ్ణీ కురుగంటి సీతారామ భట్టాచార్యుల వారినీ దూషించి, పురజనుల కోరికమీద మల్లీశ్వరిలో తాను రాసిన పాటలు పాడి కూర్చుంటుండగా "స్వామివారిని గురించి తమరైనా నాలుగు మాటలు చెప్తే బాగుంటుం"దని చీటీ పంపాను. చీటీని చదివి "ఈ సమారోహ సంరంభం చూసి నా షష్టిపూర్తి సభ అని పొరబడ్డాను. మా అన్నగారిదని తెలిసింది. ఆయన రచనలు రెండు సంపుటాలుగా వెలువరించారు. సంతోషం. అందులో రెండోది మరీ గొప్పది. అందులోని బిల్హణకవి శ్లోకాలు అద్భుతా"లన్నాడే గాని అంతకన్నా ఏమీ చెప్పలేదు. ఆపాటిగూడా



ఇతరులు ప్రస్తావించలేదు! ఎందుకో!

సభలు జరుగుతుండగా నాకో ఉత్తరం వచ్చింది. నవ్వాలో, ఏడవాలో అర్థంగాని విషయ మది. భద్రిరాజు కృష్ణమూర్తి గారు నాకో వివాహ సంబంధం ఏర్పాటుచేసి అడుసుమల్లి వారు వచ్చి మీ పెద్దల దగ్గర ప్రస్తావిస్తారని, ఆ పెళ్ళి చేసుకుంటే నాకు మంచి భవిష్యత్తుంటుందనీ విడిగా దొరకని ఆంధ్ర భాషా వికాసం తానిచ్చి ఆదుకుంటాననీ రాశారు! శ్రీనివాసరావు గారు మా ఇంటికి వచ్చి ఈ ప్రస్తావన తేవటం, మా మాతామహి అప్పుడు తీవ్ర అనారోగ్యంలో ఉండి జీవన్మరణ సమస్యలో ఉన్నాం కాబట్టి ఇది సమయం కాదనటం, వెంటనే మా పక్కింట్లో కాపుర ముంటున్న హైస్కూలు టీచరును రెండో సంబంధం భార్యగా స్వీకరించమని అభ్యర్థించటం, ఆయన కాదనటం వెంటవెంటనే జరిగాయి. ఆ తరవాత కొద్ది రోజులకే పెళ్ళి కూతురు ఆత్మహత్య చేసుకుందని విన్నాం. బాధపడ్డాం. కారణం తెలియదు. నాకు ఆంధ్ర భాషా వికాసం దొరకదని మాత్రం తేలిపోయింది! వేసవి సెలవులు ముగుస్తుండగా మా అమ్మమ్మ గారు కన్నుమూశారు. కుటుంబ స్థితిని బట్టి చదువును కొనసాగించగలనో లేదో చెప్పలేనని, పది పదిహేను రోజు లాలస్యంగా వస్తే రాగలనేమోనని గంటి జోగి సోమయాజులు గారికి రాశాను. అప్పటి విషాదయోగంలో రాసుకొని భద్రపరచిన అనేక పద్యాల్లో దొకటి ఇది (ఏకంగా ఒక మహాకావ్యమే రాసి అంకితమిద్దా మనుకున్నాను. నా ఆంధ్రత్వం అలా జరగనీలేదు).

**కాల విపర్యయమ్మున నకాండ దయాధుని యింకఁబాఱుటన్**
**పేలవ తత్సమాధిపయిఁ బెట్టుదు శబ్దమధూకమాలికా**
**జాలకమేని తన్మరణ సంభవదశ్రు జలప్రవాహసం**
**క్షాలన మాచరించి బహుశ శ్శుచిమంతములైన మీఁదటన్.**

చదువు మానరాదనే నిర్ణయం జరిగింది. వాల్తేరు చేరగానే మొదట అబ్బూరి రామకృష్ణా రావు గారిని కలిశాను. మా తాతగారు చెప్పారు, "ఆయన సలహా ప్రకారం నడుచుకుంటే బాగు పడతావు. ఆయన లాభనష్టా లాయనవి" అని! అదేమంటే 1911లో ఏలూరిలోని (జమీందార్) మోతే నారాయణరావు గారినీ, మాపినతాత శేషతల్ప శాయిగారినీ ప్రోత్సహించి మనం ముగ్గురం మొదట కొలంబోచేరి అక్కడినుంచి ఇళ్ళకు కేబుల్స్ పంపి, డబ్బు పంపకపోతే సము ద్రంలో దూకి చస్తామని బెదిరించి కార్యసాధన చేసుకుందామని చెప్పారట అబ్బూరి వారు. అన్ని ఏర్పాట్లూ రహస్యంగా జరిగాయిట సక్రమంగా. కానీ దిక్కుమాలిన సిజర్ సిగరెట్లు కొనుక్కొన బోయిన అబ్బూరి వారిని బెజవాడ ప్లాట్‌ఫారం మీదనే ఆయన మేనమామ బంధించి తీసుక పోయి పెళ్ళి చేశాట్ట నిర్బంధంగా. మోతేవారు జమీందారీ దర్జా వెలిగించటం సాధ్యపడక డబ్లిన్నుంచి తిరిగి వచ్చారుట గాని మా పినతాతగారు బారట్లా అయి తిరిగివచ్చి టంగుటూరి ప్రకాశంగారి దగ్గర రెండేళ్ళపాటు జూనియర్గా పనిచేసి, బాపట్లలో పది పదకొండేళ్ళుండి దొరల పొగాక్కంపెనీకి న్యాయసలహాదార్లై దరిమిలా గుంటూరు చేరార్ట. అప్పటినుంచీ ఆయన దశ తిరిగిందనీ, వకార పంచకానికి అది కొత్తేమీకాదని, కొండా వెంకటప్పయ్యగా రంతటివాడు బందరులో పైసా ప్రాక్టీసు లేకుండా ఉండి గుంటూరుకు వచ్చి బాగా సంపాదించారనీ, పెద్ద

నాయకుడై గాంధీజీకి ఇష్టుడైనాడనీ మా తాతగారి కథనం.

అబ్బూరి వారి సలహా రెండు విషయాల్లో కావలసి వచ్చింది. మొదట ఫైనల్ ఇయర్లో ఎంపిక చేసుకోవలసిన అభిమాన విషయం సంగతి. సాహిత్యంతో ఎంతో కొంత పరిచయ ముంది కాబట్టి భాష నభిమానించమన్నారు. "భాషను ప్రత్యేక విషయంగా తీసుకొనే వాళ్ళ సంఖ్య తక్కువ కాబట్టి పోటీ తక్కువ. కొంత శ్రమపడి స్థాయి పెంచుకోవచ్చు. ఇది మరొక విధంగా నీకవితాకండూతిని తగ్గించటానికి ఉపయోగపడుతుంది. ఇతర విషయాల్లో (రాజకీయాల్తోసహా) ఆధునికత్వాన్ని అభిలషించేటప్పుడు పద్యకవిత్వాన్ని పట్టుకొని పాకులాడటం అసందర్భం. అలవాటు తప్పాలంటే వచన కవిత్వం వైపు దృష్టి సారించు. ప్రయత్నిస్తే నెరవేరనిదంటూ ఉండ"దని, తరవాత్తరవాత క్షుద్రవిషయాలకు గ్రాంథికం వాడి గొప్పవాటికి వాడుకభాష వాడాలనే నిర్ణయాని కాయన దోహదం చేశారు. పద్యధోరణి తగ్గించుకోటానికి వెకిలిరాతలైనా మంచిదేనని ఆయన ఉద్బోధ. హాస్టలు మేగజైన్లో లిమరిక్కులు రాశాను ప్రయోగాత్మకంగా. అందులో ఒకటి:

**కళ్ళజోడు కొంటేనే పోజుపోజు అంటారని**
**కంటిజబ్బు పెంచాడొక ఘనుడు మెచ్చుకుంటారని!**
**మంద్రగబ్బ మశకమంత**
**కనిపించటమేమి వింత?**
**తన తలయే కనిపించదు! చెపుతున్నా వింటారని.**

ఇది తనను గురించే రాసిందని ఒక సహాధ్యాయుడు చంపేస్తానన్నాడు అన్నాడుగాని అంత పని చేయగలడా? మా ఫైనల్ ఇయర్ అనేక విధాల ప్రాముఖ్యం గలది. అది ఆంధ్ర విశ్వకళా పరిషత్తు రజతోత్సవ సంవత్సరం. ఆయేడు తెలుగుభాషా సమితి అధ్యక్షత లభించింది కాబట్టి నా పూర్వ ప్రతిజ్ఞ నెరవేర్చుకోవలసిన సందర్భం వచ్చిపడింది. ఆయేడు పొట్టి శ్రీరాములు ఆత్మార్పణ జరిగింది. ఆంధ్ర ప్రాంతం అల్లకల్లోలమైంది. అఖిలభారత విద్యార్థి ఫెడరేషన్ కార్యవర్గ సభ్యుణ్ణయినాను. అది స్టాలిన్ అస్తమించిన సంవత్సరం కూడా. విద్యార్థులం మాన్యుస్క్రిప్ట్ మేగజైన్ నిర్వహించి గ్రంథాలయంలో భద్రపరచగలిగాం. భద్రిరాజు కృష్ణమూర్తి గారు మొదటిసారిగా పరీక్షకులై భయపెట్టారు. వాల్తేరు వదిలేముందు రాయప్రోలు సుబ్బారావుగారి షష్టిపూర్తి సభలకు హాజరయ్యాను. విశ్వనాథ సత్యనారాయణగారితో ఘర్షణ జరిగింది అంతకు ముందే. స్థూలంగా సంక్షిప్తంగానైనా ఈ విషయాలను విశదీకరించవలసి ఉంటుందేమో!

### గొడవలే గొడవలు

హాస్టల్ తెరిచిన నెల రోజుల్లోగా విద్యార్థి ప్రతినిధులు టెండర్లు పరిశీలించాలనే అభ్యర్థన ఆమోదం పొందింది. అనేక అవినీతి చర్యలు లెక్కకు వచ్చాయి. విద్యార్థి పర్యవేక్షకులను కొందరినీ, వార్డన్నూ తక్షణం తొలగిస్తున్నట్లు వైస్ ఛాన్సలర్ కృష్ణాగారు ఆరుబయట విందులోనే ప్రకటించారు. ఫలితంగా న్యాయశాఖాచార్యుడైన ఎస్.వెంకట్రామన్ వార్డనైనాడు. (ఆయనే పొట్టి శ్రీరాములు గారి ఆంధ్ర రాష్ట్రోద్యమ సందర్భంగా ఊరేగింపులు లేవదీసిన విద్యార్థి నాయకులను



వసతి గృహం నుంచి బహిష్కరించాలని ప్రతిపాదించి విఫలుడైనాడు. అప్పట్లో జిల్లా కలెక్టరూ పోలీసు సూపరింటెండెంటూ పదవుల్లో మరిద్దరు వెంకట్రామన్లుండేవాళ్ళు మా శత్రువర్గంలో). తెలుగు భాషా సమితి అధ్యక్షుణ్ణయినాను సోమయాజిగారి పుణ్యమా అని. ఇది కూడా విద్యార్థులందరికీ (తెలుగువాళ్ళు కాకపోయినా సరే) సంబంధించిన సంఘం కాబట్టి బహిరంగ సభలు నిర్వహించవలసిందేనని పట్టుబట్టాను. విశ్వవిద్యాలయ కళాశాలల ప్రిన్సిపల్ కె.రంగ ధామరావుగారు కూడా ఇందుకు ఆమోదం తెలిపారు. విశాఖ వచ్చిన విద్వాంసులచేత బహిరంగ సభలు నిర్వహించాం – న్యాయ కళాశాలకు సంబంధించిన హాల్లో. అది ఆచార్యుల వారికోపానికి కారణమైంది. ఆంధ్ర సాంస్కృతిక వారోత్సవాల సందర్భంగా తెలుగుభాషా సమితి ఎర్స్కిన్ స్క్వేరులో బహిరంగ సభ జరపాలని నిర్ణయించాం. సభాధ్యక్షులుగా భూతపూర్వ కళాశాలాధిపతి విస్సా అప్పారావుగారిని, శాస్త్రవిజ్ఞాన సంబంధి ప్రసంగం చేయమని వసంతరావు వేంకటరావు గారిని, ఆంధ్రచరిత్ర నుపన్యసించటానికి రాళ్ళభండి సుబ్బారావు గారిని, కావ్యగానం చేయమని వేదుల సత్యనారాయణ శాస్త్రిగారిని పిలిచాం. మైకు ఇతరమైన ఏర్పాట్లు వైస్ ప్రిన్సిపల్ దాసా రావుగారి అధీనంలో ఉండేవి. ఇది జనరల్ యూనియన్ కాదు కాబట్టి అంగీకరించనన్నాడు. అప్పుడు గంటివారి సలహాతో ప్రిన్సిపల్ రంగధామరావు గారిని దర్శించి "నన్ను డీబార్ చేయండి! అప్పుడుగాని 'వెధవ తెలుగువాళ్ళు – వెధవ సభలు' అన్నందుకు ప్రతీకారం చేయటం వీలుపడ" దనీ "విద్యార్థిగా ఉండి అలాచేస్తే క్రమశిక్షణకు భంగం కలిగించిన పాప మంటుకుంటుం"దని హంగామా చేశాను. లిఖిత పూర్వకంగా అన్ని ఏర్పాట్లూ చేయాలనే ఆజ్ఞపొంది దాసా రావుగారి కిచ్చాను. సభ మొదలుకాగానే తెలుగువారికి తెలుగు విశ్వకళా పరిషత్తులో జరిగిన అవమానానికి చింతిస్తూ అందరం నిలబడి ఒక నిమిషంపాటు మౌనం పాటించాం. ఆ సంవత్సరారంభంలోనే తెలుగుభాషా సమితి నాయకత్వం వహించి స్టూడెంట్స్ ఫెడరేషన్ రాష్ట్ర కార్యదర్శి ఎన్.ఆర్. దాసరికి విధించిన పర్మనెంట్ డిబారేషన్ రద్దు చేయించాం అలజడి చేసి వి.సి. గారిచేత. ఆ యేడు తొలిరోజుల్లోనే ఏటా హాస్టల్లో జరిగే తిండి పోటీలో నెగ్గిన సూరి (భగవంతం గారి కుమారుడు) బాలకృష్ణకు ముగ్గురతిథు లున్నారని రాసినపూట పూర్తి భోజనం పెట్టాలనే అనుమతి సంపాదించి అతడికి నలభై ఇడ్లీలు ఏక సమయంలో వండగల ఇత్తడి కుక్కర్ను కొని బహూకరింపజేశాం. ఇలా చిన్నా పెద్దా విషయాల్లో కల్పించుకోవటం, రాజకీయాల్లో పాల్గొనటంతో స్టూడెంట్స్ యూనియన్ వాళ్ళు మా సంఘాన్ని రద్దు చేయాలని బహిరంగ విజ్ఞాపన చేస్తే ప్రిన్సిపల్, వీ.సీ.లు నిరాకరిం చారు. అప్పటికే ఆంధ్ర రాష్ట్రోద్యమం తీవ్రస్థాయికి చేరుకుంటున్నది. ఆ సమయంలో తెలుగు సమితిని రద్దుచేయటం – అందులోనూ రజతోత్సవ సంవత్సరంలో రద్దుచేయటం – ఎవరూ చేయగలపనికాదు.

మా విపరీత భాషాభిమానం ఎవరినీ తెలుగులో తప్ప మాటాడనీలేదు. అన్యభాషా పదం పలికితేచాలు – తెలుగు తెలుగని గోలపెట్టేవాళ్ళం. రజతోత్సవ సందర్భంగా మేమూ కొంత చేసినట్లు తరవాతి బ్యాచీల వాళ్ళకు తెలియాలని నాలుగైదు వందల పేజీల లిఖిత పత్రికను తయారుచేశాం. పేజీ పేజీకి రంగదాసనే జంతుశాస్త్ర విద్యార్థి రకరకాల డిజైన్లు వేశాడు నాలుగు

వైపులా. దానికి 'నవోదయ' అని పేరుబెట్టి అభ్యర్థించగా దాన్ని విశ్వకళా పరిషద్గ్రంథాలయంలో భద్రపరచటానికి అనుమతించారు. అప్పటి విద్యార్థి రచయితలూ, చిత్రకారులూ అందరూ పోటీపడి దాని తయారీలో తోడ్పడ్డారు. ఆంధ్రోద్యమ ప్రచారంకోసం ఊళ్ళోకి ఊరేగింపులు తీశాంగాని చాలా కాలం సరైన ప్రోత్సాహమే లభించలేదు – ప్రజలనుంచి. అనకాపల్లి ఎం.ఎల్.ఏ. కోడుగంటి గోవిందరావు వంటివారిని హాస్టల్‌కు ఆహ్వానించి ప్రసంగించే ఏర్పాటుచేశాం. పెద్ద కదలిక రాలేదు. రజతోత్సవ సందర్భాన్ని పురస్కరించుకొని అప్పటి పరిశోధకవిద్యార్థి జయంతి ధర్మతేజ ఫ్యాకల్టీ క్లబ్బులోని టేబిల్ టెన్నిస్ బల్లమీద రకరకాల అడ్డంకులను తప్పించుకుంటూ తాను ఊళ్ళోని చెంగల్రావు పేటనుంచి రిమోట్ కంట్రోల్‌ద్వారా బొమ్మ కారును నడిపి సెబా సనిపించుకున్నాడు. రాఘవరావు వంటి భౌతికశాస్త్ర విద్యార్థులు భోషాణమంత రేడియోను తయారుచేసి ప్రపంచంలోని చిన్నా పెద్దా రేడియో స్టేషన్లలో చాలా వాటిని వినగల, వినిపించగల శక్తి సమకూర్చారు. ఎవరైనా వచ్చి దాని శక్తిని పరీక్షించుకోవచ్చన్నారు. ఆ మరునాడు మేం మధ్యాహ్న భోజనాల తరవాత ఊరేగింపుగా వెళ్ళి కలెక్టరు కార్యాలయాన్ని ముట్టడించాలని నిర్ణయించుకున్నాం. గుంపులు గుంపులుగా పాలిటిక్సు చెట్టు దగ్గరకు చేరుతున్న సమయంలో ఆ రేడియోను పరీక్షిస్తున్న మాకు కొన్ని వింత సందేశాలు వినిపించాయి. అప్పటికి పొట్టి శ్రీరాములు గారి ఆత్మార్పణ జరిగి ఇరవై నాలుగ్గంటలైనా అయిందో లేదో. "నెల్లూరు నెల్లూరు – నాలుగు బులెట్లు .. విశాఖకు ప్రత్యేక విమానంలో 3 గంటల ప్రాంతంలో మలబార్ స్పెషల్ పోలీసు బృందం వస్తుంది.... అది బయలుదేరింది" వగయిరా వర్తమానాలు విన్నాం. వెంటనే బాష్పవాయు ప్రయోగమైనా కనీసం జరగవచ్చనే అనుమానం పుట్టి హాస్టల్లోని మైకుద్వారా హెచ్చరిక చెప్పాను. తక్షణం మెస్సులకు పోయి చేతిగుడ్డలూ, న్యాప్‌కిన్లూ తడిపి ఉల్లిపాయలు తరిగించి మూటకట్టుకోమని, బాష్పవాయు ప్రయోగాన్ని ఈ ఏర్పాటు తట్టుకోనిస్తుందని పదేపదే హెచ్చరించాను. పరుగులమీద కలెక్టరేట్ చేరాం, మలబార్ పోలీసులు వచ్చేలోగా ఘర్షణపడదామని. స్థానిక పోలీసులు అడ్డు నిలిచారు తుపాకులతో సహా. ఆ యేడే ఆంధ్ర విశ్వకళా పరిషత్తులో ఎన్.సి.సి. శిక్షణ ఆరంభమైంది. నా రూంమేట్ గుత్తికొండ శ్రీరాములు పోలీసులను చూసి భయపడనక్కరలేదనీ ఒక్క ఊపున ముందుకు దూకి వాళ్ళ చేతులను పైకెత్తేస్తే కాల్చిన తూటాలు గాలిలో పేల్తాయనీ, సాటి తోటి ఎన్.సి.సీ. విద్యార్థులను గొంతు చించుకుంటూ ప్రబోధించాడు. పోలీసులు కలెక్టరేట్ లోపలికి పారిపోయారు. మేం విజయం సాధించామని విర్రవీగుతుండగా ఒక్క ఉదుటన వచ్చిపడి లాఠీఛార్జీ చేశారు, 'పొడుగాటి వాణ్ణి వదలకండి' అని అరుస్తూ. అప్పటికే మా వాడు తప్పుకున్నాడుగాని కనిపించిన వాళ్ళలో పొడుగాటి వాడైన సుంకం ఆళ్వార్‌దాసును చావచితగ్గొట్టారు. (ఆయన ఏడో దశకంలో ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖకు ఉపమంత్రి అయినాడు. తెలుగు అకాడమిని చూడవచ్చి నన్ను గుర్తుపట్టి నీ రూంమేటు ఏమైనాడని అడిగాడు!). చెల్లాచెదరైపోతున్న మాలో కొందరు ఎదురుగా ఉన్న కె.జి. ఆసుపత్రి గోడలెక్కి తెలుగువాళ్ళకు పుట్టినవాళ్ళు మాతోబాటు రండని అరిచారు. దానితో రెచ్చిపోయిన జనం వెంటపడ్డారు. ఈ పరుగులు వాల్తేరు రైల్వేస్టేషన్ దాపులకు చేరేసరికి ముప్పై నలభై వేల మందిని జతగూర్చింది. తుపాకి కాల్పులు జరిగాయి. అప్పుడు జనం మధ్యలో ఉన్న తల్లాప్రగడ సత్యనారాయణమూర్తి అనే అప్పటి ఆంధ్ర రాష్ట్ర స్టూడెంట్స్ ఫెడరేషన్ అధ్యక్షుడు ఒక మొండిగోడ మీదికెక్కి వార్తాపత్రికతో గొట్టాం చేసి "మృతవీరులకు శ్రద్ధాంజలి ఘటించిగాని ముందుకు పోవ"ద్దని కేకలు పెట్టి ఊళ్ళోకి పరిగెత్తటం మొదలుపెట్టాడు – గోడదూకి. జనం వెంటపడ్డారు. అతడు సముద్రతీరం వైపు పోతుంటే వెంటపడ్డ జనంలో కొందరు తమిళుల దుకాణాలను దోచుకునే ప్రయత్నం చేశారు. మనం రాజాజీని, వెంకట్రామన్లను చంపాలిగాని పొట్టకూటికి వచ్చిన ఈ సన్నాసులను కాదని అడ్డు నిలిచాను. నా గొంతు పిసికా రెవరో. స్పృహ వచ్చేసరికి నేను భద్రమూర్తి శర్మ ఒడిలో ఉన్నాను. రేవు కార్మికనేత జనసందోహాగ్రహం నుంచి నన్ను రక్షించా డన్నమాట. మరునాడు తెలిసింది నలుగురు మరణించారనీ, వారిలో రైల్వే క్వార్టర్సులో అరుగుమీద కూర్చొని కూతురుకు జడ అల్లుతున్న తల్లీ, ఆమె కూతురూ ఉన్నారని. రోజూ ఆంధ్రరాష్ట్ర మివ్వవద్దని ప్రధానికి ఉత్తరాలు రాస్తుండే వీరరాయలసీమాభిమాని జె.కాంతారావనే కామర్సు విద్యార్థి తట్టాబుట్టా కట్టుకొని రైల్లో స్వగ్రామం వెళ్దామని బయలుదేరి స్టేషన్ దగ్గరి జనసముద్రంలో చిక్కుకుపోయాడు. అతగాడు అకస్మాత్తుగా మారిపోయి "నన్ను కాల్చండి" అని అరుస్తూ పోలీసులవైపు పరుగులు తీస్తూ కిందపడిపోయాడు. ఆ తరవాత ఏణ్ణర్థానికి అతడే చీరాల కళాశాలలో సహాధ్యాపకుడుగా తటస్థపడ్డాడు. ఉద్యమాలూ అవి నడిచేతీరూ పర్యవసించే విధానాలూ ఒక పట్టాన అర్థం కావని తెలిసింది.

ఇది జరిగిన మరునాడే పోలీసుల దృష్టిలో పడ్డామని అనుమానమున్న వాళ్ళెవరూ విశ్వవిద్యాలయం ఆవరణ దాటిపోవద్దని వీ.సీ. గారు హెచ్చరించారు. పోలీసులు లోపలికి రాగూడదనీ నిషేధించారు. ఎవరో లోపల తచ్చాడుతూ సిగరెట్లుకొనితెచ్చేవాడికోసం ఎదురుచూస్తున్న నా వైపు వేలుపెట్టి ఎవరని అడిగారు. చెప్తా దగ్గరకు రమ్మని పిలిచి నా రూంమేట్ వాణ్ణి చావగొట్టి వెళ్ళగొట్టాడు. నా పేరిట వారంట్ జారీ అయింది – గూఢచారిని చంపే ప్రయత్నం చేశానని. అప్పటి పబ్లిక్ ప్రాసిక్యూటర్ కృష్ణమూర్తి నాయుడుగారు చినవాల్తేరు పోలీసు స్టేషన్లో విద్యార్థులమీది కేసుల రికార్డు చూడటానికి వచ్చి నన్ను కోర్టులో నిలిపితే నిలిపిన వాణ్ణి బర్తరఫ్ చేయవచ్చని నాశరీర సౌష్ఠవం గురించి (తెలిసినవాడు కాబట్టి) వర్ణించి ఏ విద్యార్థి మీద కేసు నడిపినా నిలవదని చెప్పాడు. కేసులు నిలిచినా నిలవకపోయినా రికార్డు నిలిచింది. (1953లో ఆలిండియా రేడియోలో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా ఎంపికైన నన్ను పోలీసు రికార్డు కారణంగా ఉద్యోగంలో చేర్చుకోలేదు). తరవాత కొద్ది కాలంలోనే రజతోత్సవ సంరంభం మొదలుకావటం, ఫైనల్ పరీక్షలు దగ్గరపడటం కారణంగా చల్లబడ్డాం. ఆంధ్ర రాష్ట్రం వస్తున్నదనే వార్తలూ వచ్చాయి. ఉత్సవారంభ సభకు మొదట వస్తానన్న రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ భద్రతా కారణాల వల్ల రావటం లేదన్నారు. ఆయనకు బదులుగా ఉపరాష్ట్రపతి సర్వేపల్లి రాధాకృష్ణన్ వచ్చి ప్రత్యేక స్నాతకోత్సవంలో ప్రసంగించారు. Philistinists అని మమ్మల్ని దూషించాడు. ఆ మాటకు అర్థం ఆయన ఉపన్యాస ప్రవాహంలో కొట్టుకుపోతున్న మాకు తెలిసి చావలేదు. ఒక్కో విద్యార్థిని కనిపెట్టడానికి కనీసం ఇద్దరు నావికులైనా అక్కడున్నారని అంచనా. అన్ని రకాల ఆయుధాలను

అంతకు ముందెన్నడూ చూడలేదు. ఆ ప్రత్యేక సభలో న్యాయ సలహాదారుగా బహుకాలం పని చేసిన లక్కరాజు సుబ్బారావు గారికి ఎల్ఎల్.డి. అనే గౌరవ పట్టా ప్రసాదించారు. నూజివీడు జమీన్‌దారూ, సిండికేట్ సభ్యుడూ అయిన మేకా రంగయ్యప్పారావు గారికి కళాప్రపూర్ణ అనే గౌరవ బిరుదం ఇస్తామన్నారు. అప్పటికి కొద్ది రోజుల క్రితమే బెజవాడ రేడియో కేంద్రం ప్రారంభమైంది. అది ఈ సభా విశేషాలను ప్రత్యక్ష ప్రసారం చేసింది. అదే కలకలం పుట్టించింది. విశ్వకళా పరిషదాంధ్రవక్త అయిన ఆచార్య గంటి జోగిసోమయాజి గారు అధికారరీత్యా మేకా వారిని పొగుడుతూ "ఏవం గుణ విశేషణ విశిష్టులైన వీరు కళాప్రపూర్ణ బిరుదుకు ఎంతయూ తగరని విన్నవిస్తున్నాను" అని చదివి, "అయ్యా బాబోయ్! తగుదురని విన్నవిస్తున్నాను" అనే సవరణను కీచుగొంతుతో మనవి చేసిన వైనం రేడియో తక్షణం ప్రసారం చేసింది! రిజిస్ట్రారాఫీసు వారిచ్చిన సమాచారంతో ఆంధ్రపత్రిక దినపత్రికలో విశ్వకళా పరిషచ్చరిత్రనూ మొదటి ముగ్గురు ఉపాధ్యక్షులను గురించీ ప్రత్యేక వ్యాసం రాశాను.

వసతి గృహంలోని గాంధీ గ్రంథాలయంలో ఎప్పుడైనా సభలు జరిగేవి – సాహిత్య సంబంధులు. ఒకమారు విశ్వనాథ సత్యనారాయణ గారు విచ్చేస్తే అధ్యాపకవర్గం నుంచి కూడా చాలామంది వచ్చారు. అప్పటి కాయన శ్రీమద్రామాయణ కల్పవృక్షం రాస్తున్నాడు. సభారంభం లో "నేను కావ్యగానం చేద్దామనుకుంటున్నా. మీకేం కావాలి?" అని అడిగితే కిన్నెరసాని పాటలని కోరాను. పిచ్చికోపం వచ్చిందాయనకు. (ఆయన భాషలో 'పిచ్చ' అనేది శబ్దం. "నాకు మొదటి నుంచీ ఒకటే పిచ్చ – కవిత్వం" అని ఆయనంటే అబ్బూరి వారు "అందరికీ రెండుంటే ఈయనకు ఒకటేనా!" అని పెద్దగా ఆశ్చర్యపడ్డారు. సభ్యులు నవ్వినందుకు ఆయన కోపం పెరిగింది). "నీ వయస్సులో కిన్నెరసాని మీద ఇంత మోజు పుట్టే ఇక నీవు బాగుపడ'వని నన్ను శపించాడు. "మరి బాగుపడాలంటే ఏమడగాలి?" అని రెట్టించాను. "కల్పవృక్ష" మన్నాడు. "రామలక్ష్మణులు స్కంద విశాఖుల్లాగా ఉన్నారని రాశారే. ఏ నిఘంటువూ వారు వేరులేరని చెప్పలేదు. పైగా వారు గంగ రెండుపాయల్లా ఉన్నారన్నారు. ఆ రెండేవి? ఇంత కృతకంగా ఉన్న కల్పవృక్షగానం కోరాలా?" అని తిరగబడ్డాను. సభలో కనీసం ఇద్దరు విద్వాంసులున్నారు – దువ్వూరి వేంకటరమణశాస్త్రి, అబ్బూరి రామకృష్ణారావు గారలు. రెండో ఆయన విశ్వనాథకు మిత్రుడేగాక ఆయనలాంటి భావకవికూడా. వారున్నారన్న ధీమాతో ఎదిరించాను. "నీకు కావ్యదృష్టీ, కవితా హృదయమూ లేవు. అందుకే ఇలా వాగుతున్నా" వన్నా డాయన. రమణశాస్త్రి గారి పట్టే వేరు. "మన వాడికి శాస్త్రదృష్టి ఉందని తేల్చారు గదా! సంతోషం" అన్నాడు. "గొడవెందుకు? మీకిష్టమైనదే చదవం"డన్నారు అబ్బూరి వారు. ఒక్క క్షణమాగి ఆయన కల్పవృక్ష భాగాలే పాడారు. సభనుంచి తిరిగిపోతుండగా "నీకాయన కవిత్వం నచ్చలేదా?" అని అబ్బూరి వారడిగితే "ఆయన పాడుకవి" అని నాకనిపించిం దన్నాను. ఆ ప్రస్తావన అక్కడితో ముగిసింది.

పరీక్షలు సమీపిస్తున్నాయి. దువ్వూరి వారు తమ కుమారుడున్నాడు కాబట్టి పరీక్షకత్వం వదులుకున్నారు. ఆ స్థానంలో భద్రిరాజు కృష్ణమూర్తిగారు పరీక్షకు లైనారు. ఆయనకు నాకు పూర్వం రాసిన ఉత్తరంలోని విషయాలు గుర్తుకు వచ్చి సోమయాజి గారింటికి వెళ్ళి చూపి 'నాకు



రక్షణ ఉంటుందా?' అని అడిగాను. "ఏం భయంలేదు. జాగ్రత్తగా చదువుకో!" అన్నారు. అయినా అనుమానం తీరలేదు. అబ్బూరి వారిని సంప్రతించాను. "కాగితం మీద రాశాడు కాబట్టి తన జాగ్రత్తలో తానుంటాడు. మీ కుటుంబం పోరాడగలదని సూచిస్తామనులే" అన్నాడు. అంతటితో సరిపెట్టుకొని ఉందునుగాని మరునాటి క్లాసులో – బహుశా అది చివరివారమో చివరిరోజే గుర్తులేదు – సోమయాజిగా రోశ్లోకం చదివారు – ఫలితాలను గురించి మాట్లాడుతూ. అది (ఆధ్యాత్మ రామాయణంలోనిదని తరవాత తెలిసింది).

**"సుఖస్య దుఃఖస్య న కోAపి దాతా**
**అహం కరో మీతి వృథాభిమానః,**
**పరో దదా తీతి కుబుద్ధి రేషా**
**స్వకర్మ సూత్రగ్రథితో హి లోకః"**

అని "డిగ్రీలిస్తారనీ మాన్తారనీ మీరు వినే వార్తలు నమ్మకండి. నహి కస్తూరికామోద శ్శపథేన నివార్యతే" అంటూ "దొణప్ప ఫస్టున వస్తాడంటే అది అతడి శక్తివల్ల ననుకోండోయ్" అని ముక్తా యించాడు.

మర్నాడు పొద్దునే వి.సి. గారింటికి వెళ్ళి "ఈ ఉత్తరం చిత్తగించండి" అంటే విషయ మేమిటో చెప్పమన్నారు. "ఇది నా మూడేళ్ళ పరిశ్రమ ప్రమాదంలో పడుతున్నదన్న హెచ్చరిక" అన్నాను. "ఏమీ జరగనిదే ఎందుకింత గొడవ?" అన్నారు. అప్పుడు "ఏదైనా జరిగితే పోరాడక తప్ప"దని చెప్పి బయటికి వచ్చాను. భయపడినంతగా ఏమీ జరగలేదుగాని నేను పరిశోధన విద్యార్థిగా చేరవలసి వచ్చినప్పుడు ఆ ఉత్తరం తనకివ్వాలని పట్టుబట్టాడు గురుడు. కాపీ రాసుకుని అసలుత్తర మిచ్చాను.

పులిమీద పుట్ర అన్నట్లు పరీక్షా సమయం దగ్గర పడుతున్నప్పుడే నాకో కొత్త ప్రమాదం ముంచుకొచ్చింది. నేను విశాఖ జిల్లా కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శిననీ, చాలా భయంకర దుర్మార్గుణ్ణనీ, సంప్రదాయ వ్యతిరేకిననీ గంటివారికి నా సహాధ్యాయులే ఎవరో చెప్పారు(ట). నేనప్పటికి పార్టీ సభ్యుణ్ణన్నమాట వాస్తవం. జిల్లా కార్యదర్శిగా పూర్వమున్న జె.వి.కె.వల్లభరావు గారితో, వారి భార్యగారైన డాక్టర్ లక్ష్మీగారితో నాకు పరిచయమున్న మాట నిజమే. అప్పటి కార్యదర్శి యలమంచిలి విజయకుమార్ గారితోనే గాక అలనాటి నాయకులు ఎం.వి.భద్రం గారు, అనకాపల్లి (పిల్లి – అంటే సరైన ఉచ్చారణ) ఎమ్మెల్యే కోడుగంటి గోవిందరావుగారు, స్థానికులైన ఆకెళ్ళ కృష్ణమూర్తి భద్రమూర్తి శర్మాదులతో మంచి పరిచయాలున్నాయి. కానీ ఒక విద్యార్థిని, స్టూడెంట్స్ ఫెడరేషన్ కార్యకర్తను జిల్లా పార్టీ కార్యదర్శిని చేస్తారనుకోవటమే మూర్ఖత్వం. అసలే స్టాలిన్ మృతికి సంతపిస్తున్న సమయమది. గంటివారు నిలదీశారు. "తమరుంటున్న అఫిషియల్ కాలనీలోనే విజయకుమార్ గారున్నారు. అసిస్టెంట్ రిజిస్ట్రారు అన్నారావు గారున్నారు. ఆయన సిఫారసుమీదనో మొహమాటంవల్లనో తమరు విజయ కుమార్‌కు ఓటేశారని నేను విన్నాను. అది విశ్వకళాపరిషత్ సెనెట్ సభ్యత్వానికే కావచ్చు. నన్ను తప్పుబట్టడం, సాధ్యాసాధ్యాలు గమనించకపోవటం న్యాయమా? వ్యక్తిగత కారణాలవల్ల నన్ను

పాతెయ్యదలచుకుంటే ప్రయత్నించండి. నేనూ శక్తివంచన లేకుండా ఆత్మరక్షణార్థం పోరాడుతా" నన్నాను. పనిలో పనిగా 1942లో గుంటూరులో విశ్వకళా పరిషత్తుండగా హాస్టలు వార్డెన్‌కు ఉద్వాసన చెప్పించిన మా పినతాతగారు ధైర్యం చెప్పారన్నాను. ఆయనెవరో ఈయనకు తెలుసు. ఉద్వాసన తనకే జరిగిందని గుర్తు వచ్చింది. పకాలున నవ్వి "ఫరవాలేదు. పోయి చదువుకో – నీకేంకా"దని అభయమిచ్చి పంపాడు. ఆయనలో ఒక్క విశేషముంది. స్వబుద్ధితోనే నిర్ణయానికి వస్తాడు కాని ఫిర్యాదులనుబట్టి అభిప్రాయ మేర్పరచుకోడు. తరవాతి కాలంలో కూడా అనేక సందర్భాల్లో ఈ నా విశ్వాసం సరైనదని అనుభవంమీద తెలుసుకున్నాను.

**షష్టిపూర్తి విషయం**

పరీక్ష లయ్యీకాకముందే విశాఖలో రాయప్రోలు వారికి షష్టిపూర్తి జరుగుతున్నదని తెలిసింది, తెన్నేటి విశ్వనాథంగారి ఆధ్వర్యంలో. టౌన్ హాల్లో జరిగిన ఆ సభకు హాజరయ్యాను. సభానంతరం నా ఊరూపేరూ అడిగి మా పినతాతగారు (పితామహుల సోదరులు) హనుమంత రావు గారు తమకెంతో సాయపడ్డారని, తమది చీరాల దగ్గరి వెదుళ్ళపల్లి (అంటే స్టూవర్టుపురం రైల్వేస్టేషనుకు ఉత్తరాన ఉన్న కుగ్రామం) అనీ చెప్పి తమకో మనశ్శల్యముందనీ, అది వేటపాలెం సారస్వతనికేతనంలో షష్టిపూర్తిసభ కాకపోయినా కనీసం ఉపన్యాసావకాశమైనా లభించి తొల గాలని కోరుకుంటున్నాననీ చెప్పారు. సెలవుల్లో ఇంటికి పోబోతున్నా కాబట్టి ప్రయత్నిస్తానన్నాను. గ్రంథాలయ కార్యదర్శి అడుసుమల్లి శ్రీనివాసరావు గారి దగ్గర ఈ ప్రస్తావన తీసుకురాగానే "నేనిక్కడ ఉన్నంతకాలం ఆయన కోరిక నెరవేర"దని తెగేసి చెప్పాడు. ఆయన చెప్పిన కారణాలివి: (1) "ఏ దేశమేగినా ఎందుకాలిడినా, పొగడరా నీ తల్లి భూమి భారతిని" అని ఉద్బోధించిన వ్యక్తి తాను ఉన్నత పదవిలో ఉండి సంపాదిస్తూ కూడా కన్నతల్లికి అన్నం పెట్టలేదు. బాపట్ల భావనారాయణస్వామి దేవాలయం దగ్గర ఆ ముసలామె అడుక్కొని తూర్పుసత్రం పంచల్లో తింటున్నది. 'తల్లిభూమి' అనే సమాసం ఎలా తగలడ్డా, తల్లికి చేసిన ఉపచారం ఇలా తగలడ్డది. (2) ఉస్మాన్ వాచకాలు రాసి నైజాం నవాబును కీర్తించి సొమ్ము చేసుకున్నాడు. తెలుగు జాతికి గర్భ శత్రువైన నిజాం నవాబు కింకరు డిక్కడ అడుగుబెట్టడం ఈ గ్రంథాలయాన్ని అపవిత్రం చేయటమే. ఇది గాంధీజీ, బాబూ రాజేంద్ర ప్రసాదులు కాలుమోపిన నేల. రాయ ప్రోలుకు ఇక్కడ నిలబడే యోగ్యత లేదు. (3) (బెజవాడలోని) నిజాం బండి ప్లాట్‌ఫారం (నంబరు 4) మీదకు రాగానే ఇటునుంచి అటు పోతుంటే ఆ వేషమూ అటు నుంచి ఇటు వస్తుంటే లాల్చీ పంచె కట్టే అవకాశవాది ఎంత గొప్ప కవి అయినా సరే ఇక్కడ ఉపన్యసించేందుకు అంగీక రించం. ఇక సన్మాన మంటావా? జరిగే పనికాదు. గ్రామంలో మీ కుటుంబానికున్న పలుకుబడి వగైరాలను నేను ఎదుర్కోలేను. మీరు గట్టిగా పట్టుబట్టితే నేను – పైగుడ్డతో ఈ ఊరికి వచ్చిన వాణ్ణి – అదేవిధంగా తిరిగిపోతా"నని ఖండితంగా చెప్పాడు. "మీరే నేను చెప్పిన మాటలు నిజమో అబద్ధమో వాకబుచేసి తెలుసుకోండి. కావాలంటే నేను మీకు సాక్ష్యాధారాలు స్వయంగా చూపిస్తా"నన్నాడు. ఈ కారణంగా రాయప్రోలు వారు వేటపాలెంలో అడుగుపెట్టడం కుదరదు. పోనీ చీరాల్లో ప్రయత్నిద్దామని మరుసటేడు చీరాల వేంకట్రావుగారి నడిగితే పోనీ ఒక



సభపెట్టిద్దామని తల్లావఝల వారి అధ్యక్షతతో సభ చేయించాడు. దానికి నేనూ పోలేదు – మా వీధిలోనే జరిగినా. పాతకాలపు పట్టుదల లెలా ఉంటాయో, ఉండేవో తెలుసుకోటాని కిదొక మంచి నిదర్శనం.

మేనెల 15కు పరీక్షా ఫలితాలు తెలిశాయి. ఆ నాటితో విద్యార్థి జీవితానికి చరమగీతం పాడినట్లయింది. పరిశోధక విద్యార్థిగా చేరాలని ఉబలాటపడ్డాను. కుటుంబ పరిస్థితిని బట్టి అది సాధ్యంకాదని తేలిపోయింది. ఇక మిగిలింది ఉద్యోగ ప్రయత్నం – ఆస్తులు చాలా వరకు హరించిపోయాయి కాబట్టీ, నేనే మా తాతగారి తరవాత కుటుంబంలో పెద్ద వాణ్ణి కాబట్టీ ఇల్లు గడిపే ఆలోచన మొదలుపెట్టాలన్నారు. ఇష్టమున్నా లేకపోయినా విధికి తలవంచక తప్పలేదు.

# 7. ఉపాధ్యాయ వృత్తి: ప్రథమదశ

**మే** నెల చివరకు మార్కులు తెలిశాయి. 1950–51 విద్యా సంవత్సరంలోనే చాలా కళాశాలలు కొత్తగా వెలిశాయి కోస్తాలో. చీరాల్లోనూ ఒక ప్రయివేట్ కళాశాల (ఊటుకూరి రామయ్య శ్రేష్ఠి గారి పేరిట) అప్పటికి రెండేళ్ళుగా ఉంది. డిగ్రీ కళాశాలనుచేసే ప్రయత్నాలు ఫలిస్తే అధ్యాపకుడుగా చేర్చుకుంటామన్నారు. కీడెంచి మేలెంచమన్నారని విజయవాడలోని లయోలా కాలేజీకి, గుంటూరులోని ఆంధ్రా క్రిస్టియన్ కాలేజీకి దరఖాస్తులు పంపాను. (అప్పటికి శాసనాధారాల వంటివి చూపి బెజవాడ పేరు మార్చవద్దని నాతో సహా అనేకులు చేసిన బహిరంగ అభ్యర్థనలూ, రాసిన పత్రికావ్యాసాలూ బుట్టదాఖలై విజయవాడ వెలిసింది. అర్జునుడు ఇంద్రకీలపర్వతంమీద తపస్సు చేశాడని రాజకీయ వాదులకు నమ్మకం కుదిరిందన్నమాట). లయోలా వారి పిలుపు మా తాతగారు చించిపారేశారని రెండు సంవత్సరాల తరవాత నా భార్యద్వారా తెలిసింది). గుంటూరు వెళ్ళగలిగాను. ప్రిన్సిపల్ పౌలస్ గారి గదిలో తెలుగు శాఖాధిపతి తెలికచెర్ల వేంకటరత్నం గారినేగాక అభ్యర్థులందరినీ ఆసీనులను చేశారు! ఆ బహిరంగ పరీక్షలో మొదట బ్రహ్మానందమనే మా సీనియరుకు ప్రథమ తాంబూల మిస్తామన్నారు – అప్పటికి రెండేళ్ళుగా ఆయనక్కడ తెలుగు ట్యూటరుగా ఉన్నాడు కాబట్టి. ఆయన తనకు బి.ఇడి.లో సీటిస్తే సంతోషిస్తానన్నాడు – పెద్ద పిల్లలతో వేగటం కష్టమని. ఆయన కోరిక మన్నించి నన్ను పరీక్షించారు. తెలికచెర్ల వారు నన్ను చేరమన్నారు. స్వగ్రామంలో దొరక్కపోతే వస్తానన్నాను. వారం రోజుల్లో తేల్చమన్నారు. నేను పలకలేదు. ఉద్యోగంలో అక్కడ చేరలేదు.

ఇంతలో వి.ఆర్.ఎస్. కళాశాలలో డిగ్రీ కోర్సులు నడిపేందుకు అనుమతి లభించింది. స్థానికుణ్ణి గనక (అదో రకం ప్రత్యేకత చట్టం లేకుండా అంతటా అమల్లో ఉందన్నమాట) ఆర్డరు తీసుకొని చేరమన్నారు. సరిగ్గా ఇదే పరిస్థితిలో ఒంగోలు కళాశాలలో ధారా రామనాథశాస్త్రి ఉన్నాడు. ఉభయ కళాశాలల ప్రిన్సిపల్స్‌కూ తెలియకుండానే మాకు ఉద్యోగం ఖాయమైనా లోకంకోసం ఇంటర్వ్యూ జరగాల్సిందే నన్నారు. నేను ఒంగోలు వెళ్ళాను. బొంబాయి విశ్వవిద్యాలయంలో రాజనీతి శాఖాధిపతిగా పనిచేసి రిటైరైన ప్రతాపగిరి రామమూర్తిగా రక్కడ ప్రిన్సిపల్. ఎం.ఎస్.శర్మ తెలుగు శాఖాధిపతి. ఆయన తాను చదివే పద్యం ఏ కావ్యంలోదో చెప్పమని 'ప్రాగ్జ్యోతిష–' అనగానే ఉత్తరహరివంశంలో దన్నాను. మరో గ్రంథంలో అలాంటి పద్యం లేదని ఎలా చెప్పగల వన్నాడు ప్రిన్సిపల్ – "ఉందని శర్మగారిని చెప్పమనండి. చెంపలు వేసుకొని వెళ్ళిపోతా" నన్నాను. "రాయప్రోలువారి కవిత్వంలోని ప్రత్యేకత ఏ"మని ఆయనే అడిగాడు. "జాంగ్రీలో ఆవకాయ నంజుకున్న ట్లుండటం" అన్నాను (నిజానికి ఆ వాక్యానికి కాపీరైట్ హోల్డర్ ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారని అబ్బూరి వారు చెప్పారు. ఎంకిపాటలు పాడి ప్రచారం చేసినట్లే నా పద్యాలనూ చిత్తగించండని రాయప్రోలువా రడిగితే ఆంధ్రరత్నగా రలా సెలవిచ్చారుట!). "ఇలాంటి సమాధానాలు చెప్పి ఉద్యోగం దొరుకుతుం దనుకుంటున్నావా?" అని కోప్పడ్డారు. "నాకెప్పుడో చీరాల్లో దొరికింది – ఇక్కడ రామనాథశాస్త్రికి లాగా" అన్నాను.



పాపం ఆయనకు తెలియదన్నమాట ఈ సంగతి! వెంటనే ఫోనందుకొని కాలేజీ సెక్రటరీనో, అధ్యక్షుణ్ణో అడిగి "ఈ దేశం బాగుపడదు. పో" అన్నాడు. ఇలాంటి ఘనకార్యమే శాస్త్రి చీరాల్లో వెలగబెట్టాడు – డాక్టర్ టేకుమళ్ళ రామారావుగారి దగ్గర. జులై 1న ఉద్యోగంలో చేరుతూ నేను హైస్కూల్ హాస్టల్లో 1944–45 మధ్యన నివసించిన గదిలో ప్రస్తుతముంటున్న ప్రిన్సిపల్ గారికి జాయినింగ్ రిపోర్టిచ్చాను. ఫస్ట్‌ఫారం కొన్నాళ్ళపాటు చదివిన రేకుల షెడ్డులోనే మొదటి గంట పాఠం చెప్పాను. కళాశాలకు ప్రత్యేక భవనాలు రెండేళ్ళ తరవాత వాడరేవు రోడ్డులో ఏర్పడినప్పుడు ఇక్కడ ఉదయం, అక్కడ సాయంత్రం పాఠాలు చెప్పాను. 1956 నాటికిగాని ఆ గదులతో, షెడ్లతో నావైయక్తిక మానసిక సంబంధాలు తెగిపోలేదు.

మొట్టమొదటి క్లాసు ఇంటర్ ఎం.పి.సీ. రెండో సంవత్సరం వారిది. అటెండెన్స్ పిలుస్తుంటే "ప్రజంటే అన్నయ్యా!" అన్నాడు మా పెదనాయనగారి పెద్ద కొడుకు. ఇంకొకడు బావా అని, మరొకడు మామా అని పిలవకుండా వీరంగం తొక్కాను. తరవాతి క్లాసు పక్క షెడ్డులో బై.పి.సి. క్లాసు. అక్కడ అటెండెన్స్ తీసుకుంటుండగా వెనక బెంచీలో ఉన్న మాధవపెద్ది రాంగోపాల్ (అనే వీరుడు – 'దీక్ష' సినిమాలో నటించినందువల్ల హీరో ననుకున్నాట్ట) ముందున్న ఆడపిల్ల జడ లాగటం చూసి గందరగోళంగా అరిచి వాణ్ణి బైటికి గెంటుకుంటూ పోయాను. అతడు నిర్ఘాంతపోయాడు. అంతకన్నా ఎక్కువగా మా ప్రిన్సిపల్. నేను స్థానికుణ్ణనీ బళ్ళో చదివేటప్పుడు ఊళ్ళోని గూండా లందరితోనూ స్నేహమున్న వాణ్ణనీ ఆయనకు నచ్చజెప్పినా ఆయన నమ్మేటట్టు లేదు. కాలేజీ న్యాయ సలహాదారు పుత్రుడనీ, ప్రమాదమనీ అన్నాడు. ఆ కుర్రవాడి అన్న నా సహాధ్యాయేననీ, మా బంధువు లనేకులు అతడి తండ్రికన్నా పెద్ద ప్లీడర్లనీ వాదించాను. ఇది ఉదయగాథ. మధ్యాహ్నం ఆర్ట్సు క్లాసులో అడుగుపెడ్తూ నా కళ్ళు నేనే నమ్మలేకపోయాను. హైస్కూల్లో నాకు సీనియర్లు కొందరు, క్లాస్‌మేట్స్ కొందరూ ఉన్నారు. నేనెరిగిన వాళ్ళు మూడోవంతు మంది ఉన్నారు. ఇప్పుడేం చేయాలనేది సమస్య. ఎలాగో ఊపిరాడకుండా మాట్లాడి – ఇదంతా ఉపోద్ఘాతమని దబాయించి బైటపడ్డాను. అప్పటికే పొద్దుటి సంగతి తెలిసిన నా పూర్వమిత్రులైన ప్రస్తుత శిష్యులు "మేమంతా ఉన్నాం. భయపడవ"ద్దని సమాశ్వాసించారు. ఇంత చెత్త విషయం ఎందుకు రాస్తున్నానంటే స్థానికులకు ఇలాంటి బాధలు తప్పవని హెచ్చరించడానికీ, మొదటిసారి మనమీద కలిగిన సదభిప్రాయమో, దురభిప్రాయమో శాశ్వతంగా నిలుస్తుంది కాబట్టి వీరమరణానికి సిద్ధమై కాని ఉపాధ్యాయ వృత్తిలో చేరకూడదని మనవిచేయటానికీ. స్వాతంత్ర్యం వచ్చిన తరవాత దశాబ్దం గడవకముందే విద్యారంగం ఎటువంటి దీనస్థితికి వచ్చిందో (నావంటి ఉపాధ్యాయులవల్ల, నా ప్రథమశిష్యులవంటి విద్యార్థులవల్ల) గుర్తు చేద్దామని రాశాను.

మరునాడు వాడరేవు దారిలోని డిగ్రీ సెక్షనుకు వెళ్తే అక్కడ నా బాల్యస్నేహితులూ, సహాధ్యాయులూ, బంధువులూ (నా సొంత తమ్ముడితో సహా) బి.ఏ. క్లాసులో ఉన్నారు. తక్కిన అన్నింటికన్నా తెలుగు మేస్టరు దౌర్భాగ్యం ఇలాంటి వాతావరణంలో హృదయ విదారకం. క్లాసులో బంధువులైన ఆడపిల్లలుండగా పచ్చి బూతుల శృంగార భాగాలున్న పాఠ్యాంశాలను

బోధించవలసిన దుష్కర్మ అనిర్వచనీయం. తెలుగు కవులూ (ముఖ్యంగా ప్రాచీనులు) పాఠ్యాంశ నిర్ణేతలైన వృద్ధోపాధ్యాయులూ శృంగారేతరవిషయాలు బోధనకు పనికిరావని తీర్మానించి నట్లుంది (పాపం. మా బాల్య గురువైన పోస్ట్‌మన్ భద్రకాళి ఏనాడో చెప్పాడు – బ్రహ్మదేవుడు అందరి మొహానా ఏదో రాసి చర్మం కప్పుతాడనీ, వేప్పుల్లను పెంటలో ముంచి రాస్తే పోస్టుమనో, తెలుగుమాస్టరో కాక తప్పదనీ! అది పచ్చి నిజమనే నమ్మకం కుదిరింది). అప్పట్లో బి.ఎస్‌సి. వాళ్ళక్కూడా తెలుగుండేది. ఆ క్లాసుల్లో విద్యార్థినుల సంఖ్య ఎక్కువ. జగన్నాథ పండితరాయలు సంస్కృతంలో రాసిన భామినీ విలాసాన్ని వాసిరెడ్డి వేంకట సుబ్బయ్యగారు అనువదించారు. అది నిర్బంధ పాఠ్యాంశం. అందులో "రతిత్వర పీడాలస నాకయోషి దధరస్వాదూపహాసంబు మత్స రసాలాపవిలాస మేసుకృతి యాస్యంబందు లాస్యం బిడున్?" అనే భాగముంది. ఎలా చెప్పి చావాలి? ఈ దౌర్భాగ్య లక్షణం తెలుగుశాఖలకు శాశ్వత ప్రాతిపదిక మీద పూర్వం నుంచీ ఉంది. పోతుందన్న నమ్మకం పోయింది. ఇలాంటివి రాసిన కవులు తమ రచనలు పాఠ్యాంశాలై యుక్తవయసులోని విద్యార్థినులకు విద్యార్థుల సమక్షంలో అంతకన్నా రెండు మూడేళ్ళు పెద్ద వాళ్ళు చెప్పవలసి వస్తుందని ఊహించి ఉండరు. కానీ కవులు క్రాంతదర్శులనే పొగడ్త కప్పు దర్థ మేమిటి? ఈ పద్యంవంటిదాన్ని ఉపాధ్యాయినులు విద్యార్థుల కెలా బోధించాలి? క్లాసుకు పోతుండగానే గిల్లికజ్జాలు పెట్టుకొని ధుమధుమలాడుతూ మీకు నోటితో చెప్తే అర్థమై చావదని నోట్సుగా రాసుకొని ఏడవండని మాటమాటనూ విరిచి చేతనయినన్ని మారుమూల మాటలతో అర్థం రాయించి బయటపడవలసివచ్చింది – తిట్టుకుంటూ.

## మార్పుకోసం

ఈవృత్తినుంచి బయటపడాలనిపించింది. ఎ.జి. కార్యాలయంలో గుమస్తా పదవికీ, ఆలిండియా రేడియోలో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్ పోస్టుకూ ఇంటర్వ్యూలకు వెళ్ళాను. కార్యా లయంలో అడుగుపెట్టుండగానే స్కూల్లో, కాలేజీలో, యూనివర్సిటీలో నా మిత్రులైన కొందరు కనిపించి, బలవంతంగా ఉడిపీ హోటలుకు ఈడ్చుకపోయి కనిపిస్తే కాల్చిపారేస్తా మన్నారు. సుఖప్రదమైన కళాశాల అధ్యాపక వృత్తిని వదులుకోవా లనుకోవటం మనోవైకల్యంవల్ల తప్ప మరో కారణంవల్ల కలిగే భావం కాదన్నారు. "నీకేంరా! మహారాజువి. ఉన్న ఊళ్ళో ఉద్యోగం. నెలకు నూటయాభై రూపాయల మూలవేతనం, ముప్ఫయి నాలుగు రూపాయల కరువు బత్తెం. అంతమంచిది మాని ఈ నీచానికి దిగవ"ద్దని వెళ్ళగొట్టారు. రేడియో సంగతి ముందే విన్నవించు కున్నాను. ఒక వేళ ఎ.జి. ఆఫీసులో ఉద్యోగం వచ్చినా పోలీసు రికార్డు కారణంగా చేర్చుకునే వాళ్ళు కాదు. కాబట్టి తెలుగు మాస్టరుగా శేషజీవితం గడపక తప్పదని తిరిగివచ్చానింటికి. జులైలో ఉద్యోగం వస్తే డిసెంబరులో ఇల్లాలు వచ్చింది. తోటి అధ్యాపకుల్లో పూర్వ సహా ధ్యాయులు వరసలు పెట్టుకొని పిలుచుకుంటూ కాలం దొర్లిస్తుండగా సెప్టెంబరు పరీక్షలు వచ్చాయి. వైస్ ప్రిన్సిపల్ సుబ్బయ్య నాయుడు గారు "మామూలుగానైతే అప్పుడే చేరిన నీ వంటివాళ్ళకు అవకాశం ఇవ్వంగానీ నీమీద సద్భావం పుట్టింది. ఇన్విజిలేషన్ కలిసి చేద్దా" మన్నారు. నన్ను మంచివా డనే వ్యక్తి దొరికినందుకు బోలెడు గర్వించాను. అవి మెట్రిక్ పరీక్షలు.



ప్రశ్నపత్రాలు పంచిన తరవాత "కొద్దిగా ఆఫీసు పనులున్నాయి. పది నిమిషాల్లో వస్తా. జాగ్రత్తగా పరిశీలించండి – ముఖ్యంగా ఈ ఇద్దరినీ" అని చెప్పి వెళ్ళాడు. ఆయన శ్రద్ధగా చూడమన్న వాళ్ళు కాపీలు తీశారు. ఆయనకు తెలిసే హెచ్చరించాడనే నమ్మకం కుదిరింది. ముప్పావు గంటలోగా కాగితాల్లాక్కొని వెళ్ళగొట్టాను. ఆఖరు పది నిమిషాల్లో వచ్చి వాళ్ళేమైనా"రని అడిగాడు. చెప్పాను. ఆయన మొహాన నెత్తురు చుక్కలేదు. "ఆ పిల్లలు వి.సి. గారి అన్న కొడుకులు తెలుసా?" అంటూ మొహం మాడ్చుకొని వెళ్ళాడు. ఆ సాయంత్రం వారిలో ఒకడు తన బలపరాక్రమాలను వర్ణిస్తూ బెదిరించటానికి వచ్చాడు. చదివి రాసి పరీక్ష నెగ్గమన్నాను. బెదిరిస్తే నీవిక్కడ ఒక్క గంట బతక లేవన్నాను. "నీవు సైన్సు చెప్పగలవా? తెలుగు మేష్టరువి. చదివించగలవా?" అని రెట్టించాడు. సవాలు తీసుకున్నాను. చదివి చెప్పాను. మార్చిలో నీతిగా పరీక్షరాసి నెగ్గిన ఆ విద్యార్థి పేరు వాసిరెడ్డి వేంకటప్పయ్య. తరవాత ఇంటర్, బి.ఏ. డిగ్రీల్లో ఎంతో మారిపోయి ఉత్తమ విద్యార్థి అనిపించుకున్నాడు. రీసర్చికి విశాఖచేరి వీర కమ్యూనిస్టుగా మారి ప్రమాదంలో ప్రాణాలు కోల్పోయాడు. పరీక్షల్లో అవినీతికి ఉపాధ్యాయుల సహకారం ఎంత స్పష్టంగా ఆ నాటికే లభిస్తుండేదో నిరూపించే విషయమిది. అంతకు మించిన ప్రయోజనం లేదీవిషయానికి.

ఉద్యోగంలో చేరేనాటి జీతభత్యాల విషయం చెప్ప మరిచాను. డిగ్రీ కళాశాలలో మా నాటికి రూ. 150–300 స్కేలుండేది లెక్చరరుకు. మూలవేతనానికి మరో 34 రూపాయల కరువు బత్తెం ముట్టేది. రెండేళ్ళకోసారి రెండున్నర రూపాయలు ఇంటరు విద్యార్థులకు బోధించే వారికీ, ఐదు రూపాయలు డిగ్రీ క్లాసులు తీసుకొనేవారికీ ఇచ్చేవారనటం కన్నా ఇస్తామన్నారనటం సముచితం. ఆగస్టులో (స్వాతంత్ర్యోత్సవం తరవాత) మొదలయ్యే ఉద్యోగం మార్చినెల 31వ తేదీతో పూర్తవు తుంది. వేసవిలో నాలుగేళ్ళు మాకు జీతాలు లేవు. అయితే మా ఘనతను చూసి మా సీనియర్లు ఈర్ష్యపడే వాళ్ళు. 1950 దాకా లెక్చరర్లకు రూ. 80–150, ట్యూటర్లకూ డిమాన్‌స్ట్రేటర్లకూ రూ. 60 –80, స్పెషల్ ట్యూటరుకు (వారానికి రెండు క్లాసులు తీసుకున్నందుకు) అదనంగా 8 రూపాయలూ ఇచ్చేవాళ్ళు. కట్టమంచి వారి షష్టిపూర్తి సమయం నుంచి రూ. 150–250/300 స్కేలు వచ్చింది. దక్షిణోత్తర రాష్ట్రాల్లో లెక్చరర్లు తమను ప్రొఫెసర్లని చెప్పుకుంటుండే వాళ్ళు. రాయలసీమ ప్రాంతంలో ఈ పద్ధతి 1975 దాకా ఉంది. విశ్వవిద్యాలయం వారు అనుబంధ కళాశాలలవాళ్ళు అలా చెప్పుకోరాదని ఎన్ని విధాల చెప్పినా ఎవరూ లక్ష్యపెట్టలేదు. శ్రీ వేంకటేశ్వర విద్యాలయం వైస్ ఛాన్సలర్ డా॥ జగన్నాథరెడ్డి ఈ విధానం మార్చటానికి విశ్వప్రయత్నం చేసి చివరికి ప్రొఫెసర్ల జీతాలివి అని వివరించి ఆ లెక్కన ఆదాయప్పన్ను వసూలు చేయండని ప్రభుత్వానికి రాశానని చెప్పాడు. విశ్వకళా పరిషత్తులో లెక్చరర్లు రూ. 250, రీడర్లు రూ. 350, ప్రొఫెసర్లు రూ. 400లు జీతాలతో సర్వీసు మొదలుపెట్టేవారు. సైన్సు ప్రొఫెసర్లకు అదనంగా మరో వంద రూపాయలుండేవి 1950–53 మధ్య కాలంలో ఆర్ట్సు విభాగంలో. వేసవిలో జీతాలివ్వటం, ఉద్యోగం ఖాయపరచటం 1956 దాకా అమలుజరగలేదు ఆంధ్ర ప్రాంతంలో. కొత్తగా వెలసిన కళాశాలల్లో ఇంగ్లీషు మేష్టర్ల కరువుండేది. అందువల్ల రిటైర్డు డి.ఇ.ఓ.లనూ (వీరిలో చాలామంది బి.ఏ., బి.ఎడ్.లు మాత్రం) కొన ఊపిరితో ఉన్న పాతవారినీ

తాత్కాలిక ప్రాతిపదిక మీద నియమించేవారు. 1956 తరవాత ఆ ఇబ్బందుల్లేకపోగా అన్ని సబ్జెక్టుల్లోనూ అక్కరకు మించినంతమంది విద్యార్హతలున్నవారు దొరికేవారు. అదో రకంగా ప్రమాదకర మయింది. ఇంక్రిమెం టడిగినా, ప్రావిడెంట్ ఫండ్ ఏర్పాటు చేయమన్నా ఇష్టంలేక పోతే రాజీనామా చేసి పొండనే వాళ్ళు – మీపాటి అర్హతలున్న వాళ్ళు అనేకులు దొరుకుతారని. అనుబంధ కళాశాలల ఉపాధ్యాయ సంఘం (ACTA) స్థాపించుకొని పోరాడితే తప్ప ఉద్యోగ భద్రతలేదని నిశ్చయించుకోవలసి వచ్చింది.

ఆనర్సు పూర్తికాగానే పరిశోధనకు పోదామనుకుంటే కుటుంబ పరిస్థితి అనుకూలించ లేదు, నేనే పెద్దవాణ్ణి కాబట్టి, పెంచుతున్న తాతగారు వయోవృద్ధు లవుతున్నారు కాబట్టి. ఇంటికో ఆడదిక్కూ అవసరమయింది. 1953 డిసెంబరులో పెళ్ళాడాను. ఎందరికో ఆశీర్వచన పద్యాలు రాసినా నా పెళ్ళికి ఓ కుర్రాడు రాసిన పద్యాలు (పేర్లను ఉచిత స్థలంలో నిబంధించే ఏర్పాటుతో మిగిలిన భాగాలను ముందుగానే అచ్చు వేయించిన రూపంలో) ఇచ్చారు. ఎవరు రచయితలంటే ఉండేలు మాలకొండారెడ్డి అనే విద్యార్థి అన్నారు. (తరవాతి కాలంలో ఆయన గొప్ప ఇంజనీరయి, ఇంజనీరింగ్ కళాశాల స్థాపకుడైనా కవితా కండూతిని వదుల్చుకోలేకపోయాడు). కనిగిరి దేవుడి బావి దగ్గరి శివాజీ గ్రంథాలయానికి ఓ నూటపదార్లన్నా చదివించమన్నారు. వివాహానంతరం వేటపాలేనికి సింగరాయకొండ మీదుగా తిరిగి వస్తుండగా రైలు పెట్టెలో ఏకాగ్ర దృష్టితో ఏదో చదువుకుంటున్న ఓ నడివయసు పెద్ద మనిషి తటస్థపడ్డారు. తానే కదిలించి కుశలప్రశ్నాదికమైన తరవాత తాను సెనేట్ సభ్యుణ్ణనీ, సాహితీ ప్రియుణ్ణనీ – నన్నెచోడు డంటే వీరాభిమానిననీ చెప్పి గుర్తించగలరా అని పొడుపు ప్రశ్నలాంటిదొకటి తగిలించాడు. ఆయన దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డి గారు కావచ్చునీ, నన్నిచోడుడు నన్నయకన్నా పూర్వుడని భారతిలో రాశారనీ, అయితే శాసనం లోని అంకెలు విక్రమశకానికి సంబంధించినవని భ్రమించారని మా గురువులు చెప్పారన్నాను. ఆయన మాలకొండయ్య గారిని అభిమానిస్తున్నానని చెప్పాడు. ఇదో పెద్ద విషయం కాదుగాని వ్యవసాయ వృత్తిలో కడుపు నిండిన వ్యక్తి సాహిత్య విషయాల్లో పట్టుదల చూపటం నా ప్రాణానికి వింత అనిపించిందప్పుడు. కారంచేడులోని యార్లగడ్డ (ఉరఫ్ భారతం) రంగనాయకులు చౌదరి గారివంటి వారిని నేనెరక్కపోలేదు. ఈ రచనా కాలానికి ఈ రకం సాహితీప్రియుల సంఖ్య చాలా తగ్గిపోయింది.

ఆనర్సు పూర్తి అవుతున్న సమయంలో కమ్యూనిస్టు పార్టీలో అంతర్గత ప్రజాస్వామ్యం అంత రిస్తున్నదనీ విద్యార్థి సంఘాల ఎంపికలూ, పొట్టి శ్రీరాములు ఆత్మార్పణ సమయంలో విద్యార్థి ఫెడరేషన్ స్థానిక నాయకత్వాన్ని పక్కకు నెట్టి, బాధ్యతారహిత ప్రసంగాలు చేసి, ఉన్న పలుకు బడిని నీటముంచిన వాళ్ళమీద క్రమశిక్షణ చర్య తీసుకోవాలనీ లీషావ్‌చీ 'Inner Party Democracy' వేదంవంటిదనీ ఫిర్యాదులు చేసి భంగపడ్డాను. నన్ను బహిష్కరిస్తామన్నారు. నేను రాజీనామా చేస్తానంటే పార్టీ చరిత్రలో బహిష్కారాలేగాని, రాజీనామాల్లేవన్నారు. 'సిగ్గుబిళ్ళ'ను విసిరికొట్టాను (సభ్యత్వ సూచకమైన కార్డది). చివరకు బద్దెం ఎల్లారెడ్డి గారు పంచాయతీ చేసి ఏమీ జరగలేదని ఉభయ పక్షాలూ భావించటం ఉభయ తారకమని పరిష్కారం చెప్పారు. ఆనాటి



నుంచి నేను ప్రత్యక్షంగా రాజకీయాల్లో పాల్గొనలేదు – ఎందరు నాయకులతో, కార్యకర్తలతో ఎంత మంచి స్నేహ సంబంధాలున్నా. ఉపాధ్యాయ వృత్తిలో చేరిన తరవాత ఆత్మరక్షణ చర్యగా ACTAలో చేరక తప్పలేదు. సాహితీ రాజకీయాలెలా ఉన్నా అభ్యుదయ రచయితల సంఘం రాష్ట్ర కార్యవర్గ సభ్యత్వం వదులుకోలేదు. సదరు సభ్యత్వం శ్రీశ్రీ, ఆరుద్ర, అవంత్స సోమసుందర్, కె.వి.రమణారెడ్డి, తుమ్మల వెంకట్రామయ్య ప్రభృతులతో నాకున్న పరిచయాన్ని దృఢపరుస్తుం దన్న ప్రలోభంతో అరసం మూలబడేదాకా చీలిపోయేదాకా అందులో ఉన్నా. కొంతకాలం చీరాల్లోని స్వగృహం నుంచి అద్దెకున్న వాళ్ళు ఖాళీచేసేదాకా వేటపాలెం నుంచి వాడరేవు రోడ్డు మీద వున్న వి.ఆర్.ఎస్.కళాశాలకు రిక్షామీద పోయిరావటం తప్పలేదు. రోజుకు పది పన్నెండు మైళ్ళ ప్రయాణం. శని, ఆదివారాల్లో సారస్వత నికేతనంలో సాహితీగోష్ఠి కొనసాగుతుండేది. 1954 దసరా వేడుకలకు ఏకవినైనా పిలిచి సత్కరిస్తే ఎలా ఉంటుందనే చర్చ వచ్చింది గ్రంథా లయంలో. ఎప్పుడూ పాతకాపులనే పిలవటం కన్నా కుర్రకారుకు అప్పుడప్పుడు అవకాశం ఇస్తే మంచిదని సూచించాను. నీవే చెప్పమంటే సింగిరెడ్డి (సత్య) నారాయణరెడ్డి గారి పేరు చెప్పి అంగీకరింపజేశాను.

## సినారే అరంగేట్రం

మరో రెండు మూడు నెలలకు చదువు పూర్తి అవుతుందనగా ఖండవల్లి లక్ష్మీరంజనం గారి వెంట నారాయణరెడ్డి గారు వాల్తేరు వచ్చారు. తెలుగు భాషా సమితి తరపున సభ జరపమని గంటివారు ఆజ్ఞాపించారు – ఖండవల్లి వారు వ్యాకరణ విశేషాలు చెప్తామన్నారు. దువ్వూరి వారు తనకేదో కడుపులో తిప్పినట్లుందనీ సభ మధ్యలో పోవలసివస్తే వెంటవచ్చి ఇంట్లో దిగబెట్టమనీ తమ పుత్రుణ్ణిగాక నన్ను అడిగారు. సరేనన్నాను. ఖండవల్లి వారు నసపీకుడులో యరలవలు ఊష్మలనగానే దువ్వూరి వారికి ముందూహించిన ప్రమాదం వచ్చింది. వారిని ఇంటికి చేర్చాను. ఆ సందర్భంలో సింగిరెడ్డి వారితో ప్రథమ పరిచయం ముఖావంగా జరిగింది. రాగచ్ఛాయలో రాసిన కవిత చదవటం గమనించాను. నాగార్జున సాగరం మీద గేయకావ్యం రాస్తున్నానన్నాడు. అది విందామని ఈ ఏర్పాటు చేయించాను. ఆనాడు కుండపోతగా కురుస్తున్న వానలో నాతోబాటు పది మంది విద్యార్థులను కూడా వేటపాలెం తీసుకు వచ్చాను. ఇంటికి వెళ్తే సభకు రావటం కుదరకపోవచ్చు కాబట్టి నేరుగా గ్రంథాలయానికి చేరాం. వానవల్ల సభను వరండాలో ఏర్పాటు చేస్తుండగా గ్రంథాలయంలో సింగిరెడ్డి వారితో కలయదిరిగాను. అప్పుడాయన "తెలంగాణాలో నేనూ మా అన్నగారు దాశరథీ కలిసి శ్రీశ్రీని నిలబెట్టున్నా"మన్నారు! "నడుము లేని వాడికి వెదురుబద్దలు కట్టి నడిపించగలమా? స్వశక్తివల్ల శ్రీశ్రీ నిలబడలేకపోతే మనం నిలవలే"మన్నా. ఇంతలో సభ మొదలయిం దన్నారు. పరిచయవాక్యాల తరవాత కావ్యగానం మొదలయింది. నాలుగు పంక్తులైనా చదవకముందే సభాపతులవారు ఛందస్సేమిటని ప్రశ్నిం చారు. (ఆయన్ను మేం నడుపుకొనే సభల్లో పెత్తనానికి రానిచ్చే వాళ్ళం కాదు. ఇది గ్రంథాలయ సభ). ఈ భావాన్ని కనీసం నాలుగు సీసపద్యాల్లో ప్రస్తరించి వర్ణించవచ్చని కొప్పరపు వారు స్వీయ కవితా ప్రదర్శన ఆరంభించారు. ఇక మునిమాణిక్యం వారు ఎగదోసీ దిగలాగీ కొక్కిరింతలు

కురిపించారు. ఈ కోలాహలం పావుగంట సాగింది. అసలే వానలో తడిసి నీళ్ళు కారుతున్న నాకిది కోపకారణ మయింది. "కావ్యగానం పూర్తయిన తరవాత మీ చర్చ మొదలెయ్యండి. మధ్యలో అడ్డుకుంటే మీ పెద్దరికం సాగదు. కనీసం మా విద్యార్థుల పాటి సహనమైనా ప్రదర్శించండి" అని తిరగబడ్డాను. సద్దు మణిగింది. కావ్యగోష్ఠి పూర్తయింది. నాటి సాహితీ సభలిలాగే జరిగేవి. రాజకీయ సభలూ అంతే. ముషాయిరాల్లాగా ప్రశంసలు మా ప్రాంతంలో చెల్లుబాటయ్యేవి కావు అప్పట్లో.

### సాంస్కృతిక వినోదాలు

1953 డిసెంబరులో జరిగిన స్నాతకోత్సవానికి హాజరైనాను డిగ్రీ తీసుకోటానికి. మొదటి డిగ్రీల వాళ్ళను వెనక పంక్తుల్లో కూర్చోబెడితే అల్లరి చేస్తున్నారని క్రమశిక్షణగల ఆనర్సు వాళ్ళను వెనక్కు నెట్టారు. అది మాకు అగౌరవ మనిపించింది. ముందుగానే సీట్లలో డిగ్రీ కాగితాలు పెట్టేవాళ్ళు. అవి తీసుకొని పెద్దలు ఉపన్యాసానికి లేవగానే మేమూ లేచి రెండు మూడు వందల మందిమి ఊళ్ళకిపోయి అద్దె గౌన్లు అక్కడ ఇచ్చి వాల్తేరు స్టేషనుకు పరుగులు తీశాం. 1954లో పరోక్ష మార్గంలో (in absentia) ఎం.ఏ. పట్టం పోస్టుద్వారా తెప్పించుకున్నాం. అప్పటినుంచీ ఆధునికాంధ్ర భాషకు వర్ణనాత్మక వ్యాకరణం రాయాలనే దుర్బుద్ధి తీవ్రం కావటం మొదలైంది. చిన్నయసూరి సూత్రాలను సవరిస్తూ కొంత గ్రంథం రాసిన తరవాత నలుగురికీ చూసి లోపాలు సవరించుకొందా మనుకుంటుండగా రాజమండ్రిలో ఆంధ్ర సాంస్కృతిక వారోత్సవాలు జరుగుతున్నాయని తెలిసింది. రాసిన కాగితాలతో సహా అక్కడికి చేరాను. వీరేశలింగం హైస్కూల్లో మాకు బస ఏర్పాటు చేశారు డాక్టర్ గరికపాటి రాజారావు గారు ముందు రోజునుంచీ. పరిచితుల దగ్గర నా వ్యాకరణ ప్రస్తావన తెస్తే ఎవరూ పట్టించుకోలేదు – ముఖ్యంగా కవులు. నేను మొదటిసారిగా కలిసిన పాములపర్తి సదాశివరావు గారు (కాకతి పత్రికా సంపాదకుడు) ఎంతో ఓర్పుగా విని, నేర్పుగా ప్రశ్నించి, ఓదార్పుగా మంచి సూచన చేశారు – "మీ మాండలికాలు మీకు తెలిసినా తక్కినవి తెలియవు కదా. అవి కూడా అధ్యయనం చేసి మాండలిక పదకోశం నిర్మించుకున్న తరవాత వ్యాకరణం రాస్తే అది యావదాంధ్ర భాషకూ అన్వయిస్తుంది. ప్రయత్నించండి" అని. అక్కడే శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారిని చాలా దగ్గరగా చూసి బాధపడ్డాను. ఆయన అనువదించిన భాసనాటకం యజ్ఞఫలం బోధిస్తున్నాను. ఆయన అధస్సూచికల్లో చెప్పిన పద్య లక్షణాలకూ రాసిన పద్యాలకూ పొంతనలేదు. ఆశువుగా ఆయన సభనాశీర్వదించిన పద్యాల్లో ఛందోభంగం ప్రస్ఫుటంగా ఉంది. 'ముదిమది దప్పిన ముసలివేల్పు' అనే పద్య చరణం గుర్తుకు వచ్చింది. ఆయన పద్య (కవిత్వ)ం ఎంత త్వరగా మానివేస్తే లోకానికీ, ఆయనకూ అంత మేలు కలుగుతుం దనిపించింది.

తెలవారు జామున వేగుచుక్కతోబాటు నిద్రలేపిన దాలిపర్తి పిచ్చహరి నాదస్వర మాధుర్యంతో పులకరించాం. రెండున్నర గంటలపాటు ఆ మధుర స్వరాలను వింటూ కాలకృత్యాలు తీర్చుకొని, కాఫీ టిఫిన్లు ముగించి పందిట్లోకి వచ్చేసరికి 'మధురా నగరిలో' ఆనందామృత ఝరిలో తేలి ఆడినట్లయింది. ఆ తరవాత ద్వారం వేంకటస్వామి నాయుడిగారి ఫిడేలు. తనకు



ముందు పరాకాష్ఠకు చేరిన దాలిపర్తి వారి ప్రభావం నుంచి శ్రోతలతోబాటు తానూ బయట పడాలి. అందుకోసం ఆయన నట్టుతూ 'మొక్కజొన్న తోటలో' విహరించి, ఓ గంటకు తన సొంతబాణీకి చేరుకున్నాడు. చివరకు ఆయనకూడా 'మధురానగరి'లో వాయించి ఓంకార నాదంతో మైమరిపించాడు. ఆ మీదట పండిట్ ఓంకారనాథ్ ఠాకుర్ హిందుస్థానీ శాస్త్రీయ సంగీతం. తమలాంటి – లేదా తమను మించిన – కళాకారుల పోటీని తట్టుకోడానికి వారు చేసిన ప్రయత్నం ఉత్తమస్థాయి సంగీతం వినే అవకాశం కల్పించింది. కళాపూర్ణోదయంలోని నారద తుంబురుల విద్యాస్పర్ధ గుర్తుకు వచ్చింది. "ఉత్తముల పగిది నీరుకొలcది తామర సుమ్మీ" అన్నది పచ్చి నిజమని అర్థమైంది. సాయంత్రం రాజారావుగారు అతిథులందరికీ "ఝనక్ ఝనక్ పాయల్ బాజే" చూపారు ఓ సినిమా హాల్లో. బాల్కనీలో ముందు సీట్ల వరస మధ్యలో కూర్చొని సిజర్ సిగరెట్లు తగలేస్తూ 'కల్పన'తో పోలిస్తే ఇదెంత చెత్త సినిమా అనాలో కారణాలు వివరిస్తూ సంధ్య ముగ్గులు చెరపటం, నాట్యం చేస్తూ వీణమీది నుంచి దూకటం చూడగానే వీరావేశం తెచ్చుకొన్న మహాకవి 'జ్ఞానశూన్యు'లని కేకపెట్టి కాలుతున్న సిగరెట్టును విసరివేశాడు కిందకు. పారాచ్యూట్ చొక్కా ముట్టుకొంది ఓ ప్రేక్షకుడిది. 'ఎవర్రా అది?' అని అరుస్తూ పెద్దగుంపు బాల్కనీలోకి వచ్చింది 'చంపుతా'మంటూ. గరికపాటి వారు బతిమాలి బామాలి అప్పటికప్పుడు ప్రథమ చికిత్స చేసి శాంతింపజేసిన దృశ్యం ఎంత శాంతగంభీరమో అంతసేపూ ఆ సినిమా తీసిన వాళ్ళనీ నటీనటులనూ తిట్టిపోస్తూ శ్రీశ్రీ వేసిన వీరాంగం అంత బీభత్సం.

1954 వేసవి సెలవుల్లో ఒక వారం రోజులు మదరాసులో గడిపాను – బంధుమిత్రులతో. రాజాజీ హాల్లో పట్టమ్మాళ్ సంగీత కచేరి వినటం, చరిత్ర ప్రసిద్ధుడైన భాష్యమయ్యంగారి ఇల్లు వెతికి కనుక్కోవటం, అడయార్ కన్నెమెరా పబ్లిక్ లైబ్రరీలనూ మదరాసు విశ్వవిద్యాలయ గ్రంథాలయాన్నీ తాళపత్ర గ్రంథాలయాన్నీ దర్శించటం, మదరాసు హైకోర్టు ముందున్న ఓశిలా విగ్రహానికి వచ్చేపోయే న్యాయవాదులతోబాటు నమస్కరించటం వగైరాలు నా దృష్టిలో ఘనకార్యాలు. దొంగనోట్ల కేసులో పట్టుబడి జైలుపాలైన గున్నేశ్వరరావు గారిని విడిపించిన ప్రకాశం పంతులు గారు భాష్యం అయ్యంగారి ఇంటికి ఎదురుగా అద్దెకొంపలో న్యాయవాద వృత్తి ప్రారంభించటం కథలు కథలుగా చెప్పేవాళ్ళు మా వాళ్ళు. సముద్ర ప్రయాణంచేసి బారిష్టరుగా తిరిగి వచ్చిన నడింపల్లి నరసింహారావు గారికి సాటి బ్రాహ్మణులు శంకరాచార్యుల చేత బహిష్కార పత్రిక ఇప్పించారట. అదే కారణంతో మా పినతాతగారూ బహిష్కార పత్రిక అందుకున్నప్పుడు ప్రకాశంగారే సలహా ఇచ్చి స్మార్తులకూ, వైష్ణవులకూ అద్వైతాచార్యుల బహిష్కార పత్రిక వర్తిస్తుందా అనే ప్రశ్న లేవదీయిస్తే సదరు పత్రికను ఉపసంహరించుకున్నారట! నోట్లు ముద్రించే యంత్రం, కాగితాలూ పోయినట్లు ప్రభుత్వం ప్రకటించలేదు కాబట్టి అవి పోనేలేదనీ, దేశభక్తులైన గున్నేశ్వరరావు గారి మీద తప్పుడు కేసు బనాయించారనీ వాదించి విడిపించగలిగాడని చెప్పారు. హైకోర్టు ముందున్న విగ్రహం ముత్తయ్య సెట్టిదని చెప్పారు. ఆయన అసలు పేరు ముత్తా వేంకట సుబ్బారావు. 1938లో మద్రాసు హైకోర్టులో ప్రధాన న్యాయమూర్తిగా నియుక్తుడైన ఆయన 1905లో దక్షిణ భారత వైశ్య సంఘాన్నీ, 1929లో చెన్నపురి ఆంధ్ర

మహాసభనూ స్థాపించిన వాడు. నిరాడంబరుడు. ఆయన కలకత్తా మెయిల్లో మొదటి తరగతిలో కూర్చొని రెండో ప్రపంచ యుద్ధకాలంలో ప్రయాణిస్తుంటే గూడూరు కూడలి దగ్గర ఒక బ్రిటిష్ మేజర్ జనరల్‌కోసం దిగి పొమ్మన్నారనీ, టికెట్టున్న తనను దిగమనటం తప్పనీ, ఆ దొర రెండో వైపు కూర్చోవచ్చనీ చెప్తే కొల్లాయిగుడ్డతో ఉన్న ముత్తా వారిని బ్యాట్‌మన్ కిందికీడ్చి పారేశాట్ట. ఆయన సీటు కింద ఉన్న నల్ల పెట్టెను బూటు కాలితో తన్నివేస్తుంటే దాని కమర్యాద జరిగితే నేరం తీవ్ర శిక్షార్హ మవుతుందన్నాట్ట. ఆ మాటలు లక్ష్యపెట్టని సిపాయి తన్నగా పెట్టె మూత ఊడి మదరాసు హైకోర్టు అధికార లాంఛనాలు కిందపడ్డాయిట. వెంటనే వాటిని ధరించి, ఇది కోర్టని ప్రకటించి మేజర్ జనరల్ను క్షమార్పణ చెప్పమంటే ఖాతరు చేయలేదట. తనకు జరిగిన అమర్యాదకు క్షమించి, వివరించి చెప్పినా వినక న్యాయస్థానాన్ని అగౌరవించినందుకు ఏడు సంవత్సరాల కఠిన కారాగార శిక్షను విధించాట్ట – అక్కడికక్కడే. అప్పుడు బ్యాట్‌మాన్‌కే పెద్ద సేనాని లొంగిపోయాడనీ, తరవాత ప్రీవీ కౌన్సిల్ వారు అంత తేలిక శిక్ష తగదని దాన్ని మూడు రెట్లు పెంచారనీ చెప్పారు. న్యాయనిర్వహణలో జంకుగొంకులు చూపని ఆ మహావ్యక్తి విగ్రహమన్నారు. ఈ విషయాలు తరవాత తెలిసినప్పుడు బ్రిటిష్ వాడి న్యాయ నిర్వహణను అభిమానించా లనిపించింది.

### అరసం ఆర్భాటం

1955లో కుటుంబశాంతి నశించింది. ప్రథమ సంతానం పురుడు తీరకముందే చని పోవటం, భార్య రుగ్మత, తండ్రి సన్యసించటం వంటి సాంసారిక విపత్తులు వచ్చాయి. వాటిని మరిచి యథావిధి జీవితం గడపటం కష్టమైంది. పఠన పాఠనాలకు అంకితమైనందువల్ల కొంత ఉపశాంతి లభించింది. అరసం సమావేశాలకు తప్పకుండా హాజరవటం, సాధ్యమైనంత తరుచుగా సారస్వత నికేతనాన్ని సందర్శించటం మనసును స్వాధీనంలో ఉంచాయి. 1956తో పుత్రోదయం తరవాత బండి గాడిన పడింది మళ్ళీ. 1957లో ఢిల్లీలో జరగబోయే ఆసియా రచయితల మహాసభలో అరసం పాత్ర ఏమిటనేది చర్చకు వచ్చింది రాజమండ్రి సమావేశంలో. తెలుగు సాహిత్య చరిత్రను గురించి హిందీ ఇంగ్లీషు భాషల్లో యాభై పేజీలకు మించని వ్యాసాలు రాసి ప్రచురించాలనీ, ఆధునిక సాహిత్యానికి మూడోవంతు స్థలం కేటాయించాలనీ, అన్యభాషల్లోకి అనూదితమైన తెలుగు రచనలకు అధిక ప్రాముఖ్యమివ్వాలనీ నిర్ణయించాం. రెండు భాషల్లోనూ రాసే బాధ్యత నాకు అప్పగించారు. ఆ రెండు భాషల్లో నాకున్న మిడిమిడి జ్ఞానం అంత పని చేసేందుకు పనికిరాదంటే రాసి తెస్తే నలుగురం సాయం పట్టామన్నారు. అప్పట్లో కె.వి.రమణారెడ్డి గారు ఒంగోలు కళాశాలలో పని చేస్తున్నారు. దగ్గర్లో ఉన్నారు కాబట్టి సంప్రతించుకోండన్నారు సినీకవి చక్రవర్తులు. నెలకు రెండు సార్లయినా ఒంగోల్లోనో, చీరాల్లోనో కలుస్తుండే వాళ్ళం. కె.వి.ఆర్.కు ప్రాచీన సాహిత్యం మీద సద్భావం లేదు. అయినా విరాటోద్యోగ పర్వాలను నేనెలా పాఠంగా చెప్తున్నానో వివరించి తిక్కనమీద అభిమానం కలిగించగలిగాను. నేను ప్రయోగాత్మకంగా వచన కవిత వెలగబెడదామని రాసి దాచుకున్న వాటిని ఆయన అభ్యుదయలో ప్రచురించాడు – నాకు తెలీకుండా సంగ్రహించి. ఆయనే నా రచనలో ప్రకృతి



నుంచి పాఠాలు నేర్చుకోవాలనే సూచన ఉందనీ, అది మార్క్సిజానికి విరుద్ధమనీ కొంతకాలం తరవాత ఆక్షేపించాడు. మరికొంతకాలం తరవాత అలా ప్రకృతినీ ప్రజోద్యమాలనూ సమన్వ యించటం ఎంతో అవసరమనీ అన్నాడు! అందు కుదాహరణ ప్రాయమైన గేయభాగం 'విచికిత్స' అని శీర్షికతోనే 1956 అభ్యుదయలో ప్రచురితమయింది. ఆయన అభ్యంతరాలకు గురైన భాగాలివి:

**"కోటికోటి నిలువులలో, తున దాగిన ఆవేదన**
**ఈ అగాధ సాగరసం, గీతములో ధ్వనించునా?...**
**ప్రకృతి గాయనీ గీతులు, సాగరపరిదేవనగా**
**ఇంద్రధనుస్తంత్రుల మూ, ర్ఛనలో వినిపిస్తుందా?**

నేను సంస్కృతంలాంటి హిందీలో రాసిన సాహిత్యచరిత్రను మొదటిదశలో నా సహో ద్యోగులైన బసవయ్య శంకరశాస్త్రులు సవరించిపెట్టారు. బసవయ్య గారు లాహోర్లో, దేశ విభజన తరవాత లక్నోలో రామ్‌విలాస్ శర్మగారి శిష్యులు. తమ గురువుగారు విజయవాడకు వస్తున్నా రంటే లిఖితప్రతి తీసుకునిపోయి ఆయన చేత సవరింపజేశాం. ఆయన ప్రదర్శించిన ఆదరాభి మానాలను మరిచిపోలేను. అరసం మీటింగులో ఇంగ్లీషులో రాసింది చదవమన్నారు. భాషా సంస్కరణకన్నా భావ సంస్కరణ ప్రధానమన్నారు. ఆధునిక సాహిత్యం సంగతి ముందు చదవ మన్నారు. అక్కడే పేచీ వచ్చింది. ఆవంత్స సోమసుందర్ వజ్రాయుధాన్ని రష్యా వాళ్ళు నలభై యాభై భాషల్లోకి అనువదింపజేశారు కాబట్టి దానికి ప్రాముఖ్యమిచ్చానని నా వాదన. అంత మాత్రాన కె.వి.ఆర్. అడివినెందుకు ప్రస్తుతించలేదనే ప్రశ్న వచ్చింది. చివరికి తుమ్మల వారికి రెండు ప్రతులూ ఇస్తే ఆయన వాటిని సంస్కరింపజేసి ప్రచురిస్తాడన్నారు. అరసం తరపున మహాసభకు వెళ్ళే ప్రతినిధి బృందం సంగతి కూడా ఆయనే కార్యదర్శి కాబట్టి బాధ్యత వహించి నిర్ణయిస్తారన్నారు. సమావేశం పూర్తికాగానే తుమ్మలవారు హిందీ ప్రతిని నా చేతికిచ్చి రామ్‌విలాస్ శర్మగారు పరిష్కరించిన తరవాత దీనికి తిరుగేముంటుంది, ప్రచురణకు డబ్బు సమకూర్చుకున్నప్పుడు తీసుకుంటా, నీ దగ్గరే ఉంచమని ఇచ్చాడు. ప్రతినిధివర్గం సంగతి తేలకా, ప్రచురణ వ్యయం సంగతి కన్నా పరిష్కర్త ఎవరో తెలియకపోవటం ప్రధానమని భావించీ తుమ్మల వారు ఇంగ్లీషు ప్రతిని తమ దగ్గరే ఉంచారు (ఆ తరవాత దశాబ్దాలు గడిచాయి. ఒకానొక పుణ్యతిథినాడు అప్పట్లో అధికార భాషా సంఘంలో సభ్యులుగా ఉంటూ కమ్యూనిస్టు పార్టీ చరిత్ర రాస్తున్న కంభంపాటి సీనియరు తెలుగు అకాడమీకి వచ్చి 'నీ దగ్గర ఎప్పుడు తీసుకున్నానో గుర్తులేదు, ఇదుగో తీసుకో'మని దాన్ని నా చేతిలో పెట్టాడు!). ఆసియా రచయితల ప్రథమ మహాసభ నెహ్రూ అధ్యక్షతన, సుకర్ణో ప్రారంభించగా ఢిల్లీలో జరిగింది. మన వాళ్ళెవరూ ఆ చాయలకు వెళ్ళినట్టు లేదు. నాకు తెలీదు. ఆ తరవాత కొద్ది కాలానికి అరసం చీలిపోయింది. మదరాసు శాఖ వేరుపడ్డది. అనిసెట్టి మరణంతో అది విస్మృతమైంది. 1974 దాకా పునరుద్ధరణ ప్రయత్నాలు సాగలేదు.

ఆంధ్రరాష్ట్ర మేర్పడి మొదటిసారిగా ఎన్నికలు జరిగేటప్పటికి కమ్యూనిస్టుల రాజకీయ

సంరంభం బాగా ఉంది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డ తరవాత సాహిత్య అకాడమి ఉద్భవించినప్పుడు చాలామంది అరసం కవులు సర్కారుకవులుగా పరిణమించారు. "దయ్యాలపల్లి రాముడి తమ్ముడు చేరెడు నూకల కమ్ముడు పొయ్యా"దని గొడవ చేసిన కాళోజీ కవు లెవరెవరికి ఎంతకు అమ్ముడు పోయారో లెక్క కట్టినట్లు లేదు! నాకు మళ్ళీ పరిశోధించాలనే దుర్బుద్ధి పుట్టింది. ఆస్తులు హరించాక నెలకు నూట ఎనభై నాలుగు రూపాయల జీతం విలువ తెలిసింది. జీతం నష్టంమీద తప్ప సెలవు ఇవ్వమని కళాశాల వారు తెగేసి చెప్పారు. నా భార్యనూ పిల్లవాణ్ణీ కాపాడుతూ ఈ పెద్ద వయసులో ఎలా బాధలు భరించగలనని మా తాతగారు దుఃఖపడ్డారు. ఉపకార వేతనం వంటిది లభిస్తే ఉభయ తారకంగా ఉంటుం దనిపించింది. అసలు సీటు దొరుకుతుందో లేదో, ఎక్కడ ఎవరి పర్యవేక్షణలో పరిశోధనకు దిగాలో తెలియక గురువుగారికి ఉత్తరం రాశాను – ఆచార్య గంటి జోగి సోమయాజులు గారు శాసన భాషలో మాండలికాలను గురించి పరిశోధిస్తే బాగుంటుందని, విషయ సేకరణ చేసుకొని వస్తే సుఖంగా ఉంటుందనీ రాశారు. వేటపాలెంలో దొరికిన శాసనాలన్నిటికీ ప్రతులు రాసుకున్నాను. రాజమండ్రి వెళ్ళి రాళ్ళభండివారి నిరంతర పర్యవేక్షణలో ఆంధ్ర చారిత్రక పరిశోధక సంఘం వారి గ్రంథాలయంలోని శాసనాల ప్రతులు రాసుకున్నాను. 1958 దాకా ఇదే పని – ఉద్యోగ విధుల తరవాత. ఆరేళ్ళ ఉద్యోగానుభవముంటే పిహెచ్.డి. విద్యార్థి రెండేళ్ళు మాత్రమే విశ్వకళా పరిషత్తులో ఉండవచ్చనీ, ఒక సంవత్సర కాలం కలిసి వస్తుందని మా ప్రిన్సిపల్‌గారు చెప్పారు. ఆ తరవాతి ప్రశ్న ఉచిత వేతన మెవరిస్తారనేది. అప్పటికి యు.జి.సి. లేదు. కేంద్ర పబ్లిక్ సర్వీస్ కమిషన్ వారు GOI స్కాలర్‌షిప్పు లిస్తారు – నెలకు రెండు వందల రూపాయలుగా. అయితే వారు ఎంపిక చేయాలి. దరఖాస్తు చేశాను. అది వస్తే వెళ్తానంటే కుదరదు. విద్యా సంవత్సరం మధ్యకాలంలో వీలుపడదు కాబట్టి ముందుగానే సెలవు పెట్టి పొమ్మని కళాశాలాధికారులు ఒత్తిడి చేశారు. ఉచిత వేతనం రాకపోతే బతకలేమనే భయం వద్దని మా తాతగారే ధైర్యం చెప్పారు. మనం తొందరపడ్డా సర్వీస్ కమిషన్ తొందర పడదు కాబట్టి నూతన విద్యా సంవత్సరారంభంలోనే చీరాల వదలాలని నిశ్చయించుకున్నాను. నా అభ్యర్థనలు పుణేలోని దక్కన్ కాలేజీకి, మదరాసు విశ్వవిద్యాలయానికి, ఆంధ్ర విశ్వకళా పరిషత్తుకూ పంపాను – లిఖిత పూర్వకంగా. ఘటగేగారి పర్యవేక్షణలో పుణేలో పని చేయడానికి అంగీకారం వచ్చింది. నిడదవోలు వేంకటరావు గారు తమ దగ్గరకు రమ్మన్నారు. నీవెక్కడికి వీలైతే అక్కడకు పొమ్మన్నారు గంటి జోగి సోమయాజి గారు. ఇక్కడే ఉంటే నీ పరిశోధన వ్యాసం పరీక్షార్థం మరెక్కడికైనా పోతుంది, ఇంకెక్కడ ఉన్నా ఇక్కడికే వస్తే నీకు ఇబ్బంది కలగవచ్చని దువ్వూరి వేంకట రమణశాస్త్రి గారు రాశారు – 'శివాయ గురవే నమః' అనే శీర్షిక కింద! నాకో సంవత్సరం జూనియరైన కేతవరపు రామకోటిశాస్త్రి ఉస్మానియాకు రమ్మనీ, సీటు వస్తుందనీ రాశాడు. అబ్బూరి వారి సలహా తీసుకుని ఆంధ్ర విశ్వకళాపరిషత్తుకు దరఖాస్తు చేశాను – అప్పుడు మహదేవన్‌గారు ప్రిన్సిపలై ఉన్నాడు. నీకు చచ్చినా సీటివ్వనన్నాడు పాత పగతో. "అతడు నాకు మంచి మిత్రుడోయ్! నా దగ్గర పరిశోధిస్తానంటే ఇస్తా"దన్నారు సోమయాజిగారు. నేను తట్టాబుట్టాతో వచ్చినవాణ్ణి. కాకినాడ వెళ్ళి లక్కరాజు సుబ్బారావు గారి దగ్గర మొరబెట్టు



కున్నాను. "పాత విద్యార్థినైన నిన్ను కాదనటానికి వీల్లేదు – అందులోనూ ఇతర విశ్వవిద్యాలయాలు సీటిస్తామన్న తరవాత" అని వీ.సి.ని కలవమన్నారు. మరునాడు కలిసి సుబ్బారావు గారి వాదన వినిపించాను. ఆయన చేర్చుకొమ్మని ప్రిన్సిపల్‌ను ఆదేశించాడు.

అప్పుడు మరో చిక్కు వచ్చింది. పర్యవేక్షకుడుగా భద్రిరాజును వరించమని అబ్బూరి వారి సలహా. ఆయనకేమో పర్యవేక్షకుడుగా గుర్తింపు లేదప్పటికి. "నీకు గురువూ, ఆయనకు శిష్యుడూ లేని లోపం ఒకేసారి తీరుస్తా"నని అంతపనీ చేశాడాయన. "భద్రిరాజు గారైతే ఆధునిక భాషా శాస్త్రం తెలిసినవాడు కాబట్టీ నీకన్నా ముందే కవితాకందూతి వదిలించుకున్నవాడు కాబట్టీ బాగుంటుంది. నీకు ఇంగ్లీషు కూడా పట్టుబడుతుం"దని అబ్బూరి వారు ఓదార్చారు. వారం పదిరోజులు వేదాంత విద్యార్థిగా సహాధ్యాయుడుగా ఉన్న కోనేరు రామకృష్ణారావు గారి గదిలో ఉండి, చిన్న వాల్తేరులోనే ఒక గది సంపాదించి పరిశోధన వ్యాసంగంలో పడ్డాను. ఆ వైభవం తరవాతి ప్రకరణంలో.

# 8. పరిశోధన వైభవం

ప్రాఙ్మన్నయ శాసన భాషకు చారిత్రక వ్యాకరణం రాయటమనేది పరిశోధనాంశంగా నిర్ణయించుకున్న తరవాత క్రీ॥ శ॥ 11వ శతాబ్దికి ముందున్న తెలుగు శాసనాలను సేకరించి ఎత్తి రాసుకోవటం మొదలైంది. ఆ సమయంలో ప్రధాన సమస్యలైనవి రెండు. ఒకటి: భిన్న పాఠాలున్న శాసనాల్లో ఏది ప్రామాణిక పాఠమో నిర్ణయించటం. రెండోది ఆయా శాసనాల కాలనిర్ణయం. అనేక సందర్భాల్లో లిపి స్వరూపాన్నిబట్టి కాల నిర్ణయం చేయవలసి ఉంటుంది. ఈ రెండు పనులూ నాకు కొత్త. అక్కడ చరిత్ర శాఖలో చేరిన మల్లంపల్లి సోమశేఖరశర్మగారే ఈ విషయాల్లో మార్గదర్శకులు కాగలవారు. వారి నడిగాను. ఆ శాఖాధిపతీ పూర్వం గురువూ అయిన ఓరుగంటి రామచంద్రయ్య గారి అనుమతి కోరాను. ఉభయులూ అంగీకరించి లిపి శాస్త్ర పాఠాలకోసం చరిత్ర విద్యార్థులతోబాటు తరగతిలో కూర్చోటం మంచిదన్నారు. పర్యవేక్షకుడూ అంగీకరించినా తెలుగుశాఖాధిపతి ఒప్పుకోలేదు. పరిశోధక విద్యార్థులు ఎం.ఏ. చదువుతున్న వాళ్ళకు వారానికి నాలుగ్గంటలు పాఠం చెప్పితీరా లన్నా డాయన. తన రచన ఆంధ్ర భాషా వికాసాన్ని రెండు గంటలూ ప్రాఙ్మన్నయ శాసనాలను గురించి మరి రెండు గంటలూ బోధించక తప్పదన్నాడు. పరిస్థితి గ్రహించిన మల్లంపల్లి వారు సాయంత్రాలు తమ ఇంటిలోనే చెప్తామన్నారు. కావలసిన శాసనప్రతులను అబ్బూరి వారు సమకూరుస్తామన్నారు. కష్టం కొంత తగ్గింది.

చీరాలనుంచే కేంద్ర సర్విస్ కమిషన్ వారి ఉపకార వేతనం కోసం దరఖాస్తు చేశాను – కళాశాల ప్రిన్సిపల్ ద్వారా, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు తెలుగుశాఖాధిపతి ప్రిన్సిపాళ్ళ ద్వారా వైస్‌ఛాన్సలరు గారికి అదిచేరి, ఆయన సిఫారసు చేసి ఢిల్లీకి పంపాలి. ఇంత తతంగం ఎలా జరిగిందో తెలియకుండానే నాకు ఇంటర్వ్యూకు రమ్మనే ఆహ్వానం వచ్చేసరికి నేను వేటపాలెంలో ఉన్నాను – ఇంటి గొడవల్లో. తూమాటి దొణప్ప గారు టెలిగ్రామిచ్చారు ఒరిజినల్ సర్టిఫికెట్లు తీసుకుని నేరుగా పోవచ్చుని. అవి వాల్తేరులో ఉన్నాయి. అక్కడ శాఖాధిపతి అనుమతి కూడా తీసుకోవాలి. చచ్చీచెడి సిద్ధమై ఆశీస్సులకోసం, అనుమతికోసం పోతే మరి ఇద్దరు దరఖాస్తు చేశారు – వారికాహ్వానం రాలేదా అని అడిగారు గురువులు. నాకు తెలీదన్నాను. వారు నమ్మలేదు. కొంత పరిశోధన మీద తేలిన విషయం చిత్రమైనది. చీరాల నుంచి శాఖాధిపతికి నా దరఖాస్తు చేరే సరికి ఆయన ఊళ్ళోలేడు. ఆయన వచ్చేదాకా ఆగకుండా తాత్కాలికాధిపతి కాకర్ల వేంకట రామసింహంగారు తమ దగ్గర పరిశోధక విద్యార్థిగా ఉన్న కొర్లపాటి శ్రీరామమూర్తిగారి పేరు సిఫారసు చేశారు. కాగితాలు ప్రిన్సిపల్ మహదేవన్ దగ్గరకు పోయినప్పుడు శాఖాధిపతి రెండో స్థానమిచ్చిన రాజేశ్వరిగారికి ప్రథమ స్థానమిచ్చారు. నాది ఉభయుల ప్రకారమూ మూడో స్థానమే. వైస్ ఛాన్సలర్ కేవలం సంతకంపెట్టి ఢిల్లీ పంపితే అక్కడి వారు ఏ మార్పూలేని, అప్పటికి ఆరేళ్ళు డిగ్రీ కాలేజీలో బోధనానుభవం ఉన్న నన్ను మాత్రం పిలిచారన్నమాట.

### మహనీయుల పరిచయం

సర్ సి.పి.రామస్వామయ్యర్ అప్పుడు యు.పి.ఎస్.సి. ఛైర్మన్‌గా ఉన్నాడు. తెలియని



విషయాలను తెలియవని ఒప్పుకోవటం, వీలైనంత స్వల్పకాలం చేతనైనంత వ్యాకరణ బద్ధమైన ఇంగ్లీషులో మాట్లాడటం, అనుమతిస్తే అప్పటికి చేసిన పని వివరించటమో, చూపటమో తప్ప మరే వెర్రివేషం వేసినా ప్రమాదమేనని పెద్దలు సూచించారు. నా దరఖాస్తును తిరగేసి ఆయన రెండే రెండు ప్రశ్నలు వేశారు. ఉపకారవేతనం ఇచ్చినా పరిశోధనావకాశం విశ్వవిద్యాలయాలివ్వాలి గదా, దాని సంగతేమిటన్నది మొదటి ప్రశ్న. ఇప్పటికే పరిశోధక విద్యార్థిగా ఉన్నానన్నాను. విషయ సేకరణకు ఎంతకాలం పట్టుందో అంచనా ఉందా అనేది రెండో ప్రశ్న. ముద్రిత శాసనాలన్నిటినీ పాఠభేదాలతో సహా రాసుకున్నా నిప్పటికేనని పరిశీలించగోరుతూ కాగితాలు ముందుంచాను. రెండు నిమిషాలు అటూ ఇటూ తిరగేసి 86 పాఠాంతరాలున్న అహదనకర శాసనానికి ప్రామాణికపాఠం ఎలా తేల్చగలవన్నారు. నాలుగక్షరాల విషయంలో మాత్రమే అభిప్రాయ భేదాలున్నాయిగాని వాటి పునరుక్తివల్ల ఇన్ని స్థానాల్లో భేదం కనిపిస్తున్నదని, ఈ తామ్రశాసనం నమ్మదగ్గది కాదని ఫ్లీట్ చెప్పినా ఆ మాట నిజమనిపించినా పూర్వ పరిశోధకులు పరీక్షించినందువల్ల నేనూ పరిగణించక తప్పదనిపిస్తున్న దన్నాను. ఒక్క క్షణమాగి రాతపని మొదలుపెట్టడం ఎప్పటినుంచి అన్నారు. అముద్రిత శాసనాలను కూడా చూసిన వెంటనే నన్నాను. శుభమన్నారు. ఇతరులేవో రెండు ప్రశ్నలు వేసినా అవి ఇంత సూక్ష్మమైనవి కాదు.

1960 వేసవిలో కోయంబత్తూరులో జరిగిన Summer School of Linguisticsకు హాజరైనాను – అనుమతి సంపాదించి. అక్కడ మొదటిసారి సునీత్‌కుమార్ ఛటర్జీ గారి దర్శన భాగ్యం లభించింది. అప్పటికే ఆయన పర్యవేక్షణలో నేనెంపిక చేసుకున్న పరిశోధనాంశం మీదనే పరిశోధిస్తున్నారట కోరాడ మహదేవశాస్త్రిగారు. ఈ పునరుక్తి ఎందుకని నా పర్యవేక్షకుణ్ణి ప్రశ్నించి నన్ను నా దగ్గర ఉన్న సమాచారంతో కలవమని సమయనిర్దేశం చేశారు. అప్పుడు భద్రిరాజువారి పరిశోధనలను పర్యవేక్షించిన అమెరికన్ భాషా శాస్త్రవేత్త ఎం.బి.ఎమెనోగారు అక్కడే ఉన్నారు. ఆయన నన్నొక గంటముందే తమను కలవమని చెప్పి, అక్షరాక్షరం పరిశీలించి రెండు ప్రధాన సూచనలు చేశారు. ఒకటి విశ్లేషణ విపరీతంగా చేసి అసంఖ్యాక విభాగాలను కల్పించవద్దన్నారు – ధ్వన్యాలోకాదుల్లో వందల సంఖ్యలో అలంకారాదుల్లోని విభేదాలను కల్పించి చెప్పి విషయం దురవగాహం చేశారని ఆయన వాదం. రెండోది చేతనైనంత సంక్షిప్తంగా రాయాలనేది. అప్పటికి నేను రాసిన మొదటి పరిశోధన పత్రం అర్ధానుస్వారం మీద. అదీ ఇంగ్లీషులో నూట అరవై పేజీలయింది టైపులో. తక్కువ పేజీలు రాస్తే తప్పుల సంఖ్య తగ్గతుందనీ, అముఖ్య విషయాలను అధస్సూచికలో సాంకేతికంగా సూచించి ప్రధానాంశాలను మాత్రమే సిద్ధాంత వ్యాసాల్లో రాయాలనేది రెండో బోధన. తన టైపు రైటరు ఎరువిచ్చి మాతృభాషా విషయం కాబట్టి తాను తగ్గించి చూపిన భాగాలను మరింత సంక్షేపించి మరునాడు తమకు చూపమన్నారు. ఛటర్జీ గారితో నా వాదం వినిపించే సమయంలో తామూ కల్పించుకొని నేనెంపిక చేసిన పరిశోధన విధానం మెరుగైనదని నచ్చచెప్పారు. నా సొంత పర్యవేక్షకుడు ఇంత శ్రద్ధాసక్తులతో సాయపడలేదు. ఛటర్జీ గారి అసాధారణ జ్ఞాపకశక్తి ఆకట్టుకుంటే, ఎమెనో గారి నిష్కాపట్యం, అభిమానం ఆయన మీద నా భక్తి ప్రపత్తులను పెంచింది. వారం రోజుల తరవాత

నేను ఊటీ చేరుకున్నాను అముద్రిత శాసన పాఠాలకోసం. మధ్యాహ్నం ఆ ఊరు చేరిన వాణ్ణి సాయంత్రం మిత్రుడు కొల్లూరి హర్షవర్ధన శర్మతో బొటానికల్ గార్డెన్లో కూర్చొని మరునాడు గవర్నమెంట్ ఎపిగ్రఫిస్టు కార్యాలయంలో చేయవలసిన ప్రయత్నాలను గురించి మాట్లాడుకున్నాం. అతడా కార్యాలయంలోనే పని చేస్తున్నాడు. అతడి తండ్రిగారు తర్కసింహ బిరుదాంకితులైన సోమశేఖరశర్మగారు వాల్తేరులో వేదాంత శాఖలో పండితులుగా ఉండేవారు. వారి పరిచయం నాకుంది. లేచి ఎవరింటికి వారు పోయే ప్రయత్నంలో ఉండగా హర్షుడు “ఏం మాట్లాడకు. పెద్దాయన వస్తున్నాడు. నమస్కరించి మౌనం పాటించు. నీకే తెలుస్తుంది ఆయన ఘనత” అన్నాడు. ఆ వస్తున్న వ్యక్తి సర్ సి.పి.రామస్వామయ్యరు గారు. నమస్కరించిన హర్షుణ్ణి గుర్తించి అతడి తండ్రిగారి ఆరోగ్యాదులను పరామర్శించాడు. తరవాత నావైపు చూసి “ఈ ముసలాణ్ణి గుర్తు తెచ్చుకోనీ. ఏమీ చెప్పకు” అని ఓ క్షణం తరవాత ‘నీవు పరిశోధనకు సాయం కావాలని సర్విస్ కమిషన్ ఇంటర్వ్యూకు వచ్చావు కదూ? రాధాకృష్ణ అనుకుంటా నీ పేరు. అముద్రిత శాసనాలకోసం వచ్చావన్నమాట” అనే సరికి నిర్ఘాంతపోయాను. అయిదారు నెలల కిందట అయిదు నిమిషాలైనా ఎదుట నిలబడని నన్ను గుర్తుపెట్టుకోవటమేగాక నా పరిశోధనాంశం కూడా ఆయనకు గుర్తుంది! వెంటరమ్మని తోటకెదురుగా ఉన్న తన బంగళాకు తీసుకపోయి మా ఇద్దరికీ టీ ఇప్పించి ఊటీ అనే మాటకు వ్యుత్పత్తి ఏమని నన్నడిగాడు. సరిగా తెలీదంటే చలికి ‘ఊఊ’ అంటూ వేడి టీ తాగే చోటని నవ్వాడు. నేను హీనస్వరంతో హర్షుడితో ‘ఇది జానపద వ్యుత్పత్తి’ అనటం ఆయన పాము చెవులకు విన్పించింది. “నిజమేగాని తెలిసిన విషయాన్ని ధైర్యంగా చెప్పాలి – జంకరా”దన్నాడు. సర్కారును చూశావా అని అడిగితే రేపుదయం దర్శిస్తానన్నాను. ‘ఒక్క క్షణ’మని సౌంజ్ఞచేసి డి.సి.సర్కారుతో (ఆయన కూనూరులో నివసిస్తున్నాడట) ఫోనులో సరదా కబుర్లు చెప్పి “రేపు సరిగ్గా ఉదయం పది గంటలకు ఓ బక్కపలచని వ్యక్తి ఆకలి చూపుల్తో మిమ్ములను కలుస్తాడు. అతగాడు కేసియస్ కాడు. సాయం చేయండి – నాకు చేస్తున్నాననుకొని” అనగానే నా తల తిరిగిపోయింది. ఆయన కళ్ళల్లోకి చూడటం చాలా కష్టం. సర్ ఎస్.రాధాకృష్ణన్ కళ్ళూ ఈయన కళ్ళూ తళతళా మెరుస్తుంటాయి. బేడిస చేపల్లాగా కదులుతుంటాయి. చూపుల్తో ఆకట్టుకోనూ గలరు – అంచనా వేయనూగలరు ఎదుటి వ్యక్తిని.

మరునాడు గవర్నమెంటు ఎఫిగ్రఫిస్టు గారి దర్శనార్థం టైం ప్రకారం కాపుకాశాను. ఆయన కారు దిగుతూనే “ముందు నన్నెందుకు కలవలేదు? నేను సాయంచేయనా? ఆయన సిఫారసెందుకు కోరా”వని కోప్పడ్డాడు. హర్షుడు వివరిస్తున్నా ఆయన తన గదివైపు నడిచాడు. మేం వెంట నడిచాం. హాజరు పట్టీలో సంతకం పెట్టిన తరవాత “మీ తెలుగువాళ్ళు అశక్తులు. భాషాభిమానశూన్యులు. వందల సంఖ్యలో అముద్రిత శాసనాలుంటే మీ ముఖ్యమంత్రి ఏం చేస్తున్నాడు, ఏం చేశాడు? (అప్పుడు నీలం సంజీవరెడ్డి గారు ముఖ్యమంత్రి). మా బెంగాలీలైతే ఇక్కడి అధికారుల తలలు బద్దలుకొట్టి అచ్చు వేయించుకొనే వాళ్ళు. తమిళ శాసనాలన్నీ అచ్చయినాయి. మీకు తోడుబోయిన అసమర్థ కర్ణాటకు లిద్ద రున్నా రిక్కడ” అంటూ వాళ్ళను పిలిపించాడు. ఆయన తరవాతి స్థానంలో ఉన్న హెచ్.కె.నారాయణస్వామి తండ్రిగారు హెచ్.కృష్ణశాస్త్రి



మొట్టమొదటి భారతీయ లిపి భాండాగారాధిపతి. రెండో వ్యక్తి అదే పదవిలో జూనియర్‌గా ఉన్న జి.ఎస్.గాయ్. ఆయన ప్రాచీన కర్ణాటక శాసనాలకు చారిత్రక వ్యాకరణం రాసిన పరిశోధకుడు. “గాయ్! ఇతడికి తోడ్పడు. కొత్తగా శాస్త్ర విషయాలేవైనా ఇతడి ద్వారా తెలుస్తాయేమో గ్రహించు. తెలిస్తే నాకూ చెప్పు. నేను లైబ్రరీలోకి వెళ్తున్నా”నంటూ తిరిగి చూడకుండా వెళ్ళాడు. ఆయన ధోరణి నాకు నచ్చిందికాని వ్యక్తిత్వ విషయం మరి పదిరోజులకుగాని తెలియలేదు.

భారత ప్రధాని జవాహర్‌లాల్ నెహ్రూ ఈ పరిశోధనాగారాన్ని ఫలానా రోజు సాయంత్రం 4 గంటలకు సందర్శించి 5 గంటలకు రేస్‌కోర్సులో బహిరంగ సభలో పాల్గొంటారని కబురు వచ్చింది. నెహ్రూగారు లెఫ్టనెంట్ జనరల్ కుమారమంగళంతో బాటు పోనీ మీద కొండకోనల్లో విహరిస్తున్నారన్నారు. సాయంత్రం 4.50కు సర్కారు గారు గదిగదికీ తిరిగి కిటికీలు మూయించి, తలుపులు వేయించి, అందరినీ 5 లోగా బయటికి పొమ్మని శాసించి, సరిగ్గా టైం ప్రకారం కాపలా వారికి తలుపులు మూసిన భవనాన్ని అప్పగించి, స్వయంగా కారు తోలుకుంటూ వెళ్ళిపోయాడు! ప్రధానికోసం పడిగాపులు కాయలేదు. మేం అక్కడే తారట్లాడుతుండగా అయిదున్నర ప్రాంతాల్లో గుర్రపుడెక్కల చప్పుడు వినిపించింది. నెహ్రూగారు వేంచేశారు. తలుపులు తెరవమని నేపాలీ కాపలాదారును ఆదేశించాడు. అతగాడు ఎడమచేత్తో రైఫులును అడ్డంగా పెట్టి కుడిచేత్తో శాల్యూట్ చేశాడుగాని చలించలేదు – శిలావిగ్రహం లాగా. నెహ్రూ గారికి కోపం వచ్చి చేతిలోని ఎబొనీ రాడ్తో తలుపుల పైభాగానున్న అద్దాలు పగలగొట్టాడు. పరివారం యావత్తూ నిశ్చలంగా ఉంది – నేపాలీ సిపాయి భంగిమ మారలేదు. “సర్కారుగా రెక్కడ?” అని ప్రధాని ప్రశ్న. ‘సకాలంలో ఇంటికిపోయి ఉంటా’డని వెనక ఉన్న సి.పి.గారి వ్యాఖ్య. గవర్నరు బిష్ణు రాం మేధీ నీరసంగా కలెక్టరుతో ‘ఆయన్ను పిలిపించండి’ అని చెప్పారు. ఓ ఇరవై నిమిషాల తరవాతనో, అరగంటే గడిచిందో సర్కారు గారు వేంచేశారు. ప్రధాని ఆలస్యానికి క్షమించమని, తాను బద్దలు కొట్టిన అద్దాల ఖరీదు చెల్లిస్తానని చెక్కు పుస్తకం తీశాడు. ఎంత చెల్లించాలని అడిగాడు. “నేను వడ్రంగినా? నాకివేవీ తెలియ”వన్నాడు సర్కారు నిర్లక్ష్యంగా. నెహ్రూగారు ఏదో రాసి “ఇది అయిదు వేల రూపాయలు నాకు నేను విధించుకున్న జరిమానా. క్షమించి స్వీకరించండి” అని ఇచ్చి, మరుక్షణంలో “కుమార మంగళమ్! నిబంధనలు సడలించైనా ఈ సిపాయికి నేనిస్తున్న ఈ నూట పదార్లూ స్వీకరించనీండి బహుమానంగా. కాపలా రెట్టింపు చేయండి – తలుపులు సరిగా అమర్చేదాకా. వీలైతే ఇంత నిర్భయంగా తన విధి నెరవేర్చిన ఈ సిపాయికి పదోన్నతి కల్పించండి” అన్నాడు. “ఎంత మొత్తుకున్నా సర్కారుగారు లోపలికి పోనీరు. సభకైనా వెళ్దాం పదం”డంటూ నెహ్రూ నమస్కరించి వెళ్ళాడు. ఆ సభారంభంలో నెహ్రూ వ్యక్తిత్వంలోని మరో విలక్షణత బయటపడింది. “మహాజనులారా! సభకు గంటన్నర ఆలస్యంగా రావటమేగాక ప్రభుత్వ కార్యాలయం తలుపులను బద్దలు కొట్టిన నావంటివాడు ప్రధానిగా పనికిరాడు. రాజీనామా చేద్దామనుకుంటున్నా పదవికి!” అంటే జనం “నో! నో!” అని కేకలుపెట్టారు. నెహ్రూ ఆత్మదూషణ జోరు చేశాడు. జనం ఆరాధన ఎక్కువ చేశారు. తప్పును సమర్థించుకోకుండా ప్రజాభిమానం సంపాదించగలిగిన ఆయన రాజకీయ విజ్ఞత ఆశ్చర్యకరం – సర్కారు ప్రవర్తనలాగానే. అటువంటి అద్భుత దృశ్యాలను మళ్ళీ చూడగలనా? నమ్మకం లేదు.

దొరికినంత సమాచారం సేకరించుకొని వాల్తేరు చేరినప్పుడు మల్లంపల్లి వారు సహజ ధోరణిలో ఒక్క సలహా ఇచ్చారు. "చిలుకూరి నారాయణరావు, గంటిజోగి సోమయాజుల గ్రంథ రచన నాటికి ఇన్ని తెలుగు శాసనాలు దొరకలేదు. గిడుగు వేంకటరామమూర్తి గారు రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచికలో నన్నయ కావ్యభాష ఆనాటి వ్యావహారికానికి చాలా సన్నిహితంగా ఉందన్నారు. నిజానిజాలు తేలాలంటే క్రీ।। శ।। 11వ శతాబ్ది చివరిదాకా ఉన్న తెలుగు శాసనాలన్నిటికీ చారిత్రక వ్యాకరణం రాయటం అవసరం. నా హృదయం అట్టడుగు నుంచి చెప్తున్నాను. మరో శతాబ్ది శాసనాల చేరిక శ్రమనూ, సమయాన్నీ పెంచినా ఉపయోగ కరంగా ఉంటుంది. పరిధి పెంచుకో"మన్నారు. సరేనన్నా. నా చాకిరి రెండింతలు పెరిగింది. పదకొండో శతాబ్ది శాసనాలు పెద్దవి. పదజాలం ఎక్కువ. వ్యుత్పత్తులు వెతకటం శ్రమసాధ్యం. అప్పటికి ఎమెనోబరోల ద్రవిడ భాషా వ్యుత్పత్తికోశం వెలువడలేదు. తయారీలో ఉంది. భిన్న ఆకరాల నుంచి వ్యుత్పత్తుల సేకరణ గ్రంథ విస్తృతిని విపరీతంగా పెంచుతుంది. ఇది చాలనట్లు పాఠనభారం. ఇలా గింజుకుంటుండగా కేంద్ర ప్రభుత్వ పరిశోధనోచిత వేతనం వచ్చింది. అప్పుడు నాకీ పాఠనభారం తగ్గించకపోతే జి.ఓ.ఐ. రీసర్చి స్కాలర్‌గా నాకున్న అవకాశాన్ని పురస్కరించుకుని నాకు నచ్చిన మరో విశ్వవిద్యాలయానికి వెళ్ళగలనని పట్టుబట్టి సాధించాను.

విశాఖలో సంసారం, పరిశోధన, బోధనబాధ్యతలూ ఉండగా రామేశ్వరం పోయినా శనేశ్వరం వదలదన్నట్లు, స్వర్గానికి పోయినా ఏకులబుట్ట తప్పదన్నట్లు, నాకు అదనపు బాధలు తప్పలేదు. నరవాణే అనే మరాఠీ వీరుడు భారతీయ భాషలన్నిటికీ తులనాత్మక నిఘంటువు రాస్తున్నానని ఆర్భాటంచేసి, ప్రధాని నెహ్రూను నమ్మించి ప్రభుత్వ వ్యయంతో దేశ సంచారం మొదలుపెట్టాడు విమానాల్లో. నాలుగు వందల పదాల పట్టిక తయారుచేసుకొని ఆ ఇంగ్లీషు మాటలకు భారతీయ భాషల్లో సమానార్థకాలను సేకరించే ప్రయత్నంలో భాగంగా వాల్తేరు వస్తే ఆ మహాపురుషుడికి సాయపడమని నాకు మరో పనిపెట్టారు. గవర్నరును తెలుగువాళ్ళం గవర్నరనే అంటాం. అంటే హిందీ మరాఠీల్లోని మాటలను ఎందుకు వాడరని తగాదా పెట్టుకున్నాడు. నచ్చజెప్పడానికి ప్రయత్నించి ఆయన దాష్టీకం ఎక్కువ కాగానే "మా భాష. మా ఇష్టం ప్రకారం పదాలు వాడ్తాం. మీకు సమ్మతం కాకపోతే నేను లెక్కచేయ"నన్నాను. "ఇది నెహ్రూజీ పని" అని బుకాయించాడు. "అదే నిజమైతే స్వయంగా ఆయనే చేయటం మంచిది. మీ భావాలను మా మీద రుద్దలేరు. మీకు తోచినట్లు ఈ నిఘంటువును అచ్చువేయండి. నాకు తోచినట్లు ఖండన గ్రంథం రాస్తా"నన్నాను. నా అసహనాన్నీ, అహంకారాన్నీ అందరి దృష్టికీ తెస్తానని బెదిరించి తన దారిన తాను పోయాడు. ఆ తరవాత "ఎగ్జిబిషన్ బెట్టున్నాం. శాసన లిపిలోనే శాసనం ప్రతిని రాసి, నేటి అక్షర స్వరూపం సూచించి, పాత మాటలకు అర్థాలు రాయ"మనే పురమాయింపు వచ్చింది.

ఆ పీడా వదిలేసరికి భద్రిరాజు గారికి పెన్సిల్వేనియా విశ్వవిద్యాలయంలో భాషాశాస్త్రం బోధించిన లీ లిస్కర్ దొరగారు సతీసమేతంగా వాల్తేరు వచ్చారు. ఆయన అప్పటికి రాతప్రతిగా ఆధునికాంధ్రభాషా వ్యాకరణాన్ని ఇంగ్లీషురో రాస్తున్నాడు – An Introduction to Modern Telugu అని. అందులో కొన్ని మాటలకు ఆయన భార్యగారు బొమ్మలు వివరణ చేశారు. ఆయనతో కలిసి పనిచేయమన్నారు. అది ఒక విధంగా నాకు మేలు కలిగించింది – ఆయనతో నేను ఇంగ్లీషులోనే మాట్లాడాలి. నా భాషను సరిదిద్దటం ఆయన వంతు; అలాగే ఆయన నాతో తెలుగులోనే మాట్లాడితే ఆ తెలుగును సవరించటం నా బాధ్యత. ఈ ఏర్పాటు ఉభయ భ్రష్టతకే దారితీస్తుందో, పరస్పర ప్రయోజన సాధకమో కొంతకాలం సహచరిస్తే గాని తెలియదు. సముద్రతీరంలో పడవల దగ్గరికి పోతే వాటిలోని ప్రతిభాగానికీ తెలుగుపేరేమిటని అడిగేవాడు. మన నిఘంటువుల్లో చిన్న వృత్తులకు సంబంధించిన పదజాలం లేదు. తెలుగుమాట తెలియనిదే బ్రౌను నిఘంటువు ద్వారా ఇంగ్లీషు పదం తెలుసుకొనే వీలులేదు. ఇంగ్లీషు మాట లిస్కర్ చెప్పినా మన ద్విభాషా నిఘంటువుల్లో వాటికి సమానార్థకం దొరకదు. పెళ్ళీ – పిచ్చీ వ్యవహారంలా సాగింది మా సాహచర్యం. ఇంగ్లీషులో పది వాక్యాలు రాయగలనన్న నమ్మకం కుదిర్చా డాయన నా మనసులో.

నిత్య విధిగా సాయంత్రాలు అబ్బూరి వారిని కలిసేవాణ్ణి. ఆయన కుటుంబ సభ్యుల్లో ఒకణ్ణనే భావం లోకులకూ కలిగింది. అందువల్ల కె.ఆర్.శ్రీనివాసయ్యంగార్ వంటి ఇతరా చార్యులతోనూ మంచి పరిచయం కలిగి పెరిగింది. పరిశోధన రెండో సంవత్సరంలో పడీపడకముందే ఒక సువార్తో, దుర్వార్తో తెలిసింది. అబ్బూరివా రొక సాయంత్రం నన్ను పిలిచి "ఎందుకైనా మంచిది సిద్ధాంతభాగంలో నీవింకా తెలుసుకోవలసిన విషయాలనూ, తీర్చుకో వలసిన అనుమానాలనూ గుర్తురాసుకుని భద్రిరాజు వెంటపడి త్వరగా తెలుసుకో. మనవాడు మళ్ళీ అమెరికా పారిపోతున్నట్లున్నాడు. జాగ్రత్తపడ"మని హెచ్చరించారు. నేను వెంటపడేకొద్దీ పర్యవేక్షకుల అనుమానం తీవ్రతరమైంది. అబ్బూరి వారి మీదనే అనుమానం హెచ్చి "నా ప్రయాణం సంగతి చెప్పారా? చెప్పకపోతే ఇంత రహస్య వ్యవహారం అతడికి ఎలా తెలిసింది?" అని నిగ్గదీస్తే – "నేనే చెప్పాను – హనుమంతుడు సూర్యుడి దగ్గర చదివినట్లు వీడు నీతోబాటు నిర్వాకం చేయలేడని. తెలిసింది చెప్పు, వెళ్ళే ముందు. తన పని తానే చేసుకోగలడని రాసి ఇచ్చిపో"మ్మన్నారు అబ్బూరి వారు. ఆ తరవాత కొద్దికాలానికి – కొత్త విద్యా సంవత్సరం మొదలయ్యేనాటికి – నేను విషయ సేకరణ పూర్తిచేసి విశ్లేషణ కూడా అయిపోయి సిద్ధాంత వ్యాసరచన ఆరంభించాననీ, ఇకముందు పర్యవేక్షణ అక్కరలేదనీ రాసిచ్చి భద్రిరాజువారు అమెరికా వెళ్ళిపోయారు. "ఇప్పుడు నా దగ్గర చేరవోయ్. దిక్కులేని సంసారంలా పని చెరుచు కోవ"ద్దని సోమయాజిగారు వేధింపు మొదలుపెట్టారు. సిండికేట్ సమావేశాలకు నెలనెలా వచ్చే మా ప్రిన్సిపల్ గారి సలహాతో, సహాయంతో కేంద్ర ప్రభుత్వ విద్యాశాఖ అనుమతిస్తే నేను తిరిగి చీరాల కళాశాలలో చేరవచ్చు ననిపించుకున్నాను వి.సి.గారి దగ్గర. ఒకప్పటి ఒంగోలు సబ్–కలెక్టరూ ఆనాటికి కేంద్ర విద్యాశాఖ కార్యదర్శి అయిన లోబో ప్రభువు నుంచి అనుమతి సంపాదించటం సులువుగానే సాగింది. అప్పటికి ధ్వనిప్రకరణం కొంతవరకు మాత్రమే రాశాను. ఎమెనోబరోల ద్రవిడ భాషా వ్యుత్పత్తి నిఘంటువు (డి.ఇ.డి.) వెలువడగా కొనుక్కుని చీరాలకు తట్టాబుట్టా కట్టి తరలిపోయాను.

రచనారంభానికే ముందే గ్రాంథికాంధ్రంలో తప్ప సిద్ధాంతవ్యాసం రాయటానికి విశ్వకళా పరిషత్ నిబంధనలు అనుమతించవని తెలిసింది. ఇంగ్లీషులో రాస్తే నిరాకరించే వీలులేదనీ తెలిసింది. పురిపండా వగైరా లెన్నివిధాల, ఎంతగా పోరాడినా వ్యావహారిక భాష నప్పటికి ఏ విశ్వవిద్యాలయమూ అనుమతించలేదు. చీరాలకు బయలుదేరే నాటికి అంతకు ముందు ప్రయాసపడి భిన్న కాలాలనుంచి సేకరించిన భిన్న భాషా సమానార్థకాలను ప్రత్యేక సంకేతాలతో సహా కొంతవరకు మాత్రమే టైపు చేయించగలిగాను. మిగిలిన భాగాన్ని టైపుచేసి నాకు భద్రంగా చేర్చేందుకు ఏర్పాటు చేసుకున్నాను. డి.ఇ.డి. లభించింది కాబట్టి అందులోని అంశాల సంఖ్య ద్వారా అప్రధాన పదాలకు వ్యుత్పత్తి సూచించటం సాధ్యపడుతుంది – గ్రంథ విస్తృతి తగ్గించ వచ్చు. సేకరించిన శాసనాలను రోమన్ లిపిలో పాఠభేదాదులతో సహా టైపు చేయించటం సాధ్యమయిందప్పటికి. చిత్తు ప్రతులతో చీరాలచేరి విశ్రాంతి సమయంలో సిద్ధాంత వ్యాసం తొలి ప్రతిని సిద్ధంచేయవచ్చని చాలా ఆశపడ్డాను. మొత్తం 11 నెలల కాలం మాత్రమే ఉపకార వేతనం పొంది ఆ ప్రణాళిక నుంచి తప్పుకోటానికి కేంద్ర ప్రభుత్వానుమతి పొందాను. పరిశోధన కాలంలోనే ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి కార్యక్రమంగా అబ్బూరి వారి పర్య వేక్షణలో జరుగు తున్న నన్నయ పదప్రయోగ కోశనిర్మాణంలో పాలు పంచుకున్నాను. అందువల్ల కనీసం 11వ శతాబ్దిలోని కావ్యభాషనూ, శాసనభాషనూ సరిపోల్చటానికి పనికివచ్చే పదప్రయోగాలు లభిం చాయి. అది లాభం. సేవా, శ్రమలు నష్టం.

**మారుతున్నవాతావరణం**

మొదట మూడేళ్ళు, తరవాత రెండేళ్ళు విశ్వకళాపరిషత్తులో మొత్తం అయిదు సంవత్స రాలున్నప్పటి అనుభవాలు చిత్రమైనవి. నా పరిశోధన కాలంలో కూడా అప్పటి వైస్‌ఛాన్సలరు బుధవారాల్లో సీనియర్ ఎం.ఏ. క్లాసులు తీసుకొంటూనే ఉన్నాడు. కనీసం 15 రోజులకొకసారి శనివారం మధ్యాహ్న సమయాల్లో ఉపాధ్యాయులనూ పరిశోధక విద్యార్థులనూ సెనేట్ హాల్లో సమావేశపరిచేవాళ్ళు. హాజరు నిర్బంధ మనకపోయినా సాక్షాత్తు వి.సి.యే యావత్ వ్యవహారాన్నీ పర్యవేక్షిస్తున్నందువల్ల విధిగా హాజరుకావలసి వచ్చేది. ఏ రోజున ఏ పరిశోధక విద్యార్థిని తన పరిశోధనాంశం గురించి వివరించమంటారో తెలియదు. ఏ శాస్త్రంలో చర్చలు జరుగుతాయో ముందుగా తెలియదు. పెద్దా, చిన్నా తారతమ్యం లేకుండా అందరూ సమావిష్టులు కాబట్టి ఏ మూలనుంచి ఎవ రేప్రశ్నలు వేస్తారో తెలియదు. మన అజ్ఞానం బయటపడకుండా మనం బయటపడటం జరిగే పనికాదు. ఆ విధానంవల్ల తన పనిని తాను సమర్థించుకోగల సాహసం సంపాదించటంతోబాటు తనకు తాడూ పేడూ తెలియని ఇతర శాస్త్రాల్లోని మౌలిక సిద్ధాంతాలూ, పరిశోధన పద్ధతులూ, పరిశీలితాంశాలూ అందరికీ తెలుస్తాయి – అర్థమైనంతవరకు. ఒక మారు syntax అనే విషయం మీద చర్చ ఆరంభించాలన్నారు వి.సి.గారు. భాషా విభాగాల్లోని ఆచార్యుల నుంచి పరిశోధనలో అడుగుపెట్టిన వారివరకూ అందరూ అయిదేసి నిమిషాల్లో వివరించాలన్నారు. అందరం వాక్యరచనా విధానమనీ కారకమనీ భావించి తెలిసిన, చేతనైన పద్ధతిలో ప్రసంగించాం – ఓ గంటసేపు. తరవాత బాంబు పేలింది. పాశ్చాత్య దేశాల్లో అన్ని



మౌలిక శాస్త్రాల పాఠ్యప్రణాళికల్లోనూ అది నిర్బంధ పాఠ్యాంశంగా ఎందుకుంది? మన దేశంలో ఎందుకు లేదు? అనే ప్రశ్నలు వచ్చాయి. కేంబ్రిడ్జిలో గణితశాస్త్రంలో పిహెచ్.డి. తీసుకొని ఆ శాఖాధిపతిగా ఇక్కడ పనిచేస్తున్న ఆచార్యులు ఎన్.రామస్వామి గారు అది కేవలం భాషా విషయంకాదని, తర్కశాస్త్రంలో భాగమనీ, రుడాల్ఫ్ కార్నాప్ రాసిన Logical Syntax గణిత శాస్త్రం పాటించే తర్క విధానాలను వివరిస్తుందనీ, ఆ శాస్త్రం మౌలికం కాబట్టి దానితో సంబంధ మున్న ఇతర శాస్త్రాల వారికీ అది నిర్బంధ పాఠ్యాంశంగా ఉందనీ, దాన్ని బోధించగల వాళ్ళు మన దేశంలో చాలా కొద్దిమంది మాత్రమే ఉన్నందువల్ల మన విశ్వవిద్యాలయాలు ఆ శాస్త్ర విభాగాన్ని పట్టించుకోవటంలేదనీ, అందువల్ల మన దేశంలోని శాస్త్ర పరిశోధన విధానాల ప్రమాణాలు తక్కువగా ఉన్నాయనీ వివరించారు! ఇది ఉపాధ్యాయవర్గంలోని చాలా మందిక్కూడా కనువిప్పు. ఆ కాలంలో అమల్లో ఉన్న ఈ చర్చా పద్ధతి భిన్న శాఖల, శాస్త్రాల వాళ్ళ అన్యోన్యం పరిచయాలు పెంచుకోటానికీ ఇతర శాస్త్ర విషయాల్లో కనిష్ఠ పరిజ్ఞానమైనా సంపాదించే ప్రయత్నాలు చేయటానికీ తోడ్పడింది. స్పర్ధలూ పెంచింది. విద్యావర్ధనానికీ సాయపడింది.

విశ్వవిద్యాలయ వాతావరణంలోని వ్యక్తిగత స్పర్ధలూ, వాటి పరిణామాలూ కొంతవరకైనా తెలియవచ్చాయి. తెలుగుశాఖలో పింగళివారికీ, గంటివారికీ మధ్య పుట్టిన స్పర్ధవల్ల సాహిత్యాన్ని అభిమాన విద్యగా స్వీకరించిన వారికీ, అలాగే భాషాశాస్త్రం చదివిన వారికీ మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమనేది. 1948లోనే పదవీ విరమణ చేసిన పింగళివారు నా ఆనర్సు నాటికే వాల్తేరు వదిలినా వారి అనుయాయుల ప్రభావం పూర్వంలాగానే ఉండేది. గంటివారి ధోరణి చిత్రమైంది. ఎంత వద్దనుకున్నా భావతీవ్రత పెరిగినప్పుడు పద్యాలు రాసుకొనే దుర్వ్యసనం ఇప్పటికీ పోలేదు కాబట్టి అప్పటికీ ఉండేది. అయిదేళ్ళ నిత్యానుభవంతో గంటివారిని గురించి నేను రాసుకుని దాచుకున్న ఒకటి రెండు చాటువులను బయటపెట్టేగాని కడుపుబ్బరం తగ్గేట్లు లేదు.

**తెలుగు కవిత కింత వెలుగిచ్చినట్టిది**
**ద్రవిడజాతి యనుచుఁ దవిలి చెప్పు**
**తెలుగుపీఠ మెక్కి తెలుగుజాతిని తిట్టు**
**జోగి సోమయాజి యోగమేమొ!**
**కదు రహస్యంబంచు నుడివెనా బహిరంగ, విషయ మన్నట్లు భావించవలయు**
**నది చమత్కారమం చనియెనా దుర్భర, గ్లాని సూచక మనంగాను వలయు**
**ప్రేమతోడుత పల్కరించితి నన్నచో, ద్వేష మున్నదటంచు తెలియవలయు**
**కోపించి నోనాడఁ గూడెనా సౌహార్ద, లాలసుం డనుచు తలంపవలయు**
**తథ్యమిథ్యా విచక్షణ తత్పరతకు, సాక్షిభూతంబు గంజోగి లక్షణంబు**
**టోపి పెట్టినవేమి వెంట్రుకలు ముడిచి, కామశాస్త్రానువర్తి మా సోమయాజి!**

నా పరిశోధనారంభ సమయంలోనే భద్రిరాజువారు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారి ఆర్థిక సహాయంతో కొండ – కుబి భాషాధ్యయనం చేస్తుండేవారు. ప్రభుత్వం అరకు ప్రాంతాలకుపోయి విషయ సేకరణ చేయటానికొక జీపిచ్చింది. కావలసిన బొమ్మలు గీయటానికి కేతినీడు

భాస్కరరావనే చిత్రకారుణ్ణి నియమించింది. అప్పటి విశాఖ కలెక్టరూ, యూనివర్సిటీ సిండికేట్లో ప్రభుత్వ ప్రతినిధీ జె.పి.ఎల్.గ్విన్ అనే ఐ.సి.ఎస్. అధికారి. కోయంబత్తూరులో జరిగే సమ్మర్ స్కూలుకు ముందుగా వెళ్తున్న భద్రిరాజుగారు అవసరాన్నిబట్టి బొమ్మలు గీయించటానికి జీపునిమ్మని తన తరఫున కోరే అధికారం నాకిచ్చిపోయారు. మార్చినెల చివరి వారంలో ఆ జీపును స్వాధీనం చేయమని కలెక్టరు గారు రిజిస్ట్రారు నడిగితే ఆయన నన్ను సతాయించాడు. చిత్రకారుడు జీపు డ్రైవరును మంచి చేసుకొని అరకు వెళ్ళాడని నాకు తెలీదు. నాతో సహా అందర్నీ అవసరమైతే అరెస్టు చేసైనా హాజరుపెట్టమని కలెక్టరు పోలీసులకు ఆజ్ఞాపించారు. నేను స్వయంగా సందర్శించాను కాబట్టి నాకు వారంటు లేదుగాని జీపునూ, డ్రైవరునూ, చిత్రకారుణ్ణీ బంధించారని తెలిసి కలెక్టరును సందర్శించక తప్పలేదు మరోసారి. జరిగిందేమంటే మంచి బొమ్మలు గీయటానికి చక్కని వాతావరణం అరకులో ఉందని పోయే తొందరలో అనుమతి పొందలేదన్నాడు భాస్కరరావు! అతడి బొమ్మలు చూసి సంతోషించి సకాలంలోనే ప్రభుత్వ వాహనం తమ దగ్గరికి చేరింది కాబట్టి క్షమించి విడుదల చేశారు గ్విన్‌గారు. ఆయన తెలుగు భాషాభిమానం, భాషాజ్ఞానం ఆకట్టుకున్నాయి. ఆనాటి పరిచయం తరవాతి కాలంలో నాకు ఒకటి రెండు విధాల తోడ్పడింది. ఆయన నిర్మిస్తున్న తెలుగు – ఇంగ్లీషు నిఘంటువుకు నా దగ్గరి సమాచారమిచ్చి కొంతవరకు ఋణం తీర్చుకోగలిగాను.

పరిశోధనలో ప్రవేశించే నాటికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి కార్యక్రమాల్లో భాగంగా భద్రిరాజు వారి పర్యవేక్షణలో వ్యవసాయ వృత్తికి సంబంధించిన మాండలిక పదకోశం తయారీలో ఉంది. అందులో విషయ సేకరణకు చేరిన చేకూరి రామారావుగారు 1960లో ఎం.ఏ. విద్యార్థిగా ఉన్నారు. మరో వ్యక్తి లింగుట్ల కోనేటప్పగారు వ్యవసాయానుభవమూ, పద సేకరణలో వీరాభిమానమూ కలవాడు. కొంతకాలం ఆయన్ను నా గదిలో ఉండనిచ్చాను. లిస్కర్ వచ్చినప్పుడు తెలుగుశాఖలో సభ జరిపారు. సభాధ్యక్షులుగా వ్యవహరించిన కాకర్లవారు భాషా శాస్త్రాన్నీ దాన్ని అభ్యసిస్తున్న మాబోంట్లనూ తూలనాడారు. అతిథిని సమక్షంలోనే అవహేళన చేస్తే నేనడ్డుకున్నాను. నన్నాయన బెదిరించాడు – నాకు పరీక్షకత్వం రాకుండా చేస్తానని (అంటే తిరిగి చీరాల కళాశాలకు పోయినప్పుడన్నమాట). ఘర్షణ తరవాత నేనింటికి వెళ్తుంటే కొంతదూరం వెంబడి వచ్చిన చేకూరివారు నా ప్రవర్తనవల్ల భాషాశాస్త్ర విద్యార్థులందరికీ భావికాలంలో ఉద్యోగ ప్రవేశానికి ఇబ్బందులు వస్తాయనీ, నాకప్పటికే ఉద్యోగమున్నందువల్ల నిర్లక్ష్యంగా ప్రవర్తించాననీ విద్యారామం అనే చిన్న హోటల్లో సణిగి గొణిగి బాధపడి బాధ పెట్టాడు. నా ఆత్మగౌరవానికీ, అభిప్రాయాలకూ విరుద్ధంగా ఎవరు ఏమిచేసినా లక్ష్యపెట్టనని చెప్పి వెళ్ళిపోయాను. అప్పటికీ ఇప్పటికీ నా అలౌక్యం నన్ను బాధించిందేమోగాని ఆయన లౌక్యం ఆయనకు మంచి పేరు తెచ్చిందని మాత్రం నమ్మలేకున్నాను. ఇలాంటి చిల్లరమల్లర అనుభవాలు దేశకాల పాత్రల్లో, వ్యక్తుల విషయాల విలువల్లో వచ్చిన, వస్తున్న మార్పులకు చిహ్నాలు మాత్రం. ఉన్నత పాఠశాలా విద్యకూడా లేని లింగుట్ల భాషాభిమాన కర్తవ్యదీక్షలు అదే సమయంలో ఆకట్టుకున్నాయి. డిగ్రీ లేకుండా అగ్రపీఠమెక్కిన వాళ్ళూ ఉన్నారు – మల్లంపల్లి వారిలా. ఆర్థి



కంగా దీనస్థితిలో ఉన్న వాళ్ళూ, గంటివారిలా డిగ్రీ లేకుండా ఆచార్యపీఠ మధిరోహించిన వాళ్ళూ – సమాజంలోని వైవిధ్యానికి చిహ్నాలు.

ప్రాచీనాంధ్ర శాసనాలను పరిశీలిస్తుండగా 'ద్రోవది చెఱువు'లనే పదబంధం క్రీస్తుశకం 9వ శతాబ్ది నాటి రండుబల్లి తామ్రశాసనంలో లభించింది. పింగళివారి సాహిత్య పాఠాల ప్రకారం నన్నయ సంస్కృతాన్నీ, తిక్కన అచ్చ తెలుగునూ అభిమానించారు. ద్రోవది, సెల్లుడు వంటి పదాలను తిక్కన సృష్టించాడని సాహితీ విద్యార్థుల కాయన విశ్వాసం పుట్టించాడు. నన్నయకు కనీసం రెండు శతాబ్దాలముందే వాడుకలో ఉన్న ద్రోవది శబ్దం నన్నయకు తెలియదా అనే అనుమానం వచ్చి నిఘంటువులు చూస్తుంటే సూర్యరాయాంధ్ర నిఘంటువులో ద్రోవది శబ్దానికి సభాపర్వ ప్రయోగం కనిపించింది. మనకెవ్వరికీ ఈ సంగతి తెలియక పోవటమేమని చర్చిస్తుండగా వి.సి.గారి కారులో థామస్ బరోగారు తెలుగుశాఖను చూడటానికి వచ్చారు. (1953లోనే ఆయన మొదటిసారి వచ్చినప్పుడు అబ్బూరి వారితో చూశాను రాని పరిచయం కలగలేదు). ఆయన విషయమేమని అడిగి "మీ తెలుగు నిఘంటుకారుల ప్రమాణాలు నాకు బోధపడటం లేదు. ఆదిపర్వంలోనే ద్రోవది శబ్దం ఉండగా సభాపర్వ ప్రయోగమివ్వటం బాగా లే"దన్నాడు! తెలుగుభాషా విస్తృతిని చూపుతూ మేం తయారు చేసిన చిత్రపటాన్ని చూసి ఆయన ఒక ప్రశ్నవేశాడు: "మీ పటంలోనే ఇతర భాషాప్రాంతాలను చూపారు గదా. తెలుగువాళ్ళు ఒరిస్సాలోకి విస్తరించారు గాని ఒరియా వ్యాప్తి తగ్గిపోయిందని గుర్తించారా? లేదా?" అని. ఆయనతో పోల్చుకుంటే మన మెక్కడున్నాం? మన పాండిత్యమేమిటని ఆలోచించి సిగ్గుపడ్డాం.

అముద్రిత శాసనాలకోసం ఊటీ యాత్ర చేసినట్లే ముద్రిత శాసనాలకోసం మద్రాసు పోవలసి రావటం విచారకరం. ఇరవయ్యో శతాబ్ది తొలిదశకంలో అచ్చయిన నెల్లూరు జిల్లా శాసనాలు (3 సంపుటాలు) కనిపించినట్లే కనిపించి విశ్వకళాపరిషద్గ్రంథాలయంనుంచి అదృశ్యమైనాయి. వెతికించగా అవి చీలికలు, పేలికలుగా మారాయని తెలిసింది. అబ్బూరి వారి ఉత్తరంతో మద్రాసు విశ్వవిద్యాలయం గ్రంథాలయాధికారిని కలిశాను. అవి ప్రొఫెసర్ మహాలింగం గారి దగ్గర ఉన్నాయనీ ఆయన తిరిగి ఇచ్చినప్పుడు ఇవ్వగలమనీ అన్నారు. అప్పుడు ముఖపరిచయమున్న నిడుదవోలు వేంకటరావుగారి ద్వారా ఆయన్ను కలిశాను. (ఒకటి రెండు సార్లు వాల్తేరు వచ్చి" అసలేమో మీ వైస్ అసలు ఛాన్సల రున్నాడా స్మీ" అని అడగటమే మా ముఖపరిచయం). మహాలింగం గారు బాణరాజుల చరిత్రను మరింత వివరించి తమ ఎదుట తమ గదిలో కూర్చొని శాసన పాఠాలను ఎత్తిరాసుకోవటానికి అనుమతించారు. (ఆ తరవాత రెండు దశాబ్దాలు గడిచిపోగా మళ్ళీ వాటితో అవసరం వస్తే మళ్ళీ దేశమంతటా గాలించవలసి వచ్చిందంటే మన గ్రంథాలయాల పరిస్థితి, పునర్ముద్రణకు నోచుకోని ప్రాథమికావసరాలను గురించీ వేరే చెప్పనక్కరలేదు).

## ఎంత అవమానం?

ఆరో దశకంలో ఆంధ్రవిశ్వకళాపరిషత్ వాతావరణం మారిపోయింది – ప్రచండ వేగంతో. కులప్రాంత విభేదాలు మొదలై పాత స్నేహితులను పలకరిస్తే ఒకరిమీద మరొకరు దుమ్మెత్తి

పోయటం, పరిచయాలు విస్మరించమని సలహాలివ్వటం మొదలైంది. రిజిస్ట్రారు కూర్మా వేణు గోపాలస్వామి గారికీ, వైస్ ఛాన్సలర్ వాసిరెడ్డి శ్రీకృష్ణ గారికి విభేదాలు నానాటికీ తీవ్రమై వాతావరణం కలుషితం కావటం ఆరంభమైంది. పరిపాలనలో అవ్యవస్థ వస్తున్నందుకు గొప్ప నిదర్శనముంది – అది విచారకరమైంది. ప్రధాని ఆహ్వానం మీద భారతదేశానికి వచ్చి రకరకాల దురనుభవాలు పొందిన శాస్త్రవేత్త జె.బి.ఎస్.హాల్డేన్ను వాల్తేరుకు ఆహ్వానించారు – ఉపన్యాసా లిమ్మని. ఆయనకు గవర్నరు బంగళాలో వసతి కల్పించారు. యూనివర్సిటీ కారిచ్చారు. ఉదయం 8 గంటల నుంచి వారంరోజులపాటు బహిరంగ ఉపన్యాసాలుంటాయని ప్రకటించారు. తొలి రోజు సాఫీగా జరిగాయి సభలు. మలిరోజున యు.జి.సి. ఛైర్మన్‌గా నియుక్తులైన మహ్లనబిస్ గారు వేంచేశారు. వారికి సముచిత సత్కారంచేసి వాహనయోగం కల్పించటానికి మరోకారు లేకపోయిందట– చెప్పాపెట్టకుండా ముందురోజు సాయంత్రం హాల్డేను కిచ్చిన కారును ఉప సంహరించారు. అందులో హాల్డెన్‌గారి కాగితాలున్నాయనైనా గమనించలేదు. కారులేక పోయినా సకాలంలో ఉపన్యాసానికి బయలుదేరి హాల్డేన్ పరుగలమీద క్యాంపస్ దగ్గరకు వచ్చాడు. ఇన్‌గేట్ మూసి ఉంది. గేటెక్కి దూకి, పడి దెబ్బలతో బాధపడుతూ కూడా ఆయన సకాలంలో సభకు వచ్చాడు! నిర్వాహకులకు కనీసం క్షమాపణ చెప్పాలని కూడా అనిపించలేదు. ఊటీలో ప్రధాన మంత్రినే లక్ష్యపెట్టని డి.సి.సర్కార్‌లాంటి స్వతంత్ర వ్యక్తిత్వం గల విద్వాంసుణ్ణి చూసిన కళ్ళతోనే వాల్తేరులో ఒక మహాశాస్త్రజ్ఞుణ్ణి అవమానించి బాధించి ఒక అధికారి మెరమెప్పులకోసం పడికాపులు కాసిన విద్వదధికారులను చూశాను. భావి పరిణామాలు లీలగా గోచరించాయి. ఎదురుగా ఉన్న కాల్టెక్స్ కంపెనీ క్వార్టర్స్ నుంచి ఎందరో పాశ్చాత్యులు సభకు వచ్చారు – విన్నారు – ప్రశ్నించారు. పట్టుమని పది మంది పరిశోధన విద్యార్థులుగాని, అయిదుగురు అధ్యాపకులు గాని హాజరు కాలేదు. కాలాన్ని ఎవరెప్పుడు ఎలా విభజించారో, ఖగోళంలోని పరిణామాలను ఎలా అంచనావేసి మానవుడు పురోగామి అయినాడో ఆయన వివరించాడు. పైజమా లాల్చీలతో నిరాడంబర వేషంలో ఉన్నా, ఉపన్యాసం ముందు వెనకల తెలుగులో ప్రసంగించినా, ఆయన మూర్తిమత్వం కన్నా అప్పుడాయనకు పెద్ద పదవి లేకపోవటమే నిరాదరణకు కారణమనుకున్నాం గాని అది పూర్తిగా నిజంకాదు. అఖిలభారత శాస్త్రవిజ్ఞాన మహాసభల్లో నోబెల్ బహుమాన స్వీకర్త ప్రసంగం వినటానికి ముగ్గురైనా రాలేదుగాని బాబూ జగ్‌జీవన్‌రామ్ ప్రసంగానికి అందరూ హాజరైనారని ఆయన హిందూ పత్రికలో వ్యాసం రాయట మొక ముఖ్య హేతువని తెలిసింది. భారతీయశాస్త్రజ్ఞులు ఒక్కొక్కరు అయిదారు వందల పరిశోధనపత్రాలు రాశామని చెప్పు కుంటారు గాని వాటి రచయితల్లో నూటికి 90 మందికి పైగా వారివారి పరిశోధక విద్యార్థులేననీ, ఆచార్యులు శిష్యుల పరిశ్రమకు తమ పేరు పెట్టుకునే దుస్సంప్రదాయం వచ్చిందనీ, శాస్త్ర పరిశోధనల్లో 90 శాతం పూర్వ పాశ్చాత్య పరిశోధనల పునఃపరిశీలన మాత్రమే ననీ, విద్యార్థులు స్వబుద్ధితో పరిశోధించటాన్ని గురువులు హర్షించటం లేదనీ రాసినందున అగౌరవించారని తెలిసింది. వసతి మొదలైనవి కేంద్ర ప్రభుత్వం కల్పించినవే గాని విశ్వకళా పరిషత్తు వారి చర్యలుకావు.



## విశ్వనాథతో ఒక రాత్రి ప్రయాణం

పరిశోధన కాలంలో 1961 వేసవినాటి ఒకానొక అనుభవం నేను జీవితాంతం మరిచి పోలేనిది. ఇంటి పనిమీద వేటపాలెం వచ్చి తిరిగి వెళ్ళేటప్పుడు దర్జాగా సెకండు క్లాసులో బయలుదేరాను. విజయవాడ నుంచి పార్శిల్ ఎక్స్‌ప్రెస్సులో ప్రయాణం. రాత్రి ఏడెనిమిది గంటల సమయంలో రైలెక్కాను. పెట్టెలో ఎవరూలేరు. పైన పక్కపరిచి ఎవరూ రాకపోతే కింది బెర్తుమీద పడుకుందామని అదీ ఆక్రమించాను. పెట్టెలో ఉండేవే నాలుగు బెర్తులు. ఓ పావుగంట తరవాత ఇద్దరు సామానుతో ఎక్కి రెండోవైపు పక్కలు పరిచారు. మరో పది నిమిషాల్లో రైలు బయలుదేరుతుందనగా విశ్వనాథ సత్యనారాయణగారు ఎక్కారు. ఆయన్ను నేను గుర్తించాను గాని నేనెవరో ఆయనకు తెలియదు. ఆయన రచనలకన్నా ఎన్నో రెట్లు ఆయన వ్యక్తిత్వం గొప్పదనీ, కాని ప్రవర్తన విపరీతంగా కనిపిస్తుందనీ అబ్బూరి వారెప్పుడో చెప్పారు. ఆట పట్టించి చూద్దామనిపించింది. మెడచాచి వంచి రెండు వేళ్ళు కలిపి ఒక వైపు విస్తరించి తుపుక్కున ఉమ్మి. “పైన ఎవర”ని ప్రశ్నించా డాయన. “పరమాత్మ” దన్నాను. “కింద ఎవ” రన్నాడు. “అధమస్థుణ్ణి నేనున్నా”నన్నాను. “వాలకం చూస్తే తెలుగు మాస్టారులాగుంది గాని ఈ వెధవవేష మేమి” టన్నాడు. “వేషాన్నిబట్టి విధవాత్వ మాపాదించే మనం ఆ వేషధారులకు బానిసలుగా మూడు వందల ఏళ్ళున్నాం. ఆక్షేపించి సాధించేదేమి”టన్నాను. “పొగరుబోతులాగున్నావ్. నేను పెద్ద రౌడీనని తెలుసా?” అంటూ ఒక పక్క సంచీతో కూర్చున్నాడు. “మనకు మిగిలింది పొగరేకదా. మా ఊళ్ళో నేనూ రౌడీనే”నన్నాను. “ఔరా! నీ శరీరపుష్టికి రౌడీయిజమా?” అంటే “డేవిడ్ శరీర పరిమాణం చిన్నదైనా గోలియత్‌ను పరాభవించలేదా?” అన్నాను. “నీవు కిరస్తానమా? ఏ వూరు మీది?” అని ప్రశ్నిస్తే మావూరేదో చెప్పి “అంగుష్ఠమాత్రః పురుషః” అన్నారు కదా. శరీర పరి మాణం ప్రధానమా?” అని అడిగాను. “సరే. సంగతి తేల్చుకుంటా. ఏ శాస్త్రం చదివావు? ఎందులో చర్చిస్తా”వన్నాడు. “వ్యాకరణంలోగాని, భాషాశాస్త్రంలోగాని పోరాడగల”నన్నా, “ఆ రెండో కూతకూయకు. నాకు అసహ్యం. భాషాశాస్త్రజ్ఞులమనే పాశ్చాత్య సేవకులు పాణినిని అగౌరవించారు. మ్లేచ్ఛులు – వాళ్ళ మొహం చూడ” నన్నాడు. “అలాగయితే అటు తిరిగి కూర్చోండి. నేనుగూడా అపాణినీయ ప్రయోగాలు చేసే కవులను అసహ్యించుకుంటా”నన్నా. ‘ఆం’ అంటుండగానే “నేను అంతో ఇంతో అష్టాధ్యాయి చదివా. అలాగే భాషాశాస్త్రం కూడా. ఆధునిక పాశ్చాత్య భాషా శాస్త్రజ్ఞులందరూ పాణిని ప్రాతస్స్మరణీయుడని గౌరవిస్తారు. పాణినికి దొంగదండాలు పెట్టి అప్రామాణిక ప్రయోగాలుచేసే వాళ్ళకన్నా బహిరంగంగా పాణిని పాత కాలపు వాడనే వాళ్ళు సజ్జనులు కాదా?” అని అడిగా. క్రూరంగా చూసి, “ప్రేమాభిమానాలున్న చోట చీత్కారమూ ఉంటుంది. దేవుణ్ణి భక్తులు బహువిధాల దూషించారు. ఆ పాటి తెలియదా?” అని నిలవేశాడు. “మీరు ఛూ. షేక్స్పియర్ కూడా కవేనా? అని బహిరంగ సభలో ఈసడించింది భక్తి పారవశ్యంతోనా? మేం కలలోగూడా పాణిని మహర్షిని అలా అవమానించం. మేం అగౌర వించామనటానికి నిదర్శనముందా?” అన్నాను.

అప్పుడాయన “ఎవడో అజ్ఞాని. కానీ మీకు ఆరాధ్యుడు. బ్లూం ఫీల్డా వాడిపేరు? వాడికేం

తెలిసి పాణిని భాషాజ్ఞానానికి సమాధి కట్టాడని కూశాడు?" అని ప్రశ్నించాడు. "మీరా బ్లూంఫీల్డ్ పుస్తకం చదివి అందులో అలా దూషించాడని గుర్తించారా?" అన్నాను. "నేను చదవలేదు. చదివిన వాళ్ళు చెప్తే నమ్మా"నన్నాడు? "అంత బాగా చదివి అర్థం చేసుకొని మీకు అబద్ధం చెప్పిన ఆ పండితు డెవరు?" అంటే "యూనివర్సిటీ తెలుగుశాఖలో ఉన్న ఎస్.వి.జోగారావు గారు. మంచివాడు. నేనంటే అతడికి బోలెడు అభిమానం. నాకాతడు అబద్ధాలూ, అప్రమాణాలూ చెప్ప"దని వివరించాడు. "ఆయనకు మీరంటే చాలా గొప్ప అభిమానమని నాకూ తెలుసు– "నాకు నచ్చిన కవి విశ్వనాథ ఒకడు' అని రాసినవాడే కదూ? అంటే! "నీకెలా తెలుసా సంగతి?" అని నిల దీశాడు. "ఆ పద్యం ఆయన చదివిన సభలో నేనొక శ్రోతనో, ప్రేక్షకుణ్ణో. ఆ విషయం అలా ఉంచండి. బ్లూంఫీల్డ్ రాసిన వాక్యం 'Panini's grammar is a monument of human intelligence' అన్నది. Monument అంటే ఏతాజ్‌మహల్లాంటి గోరీయో అని అర్థం చేసుకున్న పండి తుడి మాట నమ్మి మీరిలా మా మీద ధ్వజమెత్తారు. చెప్పుడు మాటలు వినరాదనీ, విన్నా నమ్మరాదనీ మీకు తెలీదా?" అన్నాను. వెంటనే లేచినుంచుని "మీరు– బ్లూం ఫీల్డ్ మీరన్నట్లే రాశాడని సాక్ష్యం చూపితే– జీవితాంతం అతణ్ణి దగ్గరకు రానీను" అని క్షణమాగి "ఈ ప్రసంగం రావటమే మంచిదయింది. రేపు ఉదయం 10 గంటలకు నేను తెలుగుశాఖకు వస్తున్నా – ఆ సోమయాజి అంటే నాకు పడకపోయినా. అక్కడ లిఖిత నిదర్శనం చూపాలి. ఎవరిమాట నిజమో తేలేదాకా నేను మీ ఇంట్లోనే దిగుతానని రాశాగాని, జోగారావింటికి పోను. మా అన్న గారింటికి వెళ్తా– పిలవని పేరంటంగానైనా" అన్నాడు. "మీ అన్నగారెవ"రంటే "మల్లంపల్లి వా"రన్నాడు. ఆ రాత్రి ఇతర ప్రసంగాలతో ఎవరం నిద్రపోకుండా మాట్లాడుకున్నాం.

తెలవారుజాము నాలుగున్నర గంటలయింది. అకస్మాత్తుగా నా వైపు తిరిగి 'ఓ గంట మాటలు కట్టిపెట్టు. నేను రాసుకోవాలి' అని సంచీలోంచి కాగితాల బొత్తి తీసి యమ దీక్షతో నాలుగు పద్యాలు రాసి "ఇక రాయను. బుద్ధిమారింది. ఈ పద్యాలు విని నీ అభిప్రాయం చెప్పు. నీ పరిజ్ఞానమెంతో నాకు తెలుస్తుం"దన్నాడు. పద్యం సంగతి దేవుడెరుగు. ఆ కంఠమాధుర్యం, అందులోని ఒదుగూ పరమాద్భుతం. పక్కబెర్తుల వాళ్ళు లేచి విని ఆయనకు పాదాభివందనం చేశారు. "ఇప్పుడేమంటావ్?" అన్నాడు. "ఈ నాలుగు పద్యాల్లోనే గాక బహుశా మీ ఈ శతకం మొత్తంలో పరాకాష్ఠ నందుకున్న భాగం 'నేనెంత? నా బ్రతుకది యెంత?' అన్న భాగం" అన్నాను. వెంటనే కౌగిలించుకుని "నీవు పొగరుబోతువి, నాలాగే. కానీ నా నోరు మూయించా వీ కూతకూసి. శ్రీ గిరిమల్లేశుణ్ణి ఆరాధిస్తూ మరో విధంగా రాయలేను – నా పొగరు చంపు కోకుండా. అదే కవిత్వమని కూసిన నిన్ను ఏం చేయటానికీ వీల్లేదు. కానీ తుని వస్తున్నట్లుంది. ముఖప్రక్షాళనం కానీ. నా చేత్తో నీకు ఇడ్లీలు తినిపిస్తా"నని తొందరపెట్టి అంత పనీ చేశాడు!

కలిసి బయలుదేరాం. మల్లంపల్లి వారింట్లో దించి వస్తుంటే "అన్నా! వీడు నాకు సరిపాత కొత్త స్నేహితుడు – లేదా సరికొత్త పాత స్నేహితుడు. సాయంత్రం కావ్యగోష్ఠికి రమ్మను" అన్నాడు. 'సరే' నన్నా. బ్లూంఫీల్డు రాసింది చూపా. ఆ సాయంత్రం మల్లంపల్లి వారింటికి వెళ్ళా. కిష్కింధాకాండ (శ్రీమద్రామాయణ కల్పవృక్షంలోది) రాస్తున్నాడు. చదువుతూ మధ్యమధ్య నా



వైపు చూస్తుంటే నాకే ఇబ్బందిగా ఉంది. నిశ్చలంగా బండరాయిలా కూర్చున్నా. కొంతసేపటికి సుగ్రీవ విషాదఘట్టం వచ్చింది. సీతాన్వేషణకు కోతిమూకను పంపి, అంతకన్నా రాముడికేమీ చేయలేకపోయానన్న నిర్వేదంతో "ఒక వంద దిక్కులైనను లేవు" అనగానే నాతల తిరిగిపోయింది. 'ఆః' అన్నాను. "అన్నా! బండరాయి కరిగింది." అపిగ్రావారోది త్యపి దళతి వజ్రస్య హృదయ" మన్నమాట నిజమే. ఇక చదవను. వీడు రాక్షసుడు. అయినా చలించాడు. నా కవితా తపస్సు నెరవేరినట్లే"నన్నాడు. ఈయన ఏం మనిషి? ఇది నిందాస్తుతి కిందకు వస్తుందా? స్తుతినింద అనాలా? అనే ప్రశ్న సహృదయుల మని చెప్పుకొనే ఆలంకారికుల క్కావాలి. నాకు మాత్రం మరపురాని అనుభూతి కలిగింది. విశ్వనాథ విచిత్ర వ్యక్తి. జెకిల్ అండ్ హైడ్ లాంటివాడా? పోల్చదగిన మరో వ్యక్తి లేడా నా ఎరికలో?

అంతకు ముందు చాలాకాలం క్రితమే ఆయనకు చీరాల్లో సత్కారం జరిగింది. యార్లగడ్డ రంగనాయకులు చౌదరిగారు పదివేలిచ్చారు (ఆయన్ను భారతం రంగనాయకులనే వాళ్ళం). చెక్కు తీసుకుని ట్యూబ్‌లైట్‌కు ఎదురుగా పెట్టి "ఇది చెల్లుతుందా?' అని పెద్దగానే అన్నాడు. "ఏరా నాయనా? నీకు పెత్తనమిస్తే ఇలాంటి వ్యక్తిని తెచ్చావా? నగదు కావాలంటే ఎడం చేత్తో విసరి పారెయ్యనా?" అని భారతం వారంటే, "నేనిట్లనుట కాదు. నా దరిద్ర మిట్లనిపించినది" అన్నాడు విశ్వనాథ! అందరం విస్తుపోయాం. ఈ సన్మానం జరుగుతుందనీ అప్పుడు చేతికి సొమ్మందు తుందనీ ముందుగా అప్పుచేశాడట! చెక్కు చెల్లకపోతే ఏంగతి? అని పెద్దగా అనుకున్నాడన్న మాట!...

చీరాలకు తిరిగి వెళ్తూ నా పుస్తకాల బీరువాను సవానీ ట్రాన్స్‌పోర్టులో వేశాను. అందులో కోయంబత్తూరు పేవ్‌మెంటు మీద కొన్న శబ్దరత్నాకరం ప్రథమ ముద్రణ ప్రతివంటి అపూర్వ గ్రంథాలున్నాయి. ఎం.బి.ఎమెనో గారు స్వహస్తంతో సొంత దస్తూరీతో ఆశీర్వాద పూర్వకంగా ఇచ్చిన ఆయన రచనలు – కొలామీ వ్యాకరణం వంటివి, ఉన్నాయి. గోదావరి వరదల్లో ఉంది– పోవద్దని అడ్డుపడుతున్నా వినిపించుకోని ఆ దౌర్భాగ్యపు రవాణా కంపెనీ వాళ్ళు తమ లారీని పోగొట్టుకున్నారు. నా గ్రంథ సంచయం గోదావరి గర్భంలో కలిసింది – నా దౌర్భాగ్యాలకు ఇదో భయంకర నిదర్శనం. లక్ష రూపాయలున్నా వాటిని పునస్సంపాదించుకోవటం అసాధ్యం. రాస్తున్న సిద్ధాంత గ్రంథం పోకపోవటం గుడ్డిలో మెల్ల. 'పోగా మిగిలింది ఆస్తి' అని మరోసారి సరిపెట్టుకున్నాను – అశక్తతవల్ల.

చీరాలకు చేరీచేరకముందే బర్కిలీ నుంచి భద్రిరాజువారి ఉత్తరం వచ్చింది. తనతోబాటు అమెరికా తీసుకపోవాలని సంకల్పించిన మెట్ట వెంకటేశ్వరరావు గారనే తోటి పరిశోధకుడు తన వెంట రాలేదనీ, తరవాత కూడా రాలేదనీ, నేను వస్తే నా భావి బంగారు బాటలో వెలిగిపోతుందనీ రాశారు. ఆయనే "నీవెలాగైనా బతుకుతావు – ఏటి కెదురీదైనా సరే. వేంకటేశ్వరరావు సౌమ్యుడు (నేను కానని భావం). అతడికి నా సాయ మవసర"మని మొహానే చెప్పిన గురుడు ఇప్పుడు తన ప్రతిష్ఠకోసమో తన వెంట సేవలందిస్తూ తిరిగే వ్యక్తికోసమో ఈ ఆహ్వానం పంపాడు. "నా సిద్ధాంత వ్యాసరచన పూర్తయ్యే దాకా భారత ప్రభుత్వానికి నా రుణం తీరదు. తీరేదాకా నేను

కదల"నని తిరగరాశాను. ఆ తరవాత కూడా తిరుపతిలో తెలుగు రీడరుగా ఉన్న రోజుల్లో ఎవరినో (తెలిసినా చెప్పను) అమెరికా పోకుండా ఆపేందుకు నేను దరఖాస్తు చేసినా, కనీసం మౌఖికాంగీకారం తెలిపినా, నన్ను విస్కాన్సిన్ విశ్వవిద్యాలయానికి ఉద్యోగం చేయటానికే పంపుతానని ప్రలోభపెట్టా డాయన. నేను పోలేదు. పోతా నననూ లేదు. దరిమిలా ఆచార్య జి.ఎన్.రెడ్డి గారు వెళ్ళివచ్చారు. అక్కడ – అంటే అమెరికాలో – ఏర్లున్నాయో లేవో, వాటికి ఎదురీదగల సామర్థ్యం నాకుందో లేదో తెలీదు. అటు వెళ్ళి వచ్చి అద్వితీయ విద్వత్తు సంపాదిస్తా నని గాని, మహోన్నతోద్యోగంలో ప్రవేశిస్తాననిగాని నమ్మనే లేదు. ఈ వ్యవహారాల్లో ఎంత రాజకీయం నడుస్తున్నదో తెలిసింది. అదే పది వేలు. (నేను పోకపోయినా నా రెండో కుమారుడు ఆ విశ్వవిద్యాలయంలోనే పిహెచ్.డి. తెచ్చుకొని ఆ దేశంలో స్థిరపడ్డాడు – నా రెండో కోడలూ అక్కడే ఎం.ఎస్. చేసి అలాగే అమెరికన్ పౌరత్వం పొందింది. 'ఆత్మా వై పుత్రనామాసి' అనుకొంటూ సంతోషిస్తున్నాను).



# 9. అధ్యాపకత్వం: ద్వితీయ దశ

చీరాల కళాశాలకు తిరిగి వచ్చి చేరిన పూటే కొత్త వాతావరణంలో వచ్చిన పెద్ద మార్పు తలకెక్కింది. జాయినింగ్ రిపోర్టిచ్చి స్టాఫ్ రూముకు వెళ్ళేసరికి కొత్త ముఖాలు కనిపించాయి. కళాశాల పెరుగుతున్నది కాబట్టి అందులో విశేషమేమీ లేదు. కానీ వెనకటి ఆప్యాయత కనిపించ లేదు. పాతమిత్రులు మారలేదుగాని వాళ్ళను పాతపద్ధతిలో వరసలు పెట్టి పలకరించినందుకు కొత్త వాళ్ళు అభ్యంతరం చెప్పారు. అప్పటికీ జీతాలు సకాలంలో అందటంలేదు. భవన నిర్మాణం అంటే షెడ్ల నిర్మాణం జరుగుతున్నందువల్ల యాజమాన్యం ఆర్థిక బాధల్లో ఉందన్నారు. యు.జి.సి. స్కేళ్ళిమ్మని ఉపాధ్యాయు లడుగుతుంటే కళాశాల యాజమాన్యం నీచభాషలో దూషించిందని పాతవాళ్ళు చెప్పారు. నేనెలా కూర్చోవాలో, ఎలా మాట్లాడాలో కొత్త మొహాలు చెప్పి జాగ్రత్తగా ఉండమన్నారు. మాటల వాడి చేతులు కలిపే స్థితికి వచ్చింది. వాల్తేరులో నేవిన్న సంగతులు నిజమేననే నమ్మకం కుదిరింది. సెనేట్ సభలో చీరాల కళాశాల వ్యవస్థాపకులు ఊటుకూరి రామయ్య శ్రేష్ఠిగారు ఈ సన్నాసులకింత పెద్ద జీతా లెవరిస్తారని ఘర్షణ పడ్డారన్నారు. అంతకన్నా మరికొంత మొరటు భాషలో అధ్యాపకులను సమావేశపరిచి దూషించారని ఇక్కడ తెలిసింది. ఆయనెప్పుడూ 'అధ్యాపకులారా?' అనే సంబోధించే వాడు. రోజుకు రెండు మూడు గంటలు పాఠాలు చెప్పే వాళ్ళు రోజుకు టన్ను కట్టెలు కొట్టి రెండు రూపాయలు తీసుకునే కూలివాళ్ళ కన్నా ఘనులా? అని ఆ విద్యాపోషకుడి విస్పష్ట ప్రశ్న. జీతభత్యాలు సకాలంలో చెల్లిస్తామనీ, బకాయిలు తీరుస్తామనీ కారంచేడు భూస్వాములు యార్లగడ్డ రామనాథబాబు గారు ప్రతిపాదించా రప్పటికే. తమ తండ్రిగారి పేరును కూడా కాలేజీకి పెట్టమనీ, యాజమాన్యంలో భాగస్వామ్య మిమ్మనీ వారడిగితే ఉపాధ్యాయులు హర్షించారు – జీతాలు వస్తాయి కదా అని. అది కులద్వేషంగా, ధిక్కారంగా భాసించి ప్రస్తుతయాజమాన్యం నియమించిన స్వకులస్థులు తక్కిన వారు విశ్వాసఘాతుకు లనటం మొదలుపెట్టారు. స్వస్థలం కాబట్టి, రామయ్య శ్రేష్ఠిగారు మా కుటుంబానికి బాగా పరిచితులే కాబట్టి ఆ సాయంత్రం నేను వారింటికి వెళ్ళి ఏం జరుగుతున్న దంటే "నీవేమీ కల్పించుకోకు. మా కులానికి తలవంపులు తెచ్చే ప్రయత్నం జరుగుతున్న"దని, ఆయన పేరిట చెలామణిలో ఉన్న ఆ తిట్టునే పునరుక్తం చేశాడు. నేనూ ఉపాధ్యాయుణ్ణే కాబట్టి శ్రమకు తగ్గ ఫలితంకోసం పోరాడవలసిన పరిస్థితి కల్పించవద్దనీ, చర్యకు ప్రతిచర్య లుంటాయని హెచ్చరించాను.

మరునాడు పాతవాళ్ళం సమావేశమై "కలౌ సంఘబలం బల"మన్నారు కాబట్టి అనుబంధ కళాశాలల ఉపాధ్యాయ సంఘానికి (ACTAకు) మన కళాశాలలో కూడా స్థానిక శాఖను నిర్మిం చాలనీ, బకాయిలు చెల్లించమనీ యు.జి.సి. స్కేళ్ళు అమలు జరపమనీ ఒత్తిడి తేవాలనీ నిర్ణయించుకున్నాం. సిండికేట్ ఆ స్కేళ్ళు అమలుజరపమని కోరుతూ అంతకు ముందే తీర్మానిం చింది. కాబట్టి మా కోరిక తప్పుకాదని నమ్మాం. కొత్త జీతాలిచ్చే దాతలుంటే వారిని ఆహ్వా నించటం తప్పుకాదనీ నిశ్చయించుకున్నాం. ఘర్షణ మొదలైంది. సిద్ధాంతవ్యాసాన్ని ప్రత్యేక లిపి

చిహ్నాలతో సహా టైపు చేసుకుందామని అమెరికా వెళ్తున్న భద్రిరాజు వారి దగ్గరకొన్న ఒలింపియా లైట్ రైటరు అభ్యర్థనలనూ, ఫిర్యాదులనూ టైపు చేయటానికి పనికి వచ్చింది కాని అనుకున్న పనికి ఉపయోగపడలేదు. ఇక్కడ రాసిన రాతప్రతిని వాల్తేరు పంపి అక్కడి తెలుగు శాఖలో పనిచేస్తున్న టైపిస్టుకు పంపి భద్రంగా తెచ్చుకోవటానికి తడిసిమోపెడయింది ఖర్చు. ఇంట్లో రాసిన భాగాన్ని విరామ సమయంలో సాపు రాసుకునే అవకాశం తగ్గింది కాలేజీలో. 'ఓహో! పరిశోధన వ్యాసం కదూ!' అని సాటివాళ్ళు పరిహసిస్తుంటే, "వీడే చదువుతున్నాడు. ఇంకా మనకు చెప్పేదేమి"టని విద్యార్థులు అపహాస్యాలాడుతుంటే, "పి.యు.సి. వాళ్ళకు చెప్పటానికి పిహెచ్.డి.లు కావాలా?" అని యాజమాన్యం వెక్కిరిస్తుంటే అవమాన భారం మోయక తప్పిందికాదు. యు.జి.సి. స్కేళ్ళు వస్తే ఎవరెవరికి ఎంత మొత్తం దక్కుతుందో లెక్కలు వేస్తుండే వాళ్ళు. జీతం నష్టంమీద పోయిన నాకు వచ్చిచచ్చే దేమీలేదు. పైపెచ్చు ఆగిపోయిన ప్రావిడెంట్ ఫండ్ ఖాతాను పునరుద్ధరించు కోవటమనే అదనపు కష్టం తప్పలేదు. అధ్యాపకవర్గం చీలిపోయింది రెండుగా – యాజమాన్యా నికి అనుకూల ప్రతికూల వర్గాలుగా. ఎవరెవరి నియామకాలు సక్రమంగా జరిగాయో పరిశీలిం చటం మొదలైంది.

### పేరు గొడవ, పదవి గొడవ

నా బాధ నాది. ఎస్.ఎస్.ఎల్.సి. రిజిష్టరులోనే బూదరాజు శబ్దానికి రెండు మూడు రకాల అక్షర క్రమాలు పాటించారు. "బూదరాజు రాధాకృష్ణమూర్తి కవిని" అని అఘోరించే నేను 'మూర్తి' పోగొట్టుకొని చివర నకారపొల్లు సంపాదించాను హెడ్మాష్టరుగారి పుణ్యాన. గుంటూరులో వెధవ అరవ పేరేమని ప్రిన్సిపల్ ఆ తోకను కత్తిరించాడు. ఆనర్సు సర్టిఫికెట్‌లో ఉత్వదుఖ్ఖలు లేని రూపమే నిలిచింది. ఈ మార్పులవల్ల కొత్త చిక్కులేమొస్తాయో తెలియదు. (ఇంటర్మీడియట్ సర్టిఫికెట్టును నేను చూడనే లేదు. ఆ రోజుల్లో పైచదువులకు పోతామని రాసి పైకోర్సుల్లో చేరిన తరవాత పరీక్షా సమయంలోగా చదువుతున్న చోటికి నేరుగా పంపేవాళ్ళు – విద్యార్థికి కాక). పినతాతగారినీ ప్రిన్సిపల్ గారినీ సంప్రతిస్తే మార్గాంతరం సూచించారు. నా పేరు తమ రికార్డుల్లో ఎలా ఉందని 'రాధాకృష్ణ' రాస్తే అతగాడికి ప్రిన్సిపల్ సమాధానమిస్తూ కాలేజీలో చేరినప్పటి రికార్డులో 'రాధాకృష్ణన్' అని ఉందని ప్రత్యుత్తరం రాశాడు! రికార్డుల్లో రకరకాలుగా ఉన్న నా పేరునూ, ఇంటి పేరునూ ఇలా సవరించదలచానని జిల్లా కలెక్టరు గారికి రాసి నా ప్రకటనను జిల్లా గెజెట్లో ప్రచురించటానికి చలానా కట్టాను. ప్రచురించామనీ గెజిట్ కాపీ ల్లేవు కాబట్టి ఎలా ఏ పేజీలో ఏ తేదీన ప్రచురించామో వివరిస్తున్నామనీ లేఖ రాసి కలెక్టరు గారి అధికారముద్ర వేసి పంపారు. దాన్ని రిజిస్టరులో అతికించి బతుకు జీవుడా అనుకున్నాను (ఇలాంటి కష్టం వచ్చిన వాళ్ళకు ఈ అనుభవం పనికి రావచ్చునని రాస్తున్నాను గాని ఇందువల్ల నా ఘనత పెరగలేదు సరికదా, తేటగీతి యతిస్థానం దగ్గర మొక్కపోయిన విచారం మిగిలింది).

మాకు ప్రిన్సిపలు గారి సాయం కొంత దొరికింది – వి.సి.గారు సిండికేటులో కొత్త స్కేళ్ళు ఫలానా తేదీనుంచి అమల్లోకి వస్తాయని తీర్మానించినందువల్ల. ఊటుకూరి వారినీ, యార్లగడ్డ వారినీ సమావేశపరిచి సర్దుబాటు చేసుకొమ్మని ఒత్తిడి తెచ్చింది విశ్వకళాపరిషత్తు. మేము



విద్యామంత్రిని అభ్యర్థించాం మాకు రక్షణ ఇమ్మని. యాజమాన్యం మా కరపత్రాలు క్రమశిక్షణకు విరుద్ధ ప్రవర్తనగా భావించి విద్యాశాఖను విచారించమని కోరింది. అప్పటి డి.పి.ఐ. రాంలాల్ గారు చీరాల విచ్చేసి ఊటుకూరి వారి బంగళాలో వాడరేవు సముద్రతీరాన బసచేసి మమ్మల్ని ఓ హాల్లోకి పిలిపించి బెదిరించాడు. ముందుగా ఊహించినందువల్ల పాతతేదీ వేసి నా స్థానంలో మరొకరిని ఉపాధ్యాయ సంఘానికి కార్యదర్శిగా ఎన్నుకున్నాం రహస్యంగా. దండయాత్ర నామీద జరిగింది. నేను కార్యదర్శిని కాదన్నాను. 'నీది మూర్ఖవాదన' అన్నాడు డి.పి.ఐ. మన ఇద్దరిలో నేను మూర్ఖుణ్ణి కాదన్నాను. మండిపడ్డాడు. మేం సమావేశాన్ని బహిష్కరిస్తున్నామనీ, యాజ మాన్యం వారి అతిథి మాకు న్యాయమిస్తాడనే నమ్మకంలేదనీ అవసరాన్ని బట్టి హైకోర్టును న్యాయ సాధనకోసం ఆశ్రయించదలచాం కాబట్టి చర్చలు సాగించలేమనీ చెప్పి బయటికి వెళ్ళాం. మాకీ విధంగా ప్రవర్తించమని మా పినతాతగారే కాక నడింపల్లి నరసింహారావు గారనే బారిష్టరు గారు కూడా సలహా ఇచ్చారు. గాభరాపడ్డ డి.పి.ఐ. బసమార్చి ట్రావెలర్స్ బంగళాలో దిగి సంప్రతింపు లకు రమ్మన్నాడు. మేం పోలేదు. అప్పుడు పాలకవర్గం వారిని సమావేశపరిచి ప్రభుత్వం తరఫునా విశ్వకళాపరిషత్తు తరఫునా ఒత్తిడి తెచ్చి రెండేసిమార్లు సర్వసభ్య సమావేశాన్నీ, పాలకవర్గ సమా వేశాన్నీ దగ్గర ఉండి సమావేశపరిచి, కళాశాల పేరులో చేరికనూ మా బకాయీల చెల్లింపునూ ఆమోదింపజేసి వెళ్ళాడు. వి.ఆర్.ఎస్. కాలేజీ వి.ఆర్.ఎస్. అండ్ వై.ఆర్.ఎన్ కాలేజీగా మారింది. రామయ్య శ్రేష్ఠిగారు అధ్యక్షులుగా కొనసాగినా కార్యదర్శిగా ఉన్న ఆయన అల్లుడు గారి స్థానంలో యార్లగడ్డ శివరామప్రసాద్ గారు అధికారం స్వీకరించారు. ఈ వ్యవహారంవల్ల అనుబంధ కళాశాలల అధ్యాపక సంఘం బలపడింది.

మా సలహాకోసం, సహాయంకోసం హైదరాబాద్ నుంచి తెలంగాణా ప్రాంతీయ సంఘం వారి తరఫున అరిపిరాల విశ్వంగారు చీరాల వచ్చారు. హైదరాబాదులో ఖండవల్లి లక్ష్మీరంజనం గారు నడుపుతున్న వివేకానంద కళాశాల అధ్యాపకుల జీతభత్యాల విషయాన్ని చక్కబరిచాం. ఖండవల్లి వారికి నా మీదికోపం శాశ్వతంగా అభివృద్ధమయింది. మా సంఘం తరఫున ఉపా ధ్యాయ బృందం నాటి విద్యాశాఖ కార్యదర్శి రమేశ్ గారిని కలిస్తే ప్రైవేటు ట్యూషన్లు మానుకుంటా మని సంఘం తీర్మానం చేస్తేగాని ప్రభుత్వ సహాయం లభించదన్నాడు. విజయవాడ మాంటిస్సోరీ కళాశాల ఆవరణలో సభ జరిపి అలా తీర్మానించమంటే ట్యూషన్లు చెప్పేవాళ్ళు నిరాకరించారు. లంచాలు పుచ్చుకోమని ప్రభుత్వోద్యోగులు తీర్మానించాలనీ అప్పుడే తాము అలాంటి తీర్మానా లను ఆమోదిస్తామనీ తిరగబడ్డారు. వాదించి విఫలమై నేను కె.వి.రమణారెడ్డి వగైరా కార్యకర్తలం విధిలేక వాకౌట్ చేశాం. తెలుగు మాస్టర్లూ, హిస్టరీ పంతుళ్ళూ తమ దగ్గర కెవరూ ట్యూషనుకు రారు కాబట్టి ఈ పిచ్చి తీర్మానం తెచ్చారని మమ్మల్ని వెక్కిరించి వేళాకోళ మాడారు.

ఈ ఘట్టం ఇలా ముగిసి కళాశాల ప్రశాంతంగా నడవటం మొదలైన తరవాత ఇంట్లో రాసిన భాగాలకు కాలేజీలో శుద్ధ ప్రతి రాసి వాల్తేరు పంపటం, తెప్పించుకోవటం మళ్ళీ మొదలైంది. రెండేళ్ళపాటు అమెరికాలో విజిటింగ్ ప్రొఫెసర్‌గా ఉంటాడనుకున్న భద్రిరాజు వారు అర్థాంతరంగా స్వదేశానికి తిరిగివచ్చారు – శ్రీ వేంటేశ్వర విశ్వవిద్యాలయం వారు తెలుగుశాఖకు

రీడర్ అండ్ హెడ్‌గా నియమిస్తామన్నారని. తీరా తిరిగి వచ్చాక అక్కడ హెడ్డుగా పింగళి లక్ష్మీకాంతం గారిని నియమించారనీ, రీడరు ఉద్యోగానికి ఢోకా లేదన్నారనీ తెలిసి చీరాల వచ్చాడు– కోర్టుకు పోయి పోరాడే మార్గముందా అని, నాకున్న న్యాయశాస్త్ర జ్ఞానం పరీక్షించటాని కన్నట్లు. పోరాడినా తక్షణ ఫలితం ఉండకపోవచ్చునంటే పేచీలకు ప్రసిద్ధి గాంచిన ఆయన స్వస్థలం ఒంగోలుకు తీసుకుపోయాడు. అక్కడా అదే మాట. రెంటాచెడ్డ రేవడి కాదలచక తిరుపతిలో చేరాడు. నేను రాసిన వ్యాస భాగాలను విశ్రాంతిగా చూడాలంటే వేసవి సెలవుల్లో తిరపతి రమ్మన్నాడు. పరీక్షలూ – ఇన్విజిలేషన్ బాధలూ తప్పించుకొని రెండు వేసవులు తిరుపతినే ఊటీగా భావించి సత్రాభోజనం మఠానిద్ర చేశాను. ఈ రాకపోకలవల్ల జి.ఎన్.రెడ్డి, జి.నాగయ్య, వి.ఎం.రెడ్డి వంటి వాళ్ళెందరో మిత్రులైనారు. “ఇచ్చట ఇందిరాగాంధీ చేతి దంపుడు బియ్యం అమ్మబడును” అనే సైన్‌బోర్డు ఊళ్ళో ఎప్పుడెప్పుడు ఎక్కడెక్కడికి మారిందో గమనించే అవకాశం దొరికింది. “మా తెలుగు తల్లికీ మల్లెపూదండ” గేయ రచయిత సుందరాచార్యుల వారి వ్యక్తిగత జీవిత విశేషాలను తెలుసుకోవడం, ఆయన హాస్య చమత్కార సంభాషణల కానందించటం వీలయింది. రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారినీ, ఆయన ‘విద్వత్కలెక్ట”రని అభిభాషించే కుక్కుటేశ్వర రావు గారినీ, స్థానికంగా సుప్రసిద్ధులైన నాదముని రెడ్డిగారి వంటి రాజకీయ వాదులనూ భిన్న కళాశాలల్లోని ఉపాధ్యాయులనే గాక కేతు విశ్వనాథరెడ్డి, తంగిరాల వేంకట సుబ్బారావు, కామిశెట్టి శ్రీనివాసులు సెట్టి వంటి విద్యార్థులనూ, ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో సహాధ్యాయులుగా సీనియర్లుగా ఉన్న అనేకులనూ తరచుగా కలిసే అవకాశం దొరికింది. పింగళివారు నేను గంటి వారి శిష్యుణ్ణని గద్దించారు. “ఈ పని మీరు 1954లోనే విజయవాడ రేడియో స్టేషన్లో చేసిందే గదా? ఈ కాలంలో గురువులను ఎంపిక చేసుకోవటమనేదే లేదు. జీతం కట్టి బడిలో చేరినప్పుడు ఎవరుంటే వారే గురువు”లని విన్నవించాను. “నన్నప్పు డెందుకు కలిశా”వని ప్రశ్నించాడు. “వేమన మీద రేడియోలో వాగడానికి వస్తే “మిరపకాయ చూడ కురుచనై ఉండును, కొరికిచూడ నోరు చురుకుమనును” అనే వేమన పద్యం చదివి అంతకు పూర్వం మిరియాలేగాని మిరపకాయ ల్లేవు. అవి విశ్వామిత్ర సృష్టిలో ఉన్నాయంటే మిరియం ముందనేందుకు కావ్యప్రయోగమడిగారు. బాలచంద్రుడు ఐతాంబతో “బాలుడ నని నన్ను భావించవలదు, చిన్న మిర్యంబున చెడునె కారంబు’ అన్న ప్రయోగం చూపాను. అప్పుడు మీరు గంటివారి శిష్యుడికి సాహిత్య జ్ఞానమా అని ఎత్తి పొడిచా”రని గుర్తు తెచ్చాను. సోమయాజి గారిని గురించి మరి నాలుగు విసుర్లు విసిరి సాహిత్యాన్ని అభిమానించమని ఉద్బోధించా డాయన. అక్కడే నేను పూర్వం ఎరిగున్న మారేమండ రామారావు గారిని, ఆచార్య నీలకంఠం, భీమసేన్ సచార్ వంటి వాళ్ళని పునర్దర్శించాను. అబ్బూరి వారి శిష్యరికం పెద్దల సాహచర్యం కూడా ప్రసాదించింది.

1963లో భద్రిరాజు వారు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో భాషా శాస్త్రాచార్యులుగా చేరారు. ఆ వేసవిలో వేసవి శిబిరం నిర్వహించారు. రాసిన సిద్ధాంత వ్యాస భాగాలు తెస్తే సరి చూస్తాననీ, ఆ శిబిరంలో ఉండి ఆధునిక భాషాశాస్త్ర విశేషాలను తెలుసుకొంటే పురోభివృద్ధికి అవకాశం ఉంటుందనీ రాస్తే హైదరాబాద్ వచ్చి చిక్కడపల్లిలో వేంకటేశ్వరాలయం దగ్గర అద్దె



గదిలో ఉండక తప్పింది కాదు. కూతవేటు దూరంలో అబ్బూరివారుండటం పెద్ద ఓదార్పు. సాయంత్రాలు ఆయన వెంట వెళ్ళి ఎ.ఆర్.కృష్ణను, నాటకరంగ ప్రముఖులనూ కలియటం అలవాటయింది. ఒకనాడు వై.ఎం.సి.ఏ.కు వెళ్ళి పి.వి.నరసింహారావనే చిన్న మంత్రి ఉపన్యాసం విని వద్దాం రమ్మన్నారు అబ్బూరి వారు. రాజకీయవాదుల మీది దుర్భావం పోతుంది రమ్మన్నారు. సంవత్సరాలూ దశాబ్దాలూ గడిచిన తరవాత చక్కని ఇంగ్లీషు ప్రసంగం విన్న సంతృప్తి కలిగింది. ఆ సమయంలోనే ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కార్యదర్శి దేవులపల్లి రామానుజరావు గారితో, దాశరథి కృష్ణమాచార్యులు, బిరుదరాజు రామరాజు, బోయి భీమన్న వంటి వారితో పరిచయం కలిగింది. దశాబ్దం తరవాత దివాకర్ల వేంకటావధాని గారి పునస్సందర్శనం తప్పలేదు. (ఆయన తమ్ముడు రామమూర్తి గారితో నాకు మంచి సంబంధా లుండేవి). హైదరాబాద్ సాహితీ వాతావరణం పరస్పర ప్రస్తుతులతో నాకు విచిత్రంగా కనిపించింది. (వాల్తేరులో పొగడటాన్ని తైరు కొట్టడమనే వారు. అది త్రివిధమనీ స్వ, పర, పరస్పర భేదా లుంటాయనీ అప్పటి మాట). సురవరం ప్రతాపరెడ్డి గారు ‘సాహితీ గూండాల సంఘం’ పెట్టి ఈ వాతావరణంలో మార్పు తెద్దామనుకున్నారు గాని అది నెరవేరలేదని అన్నారు. బహుకాలం తరవాత ఈ సమయంలోనే గుంటూరు శేషేంద్ర శర్మగారి పరిచయాన్ని పునర్నవీకరించుకున్నాను. మధ్యలో వరంగల్లు పోయి సదాశివరావు గారినీ, పూర్వ మిత్రుడూ ‘భూమాతా ఎరువుల డిపో’వంటి మహత్తర సంస్థకు స్థాపకుడూ అయిన మాచిరాజు దేవీప్రసాదునూ, పాములపర్తి వారిద్వారా కాళోజీ సోదరులనూ కలుసుకోగలిగాను. నాలాగే స్కూలుకు వచ్చిన సుప్రసన్నాచార్యుల వారితో పరిచయం కలిగింది. సమ్మర్ స్కూల్లో ఎ.ఎం.ఘటగే, కేల్కర్, సునీతి కుమార్ ఛటర్జీలవంటి పెద్దల పాఠాలు విన్నాను. ఆ సమయంలోనే భారతీయ పరిభాషా కల్పనకు తనకు చేతనైన పద్ధతిలో ప్రయత్నించిన డాక్టర్ రఘువీర అస్తమించారు – రోడ్డు ప్రమాదంలో. ఎన్ని ఇతర వ్యాపకాలున్నా సిద్ధాంత వ్యాసాన్ని భద్రిరాజు వారిచేత పరిశీలింపజేయటం నా తరంకాలేదు. “అంతా పూర్తికానీ. అప్పుడు చూస్తా”నని తిరపతిలో చెప్పిన మాటే ఇక్కడా చెప్పారు. ఒరిగిందేమంటే సాహిత్య అకాడమీ వృత్తి పదకోశ నిర్మాణానికి ఏర్పరచిన సంపాదక మండలిలో నన్ను చేర్చుకోవటం, గృహ నిర్మాణ సంబంధి వాస్తుకోశం నిర్మించేందుకూ దానికి సంపాదకుడుగా వ్యవహరించేందుకూ నాకు అవకాశం కలగటం.

ఎట్టకేలకు 1963 జూన్ నాటికే రాయటం, టైపు చేయించటం పూర్తయిందిగాని పర్యవేక్షకుల సంతకం దొరకలేదు. “నేను చూడనే లేదుగదా? ఎలా సమర్థించేది?” అనేది కొత్తమాట. “బాగానే ఉండి ఉంటుంది. ఘుణాక్షర న్యాయంగా పరిశీలించానుగదా. నాలుగు కాపీలూ పూర్తిగా టైపు చేయించు” అన్నది పాతపాట. వ్యాససమర్పణకు అనుమతి వైస్ ఛాన్సలరు నుంచీ, వారంరోజుల సెలవు ప్రిన్సిపాలునుంచీ సంపాదించి అయిదు కాపీలు మోసుక వస్తే పస్తాయించి, నేను స్వయంగా సమర్పించటానికి మీ పూర్వానుమతి ఎటూ ఉందిగదా. అలాగే చేస్తానని నా చేత అనిపించి, చివరకు నాంపల్లి రైల్వేస్టేషన్‌కు వచ్చి ప్లాట్‌ఫారం మీద సంతకాలు పెట్టారు మా పర్యవేక్షకులు (ఇలాంటి అనుభవాలకు నేనే మొదటివాణ్ణి కాను. కొత్తపల్లి వీరభద్రరావు గారికీ

ఇలాగే జరిగింది). వాల్తేరులో సమర్పించి స్వస్థలం చేరుకున్నా. నెలలు గడిచినా నా పుస్తకాలు రిజిస్ట్రారాఫీసు నుంచి కదలలేదు. పరీక్షకుడుగా వాల్తేరు వెళ్ళినప్పుడు పరిశీలకులుగా ఎమనోబరో లనూ, సునీతికుమార్ ఛటర్జీ గారినీ పర్యవేక్షకులు సిఫారసు చేశారనీ, మొదటి ఇద్దరూ తాము ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా పరిశోధక విద్యార్థితో సంబంధమున్న వాళ్ళం కాబట్టి మేం పరిశీలకు లుగా ఉండటం బాగుండదని రాసినట్లూ ఛటర్జీగారు ఎన్నికల హడావిడిలో ఉండి ఏమీ తేల్చ నట్లూ తెలిసింది. మరికొంతకాలానికి ఛటర్జీ గారు పశ్చిమబెంగాల్ శాసన మండలి అధ్యక్షు లైనందున విద్యా విషయక వ్యవహారాల్లో తలదూర్చమని రాశారని తెలిసింది. దరిమిలా కాత్రేగారి అధ్యక్షతన మీనాక్షి సుందరం, పి.బి.పండిట్లతో సరికొత్త పరిశీలక బృందాన్ని నియమించారు. సిద్ధాంత వ్యాసం నిబంధనల ప్రకారం విదేశయాత్ర చేయటానికి కట్టిన సొమ్ము వృథా వ్యయ మయింది. చివరకు 1965 జులైలో డిగ్రీ ఇవ్వవచ్చన్నారు. పరోక్షంగా తీసుకోటానికి దరఖాస్తు ఫారాన్ని పంపుతూ చెల్లించవలసిన సొమ్మునూ తెలపమని నేను రాసిన ఉత్తరం రిజిస్ట్రారాఫీసును నవ్వుల్లో ముంచెత్తిందని విని సంతోషించాను. విధిలేని పరిస్థితిలో 1965 డిసెంబరులో జరిగిన స్నాతకోత్సవంలో తూమాటి దొణప్ప గారి సరసన కూర్చుండి పాతా కొత్త విశ్వవిద్యాలయ కళాశాల ప్రిన్సిపల్స్ పిల్లలతోబాటు శ్రీనివాసయ్యం గారి కుమారుడితో బాటు ప్రత్యక్ష పద్ధతిని ఆ కాగితం తీసుకుని మడిచి జేబులో పెట్టుకొని ఇంటికి తెచ్చుకున్నాను. డిగ్రీ వచ్చినప్పటి నుంచీ ఎప్పుడే విశ్వవిద్యాలయంలో చేరుతున్నావని సాటివాళ్ళూ "బి.ఏ. వాళ్ళకు నీ అంత చదువుకున్న వాళ్ళు కావాలా? పాఠం చెప్పటాని"కని యాజమాన్యమూ ఎత్తిపొడవటం ఎక్కువయింది. అశక్తత నోరుమూయించింది.

ఆనర్సు చివరి సంవత్సరం చివరి నెలలో గంటి జోగి సోమయాజిగారికి 'భాషా చరిత్ర చతురానన' అనే బిరుదు లభించింది తిరుపతిలో. ఆ విద్యా సంవత్సరం మొదట్లోనే ఆయన ఆచార్య పదవి పొందాడు. ఈ రెండు సందర్భాలనూ పురస్కరించుకొని ఆయనకో సన్మానపత్రం రాసి సమర్పించవలసి వచ్చింది. నేను చదివితే కర్ణకఠోరంగా ఉంటుందని దొణప్ప గారిచేత చదివించారు. అది నా జన్మకు శివరాత్రి. ఎందరెన్నిసార్లు చెప్పినా మళ్ళీ అలాంటి పని చేయ దలచలేదు. సంగీత సాహిత్యాలు రెంటిలోనూ సమప్రాగల్భ్యమున్న వారెవరో చెప్పమంటే రాళ్ళ పల్లి వారని చెప్పగా త్యాగరాయ నారాయణదాస ఆరాధన సభలకు చీరాల వేంకట్రావు గారు ఆయన్ను ఆహ్వానించారు. స్వాగతపత్రం రాయక తప్పదన్నారు – నీవే పిలవమన్నావని. దరిమిలా కోటంరాజు రామారావు గారికైనా రాయమని నిర్బంధించారు. రాయలేనన్నావని ఆయన ఎదు టనే కళాశాలాధ్యక్షులు ఆక్షేపిస్తే "వాడి మొహం. వాడు రాసేదేమి"టని ఆయన నన్ను కాపాడాడు. వేసవిలో స్వస్థలానికి వచ్చినప్పుడు ఆయనకు ఉక్తలేఖకుడుగా పనిచేశాను. "స్పెలింగు లడగని కిష్టిగాడి"కని ఆయన నాకో జర్నలిజం పుస్తకం బహూకరించాడు. దశాబ్దాల తరవాత దాన్ని చదివి పొట్టపోసుకోవలసి వస్తుందని కలలో కూడా అనుకోలేదు. ఆరాధన సభల్లో పాల్గొనడానికి వచ్చిన చిలుకూరి నారాయణరావు గారి వంటి పెద్దలకు సేవలు చేశానుగాని ప్రశంసాపత్రాలు రాయలేదు. ఎప్పుడో తప్ప చీరాలలో సాంస్కృతిక సభలు జరిగేవి కావు. వాటికోసం దేబిరిస్తూ



వేటపాలెం పోవలసిందే. ఊటుకూరి రామయ్య శ్రేష్ఠిగారి షష్టిపూర్తి సభలు జరిగాయి. వేదాంతం వారి ఉషాపరిణయ ప్రదర్శన సమ్మోహపరిచింది. చిత్రమేమంటే ద్వారం వేంకటస్వామి నాయుడు గారి ఫిడేలు కచేరీ ఏడిపించటం. ఆయనకు వాగ్దానం చేసిన సొమ్ములో నాలుగోవంతు ముట్టజెప్పి తక్కిన భాగం వసూలైన తరవాత పంపుతామన్నారు! ఆనాడాయన వినిపించిన ధ్వనులు పదిజన్మలకైనా మరిచిపోలేనివి! వాటిని మనసులో పెట్టుకొని ఒక సహోద్యోగి సంగీతాన్ని చాటుశ్లోకంలో వాడుకున్నాను. అదేమంటే–

**కాఫీ పాన కషాయితానన గళ ద్గాద్గద్య సమ్మిశ్రితై**<br>
**ర్గీతైః యః ప్రకటీకరోతి నిజమండూకప్రియాలాపితాన్**<br>
**కాకోలూకసృగాలరాసభశునీ భల్లూక ఝిల్లీ స్వరాన్**<br>
**జీయా ద్వ శ్చిరమేవ కాక ఇవ సీతారామదుర్గాయకః** – అనేది.

ఇలాటి పద్యాలు చెప్తే అసలు వ్యక్తి సరదాగా తీసుకొని సరిపెట్టుకున్నా అతడి అభి మానులూ, బంధువులూ క్రోధోన్మత్తులై బాధిస్తారని అనుభవరీత్యా తెలుసుకున్నాను. అలాగని ఈ పాడు పని ఈనాటికీ మానుకోలేకపోతున్నాను.

## వాస్తు పదకోశం

నిత్యకృత్యాలైన పఠన పాఠనాలకు తోడు వాస్తు పదకోశ నిర్మాణం ఊపిరిసలపని పని అయింది. వ్యవహర్తలను ప్రశ్నించటానికి ప్రశ్నావళి రూపొందించటంకోసం వాస్తు గ్రంథ పఠనం అవసరమైంది. అప్పటికే వెలువడ్డ వ్యవసాయ వృత్తి పదకోశం, విషయ సేకరణ జరుగుతున్న చేనేత పదకోశం నిర్మించిన, నిర్మిస్తున్న విధానాలకూ దీని నిర్మితికీ భేదముంది. గృహనిర్మాణం వాటంత పర్యాప్తంగా జరిగినా నిర్మాణ సామగ్రి అన్నిచోట్లా తయారయ్యేది కాదు. రాష్ట్ర వ్యాప్తంగా ప్రధాన కేంద్రాలను గుర్తించినా భిన్న వస్తు నిర్మాణం జరిగే స్థలాలను, నిర్మాణ దశలనూ గుర్తించటం కష్టమైంది. ఉదాహరణకు ఇటుక బట్టీల వారినుంచి అమ్మకం పన్ను వసూలు చేసే ప్రభుత్వానికి బట్టీ లెక్కడ విస్తృతంగా ఉన్నవో తెలియదు! ప్రాథమిక సమా చారంకోసం రాష్ట్ర ప్రభుత్వ పౌర సంబంధాల శాఖ వారికి రాసిన ఉత్తరానికి కోశ నిర్మాణం పూర్తి అయిన తరవాత – అంటే మూడు నాలుగు సంవత్సరాల తరవాత – అప్పటికి డైరెక్టరు నరేంద్ర లూథ్రగారి సంతకంతో అస్పష్ట సమాధానం వచ్చింది! చీరాల వంటి చిన్న పట్టణంలో విషయ సేకరణకు తోడ్పడగలిగే భాషాశాస్త్ర పరిచయంగల వాళ్ళు దొరకటం దుర్లభం. ఎంపిక చేసిన విద్యార్థులకు ధ్వనిశాస్త్రం మూల సూత్రాలను పర్యటన పరిశోధన పద్ధతులనూ నేర్పుకోవలసి వచ్చింది. వారి నెలసరి జీతభత్యాలకు, పర్యటన వ్యయానికి వారం పది రోజులు ముందుగా రాసి పర్యటనలో ఉన్నవారికి ఉన్నచోట పోస్టుమాస్టరు గుర్తింపు ద్వారా చెల్లింపులకు ఏర్పాటు చేయటం, ఎప్పటికప్పుడు సేకరించిన పదజాలాన్ని పట్టికాబద్ధం చేయించి, నివేదికలలోని లోపా లను సవరించుకుంటూ పదపదార్థ నిరూపణ చేయటం తప్పదు. గృహ నిర్మాణాదుల్లో వాడే కలప, రాళ్ళు వగైరాల నమూనాలు సేకరించాం – స్థానికంగా వాటికున్న పేర్లతో సహా. అసలు సమస్య ఆ తరవాతది.

కలప రకాలను గుర్తించి వాటి సాంకేతిక నామధేయాలనుబట్టి పర్యాయపదాలను నిర్ధ రించటం, అదేవిధంగా రాళ్ళ విషయంలోనూ చేయటం కష్టసాధ్యమయింది. సాంకేతిక సమా చారంకోసం బాపట్లలోని వ్యవసాయ కళాశాలలోని గ్రంథాలయాన్నీ, తిరుపతిలోని శ్రీవేంక టేశ్వర విశ్వవిద్యాలయంలోని మిత్రుల సహకారాన్నీ పొందవలసి వచ్చింది. సెలవుల్లో పనులు కావు. సెలవులు దొరకటం కష్టం. ఆయా పదాల అర్థాలను స్పష్టంగా చెప్పటంకోసం రేఖా చిత్రాలు గీయించే సముదాచారం వ్యవసాయ వృత్తిపదకోశంతోనే మొదలయింది. అందులో పని చేసిన చిత్రకారుడు లాభీ హనుమంతరావు గారిని చీరాల్లోని స్వగృహంలో బంధించి బొమ్మలు గీయించటం నేనెదుర్కొన్న కష్టాలన్నిటిలోనూ పెద్దది. పర్యటనలో ఎలా ప్రవర్తించేవాడో తెలి యదుగాని పరిశోధకులు మరచిన అంశాలను కూడా ఆయన సేకరించే వాడు. ఇంటికి దూరం గా ఉన్నందువల్ల విచారభారంతో పనికి బద్ధకించేవాడు. మేధావులైన కళాకారులందరితోనూ వారికి నచ్చని, శ్రద్ధలేని పనిచేయించటం ఎంత దుర్భరమో ఆయన ద్వారా బోధపడ్డది. కేటాయించిన సొమ్ము ఖర్చయింది కాబట్టి మళ్ళీ మరికొంతకావాలని ఆశ్రయించటం దేనికని మిగిలిన పని స్వయంగా చేసి ముద్రణయోగ్య ప్రతితోబాటు సేకరించిన సమస్త వస్తువులనూ సాహిత్య అకాడమికి పంపగలిగాను. గ్రంథ ప్రచురణ 1968 నాటికి నెరవేరింది. ముద్రణ వ్యవహారమంతా నా కోరికమీద శ్రద్ధాసక్తులతో చేసినది పోరంకి దక్షిణామూర్తి గారు. ఆయన రుణం తీరేది కాదు.

వృత్తిపదకోశ నిర్మాణ సమయంలో హైదరాబాదులో సాహిత్య అకాడమిని సందర్శించక తప్పలేదు. ఒకమారు 1964లో కాబోలు సమావేశం కాగానే ఆచార్య జి.ఎన్.రెడ్డి గారు నాతో బాటు చీరాల వచ్చారు. మా కాలేజీలో ఎన్.వెంకటరాయుడని ఆయన పూర్వశిష్యుడు ఉన్నాడు తెలుగుశాఖలో. అతడు పరిశోధన చేస్తానంటే నేను త్వరలో తిరుపతి విశ్వవిద్యాలయంలో చేరవచ్చు కాబట్టి నాతో చర్చిస్తూ ఉండమని చెప్పి వెళ్ళాడు. అప్పటినుంచీ ఎప్పుడు పోతున్నావనీ, విద్యా సంవత్సరం మధ్యలో వెళ్ళవద్దనీ యాజమాన్యం తగులుకుంది. అక్కడ ఖాళీ ఉందని దరఖాస్తు చేసిపోతే, తీరా రేపు ఇంటర్వ్యూ అనగా ఆ ఖాళీని నింపటం లేదన్నారు. తిమ్మావజ్ఝుల కోదండరామయ్య, ఎం.కందప్ప చెట్టి వంటి వారితో పోటీ అది. ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో ఖాళీ ఉందని దరఖాస్తు చేశాను. అది దొణప్పగారు తమ సిద్ధాంత వ్యాసాన్ని సమర్పించినప్పుడు ఆయన కిస్తామన్నారు (నేను 1963లోనే సమర్పించినా ప్రయోజనం లేకపోయింది). అంతకు ముందు ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని భాషా శాస్త్ర విభాగంలో లెక్చరర్ పదవికి దరఖాస్తు చేశాను. నాకు ఆ శాస్త్రంలో ప్రాథమిక స్నాతక స్థాయి డిగ్రీ లేదన్నారు. తెలుగు శాఖల్లో రీడర్ పోస్టును కోరినప్పుడు తెలుగులో ప్రాథమిక స్థాయి డిగ్రీ ఉన్నా పరిశోధన డిగ్రీ తెలుగులో లేదన్నారు. నాకు పిహెచ్.డి.ని ప్రసాదించింది తెలుగుశాఖలో పరిశోధించినందుకే. ఇదో పెద్ద విశేషమనిగాక భావితరాల వారికి ఇలాంటి ప్రమాదముందని హెచ్చరించటానికి రాయవలసి వచ్చింది. ఈ పరిణామాలు ఉభయతారకంగా జరిగాయి. విశ్వవిద్యాలయాల్లో నావల్ల విద్యా ప్రమాణాలు పడిపోయే ప్రమాదం తప్పింది. ఆస్తి విషయంలో లాగానే విద్యా విషయంలో కూడా



ఉన్న వాటిని చెడగొట్టే అవకాశం నాకు కలగకుండా పోయింది. పాపపుణ్యాలు రెండూ నాకు లేవు. అదీ సంగతి.

1962లో రాష్ట్ర ప్రభుత్వం నుంచి ఒక లేఖ వచ్చింది. మా నాన్నగారు స్వాతంత్ర్య సమ రంలో పాల్గొని కారాగారవాసం చేసినందుకు గుర్తింపుగా రాజకీయ బాధితుడనే పేరున కొన్ని ఎకరాల భూమినిస్తున్నామని లేఖార్థం. నా తమ్ములతో ఆలోచించి (ఒకే భూఖండాన్ని నలుగురైదు గురికి కేటాయించిన వైనం మా మేనత్త గారి భర్త అయిన ఒక కరణం గారి ద్వారా తెలుసుకొని ఉన్నందున) నిరాకరిద్దామని నిర్ణయించి కలెక్టరు గారికి ఉత్తరం రాశాం మా అందరి సంత కాలతో. భవిష్యత్తులో ధనధాన్యసంపాదన కిది పెట్టుబడి అని భావించి మా నాన్నగారు జైలుకు పోలేదనీ, రాజకీయాల్లో ప్రవేశించి ఆయన స్వబుద్ధితో ఆస్తిపాస్తులు పోగొట్టుకున్నా ఆ పని ప్రతిఫలమాశించి చేసింది కాదనీ రాశాం. వాడరేవు క్యాంపుకు వెళ్తూ దారిలో మా కాలేజీలో ఆగి పిలిపించి కలెక్టరు గ్విన్‌గారు ఎవరికీ లేని ఈ ఆలోచన నీకెందుకని మందలించి తీసుకొమ్మని సలహా ఇచ్చారు. ఒక ఐరిష్ జాతీయుడుగా స్వాతంత్ర్య సమరంలో పాల్గొనటం భావి సంపాదన కని చెప్తే బుద్ధి మార్చుకుంటా మన్నాను. చస్తే ఆలాటి సలహా ఇవ్వనన్నాడు! మీ ఉత్తరంలోని ఆరోపణ ఏమిటన్నాడు. మీరు విచారించి తెలుసుకోండి. ఒకే భూఖండాన్ని మంతెన వేంకట్రాజు గారికి, అడుసుమల్లి శ్రీనివాసరావు గారికీ, అక్కల కోటయ్య గారికీ ఇచ్చామన్నారనీ, నోరులేని చివరి ఇద్దరూ అది మాకు వద్దన్నారని విన్నామని చెప్పాను. మీ కుటుంబం నిరాకరించిందని ప్రకటిస్తానని వెళ్ళారు. తరవాత నెల తిరక్కముందే ధుమధుమలాడుతూ పోతిన వేంకట సుబ్బయ్య గారు కాలేజీ దగ్గరకు వచ్చి “ఏమోయ్! మీలాగా నా పిల్లలూ భూమి వద్దని తిరస్క రించాలంటే నాకు అటువంటి అవకాశం లేకపోయింది – కేటాయించనందువల్ల. నేనిప్పుడేం చేయాలి?” అని ప్రశ్నించాడు! “నా సహాధ్యాయి మీ కుమారుడూ రామచంద్రరావు ప్లీడరు కాబట్టి అతడితో సంప్రదించి ఒక నిర్ణయానికి రండి!” అని చెప్పాను. ఆ మహనీయుడు సొంత పొల మమ్ముకొని న్యాయస్థానాల్లో పోరాడి, పదేళ్ళ తరవాత తనకూ రాజకీయ బాధితులకిచ్చే భూమిని కేటాయింపజేసుకొని, నేను సంపాదనకోసం స్వాతంత్ర్య సమరంలో పాల్గొనలేదని రాసి నిరాకరిం చాడు! అటువంటి స్వార్థరహితు లెందరున్నారో చెప్పలేను. మంత్రి పదవులు వద్దన్న కడప కోటిరెడ్డి గారిని గురించీ, కల్లూరి సుబ్బారావు గారిని గురించీ విన్నాను. అటువంటి స్వార్థ త్యాగులు కొద్దిమందైనా విత్తనానికుండబట్టే ఈ దేశం ఇంకా సర్వధ్వంసం కాకుండా మిగిలింది. రాజకీయరంగం స్వార్థపరుల కుతంత్రాల మధ్య భ్రష్టమవుతున్న కాలంలో వీరిని స్మరించి కొంత ఊరట పొందవచ్చు.

బాపట్ల వ్యవసాయ కళాశాలలో వ్యవసాయార్థికశాస్త్రంలో పరిశోధనలు చేస్తున్న జపానీయు డొకడు తటస్థపడ్డాడు. ఒకరొకరి పేర్లను సరిగా ఉచ్చరించలేం కాబట్టి తెలుసుకోవటం దండగ అన్నాడు. భారద్దేశం మూడు పంచవర్ష ప్రణాళికల్లో పెట్టిన పెట్టుబడికి సక్రమమార్గంలో విని యోగం జరిగితే తమ దేశం కన్నా సంపన్నమై ఉండేదన్నాడు. మన మొదటి ప్రణాళికలో పెట్టినంత వ్యయం తమ దేశం ఈ నాటికీ ఖర్చుచేయలేదన్నాడు. “ప్రణాళికా విధానం అమలైన

తరవాత మొదటి సంవత్సరం గ్రామగ్రామంలో నీటి వసతి కల్పించుకున్నాం. రెండో ఏడు చిన్న చిన్న డైనమోలతో గ్రామావసరాలకు చాలినంత కరెంటు ఉత్పత్తి చేసుకున్నాం. మూడో ఏడు కుటీర పరిశ్రమల మీద కేంద్రీకరించాం. నాలుగో సంవత్సరం నుంచి ఉన్న వనరులను క్రమంగా అభివృద్ధి చేయటం మొదలుపెట్టాం. మేం క్రమాభివృద్ధికి ప్రయత్నించాం గాని మీలాగా మొదటనే భారీ పరిశ్రమలకు సొమ్ము కుమ్మరించలేదు. అవి పూర్తయ్యేలోగా కొన్ని తరాలు నష్టపోతాయని మీరు గ్రహించలేదు. మీ గాంధీ చెప్పినట్లు చేసివుంటే తలకిందులుగా మార్పులు వచ్చేవి. కుటీర పరిశ్రమలనూ, కులవృత్తులనూ ప్రోత్సహించి ఉంటే భూస్వామ్య వ్యవస్థ దెబ్బతినేది. గ్రామ స్వరాజ్యంవస్తే నీటి కరువు, పంట కరువు, చివరకు కరెంటు కరువూ వచ్చేవికావు. పునాది బలంగా ఉంటే మహాసౌధాలు నిర్మించవచ్చు. వ్యవసాయాధారిత పరిశ్రమలు నెలకొల్పుకొని, నదులనుంచి కాలవల ద్వారా జలవసతీ రవాణా సౌకర్యాలూ కల్పించుకొని ఉంటే మీకు ఎదురుండేది కాదు. అలా చేస్తే వేల సంవత్సరాలుగా మిమ్ములను బాధిస్తున్న భూస్వామ్య వ్యవస్థ కూకటి వేళ్ళతో కూలిపోయేది. వాళ్ళ అడ్డు తొలగిపోతే పారిశ్రామికీకరణ సులభమయ్యేది. ప్రభుత్వరంగ సంస్థల ఏర్పాటువల్ల అధికారపక్షం దొంగచాటుగా ఆశ్రిత పక్షపాతం ప్రదర్శించి అశక్తుల, అసమర్థుల చేతిలో సాంకేతిక విషయాల నియంత్రణ పెట్టి అస్వతంత్ర సంస్థలద్వారా అవినీతిని పోషించింది. దాని ఫలితం మీరూ మీ తరవాత ఇతరులూ అనుభవిస్తున్నా"రని మండి పడ్డాడు. "మీ చరిత్రలో ప్రజాస్వామ్యం లేదు. రాచరికం మాత్రమే ఉంది. ప్రజాస్వామ్య భావన యూరప్ ఖండంలో అక్కడి అవసరాలనుబట్టి పుట్టి పెరిగింది. ఆసియా, ఆఫ్రికాల్లో అది పనికి రాదు. అలా మీ అనుభవాలే నిరూపిస్తున్నా"యని వాదించాడు. నాకీ శాస్త్ర విషయాలు తెలియవు. తెలిసీ తెలియని స్థితిలో వాదనకు దిగలేను గాని చూసిన, చూస్తున్న పరిణామాలు అతడి మాటలు నిజమేమో అనిపిస్తున్నాయి.

## విద్యావ్యాపారం

అంతో ఇంతో తెలిసిన విద్యారంగం గురించి చెప్పగలను. జస్టిస్ పార్టీనేత పాములపాటి వెంకటకృష్ణయ్య చౌదరి జిల్లా బోర్డు అధ్యక్షుడుగా ఉన్నప్పుడు వందల సంఖ్యలో గుంటూరు జిల్లాలో ప్రయివేట్ యాజమాన్యంలో ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత పాఠశాలలు వెలిశాయి. 1951 నాటికి ఆ విధానం కళాశాలల స్థాపనకు దారితీసింది. కేవలం 25,000 రూపాయల విరాళమిచ్చి తమ పేరిట కళాశాలలు స్థాపించిన వారున్నారు. నిర్వహణ యాజమాన్యాలూ ఉపాధ్యాయుల నియామకమూ వారి చేతుల్లోనే ఉండేది. ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ఆ మహాదాతలకు (అందులో కొందరు నిరక్షరాస్యులు) కళాప్రపూర్ణ అనే గౌరవ డాక్టరేట్ ప్రసాదించి సెనేట్లో సభ్యత్వం కల్పించేది. ఇంతాచేసి ఆ సంస్థలకు రాజకీయ ప్రాబల్యమున్న వాళ్ళు ప్రభుత్వం నుంచి ఆర్థిక సహాయం పొందుతుండే వాళ్ళు. పేరుకు గ్రంథాలయాలూ, ప్రయోగశాలలూ ఉండేవి. విశ్వకళాపరిషత్ అధికారులూ, ప్రభుత్వ ప్రతినిధులూ వాటిని సందర్శించి సకల మర్యాదలూ పొంది అంతా భేషుగ్గా ఉందని కితాబిచ్చి వెళ్ళేవారు. శాఖలను విభజించే వారు. యాజమాన్యానికి అనుకూలమైన వ్యక్తులు జూనియర్లయినా విభక్త శాఖలకు అధిపతులయ్యే వాళ్ళు. శాఖాధిపతులకు అదనంగా ఇవ్వవలసిందని యూనివర్సిటీ నిర్ణయించిన సొమ్మిచ్చిన సంస్థలు లేని వాటితో సమానం. పూర్తి జీతమిచ్చినట్లు రాయించుకొని కొంత చెల్లించి అందుకంగీకరించిన వారికే ఉద్యోగాలిచ్చారు. వేసవి సెలవుల్లో జీతాలుండేవి కావు. అడ్మిషన్లు పూర్తయ్యేదాకా కొత్త ఉద్యోగులకు ప్రవేశం లేదు. పాఠ్యాంశాల బోధన పూర్తి చేయమని తొందరపెట్టి పూర్తికాగానే పదవినుంచి తప్పించటం సర్వసాధారణం. ఉద్యోగకాలం అవిచ్ఛిన్నంగా లేదు కాబట్టి ఇంక్రిమెంట్లు ఇచ్చే పనిలేదు. ఉద్యోగం ఖాయమైతే తప్ప ప్రావిడెంట్ ఫండ్ ఏర్పాటు లేదు. తొలిదశలో ఆయా శాఖల్లో సరైన అర్హతలున్న వారు దొరక్క పదవీవిరమణచేసిన వారికి తాత్కాలికోద్యోగాలిచ్చారు, నావరకు నేను దరఖాస్తు చేయకుండానే అనంతపురంలోని ప్రభుత్వ కళాశాలలో తెలుగు ట్యూటరుగా నియమితుణ్ణయ్యానని డి.పి.ఐ. నుంచి ఆర్డరందుకున్నాను – చీరాల కళాశాలలో మూడు నెలలు పనిచేసిన తరవాత. ప్రిన్సిపల్ సలహామీద సమాధానం చెప్పనూ లేదు – అనంతపురంలో చేరనూ లేదు. మరో రెండు నెలల తరవాత పనిలో ప్రవేశించనందున క్రమశిక్షణ చర్యగా నన్ను ఉద్యోగంనుంచి తొలగించామనే ఉత్తరువు జారీ అయింది! తిక్క తిరిగి దరఖాస్తే చేయని నన్నీవిధంగా చిన్న పదవిలో నియమించి తొలగించి అగౌరవించినందుకు అధికారం లేకపోయినా సదరు డి.పి.ఐ.ని నేను బర్తరఫ్ చేస్తున్నానని రాసి పంపాను – అందువల్ల ఒరిగేదేమీ లేదని తెలిసి కూడా.

క్రమంగా ఈ విద్యావ్యాపారం వృత్తి కళాశాలలక్కూడా వ్యాపించింది. వైద్య కళాశాల స్థాపనకు విరాళమిచ్చి, దానికి తనపేరే ఉండాలని శాసించి, దాని భవన నిర్మాణానికి కంట్రాక్టు తానే పరోక్షంగా సంపాదించి లాభపడ్డ వాళ్ళున్నారని విన్నా. రాజ్యాంగం ప్రకారం సంక్రమించే ఉచిత వేతనాల్లో భాగమిస్తే గాని విద్యాసంస్థల ఉద్యోగులు విద్యార్థుల దరఖాస్తులను ప్రభుత్వానికి పంపేవాళ్ళు కారు. చచ్చిన వాడి పెళ్ళికి వచ్చిందే వరకట్నమనే సామెత ప్రకారం పేద విద్యార్థులు తమ పేరిట న్యాయంగా వచ్చిన సొమ్మును పరాయి వాళ్ళకు పంచిపెట్టక తప్పేదికాదు. రాజకీయ రంగంలో పర్మిట్ల లైసెన్సుల రాజ్యం నడిచేప్పుడు, అవినీతికీ ఆశ్రిత పక్షపాతానికీ అవకాశం ఉన్నప్పుడు ఆ రుగ్మత ఇతర రంగాలకు వ్యాపించటంలో ఆశ్చర్యం లేదు. అధికారులు ప్రభువులు. రాజులు పోయినా అసంఖ్యాకంగా మంత్రులు పుట్టారు. సమాజంలో చరిత్ర పుట్టినప్పటి నుంచీ ధనవంతుల పెత్తనం ఉంది. అధికారం అవినీతిని రక్షించగలదు. అయినా సామాన్య ప్రజల దృష్టిలో వీరే శ్రేష్ఠులు. సాక్షాత్తూ శ్రీకృష్ణ పరమాత్మ అంతటివాడు "యద్య దాచరతి శ్రేష్ఠ స్త త్త దే వేతరే జనాః, సయత్ ప్రమాణం కురుతే లోక స్త దనువర్తతే" అని భగవద్గీతలో చెప్పాడు. "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" అనీ శాసించాడు. ఇదే మన దేశంలో చెలామణిలో ఉన్న ధర్మం. "ధనమార్జయ కాకుత్థ! ధనమూల మిదం జగత్, అంతరం నైవపశ్యామి నిర్ధనస్య మృతస్య చ" అని విశ్వామిత్రుడు శ్రీరామచంద్రుడికి చెప్పాడని స్వయంగా వాల్మీకి చెప్పాడు. వ్యాస భట్టారకుల వారు "అనిత్యాని శరీరాణి విభవో నైవ శాశ్వతః, నిత్యం సన్నిహితో మృత్యుః కర్తవ్యో ధర్మ సంగ్రహః" అని బోధించినప్పుడు 'కర్తవ్యో' అనే భాగానికీ 'ధర్మ' శబ్దానికీ మధ్య అవగ్రహను (తెలుగువాడుకలో పరకను) ఉంచాడో లేదో తెలీదు. ఆయన దస్తూరీ మనకు

తెలియదు – మనం చూడలేదు. ఆయన ఎలా ఉచ్చరించాడో తెలీదు. అందువల్ల 'అధర్మ సంగ్రహం' కర్తవ్యమన్నాడో 'ధర్మసంగ్రహమే' చేయమన్నాడో స్పష్టంగా చెప్పలేం. వారివారి అభిరుచుల ప్రకారం అర్థనిర్ణయం చేసుకోవచ్చు. ఈ పరిణామ క్రమంలో చేతివృత్తులు, కుటీర పరిశ్రమలు అంతరించాయి. వాటిలో నిపుణులను ధనవంతులైన వ్యాపారులు శాసించటం మొదలైన తరవాత అన్ని రంగాలూ ఒకేరకంగా దెబ్బతినక తప్పలేదు.

కాలప్రవాహం ఆగలేదు. 1967 వచ్చింది. వాస్తు వృత్తి పదకోశ నిర్మాణం పూర్తి అయింది. అప్పటికి మూడు విశ్వవిద్యాలయాల ఆంధ్రశాఖలు నా వల్ల ఇబ్బందులు లేని, రాని మార్గాలను అన్వేషించటం మొదలుపెట్టాయి. కొత్తగా ఏదో సంస్థ రాబోతున్నదని ఆ యేడు వెలువడ్డ గ్విన్ కమిటీ నివేదిక బయటపెట్టింది. తెలుగుభాషను ఉద్ధరించి సమస్త రంగాల్లో దాన్ని అధికార భాషగా ప్రకటించాలని 1966లో అధికార భాషాచట్టం చేశారు. అందుకు తెలుగు అకాడమిని స్థాపిస్తూ రాష్ట్ర ప్రభుత్వం ప్రకటన విడుదల చేసిన తరవాత నెలరోజులకు బడ్జెటులో అందుకు సొమ్ము కేటాయించనందువల్ల మూసివేస్తూ మరో ఉత్తరువు జారీ చేసింది. ది హిందూ పత్రిక ఈ వార్తను ఘనంగా పేటికాంతర్గతం చేసి (బాక్స్ ఐటమ్/డబ్బావార్త గా) ప్రచురించింది. చేసిన తప్పును అయ్యవారు దిద్దుకొన్న తరవాత, 1968 ఆగస్టులో తెలుగు అకాడమిని స్థాపిస్తూ మరో ప్రభుత్వాజ్ఞ వెలువడింది. అప్పటి విద్యాశాఖ కార్యదర్శి జె.పి.ఎల్.గ్విన్ గారి నుంచి చీరాల కళాశాల కరెస్పాండెంటు గారికో అర్ధాధికార లేఖ అందింది – నా సేవలను అకాడమికి కొంత కాలం ఎరువిమ్మని. అందిన రోజు సెప్టెంబరు 17వ తేదీ. వెంటనే నన్ను పిలిచి తక్షణం విడుదల చేస్తాం పొమ్మన్నారు – అది పరీక్షాకాలం అయినా. "నాకూ ఆహ్వానం అందాలిగదా. అది వస్తేనేపోతా. ఇన్నాళ్ళున్న వాణ్ణి అర్థాంతరంగా ఎలా పోతా"నని మొండికి పడ్డాను. మరునాడు నాకూ అందింది. ఆ సాయంత్రం బయలుదేరి హైదరాబాద్ చేరాను మర్నాడు ఉదయం.



# 10. తెలుగు అకాడమిలో

తెలుగుభాష నుద్ధరించాలనే సద్భావం మన నేతలకు అకస్మాత్తుగా పుట్టలేదు. 1913లో బాపట్ల మహాసభ కావాలని తీర్మానించిన ఆంధ్రరాష్ట్రం 1953లో పొట్టి శ్రీరాములు ఆత్మార్పణతో సిద్ధించింది. అంతటితో రాజకీయ ప్రయోజనం నెరవేరింది. 1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది గాని ఆ తరవాత పదేళ్ళకు గాని తెలుగును అధికారభాష చేయాలనే సంకల్పం కలగలేదు. 1951లోనే పార్లమెంటు అధికార భాషాచట్టం ఆమోదించింది. హిందీని అధికార భాషగా ప్రకటించినా నేటికీ అది పూర్తిగా నెరవేరలేదు. ఇంగ్లీషులోనే చాలావరకు పరిపాలన జరుగుతున్నది. గాంధీజీ పేర్కొన్న హిందుస్తానీ అనే భాషా రూపానికి రాజ్యాంగంలోని 351వ అధికరణంలోనేగాని 6వ షెడ్యూల్లో స్థానం లభించలేదు. లిపి భేదాన్ని బట్టి, పదజాలాన్ని బట్టి ఉర్దూ ప్రత్యేక భాష అనే రాజకీయ నిర్ణయం జరిగింది – భాషాశాస్త్ర దృష్టిలో అది అసంబద్ధ భావమైనా సరే. హిందీ ఉర్దూలకు విడివిడిగా కోట్ల రూపాయలు కుమ్మరించి వాటిని అభివృద్ధి చేయవచ్చునని నేతలు విశ్వసించారు. అధిక సంఖ్యాకుల నిర్ణయం అలా ఉంది కాబట్టి రాజ్యాంగం గుర్తించిన ఇతర ప్రాంతీయ భాషల విషయం అంతగా పట్టించుకోలేదు. 1964లోనో, 1965లోనో పండిట్ హృదయనాథ్ కుంజ్రూ వేళాకోళంగా బడ్జెటు చర్చల్లో ఒక సూచన చేశాడు పార్లమెంటులో. వీలైనంత త్వరలో సాధ్యమైనంత ఎక్కువ సొమ్ము కేటాయించి అండమాన్ నికోబార్ దీవులను అభివృద్ధి చేయటం రాజనీతిజ్ఞత అన్నా డాయన. అప్పటి రాజ్యపాలన పద్ధతులూ, అవినీతి విజృంభణా చూస్తే చాంగ్ కైషేక్ హయాంలో చైనా వాళ్ళు ఫార్మోజా (తైవాన్)ను మంచి స్థితికి తెచ్చినందువల్ల కమ్యూనిస్టు ప్రమాదం ముంచుకవచ్చినప్పుడు మహానాయకులు క్షేమంగా తలదాచుకోగలిగారనీ, అది ఆదర్శంగా మనమూ జాగ్రత్తపడటం మంచిదనీ వ్యాఖ్యానించాడు. అదే ధోరణిలో ఉన్న సొమ్మునంతా హిందీ ఉర్దూలకు కేటాయించి ఇతర భారతీయ భాషలను విస్మరిస్తే కుంజ్రూ గారి సూచన పాటించని కేంద్ర ప్రభుత్వ నేతలు ఇబ్బందుల్లో పడతారని మరో గౌరవ సభ్యుడు హెచ్.వి.కామత్ ముక్తాయించాడు.

అప్పుడు ఆయా రాష్ట్రాల్లోని మెజారిటీ భాషల అభివృద్ధికీ వాటిని అధికార భాషలుగా తీర్చిదిద్దటానికీ ఒక్కో భాషకు కోటి రూపాయల చొప్పున ఆర్థిక సహాయం చేస్తామనీ ఆ వ్యవహారాన్ని పార్లమెంటు నెలకొల్పిన "వైజ్ఞానిక్ తథా తక్నీకీ శబ్దావలీ ఆయోగ్" (ఇంగ్లీషులో Commission for Scientific and Technical Terminology - క్లుప్తంగా CSTT) అనే శాఖ హిందీ డైరెక్టరేట్‌తో కలిసి నిర్వహిస్తుందనీ ప్రకటించింది కేంద్ర ప్రభుత్వం. అందు కేర్పరచిన రాష్ట్ర సంస్థల నిర్వహణవ్యయం రాష్ట్ర ప్రభుత్వాలే భరించాలనీ, పెట్టుబడిగా మూలధనాన్ని అంచెలవారీగా విడుదల చేస్తామనీ, వృథా వ్యయాన్ని అరికట్టడానికి ఆయా సంస్థలకు ఆయా రాష్ట్రాల్లో తలదాచుకొనే అవకాశమిచ్చిన విశ్వవిద్యాలయంలో స్థావరం కల్పించాలనీ, విశ్వవిద్యాలయాల ఉపాధ్యక్షులు వంతుల వారీగా ఆస్వతంత్ర సంస్థలకు అధ్యక్షులుగా వ్యవహరించాలనీ నిర్ణయించారు. కేంద్ర సంస్థ అందిచ్చే మూలధనం రాష్ట్ర ప్రభుత్వాల ద్వారా విడుదల చేస్తామన్నారు. ఇలా

కేంద్రమిచ్చే సొమ్మును పోగొట్టుకోవట మెందుకని మనవాళ్ళు తెలుగు అకాడమిని స్థాపించారు. పేరుకది స్వతంత్ర సంస్థ. పదవిరీత్యా దాని పాలక వర్గానికి విద్యామంత్రి అధ్యక్షుడుగా ఉంటాడు. వంతుల వారీగా సీనియారిటీ ప్రకారం ఏదో ఒక విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షుడు ప్రథమోపాధ్యక్షుడుగా ఉంటాడు. విద్యాశాఖ కార్యదర్శి ద్వితీయోపాధ్యక్షుడుగా ఉంటాడు. మిగిలిన విశ్వవిద్యాలయాల ఉపాధ్యక్షులందరూ, ఆర్థిక న్యాయ శాఖాకార్యదర్శులూ, సాంకేతిక సాధారణ విద్యాశాఖల సంచాలకులూ సభ్యులు. అయిదుగురు నిరధికారులైన విద్యావేత్తలున్న విద్యావిషయక స్థాయీసంఘ ముంటుంది గాని అందులో విద్యాశాఖ కార్యదర్శి సభ్యత్వం తప్పదు. సదరు కార్యదర్శి అధ్యక్షతన పరిపాలన విషయక స్థాయీ సంఘ ముంటుంది. అందులో విద్యావిషయక స్థాయీసంఘాధ్యక్షు డొక సభ్యుడు. వీటన్నిటికీ అకాడమీ సంచాలకుడు సభ్యకార్యదర్శి. ప్రభుత్వం గుర్తించిన వ్యక్తులే విద్యావేత్తలు. పేరు కిది స్వతంత్ర సంస్థ. నేతిబీరకాయలో ఎంత నెయ్యి ఉందో ఈ పాలకవర్గంలో అంత స్వాతంత్ర్యముంది.

ఉద్యోగులు నాలుగు విభాగాలని చెప్పాలి. పరిపాలనలో సంచాలకులకు తోడ్పడే సిబ్బంది మొత్తం ఆ వ్యక్తి ప్రత్యక్ష పర్యవేక్షణలో ఉంటుంది. విద్యా విషయకంగా మూడు శాఖలున్నాయి – పరిశోధన, బోధన– శిక్షణ, ప్రచురణశాఖ లని. వీటిలో మూడోది కీలకం – ధనార్జన చేస్తుంది కాబట్టి. తక్కిన రెండూ వాటికి నిర్దేశించిన పనులకన్నా ముఖ్యంగా ప్రచురణ శాఖకు తోడ్పడక తప్పదు. గ్రంథ విక్రయం ద్వారా వచ్చిన సొమ్ము సంచితనిధి (సరైన ఇంగ్లీషు మాట రివాల్వింగ్ ఫండ్)లో చేరి పునర్ముద్రణ సమయంలో పెట్టుబడిగా పనికి వస్తుంది. ఇస్తామన్న కోటి రూపాయలనూ ఏకమొత్తంగా ఇవ్వరు. కేంద్ర ప్రభుత్వం తరఫున యు.జి.సి. ప్రతినిధీ, హిందీ డైరెక్టరేట్ ప్రతినిధీ ఉంటారు. కాలక్రమాన పరిపాలక మండలిలో చేర్పులు జరిగాయిగాని పెద్ద మార్పులేమీ లేవు. రాష్ట్ర ప్రభుత్వం విధాన నిర్ణయం చేస్తుంది. దానికి తిరుగులేదు. ఇటువంటి మహత్తర సంస్థలో నాకు పరిశోధన విభాగాన్ని కేటాయించారు. రాష్ట్రమంతా పర్యటించి సామాజిక భాషా పరిశీలన చేసి ఆధునిక తెలుగుభాషకు విస్తృతమైన వర్ణనాత్మక వ్యాకరణం రాయటం, నిఘంటువులు నిర్మించటం, నానాశాస్త్రాల్లో పరిభాషను సిద్ధం చేయటం ప్రధానకర్తవ్యా లన్నారు. భాషాపరిశీలనకు పన్నిద్దరు సహాయకు లుంటారని ముగ్గురిని నియమించి వారిని ప్రచురణ విభాగం పనులకు ప్రాధాన్యమివ్వమన్నారు. తెలుగు నేర్చుకోదలచిన ప్రభుత్వోద్యోగులకు తెలుగునేర్పటం బోధన విభాగం కర్తవ్యం. అందుకు నియమితులైనవారుకూడా ప్రచురణ కార్యక్రమంలో పాల్గొనాలి. స్థూలంగా ఇలాంటి లక్షణాలున్న సంస్థలో పరిశోధన శాఖాధిపతిగా చేరబోతే అప్పటి ప్రత్యేకాధికారి (కొంతకాలం తరవాత ఆయన్ను సంచాలకుడుగా నియమించారు) పంచాంగం చూసి ఆనాడు చేరటం మంచిదికాదని చెప్పాడు. ఒక్కక్షణం ఉద్యోగకాలంలో విరామం వచ్చినా ప్రమాదమే. నివారణ చర్యలు ఎంతకాలం పట్టాయో, ఎవరు తీసుకొంటారో తెలియదు. 'సుఖస్య దుఃఖస్య న కోAపి దాతా' అని మా గురువుగారు చెప్పిన మాటను నమ్మి ఇప్పుడే చేర్తానన్నాను. చేరాను. అప్పటికాయన తరవాతి ఉద్యోగిని నేను. ఒక గుమాస్తాగా రున్నారు. మేం త్రిమూర్తులం. ఓ బంట్రోతుగా రున్నారు. వారితో కలిపి మేం చతుష్టయం. మరిద్దరు విభాగాధిపతులు



చేరవలసి ఉంది. ఉద్యోగులను ఎంపిక చేయవలసి ఉంది. కార్యాలయం హిమాయత్‌నగర్‌లోని పాకిస్తాన్‌కు వెళ్ళిన ఒక ప్రవాసి గృహం – ప్రభుత్వాధీనంలో ఉంది. ఒకవైపు ప్రభుత్వ వైద్యశాల. మరోవైపు రేకుల షెడ్డు. మధ్యలో మూడు గదులు – ఒక పెరడు.

ఉద్యోగంలో ప్రవేశించిననాడు నన్ను కాపలాపెట్టి గుమస్తాగారూ, ప్రత్యేకాధికారిగారూ సచివాలయానికి వెళ్ళారు – తదనంతర కార్యక్రమం తెలుసుకొని రావటానికి. బంట్రోతుగారు విహారానికి పోయారు. కొంతసేపటికి ఓ పెద్దాయన వచ్చాడు ప్రత్యేకాధికారి సాయంకోసం. "బాబూ! నా పేరు కల్లూరి సుబ్బారావు. మాది హిందూపూరు. నేను ఎం.కాం. చదివించిన కుర్రవా డొకడు ఉద్యోగార్థి. అతడికి సాయం చేయమని విద్యామంత్రి గారికి విన్నవించి దరఖాస్తు ఇప్పించాను. కాస్త గుర్తుపెట్టుకుని సాయం చేయమని వారికి చెప్పు" అని ఆయన చెప్తుంటే తలతిరిగిపోయింది. మంత్రి పదవిని కాలదన్ని, ఉన్న ఆస్తితో ఎందరినో పోషించిన మహనీయుడు ఇలా ఇతరుల మేలుకోసం దేబిరిస్తున్నాడు – స్వతంత్ర భారతంలో! సాయంత్రం వేళకు వచ్చిన పైఅధికారికి జరిగిన సంగతి విన్నవించాను. 'అలాగా!' అన్నాడు. అంతే సంగతులు. మరునాడు పది గంటలకల్లా రావాలనీ విద్యామంత్రిగారు ఏ క్షణంలోనైనా రావచ్చుననీ నాకు హెచ్చరిక చెప్పాడు. "పదిహేను సంవత్సరాలపైకాలం ఏదో చిన్న ఉద్యోగం చేసినా ఎప్పుడూ ఆలస్యంగా రాలేదు – ముందు పోలేదు" అని నా స్వభావం వివరించాను. సాయంత్రం అద్దెకొంపకోసం అన్వేషణ చేయాలి. మరునాడు ఉదయం పదిన్నర ప్రాంతంలో విద్యామంత్రి పి.వి.నరసింహారావుగారి పరిచయ మయింది. కూర్చోమన్నారు. తెలుగు అకాడమిని ఇంటర్మీడియట్ బోర్డునూ ఒకేసారి స్థాపించారని నాకు అప్పటిదాకా తెలీదు – దానికి విద్యాశాఖ నుంచి పి.ఆదినారాయణగారిని అధిపతిని చేశారు. మంత్రిగారు ఇంటరు పిల్లలకు తెలుగులో పాఠ్యగ్రంథాలుగా, అంశాలుగా ఏమేమున్నాయని మా అధిపతి పి.ఎస్.ఆర్. అప్పారావు గారిని అడిగారు. నాటకంగా భాసుడి యజ్ఞఫలాన్ని అనూదిత రూపంలో నిర్ణయించా మన్నారు. "అదేమిటి? గయోపాఖ్యానంలాంటి తెలుగునాటకాన్ని మొదటి సంవత్సరం పెట్టి, రెండో సంవత్సరం కాళిదాసు, షేక్స్పియర్ వంటి మహారచయితల నాటకానువాదాల్లో ఏదో ఒకటి ఉంచవచ్చుగదా?" అన్నారు. నాటక లక్షణాలను బోధించటానికి నిర్దిష్ట గ్రంథం బాగా ఉపయోగపడుతుం దనుకొన్నారని అప్పారావు గారు చెప్తే నాకు నవ్వు వచ్చింది. ఎందుకు నవ్వుతున్నారంటే ఆలంకారికులు పేర్కొన్న రూపక లక్షణాల్లో అత్యధిక భాగాన్ని భాసుడు అవహేళనం చేశాడన్నా. అవేమంటే ఏకరువు పెట్టాను. మీరు యజ్ఞఫలం చదివారా? అని ప్రశ్నించారు. రెండేళ్ళుగా శ్రీపాద కృష్ణమూర్తిగారి అనువాదాన్ని బి.ఏ. విద్యార్థులకు పాఠం చెప్తూ మధ్యలో ఇటు వచ్చానన్నా.

మంత్రిగారు వెళ్తూ జేబులోంచి ఓ చిన్న కాగితం తీసి "అప్పారావు గారూ! మదిరాక్షి అనే మాటకు వ్యుత్పత్తి ఏ"మని అడిగారు. "కల్లులా తెల్లగా ఉండే క" ళ్ళని ఆయన చెప్పారు. మంత్రిగారు 'గుంటూరు పండితులేమంటారు?' అని ప్రశ్నిస్తే నాకు కోపం వచ్చినమాట వాస్తవం. "నేను మా గురువుల దగ్గర నేర్చుకున్నవన్నీ గుర్తు పెట్టుకున్నానని చెప్పలేనుగాని, నాట్యశాస్త్రంలో "మదిరేతి అర్ధనిమీలితనేత్రముద్రా" అని చదివింది గుర్తున్నదన్నా. "అప్పారావు గారూ! మీ అభిమాన

విద్యలో ఈయన తలదూరుస్తున్నాడు. జాగ్రత్తగా ఉండండి" అని చెప్పి వెళ్ళారు. నాకిక మిగిలింది కష్టకాలమని అర్థమయింది. ఆ రాత్రి పరిశోధించి దివాకర్ల వేంకటావధాని గారు యజ్ఞఫల నాట కాన్ని అనువదించటానికీ, దాన్ని పాఠ్య గ్రంథంగా నిర్దేశించటానికీ నిర్ణయించారని తెలుసు కున్నాను. ఆ ఎంపికను విద్యామంత్రి రద్దు చేశారనీ తెలిసింది మరునాడు. 1953 తరవాత మరోసారి అవధాని గారితో పోరు తప్పదని కూడా తేలింది. విద్యావిషయక స్థాయీ సంఘానికి పింగళి లక్ష్మీకాంతంగారు అధ్యక్షులనీ, అవధానిగారూ భద్రిరాజు వారూ సభ్యులనీ ఆ సంఘ అకాడమీ పాఠ్యగ్రంథరచనలో వాడవలసిన భాషాస్వరూపాన్ని నిర్ణయించవలసిఉందనీ, ఆ సందర్భంలో నేను వారికి సేవలందించాలనీ తెలుసుకున్నా తరవాత.

**పరిభాష విషయం**

కందుకూరి వీరేశలింగంగారి కాలంనుంచీ శాస్త్రగ్రంథాలు వచనంలో రావటం ఎక్కు వయింది. అంతకు ముందున్న గ్రంథాలు అన్నీ లభించటంలేదు. 1921లో కాబోలు బ్రిటిష్ ప్రభుత్వం మెట్రిక్యులేషన్ స్థాయిదాకా తెలుగు, తమిళ, కన్నడ, మళయాల భాషల్లో ప్రాథమిక పరిభాషా పట్టికలు తయారు చేయించింది. దరిమిలా దిగవల్లి వేంకటశివరావుగారు వంటి వ్యక్తులూ తెలుగుభాషా సమితి వంటి సంస్థలూ ఆయా శాస్త్ర పరిభాషను కొంత పెంచగలిగితే కేంద్ర ప్రభుత్వం వారు పెద్దయెత్తున సంస్కృతాధారితంగా కొన్ని పట్టికలు ప్రచురించారు. దాతే కార్వేలు, రఘువీర, తెలుగులో వేటూరి శంకరశాస్త్రి, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి వంటి పండితులు మరికొన్ని పట్టికలు ప్రచురించారు. ఆంధ్ర రాష్ట్ర ప్రభుత్వం అయ్యదేవర కాళేశ్వరరావుగారి అధ్యక్షతన నియమించిన సంఘం పరిపాలన న్యాయపదకోశం ప్రచురించింది. ఇంటర్మీడియట్ స్థాయి పరిభాషను భిన్నశాస్త్రాల్లో సిద్ధపరచటానికి వీటినన్నిటినీ సేకరించటం ఒక ఎత్తు. 1968కి ముందు ప్రయివేట్ వ్యక్తులూ, సంస్థలూ ప్రచురించిన పాఠ్యగ్రంథాల్లో కొంత పరిభాష లభిస్తుంది. అయితే పాఠ్య ప్రణాళికకు అనుగుణంగా అవసరమైన సాంకేతిక పదాలను ఇంగ్లీషు లో గుర్తించి తెలుగులో వాటికి సమానార్థకాలను ఎంపిక చేయవలసి ఉండగా, సి.ఎస్.టి.టి. వారు విధించిన షరతులవల్ల కొత్త చిక్కులు వచ్చాయి. తాము సిద్ధం చేసిన పట్టికల నుంచి 25 శాతం, అప్పటికి ప్రాంతీయ భాషలో సిద్ధంగా ఉన్న పదజాలం నుంచి 25 శాతం, అంతర్జాతీయ పరిభాషనుంచి 25 శాతం ఉండాలనీ, అవసరాన్ని బట్టి మిగిలిన పరిభాషను సృష్టించుకోవచ్చనీ వారి నిర్ణయం. అంతర్జాతీయ పరిభాష అంటే ఐ.రా.స. గుర్తించిన భాషల్లో అధిక సంఖ్యాకులు అంగీకరించి వాడుతున్న పదజాలమని వారి నిర్వచనం. యు.జి.సి. వారు అలాంటి పట్టికలు ప్రచురించారు గాని పట్టున పదిశాతం మాటలు కూడా ఆ నిర్వచనకు సరిపోయేట్లు లేవు. నానా విధాలుగా ఉన్న పరిభాషనూ దానికి సమానార్థక ప్రామాణికాంగ్ల పదాలనూ సేకరించి ఆయా శాస్త్రవేత్తల సంఘా లకు నివేదించి వారి అనుమతి సంపాదించిగాని పాఠ్యగ్రంథాల్లో వాడరాదని అకాడమి యాజ మాన్యం నిర్ణయించింది. విద్యావిషయక స్థాయీ సంఘంలో భాషాశాస్త్రవేత్తలైన భద్రిరాజు వారు ఇంగ్లీషు పరిభాషను యథాతథంగా తెలుగులో వాడటం సర్వోత్తమ మార్గమనీ, పాఠ్యగ్రంథ రచయితలకు తమకు తోచిన పరిభాషను కల్పించుకొనే స్వాతంత్ర్యం ఇవ్వాలని, కొంతకాలం



తరవాత భిన్న పారిభాషికాల్లో ఏది బహుజనామోదం పొందితే దాన్ని స్వీకరించవచ్చుననీ ప్రతిపాదించారు. చాలా మంది విశ్వవిద్యాలయాచార్యులు ఇంగ్లీషు పదాలనే అంతర్జాతీయ పరిభాషగా గుర్తించి వాటిని తెలుగులిపిలో రాసినా, వాటికి తెలుగు సమానార్థకాన్ని వాడినా ఆంగ్ల పదాలను కుండలీకరించి చూపాలని వాదించారు (నిజానికి ఇంటర్మీడియట్ విద్యార్థులకు బోధకులు వీళ్ళుగారు – వీరి శిష్యులేగాని). భిన్న విశ్వవిద్యాలయాచార్యులను ఆయా శాస్త్ర సంఘాల్లో సభ్యులను చేస్తే ఏకాభిప్రాయసాధన ఒక పట్టాన సాధ్యమయ్యేది కాదు. ఒకరి ప్రామాణ్యాన్ని మరొకరు గుర్తించేవాళ్ళు కాదు – ఎప్పుడో తప్ప. అంతకాలం ఉన్నత పాఠశాలా స్థాయిలో వాడుకలో ఉన్న తెలుగు పరిభాష తప్పులకుప్ప అని వారి విశ్వాసం. ఇన్నాళ్ళూ అభ్య సించిన మాటలను మారిస్తే విద్యార్థులకు కలిగే ఇబ్బందుల విషయం వారికి పట్టదు. గణిత, భౌతిక, రసాయన శాస్త్రాలు మూడూ నేర్చుకొనే విద్యార్థి ఒకే భావనకు (Concept) భిన్న పారిభాషికాలను నేర్చుకోవలసి వస్తే ఉద్భవించే అవ్యవస్థను అందరూ గుర్తించలేదు. భిన్న రచయితలు ఒకే పాఠ్యగ్రంథంలోని భాగాలను రాసినప్పుడు ఎవరికి తోచిన పరిభాషను వారు వాడితే అది ఒకే పాఠ్యగ్రంథ మనిపిస్తుందా అన్న ఆలోచన వారికి రాలేదు. రచయితల స్వాతంత్ర్యం హరించి అకాడమి పరిభాషను ప్రమాణీకరించరాదనీ, గ్రంథరచనలో వాడే భాషా రూపాలు కూడా ప్రధాన మాండలికాల్లో కనీసం మూడు రకాలుగానైనా ఉండాలనీ భద్రిరాజు వారు, చేకూరి వారు పోరుపెట్టారు. వారు శాస్త్రవిద్య నేర్చిన అమెరికాలో – అంతటి సంపన్న దేశంలో – భిన్న మాండలికాల్లో శాస్త్ర గ్రంథాలులేవు కదా అంటే, అక్కడి భాష ప్రమాణీకృత మయిందని వాదిస్తారు. ప్రత్యేక తెలంగాణా ఉద్యమం బలం పుంజుకుంటున్న సమయంలో ఈ మహాశాస్త్రజ్ఞులు మరికొంత అయోమయం సృష్టించేందుకు తోడ్పడ్డారు (వారి వాదం పూర్తిగా నెగ్గితే తెలుగు బోధనమాధ్యం అవుతుందన్న నమ్మకంలేదు).

**భాష విషయం**

ఇక భాషా విషయంలో చర్చోపచర్చలు జరిగాయి. తిరుపతిలో తాపీధర్మారావు గారి అధ్యక్ష తన జరిగిన మహాసభ శాస్త్రగ్రంథాల్లో వ్యావహారికభాషనే వాడాలని సిఫారసు చేసింది. ఆ వాదాన్ని గ్విన్ కమిటీ నివేదిక సమర్థించింది. తరవాత ప్రభుత్వం అంగీకరించింది. విద్యాశాఖ డైరెక్టరు కార్యాలయంలో పింగళి వారి అధ్యక్షతన, గొడవర్తి సూర్యనారాయణ గారితో ఒక ఉప సంఘాన్ని నియమించారు – వివరాలు సూత్రీకరించటానికి. (అలాగే పరిభాషా కల్పనకోసం డాక్టర్ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారి ఆధిపత్యంలో మరో విభాగాన్ని నియమించారు). అకాడమి స్థాపనానంతరం ఈ రెంటినీ పరిశోధనశాఖలో చేర్చారు. (జూనియర్ పెత్తనంలో పనిచేయనని శ్రీపాదవారు వారం రోజుల్లోగా రాజీనామా చేశారు). అకాడమి విద్యావిషయక స్థాయీసంఘం చర్చించి రూపొందించిన స్థూలవిధానాలను పరిపాలకసంఘం ఆమోదించింది – భాషావిష యంలో. పాఠ్యగ్రంథరచన మొదలై చిత్తుప్రతులు రాగానే అకాడమి ఉద్యోగులు భాషాసంస్కరణ చెయ్యాలన్నారు. పరిశోధన శాఖలోని ఉద్యోగులు (వీరి మాతృభాష తెలుగేగాని అభిమాన విద్యకాదు. భాషాశాస్త్రమనే దాన్ని అభిమానవిద్యగా నేర్చుకున్న వారిలో నూటికి తొంభయి

తొమ్మిది మందికి సాహిత్య పరిచయంగాని, సంప్రదాయ వ్యాకరణ పరిజ్ఞానంగాని లేదు – ఉండనక్కరలేదు!) కూడా భాషా సంస్కరణ చేయవలసి వచ్చింది. వాళ్ళు తప్పులుచేసి భాషను భ్రష్టుపట్టిస్తున్నారని దివాకర్లవారు విద్యామంత్రిగారి దగ్గర అభియోగం తెచ్చారు. ఆయన దోషారోపణ పత్రాన్ని నాకు పంపి ప్రత్యుత్తరం ప్రత్యేక సమావేశంలో చెప్పాలని ఆదేశించారు. (నేను అకాడమిలో ఉండగా విద్యామంత్రులు చాలామంది మారారు. వారిలో ఒక్క పి.వి.గారు మాత్రమే అభియోగ పత్రాలను నిందితులకు పంపి లిఖిత సమాధానం అడిగిన వారు. తక్కిన వాళ్ళందరూ శాసన సభలోనో పత్రికా విలేఖరుల సమావేశంలోనో పూర్వవిచారణ చేయకుండా ఉద్యోగుల మీద చర్య తీసుకుంటున్నామనో, ఈ చర్య తీసుకున్నామనో ప్రకటించి తమ ఆధిక్యాన్ని ప్రదర్శించి ప్రజాదరణ పొందిన వాళ్ళే. ఇందుకు అనేక నిదర్శనాలున్నాయి – రెండు రకాలు గానూ). దివాకర్ల వారు భాషాద్రోహం జరిగిందని పేర్కొన్న తప్పులన్నీ వారు స్వయంగా చేసినవీ, సమర్థించినవీ. వారు రాసిన వ్యాసాలను, పీఠికలను, గ్రంథాలను సేకరించి వారు తప్పులన్న ప్రయోగాలను స్వయంగా ఎక్కడక్కెడ చేశారో అధోరేఖలతో సూచించి ప్రత్యేక సమావేశంలో ఆత్మరక్షణతోబాటు సోదరోద్యోగులను సమర్థించటానికి ప్రయత్నించాను. నా దగ్గరి బ్రహ్మాస్త్రాన్ని చిట్టచివరకు ప్రయోగించక తప్పలేదు. చెళ్ళపిళ్ళవారి సంస్మరణ సంచికకు నేను ఇంటరు విద్యార్థిగా రాసిన పద్యాలను తిప్పి పంపిన కాటూరివారు 'సుప్రసిద్ధ విద్వాంసుల రచనలను మాత్రమే' స్థలాభావంవల్ల ప్రచురించగలుగుతున్నా మంటూ రాశారు. ఆ ఉత్తరం ప్రదర్శిస్తే పి.వి.గారు "ఇదెందుకు?" అని ప్రశ్నించారు. "నేను అప్రసిద్ధుడ ననేకాక దివాకర్లవారు సుప్రసిద్ధు లనటానికి ఈ ఉత్తరాన్నే గాక ఈ ప్రత్యేకసంచికనుకూడా చిత్తగించం"డన్నా. దివాకర్ల వారు రాసినట్లు నాకు దొరికిన ఏకైకాధారం అందులోని వ్యావహారిక భాషావ్యాసం! వారి అభియోగంలో ఉన్న వాటికన్నా పెద్ద తప్పు లందులో ఉన్నాయి. పింగళివారు తమ పూర్వశిష్యుణ్ణి మందలించారు. పి.వి.గారు "ఈ వివాదం ఇంతటితో కట్టిపెట్టి నా వెంట యాదగిరిగుట్టకు రండి. అక్కడ తడిగుడ్డలతో స్వామి ఎదుట ప్రమాణం చేద్దాం – ఈ వివాదాన్ని మళ్ళీ రేకెత్తించ మని" అన్నారు! 'వస్తున్నారు' అనేది సాధురూపమని అంగీకరించిన తరవాత కూడా దివాకర్ల వారు "తెస్తున్నారు" సరైన రూపమా అని ప్రశ్నిస్తే సహనం కోల్పోయిన పింగళివారు "నీకెంత సొమ్ము కావాలోయ్? ఇంతటితో సరిపుచ్చుకోడాని"కని ఓ అయిదు రూపాయల నోటు ప్రదర్శించారు.

పరిభాషా సమావేశాలు కూడా ఇలాగే జరిగేవి. Expenditure, expense అనే మాటలకు వేర్వేరు తెలుగుమాట లేమున్నాయో చెప్పమనే వారు ఆచార్యులు. (వారిలో కొందరు సంస్కృ తాంధ్రాంగ్లాల్లో కూడా తమకు సమప్రాగల్భ్యముందని నమ్మినవాళ్ళు. కొందరు మేం సాంకేతిక భావనను వివరిస్తాం – తెలుగుమాట చెప్పం డనేవాళ్ళు. మరికొందరు చెప్పిన మాట నోరు తిరగ దని అంతకన్నా క్లిష్టమైన ఆంగ్ల పరిభాషే బాగుందనే వాళ్ళు) "వ్యయం, ఖర్చు – అనే రెండు తప్ప మూడోది నాకు తెలీదు. మొదటిది సంస్కృతపరం. రెండోది హిందీ/ఉర్దూ పదం. వాటిలో ఏదో ఒక దాన్ని ఏదో ఒక ఆంగ్ల పదానికి నిర్దిష్ట సమానార్థకమని నిర్దేశించండి" అంటే దేన్ని దేనికి



సమానార్థక మనాలన్న విషయం వివాదగ్రస్త మయ్యేది. Matrix అనే పరిభాషాపదానికి వ్యుత్పత్తి రీత్యా 'మాతృక' అనే సంస్కృతపదం సమానార్థకమంటే, అది నోరు తిరగని మాట అని 'మాత్రిక' అని రాయమని ఆదేశించారు. ఇలా అనేకం. ఆ చర్చలన్నిటినీ ఏకరువుపెట్టడం వృథాశ్రమ.

అన్నట్లు ఉద్యోగాల భర్తీ, ఇంటర్వ్యూల విషయం మరిచానేమో. బోధన శిక్షణ శాఖకు కర్నూలు డి.ఇ.వో.గా ఉన్న ఎ.నాగభూషణరావుగారిని శాఖాధిపతిగా నియమించారు. ఢిల్లీ లోపల ఆ విశ్వవిద్యాలయంలో తెలుగుశాఖాధిపతిగా ఉన్న కొత్తపల్లి వీరభద్రరావుగారిని ప్రచురణ శాఖాధిపతిగా (?) నియమించారు. విద్యాశాఖలో అసిస్టెంట్ లెక్చరర్‌గా ఉన్న పోణంకి శ్రీరామ అప్పారావుగారు మొదట ప్రత్యేకాధికారిగా, తరవాత సంచాలకులుగా నియుక్తులైనారు. సీనియారిటీ ఉన్న నాగభూషణరావుగారి కిది బాధాకరంగా ఉండేది సహజంగా. నేనూ పోణంకి వారూ ఒకే జీతాల స్కేల్లో ఉన్నాం. ఆయనకు పరిపాలనభృతిగా అదనంగా 50 రూపాయలు ఇచ్చారు మొదట. ఆలస్యంగా చేరిన కొత్తపల్లి వారు నా కన్నా పదేళ్ళు పెద్దవారు. నేను చీరాల కళాశాలోద్యోగానికి రాజీనామా చేస్తే ఇక్కడి ఉద్యోగం ఖాయం చేస్తామన్నారు. అలాగే చేసిన తర వాత కొత్తపల్లివారినే సీనియర్నని గుర్తించకపోతే ఈ ఉద్యోగం ఉండదన్నారు. విధిలేక అంగీకారపత్రం ఇవ్వవలసి వచ్చింది. ఇది మొదటితరం ఉద్యోగుల విషయం. 1968 సెప్టెంబరు లో మొదలైన అకాడమిలో నవంబరులో కొత్తగా ఉద్యోగులను ఇంటర్వ్యూ చేసి నియమించాలని ప్రకటించారు. అకాడమి నియమనిబంధన లప్పటికి సిద్ధమైనాయి గాని తక్కిన ఇద్దరు రీసెర్చి ఆఫీసర్లూ చేరలేదు. కాబట్టి ఆ కార్యక్రమ నిర్వహణ బాధ్యత నాదన్నారు. దరఖాస్తులను అర్హతల వారీగా పట్టికాబద్ధం చేసి నిబంధనల ప్రకారం ప్రథమోపాధ్యక్షులైన ఉస్మానియా విశ్వవిద్యా లయం ఉపాధ్యక్షులకు పంపాలని ప్రతిపాదించాను. అది విద్యామంత్రికే పంపాల్సిందన్నారు ప్రత్యేకాధికారి గారు. ప్రతిపాదనలు పంపి నా కుటుంబాన్ని కొత్తగా దొరికిన అద్దె ఇంటికి చీరాల నుంచి తెచ్చుకోటానికి సెలవుమీద బయల్దేరాను. నా సెలవు రద్దయిం దన్నారు. నేను ప్రతి పాదించినట్లు వి.సి. అయిన డి.ఎస్.రెడ్డి గారే ఎంపిక చేయాలని మంత్రిగారు ఆదేశించారు. నేను సిద్ధం చేసిన పట్టికను మార్చి వారికి సమర్పిస్తే అది నిబంధనలకు విరుద్ధంగా ఉందని, సక్రమం గా తయారుచేసి సమర్పించాలని తిప్పికొట్టారు. మరోసారి పూర్వపద్ధతిలో సిద్ధపరచిన పట్టికతో నేనే స్వయంగా సందర్శిస్తే, ఫలానా వారినే ఇంటర్వ్యూకు పిలవాలని గుర్తుపెట్టి, వెనక్కు పిలిచి ఫలానా వారిని పిలవరాదని గుర్తురాసి పంపాడాయన తన సంతకంతో! ఇంటర్వ్యూలో పింగళి వారే నిపుణ సభ్యులు. ప్రత్యేకాధికారి సంచాలకుడు కాడు కాబట్టి ఆ సమయంలో ఆయన ఉండ రాదని నిషేధించారు. ఇదో అనుభవం. దరఖాస్తులూ, ఇంటర్వ్యూ నిబంధనలూ, ఫలితాలూ ఎన్ని విధాల ఉండవచ్చునో తెలిసింది, కొంతగానైనా. జన్మ తరించింది. అప్పట్లో విశ్వవిద్యాలయాల స్వతంత్ర ప్రతిపత్తి విషయం చిలికి చిలికి గాలివానగా మారి, కోర్టులపాలై, చివరకు డి.ఎస్.రెడ్డి గారిని తొలగించటం అసాధ్యమై, ఆయన పదవీ విరమణ తరవాత ఆ ప్రమాదం ఆంధ్ర విశ్వ కళాపరిషత్తుకూ తదితర సంస్థలకూ వర్తించింది. అకాడమి పనిచేయటం మొదలయింది – ఏదో విధంగా. 1971 నాటికి బాగా విస్తరించింది. డిగ్రీ స్థాయిలోనూ తెలుగే బోధనమాధ్యం కావాలనే

ప్రతిపాదన విశ్వవిద్యాలయాల నుంచి రావటం విశేషం. దానితో మా చాకిరి ఇబ్బడిముబ్బడిగా పెరిగింది.

రాష్ట్ర ప్రభుత్వం తెలుగును అధికారభాషగా అభివృద్ధి పరచాలంటే ఏం చేయాలో వివరిస్తూ 1968లోనే శ్వేతపత్రం విడుదల చేసింది. (ఇంగ్లీషులో దాని పేరు White Paper). శాసనసభలో ఈ విధానం ఎంతవరకు సముచితమనే చర్చ జరిగింది. దరిమిలా ఇందులోని అంశాలను విశదీకరిస్తూ నాలుగైదు వర్కింగ్ పేపర్లను ఉభయభాషల్లోనూ విడుదలచేసి విస్తృతచర్చ నిమిత్తం విభిన్న రంగాలకు చెందిన విద్వాంసులతో మహాసభ జరపాలని నిశ్చయించారు. అయితే ప్రత్యేక తెలంగాణా ఉద్యమం తీవ్రతర మవటంతో ఈ వ్యవహారం వెనకబడ్డది. ఆ సమయంలోనే ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమివారు "వ్యావహారిక భాషాచరిత్ర – వికాసం" అనే అంశంమీద పోటీ పెట్టి గ్రంథ రచనకు ఆహ్వానించారు. కానీ పోటీకి వచ్చిన రచనలేవీ తాము నిర్దేశించిన ప్రమాణాల నందుకోలేదని మరోమారు పోటీలకు ఆహ్వానించారు. అప్పుడు మిత్రుల ప్రోత్సాహంతో వారిచ్చిన గ్రంథ సహాయంతో నేనూ రాశాను – చరిత్ర, వికాస శబ్దాలు రెండూ వాడనక్కర లేదనీ, వికాస శబ్దంలో చరిత్ర గతార్థమవుతుందనీ ఆరంభించి. అక్కిరాజు రమాపతిరావు గారు పునస్సమర్పించిన పుస్తకానికీ నా రచనకూ కలిపి బహుమానధనాన్ని పంచుతున్నామని ప్రకటించారు. ఒకే మొత్తాన్ని ఇద్దరికి పంచి రచయితలకు అన్యాయం చేసేకన్నా, ఇద్దరికీ సమంగా ప్రకటించినంత సొమ్మయినా ఇవ్వండి, అది వీలుపడకపోతే నా రచన పోటీలో లేదని భావించండని రాశాను. బహుమతి నిరాకరించాను. (నాకు తిరిగి ఇచ్చిన ప్రతిలో ఎవరివో వ్యాఖ్యానాలున్నాయి. వాటికి నా సమాధానాలతో సహా అనుబంధంలో చేర్చిన రూపంలో విశాలాంధ్ర ప్రచురణాలయం వాళ్ళు ఆ గ్రంథాన్ని 1972లో ప్రచురించారు). అది నేటికి మూడు పునర్ముద్రణలు పొందింది. నాకు ప్రవేశంలేని విశ్వవిద్యాలయాల్లో నా రచనకు ఆదరణ లభించటం దుఃఖించవలసిన విషయం కాదుగదా? ఎక్కడికక్కడే ప్రాప్త మనుకోవటంలో సుఖశాంతు లుంటాయి.

### సభలూ సమావేశాలూ

1970 నుంచీ వీలుపడ్డప్పుడల్లా అఖిలభారత భాషాశాస్త్రజ్ఞుల సమావేశాలకూ ద్రవిడభాషా సంఘం మహాసభలకూ హాజరుకావటం మొదలుపెట్టాను. తక్కిన సంస్థల్లాగా సభలకూ సమావేశాలకూ హాజరు కావటానికి ఏనాడూ అకాడమి ఆర్థిక సహాయం చెయ్యలేదు. పొరుగూళ్ళకు పోయేందుకు సెలవివ్వటమే పదివే లనుకోవలసి వచ్చింది. కొన్నిమార్లు నా పరిశోధన పత్రాలను సమావేశాల్లో ఎవరో చదవవలసి వచ్చింది – చివరి నిముషంలో సెలవు రద్దు చేసినందువల్ల. ఆయేడు పుణేలోని (అప్పటి పూనాలోని) డక్కన్ కాలేజీలో జరిగిన భారతీయ భాషాశాస్త్రజ్ఞుల ప్రథమ సదస్సులో ద్విభాషాస్థితిని (diglossia) గురించి నేను చదివిన వ్యాసం అక్కడ కాకపోయినా ఇక్కడ భద్రిరాజు వారి సిద్ధాంతాలకు విరుద్ధమై వివాదాస్పదమయింది. పరిశోధకులు (పూర్వ) గురువుల అభిప్రాయాలకు విరుద్ధంగా ఏమి రాసినా చేసినా మన దేశంలో ప్రమాదకర మవుతుందని హాల్డేన్‌గారు రాసిన మాట నిజమని అనుభవరీత్యా తెలుసుకున్నా తత్వం పూర్తిగా బోధపడలేదు – అందుకు విచారించక తప్పదు. 1971లో రాష్ట్ర ప్రభుత్వం



తెలుగు అకాడమి బాధ్యతగా లిపి సంస్కరణ సదస్సును రెండు రోజులపాటు నిర్వహించింది. అప్పటి ముఖ్యమంత్రి కాసు బ్రహ్మానందరెడ్డి గారు ప్రారంభించగా తాపీ ధర్మారావుగారు ప్రథమ సమావేశానికి అధ్యక్షత వహించారు. లిపి సంస్కరణ సమర్థంగా నిర్వహించిన మలయాళీల తరఫున మలయాళ మనోరమ సంపాదకులు కృష్ణ వారియార్ గారు సదస్సులో పాల్గొన్నారు. మల్లంపల్లి వారు సేకరించిపెట్టిన సమాచారంతో ముద్రాలేఖిని (Typewriter), ముద్రణ (Printing)ల్లో ఏకరూపంగా ఉండేట్లు తెలుగు లిపిని సంస్కరించాలన్న భావంతో భిన్న రంగాలకు చెందిన పెద్దలు పాల్గొన్న సభలో తెలుగు కన్నడాలకు ఏక లిపిని పునరుద్ధరించాలని మైసూరు విశ్వవిద్యాలయం నుంచి వచ్చిన తెలుగు ఆచార్యుడు సుబ్బరామప్ప లేవదీసిన ప్రశ్న వివాదాస్పదమయింది. సభనుంచి తీవ్రావేశంతో వావిలాల గోపాలకృష్ణయ్య గారు వాకౌట్ చేశారు. ప్రభుత్వ ముద్రణాలయం సంచాలకులు నారాయణరావు గారికీ ప్రసిద్ధ పత్రికా సంపాదకులు నార్ల వేంకటేశ్వరరావు గారికీ ఘోరమైన పోరాటం జరిగింది. చివరకు మోనో, లైనో టైపులతో సహా ముద్రణలో ముద్రాలేఖిని వాడుకలో ఏకరూపంగా తెలుగు లిపి మూలస్వరూపం మార్చకుండా చిన్న సవరణలు మాత్రం చేసి ఆచరణలో పెట్టడానికి విద్యామంత్రి పి.వి.నరసింహారావుగారు అధ్యక్షులుగా సాంకేతిక వ్యవహారజ్ఞులతో ఒక సంఘాన్ని నియమించారు. (ఆ సంఘం పర్యవేక్షణలో వణుకూరి నారాయణరావు గారి హయాంలో ఒత్తులను పక్కకు చేర్చి, పేజీలో పంక్తుల సంఖ్యను పెంచే టైపురైటింగ్, లైనో యంత్రాలు సిద్ధమైనాయి. నా ఎరికలో ఆ పద్ధతిలో టైపుచేసిన మొదటి రచన ఏటుకూరి ప్రసాద్‌గారు తాపీ ధర్మారావు గారిని గురించి రచించిన సిద్ధాంతవ్యాసం). ఒకటి రెండు పాఠ్యగ్రంథాలు పరిష్కృత లిపిలో అచ్చయినాయిగాని ఫొటోకంపోజింగ్ అమల్లోకి వచ్చిన తరవాత లిపి సంస్కరణ అనేది వృథాప్రయాస అయిపోయింది.

తెలుగు అకాడమి నేషనల్ బుక్‌ట్రస్టు, ఇండియాతో కలిసి హైదరాబాదులో అనువాద పద్ధతులను గురించి ఒక సదస్సు నిర్వహించింది 1971లోనే. ఈ ప్రయత్నాలన్నీ తెలుగులో శాస్త్ర విజ్ఞాన గ్రంథ రచనకూ, ప్రచురణకూ దోహదం చేయాలని ఆరంభించినవే. ఆయేడు అకాడమి ఆరంభించిన సామాజిక భాషా పరిశీలన కార్యక్రమంలో భాగంగా కరీంనగర్ జిల్లా మాండలికాన్ని గురించిన పుస్తకం వెలువడింది. మాండలికోచ్చారణ భేదాలను సూచించటానికి ప్రత్యేక లిపి సంకేతాలను వాడవలసి వచ్చింది. ముద్రాపకులు చాలామంది అదనపు ఖర్చుతో వాటిని సేకరించటానికి నిరాకరించారు. అయితే జ్యోతిప్రెస్సు వ్యవస్థాపకుడైన ఆలపాటి రవీంద్రనాథ చౌదరి అందుకు సిద్ధపడి ముద్రించాడు. లిపి సంకేతాలు వాడినందుకు కోపించిన ఖండవల్లి లక్ష్మీరంజనం గారు విద్యావిషయక స్థాయీ సంఘ సభ్యులై ఉండి కూడా 'భారతి'లో మా ప్రయత్నాన్ని ఖండిస్తూ వ్యాసం రాశారు. దానికి ప్రతిగా నేను రాసినందుకు పాలకవర్గం వారు నాది క్రమశిక్షణరహితచర్య అని గర్హించి కొద్దిగా బాధించారు. ఆనాడు మొదలైన సామాజిక భాషా పరిశీలన ఈనాటికీ పూర్తి కాలేదంటే, అధికారులకు భాషా విషయంలో ఉన్న శ్రద్ధాతాత్పర్యాలను వేరే వ్యాఖ్యానించనక్కరలేదు. ఆ సంవత్సరమే నా సిద్ధాంత వ్యాసంలోని ప్రధాన భాగానికి సంక్షిప్త

రూపాన్నీ, శాసన పాఠాలనూ తెలుగు ఇంగ్లీషు భాషల్లో, లిపుల్లో సాహిత్య అకాడమి వారు ప్రచురించారు. ఇంటర్ పుస్తకాల ప్రచురణ చాలా వరకు పూర్తయినా పునర్ముద్రణ వ్యవహారం కొంత సాగుతున్నది. అదే సమయంలో డిగ్రీ స్థాయి పాఠ్య గ్రంథరచనా ప్రచురణ కార్యక్రమం మొదలైంది. చిత్తు ప్రతుల్లోనే భాషా సంస్కరణ చేయటం, నూతన పరిభాషాకల్పన చేయవలసి రావటం, ప్రచురిస్తున్న గ్రంథాల ప్రూఫులు దిద్దటం సిబ్బందికి బాధాకరంగా పరిణమించింది. డెప్యుటేషన్ మీద వచ్చిన ప్రభుత్వోద్యోగులు బాధ్యతల కన్నా హక్కులను ప్రధానంగా భావిస్తే, హక్కులు లేని అకాడమి ఉద్యోగులు బాధ్యతల బరువుతో కుంగిపోతుండే వాళ్ళు. ఉపశమన మార్గంగా నా పాత అలవాటు పద్యాలు రాయించి చదివించింది అకాడమిలో. మచ్చుకు కొన్ని-

**అసహంబై కరణీయమై విధికృతవ్యాసంగమై సంగమై**
**వ్యసనంబై అనివర్తనీయమయి దుర్వ్యాపారమై భారమై**
**హసనీయంబయి దుఃఖహేతువయి మాయారూపముల్ తాల్చు నీ**
**రసవంతంబగు ప్రూఫునామక పరబ్రహ్మమ్ము జింతించెదన్ –**
**అప్పరాయమహోదయానుగ్రహ మహమ్ము**
**వీరభద్రుని కృపావీక్షణమ్ము**
**గొడవర్తి వంశాబ్ధికుముదాప్త నాశీస్సు**
**నాగేశ్వరోపాసనాబలమ్ము**
**కడప రాధాకృష్ణ గంభీరభావమ్ము**
**వేంకటాచార్యుల వినయగరిమ**
**నారసింహ మనీషి నశ్యప్రభావమ్ము**
**నాయరు కాఫీరసాయనమ్ము**
**"కారణంబులు నుద్బోధకములు గాగ**
**సంభవించిన సాహిత్య సౌష్ఠవమున"**
**యుష్మదీయ మాహాత్మ్యంబు నుగ్గడింపఁ**
**బూనుకొనినాఁడ జనయిత్రి! ప్రోవు నన్ను-**

అని ఆరంభించి సహోద్యోగుల బాధలను గూడా సంస్మరిస్తూ ప్రూఫుదేవతారాధనచేశాను. సరదాకోసం ఈ మహాదుష్కావ్యాన్ని ఒక మిత్రుడి కంకితం చేస్తూ రాసిన పద్యాల్లో ఒకటి -

**నైకవిధగమన భంగీ**
**వ్యాకులిత సమస్త పాంథవాహనతతికిన్**
**లోకోత్తర క్షతధ్య**
**న్యాకులిత నభోAంతరాళునకు కృతిపతికిన్ –** అనేది షష్ఠ్యంతాల్లో ఒకటి.

ఫలశ్రుతి కూడా ఉంటే బాగుంటుందని-

**"అవహేళన కావ్యస్థం, ప్రూఫువాం గుణసంపుటిమ్**
**బ్రహ్మానంద మవాప్నోతి, యః పఠే చ్ఛృణుయాదపి"** అని రాశాను.



ఆ సమయంలోనే నేను సొంత రచనలు కూడా మొదలుపెట్టడం, ప్రథమ సంతానం పొరుగూళ్ళలో చదవవలసి రావటంవల్ల అదనపు వ్యయభారం పెరగటంవంటి కారణాలవల్ల నా గోడును చెప్పుకోవాలనిపించి ఫలశ్రుతికి ముందు ఈ పద్యం రాయవలసి వచ్చింది.

**నీ వినోదములనే భావించుటం జేసి**
**కన్నబిడ్డల ఆట లెన్ననైతి**
**నీ నామజపముతో మేనెల్ల మఱచుట**
**నిల్లాలి పొడగూడ నొల్లనైతి**
**నీరూపలావణ్య వారాశిలోబడి**
**ప్రూఫురాజంబంటి పొలతిజూచి**
**తివుటమై నినుజూచి దృష్టిదోషము రాగ**
**దృక్సంగమేని పొందితిని గాను**
**తవపదాబ్జాతసేవ గోత్రస్థలత్వ**
**మభిఘటించుట సంసారమయ్యె నరక**
**మకట! నీ దయవలన నే సుకములేదు**
**వాంఛలు నశించె జీవచ్ఛవంబనైతి.**
**కొలువు పనులకు సొంత కక్కుఱితి చేర**
**దిద్ది చాలేక వేరొండు దిక్కులేక**
**ఏడ్చుచున్నాడ నేడ్చితి నేడ్వవలయు**
**పద్యములలోన నీపాదపద్మ సాక్షి.**

ఇవి విన్న సహోద్యోగుల్లో కొందరానందిస్తే కొందరు దుఃఖించారు. అధికారులు మాత్రం కోపగించారు. పద్యాలు కోపకారణ మనిపించింది. అప్పట్లో ఒలింపిక్ క్రీడల ప్రసంగం వచ్చింది. గ్యాలీ ప్రూఫు పట్టుకొని అర్జంటుగా దిద్దమని అధికారులు వెంటబడితే ప్రాణభయంతో చావు పరుగులు తీసిన నాకు పరుగుపందెంలో ఒలింపిక్ స్వర్ణం లభించినట్లు కలగన్నాననగానే భగ్గుమన్నారు. భారతీయులు శృంగారప్రియులు - ముఖ్యంగా విద్వత్కవులు. హాస్యకరుణలు వారి మనస్సులో బీభత్సం కల్పించి ప్రయోక్తలకు భయానకంగా పరిణమిస్తాయి - అనే రహస్యం అనుభవం మీదగాని అర్థంకాలేదు. అర్థమైనా సహజ దౌర్బల్యం కామారపు జీడిలా పట్టుకొని ఒక పట్టాన వదలదు.

1972 నుంచి ద్రవిడ భాషా సంఘంతో సంబంధమేర్పడింది. పదిహేను సంవత్సరాల పాటు దానికి ప్రధాన కార్యదర్శి అనే బిరుదు పొందాను. నేను చేసిం దేమీలేదు. నా కప్పగించిన బాధ్యతా లేదు. నాకూ తిరువనంతపురంలో ఉన్న ఆ సంఘం ప్రధాన కార్యాలయానికీ మధ్య ఎంత దూరముందో సరిగా చెప్పలేను. నామమాత్రంగా సుదూరాన మిన్నులుపడ్డ చోట ఎవరో ఒక రుండటంవల్ల వాస్తవ నిర్వాహకులకు ఎటువంటి ఇబ్బందీ ఉండదు. ఈ రహస్యం తెలిసి నిర్దాక్షిణ్యంగా అమలు జరిపిన, జరుపుతున్న భాషావేత్త సర్వతంత్ర స్వతంత్రుడైన వి.ఐ.

సుబ్రమణ్యం గారు (తమిళంలో ఆయన పేరును తెలుగు అక్షరాల్లో చుప్పి రమణి అని రాసినట్లు లిఖిస్తారని మరో భాషావేత్త చెప్పాడు). అయితే ఆయన విశిష్టతను తక్కువ చేయటం లేదు. తమిళుడై పుట్టి కేరళలో ఒక మహాసంస్థను స్థాపించి సర్వతోముఖంగా దాన్ని అభివృద్ధి చేసిన, చేస్తున్న కార్యశూరుడని అంగీకరించక తప్పదు. కుప్పంలో ద్రవిడ విశ్వవిద్యాలయ స్థాపనకు ఆయన చేసిన కృషి అపారం. బహు సంవత్సరాలుగా క్రమం తప్పకుండా అంతర్జాతీయ స్థాయి పరిశోధన పత్రిక నిర్వహిస్తూ, సంస్థకు విలువైన ఆస్తులు సంపాదించిన సమర్థుడు. అటువంటి సమర్థులు తెలుగువాళ్ళలో పుట్టనందుకు విచారించక తప్పదనిపిస్తుంది. ఈ విచారం ముందుకు సాగనీయటం లేదు. అయినా ఈ ప్రకరణాన్ని ఇక్కడ ముగించలేను. క్షమించండి.

**పేచీలే పేచీలు**

విద్యావిషయకంగా 1972 మిశ్రమఫలితా లిచ్చిన సంవత్సరం – నా జీవితంలో. హైదరాబాదులో జరగనున్న మూడో భాషా శాస్త్రజ్ఞుల మహాసభలో పాల్గొనాలనే తలంపు మనస్తాపానికి దారితీసింది. నెలరోజులు ముందుగా ఉస్మానియా విశ్వవిద్యాలయానికి పోయి హాజరు నమోదు చేసుకుంటుంటే ద్విభాషితనుగురించి నేను పూనాలో చదివిన పత్రం అసంబద్ధమనీ, ప్రూఫులు దిద్దుకోటానికి తప్ప నేనెందుకూ పనికిరాననీ తూలనాడారు పది మందిలో భద్రిరాజు వారు. రోషం వచ్చి అదే పద్ధతిలో మీరూ తప్పులు రాశారని నేనూ మరోపత్రం రాయగల నన్నాను. శాశ్వతసభ్యుణ్ణయిన నన్ను హాజరుకానీనంటే సభనే స్తంభింపజేస్తా నన్నాను. ఉభయులం దురహంకార ప్రదర్శన చేశాం. అందుకు కారణం లేకపోలేదు. అన్ని శాస్త్రాల్లోలాగా భాషాశాస్త్రంలో కూడా తెలుగులో పాఠ్య గ్రంథ రచన చేస్తే బాగుంటుందని ప్రతిపాదించాను. అయితే బి.ఏ. స్థాయిలో బోధనప్రణాళిక సిద్ధంగా లేదు. అందుకని పూనేనుంచి ఘాటగే గారిని పిలిపించి పాఠ్యాంశ నిర్ణయం చేశారు ఉస్మానియా వారు. పాఠ్యగ్రంథాల సంఖ్య, సంపాదక రచయిత లెవరనే ప్రశ్న వచ్చాయి. అకాడమి పరిభాష నంగీకరించబోమన్నారు. ఒకరిని సంపాదకులుగా గుర్తించా లన్నారు. అకాడమి నిబంధనల ప్రకారం ప్రొఫెసరో, రీడరో, డిగ్రీ కళాశాల ప్రిన్సిపలో సంపాదకుడు కావచ్చు. ఆ నిబంధనలు పనికిరావన్నారు. అశేష శాస్త్రాల విషయంలో చేసిన సాధారణ నిర్ణయాన్ని మార్చగల అధికారం నాకు లేదన్నాను. మిగతా పాఠ్యగ్రంథాల విషయంలో రచయితలకూ, సంపాదకులకూ, విద్యార్హతల నిర్ణయం జరిగింది. వాటికి భిన్నంగా ఈ శాస్త్ర విషయంలో తీర్మానించే వీలులేదనీ, పరిపాలనమండలి నిర్ణయించవలసిందే నన్నాను. అలా మాట్లాడటం తమనందరినీ అగౌరవించటమనీ, ఒక్కొక్కరికి నేను లిఖితపూర్వకంగా క్షమాపణ పత్రాలురాసి ఇవ్వాలన్నారు. నాకీ భాషాశాస్త్రంతో ప్రమేయ మక్కరలేదనీ క్షమాపణ ప్రశ్నే లేదనీ మొండికి పడ్డాను. అయితే మేమీ సమావేశాన్ని బహిష్కరిస్తున్నామన్నారు. మీరంతగా అభిమానించిన విద్వాంసుణ్ణి మీ శాఖవాడే కాబట్టి రీడరుగా పదోన్నతి కల్పించి ఆదుకుంటే ఈ సమస్యలన్నీ తేలిపోతాయన్నాను. చివరకు నామీద తీవ్ర క్రమశిక్షణ చర్యతీసు కోవాలని రాసి పాలక మండలిలో తీర్మానం ప్రతిపాదించారు!

'దుర్బలస్య బలం రాజా' అని చిన్నయసూరి పేర్కొన్న మాట నిజమయింది. నాకు



అభియోగ పత్రమిచ్చి సంజాయిషీ కోరకుండా నా మీద చర్య తీసుకోవటం కుదరదని విద్యాశాఖ కార్యదర్శి నిర్ణయించి సమాధానం అడిగారు. రాసి ఇచ్చాను. ఆ విషయాన్ని అంతటితో మూసివేస్తున్నామని పాలక మండలి తీర్మానించింది. మేం అకాడమితో సంబంధాలు తెంచుకుంటామన్నారు. ఈ వ్యవహార ఫలితమే మనస్తాప కారణం. రెండు రోజులు నాకు పరిశోధన పత్రం చదివే అవకాశమివ్వలేదు. చివరికి విధిలేక అవకాశమిచ్చి నేను వ్యతిరేకార్థకం మీద రాసిన సిద్ధాంతాదులన్నీ ఉద్ధరణలన్నీ అబద్ధాలన్నారు. నిదర్శనలు చూపాను. ఈ వ్యాసాన్ని సంఘం వారు ముద్రించరన్నారు. అదే మొదటి వ్యాసంగా అచ్చయింది! ప్రారంభ సమావేశంలోనే ద్విభాషితను గురించిన నా అజ్ఞాన ప్రసంగాలను భద్రిరాజు వారు ఖండించారు. నేను ప్రత్యుత్తర మిస్తానంటే సభాధ్యక్షులైన సి.డి. దేశముఖ్‌గారు ప్రారంభ సమావేశ ప్రసంగాలను చర్చించరా దన్నారు. కేల్కర్ వంటి ఇతర వక్తలు నన్ను సమర్థించారు పరోక్షంగా. ఈ వ్యవహారం ఇంతటితో ముగిసినా మరో విషయం అభిప్రాయ భేదాలు పెంచింది. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం వారు Concise Oxford Dictionaryని తెలుగులోకి అనువదించే కార్యక్రమం చేపట్టారు. యు.జి.సి. ఆర్థిక సహాయ మందించింది. అది గడువులోపల పూర్తికాలేదు. విశ్వవిద్యాలయం తాను ఖర్చులు భరించలేనన్నది. అసంపూర్తిగా ఉన్న ఆ నిఘంటువును సంస్కరించి పూర్తిచేసి ముద్రించే బాధ్యత తెలుగు అకాడమి నెత్తిన పడ్డది. అది పూర్తి అయిందిగాని కొద్దిపాటి సవరణ లున్నాయని రాసి ఇమ్మన్నారు. దాన్ని పరిష్కరించే బాధ్యత మొదట పింగళివారిది. వారు అస్తమించిన తరవాత ఆ స్థానం అధిష్ఠించిన గంటివారిది. మధ్య నాకెందుకీ బాదరబందీ అన్నాను. అచ్చంగా నిఘంటువును సరిచూడగలనేమోగాని ఇతర కార్యక్రమాలనుంచి తప్పించకుండా అదనపు బరువు నెత్తికెత్తితే మోయలేనని మొత్తుకున్నాను. విశ్వవిద్యాలయ విద్వాంసులు దయతలచి తెలుగు అకాడమిలో నాకు చోటిచ్చారు కాబట్టి అందరి బాధలూ నావేనైతే బతికే దెలాగు? 'నీవు ఈ బాధ్యత చేపట్టి మా స్నేహసౌభాగ్యాన్ని పునస్సంపాదించవ'చ్చని రాయబారాలు మొదలైనాయి.

రామాయణంలో పిడకలవేటలాగా మరో సంగతి. ద్రవిడ భాషా శాస్త్రజ్ఞుల సంఘం తరపున రాష్ట్ర ప్రభుత్వాని కొక నివేదిక అందింది. తెలుగుభాషకు సమగ్ర చారిత్రక వ్యాకరణం రచించటానికి మూడేళ్ళో అయిదేళ్ళో పట్టుందనీ, దాన్ని కోరాడ మహదేవశాస్త్రి గారి నాయకత్వంలో నిర్వహించగలమనీ, దానికి కావలసిన సిబ్బందికి యు.జి.సి. స్కేళ్ళివ్వాలనీ ప్రతిపాదించారు. ఎవరెటునుంచి ఏ కోరిక భాషాపరంగా కోరినా దాన్ని మీ తలకెత్తుకొమ్మని అకాడమికి పంపటం ప్రభుత్వానికి ఆచారమయింది. అకాడమి ఆదర్శాల్లో ఈ పనీ ఉంది. అది నిర్వహించగల విద్యార్హతలున్న సిబ్బందీ ఉంది. వారిమీద ప్రభుత్వానికి నియంత్రణాధికారముంది. విశ్వవిద్యాలయాల మీద ప్రత్యక్షంగా అలాంటి పట్టులేదు. అకాడమి ఉద్యోగులకు అవకాశంతోబాటు జీతభత్యాలూ ఇచ్చి ఈ పని చేయించవచ్చనీ, అన్యులకు ఈపాటి అర్హతల్లేకపోయినా అకాడమి సొమ్మిప్పించటం ఉద్యోగులకు మనస్తాపం కలిగిస్తుందనీ రాశాను. ఆ వాదనను విద్యావిషయక స్థాయీ సంఘాధ్యక్షులైన గంటివారు ఆమోదించారు. ప్రభుత్వం మౌనం వహించింది. నిరాటంకంగా ఈ ప్రతిపాదనను సమర్థించటం కోసమే నాకు అజాగళ స్తనం వంటి ప్రధాన కార్యదర్శిత్వం డి.ఎల్.ఏ.

వారు అంటగట్టారేమో ఊహించలేకపోయాను. తిరుపతిలో జరిగిన ఆ సంస్థ ద్వితీయ మహాసభలకు హాజరై పరిశోధనపత్రం చదివిన నన్ను ఈ విషయంలో వెంటాడారు. గుడ్డిలో మెల్లగా ఆ సభలకు విచ్చేసిన గంటివారి వైపు దృష్టి మరల్చాను. 'విషకన్యా ప్రయోగం చేశావుటోయ్!" అన్నా, ఆయన సంతోషించినట్లు గ్రహించాను. ఇలాంటి విషయాలను ఆయన అలవోకగా పరిష్కరించ గలడన్న విశ్వాసం నాకుంది.

ఇటువంటి గొడవలేవి వచ్చినా నాకు కొండంత అండగా ఉండి వెన్నుదట్టిన వారు అబ్బూరి మాష్టారే. మనశ్శాంతికోసం ఆయన్ను ఇంచుమించు అనునిత్యం కలిసేవాణ్ణి. ఆయన చమత్కార ధోరణిలో పరిష్కార మార్గాలు చూపేవాడు. ఆయన నన్ను తన కుటుంబ సభ్యుడని భావించి అలా ఎందరికో పరిచయం చేశాడు. ఆయన్ను బతిమాలి, బామాలి, ఆయన ద్వితీయ పుత్రుడు వరద రాజేశ్వరరావు ప్రోత్సాహసహాయాలతో 'ఊహాగానం – ఇతర కృతులు' శ్రమించి సేకరించి ప్రచురణలో సాయపడ్డాను. అంతకన్నా నేను చేయగలిగిందేమీ లేదు. 1974లో సాహిత్య అకాడమి వారు సంకల్పించిన తెలుగు భాషా చరిత్రలో రెండు ప్రకరణాలు రాసే అవకాశం కలిగింది. ఆయేడే నాకు రాంభట్ల కృష్ణమూర్తి, గజ్జెల మల్లారెడ్డుల సాహచర్యంతో బాటు 'ఈనాడు' పత్రికాధిపతి రామోజీరావు గారితో సంబంధ మేర్పడింది. అప్పట్లో నిద్రాణంగా ఉన్న అభ్యుదయ రచయితల సంఘాన్ని పునరుద్ధరించాలనే సంకల్పం కలిగింది. అదే భావం ఎందుకో గాని ఆరుద్రకూ పుట్టింది. ఒకనాడు అకాడమీకి కుందుర్తి ఆంజనేయులు గారితో కలిసి ఆరుద్ర గారు వచ్చారు – ఈ విషయంలోనే. చీలిన, వేరుపడిన పాత కారణాల ప్రస్తావన లేకుండా ఏం చేయాలో చెప్పమన్నాను. రాంభట్లా గజ్జెల లేకుండానూ, వీరేశలింగం గారికి పూర్వమున్న సాహిత్యాన్ని గుర్తించకుండానూ పునరుద్ధరిద్దా మన్నారు. పది మందిని కలుపుకోటానికి సంఘాలు కావాలిగాని బహిష్కరించటాని కక్కరలేదని నా విశ్వాసం. ఎవరి బతుకు వారి ఇష్టం ప్రకారం జరుగుతున్నప్పుడు కొత్త ఏర్పాట్లవల్ల సరికొత్త విద్వేషా లక్కరలేదని నావాదం. గతంలేని వర్తమానం లేదు. కందుకూరివారు తమకు పూర్వమున్న సాహిత్యంలో కొన్ని లోపాలున్నవి కాబట్టి సంస్కరిద్దా మనుకున్నారు. లేని దాన్ని సంస్కరించటం అసాధ్యం, అనూహ్యం. పూర్వంలా మిత్రులుగానే విడిపోదా మన్నాను. వచన కవిత్వమేగాని మరేదీ ఆమోదయోగ్యం కాకపోవచ్చు కుందుర్తికి. తక్కిన సాహితీ ప్రక్రియల అస్తిత్వాన్ని ప్రశ్నించటం అవివేకం. కాబట్టి ప్రయత్నా లక్కడితో ఆగిపోగా నేను గుంటూరు అరసం సభలకు హాజరై పాతమిత్రులను చూసివచ్చాను.

## సదస్సులూ సమావేశాలూ

ఆయేడు పోతుకూచి సాంబశివరావుగారు బెంగుళూరులో తెలుగు మహాసభలు నిర్వహిస్తూ ఆహ్వానించారు. ప్రారంభ సమావేశం రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారి అధ్యక్షతన మొదలయింది. న్యాయమూర్తి శ్రీరామశాస్త్రిగారు ప్రారంభోపన్యాసం చేశారు. బెజవాడ గోపాలరెడ్డిగారి వంటి పెద్దలనేకులు ప్రసంగించారు. సుబ్బరామప్పగారు పాతపాట మొదలేశారు – తెలుగు కన్నడాలకు తొలి దశలోలాగా మళ్ళీ ఒకే లిపి ఉంటే ఉభయులమధ్యా స్నేహసౌహార్దాలు పెరుగుతాయని ఆయన వాదం. క్రీస్తుశకం 12వ శతాబ్ది నాటికే రెండు లిపులుగా పాత తెలుగు కన్నడ లిపి



చీలిపోయిందని కొమర్రాజు లక్ష్మణరావుగారు ఏనాడో నిరూపించారు. ఏకలిపి ఉన్నప్పుడు ఐక్యంగా ఉన్నామనిగాని, ఇప్పుడు పరస్పర శత్రుత్వం వచ్చిందనిగాని చెప్పటానికి ఆధారాల్లేవు. సంస్కృతానికి దేవనాగరీ లిపికాక తమిళ, కన్నడ, తెలుగుల వంటి ప్రాంతీయ భాషల లిపులు కూడా ఉపయోగపడుతున్నాయి. సాధారణ లిపి ఉన్న అసామీ బెంగాలీలు ఘర్షణ పడుతుంటే దేవనాగరి, పెర్షో– అరాబిక్, గురుముఖి అనే మూడు లిపుల్లో రాస్తున్న పంజాబీలు కొట్లాడుకోవటం లేదు. భాషా శాస్త్రజ్ఞులు అన్ని భాషలనూ ప్రత్యేక లిపిలో రాస్తున్నారు. రోమన్ లిపిలో ప్రత్యేక సంకేతా లేర్పడ్డాయి. సాధారణ లిపికోసం అలజడి సృష్టించేకన్నా కన్నడ తెలుగు సాహిత్యాలను ఒక భాషనుంచి మరో దాంట్లోకి అనువదించి ప్రచురిస్తే ప్రేమాభిమానాలు పెరగవచ్చు. ఇలా నేను సాగించిన వాదాన్ని రాళ్ళపల్లివారూ శ్రీరామశాస్త్రిగారూ సమర్థించారు (శాస్త్రి గారు మైసూరు హైకోర్టులో ప్రధాన న్యాయమూర్తిగా, కర్ణాటక రాష్ట్రంలో విధానమండలి అధ్యక్షులుగా అధికారభాషా సంఘాధిపతిగా పనిచేసిన సుప్రసిద్ధాంధ్రులు). అటువంటి పెద్దల సందర్శనం అదృష్టమని భావిస్తాను.

1975లో ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభలు జరిగాయి హైదరాబాదులో. ఆ సందర్భంగా వెలువరించిన ప్రత్యేక సంచికలో సాంకేతిక పదాల ప్రమాణీకరణం గురించి వ్యాసం రాసే అవకాశం కలిగింది. ఆ సభలు జరిగిన తీరు, వాటికి ముందు వెనకాల శ్రీశ్రీ విశ్వనాథల మధ్య జరిగిన ఆరోపణ, ప్రత్యారోపణలు వగైరాలు జగత్ప్రసిద్ధ సంఘటనలు. 'మా తెలుగు తల్లికీ మల్లెపూదండ', 'దేశమును ప్రేమించుమన్నా' అనే రెండు గేయాలనూ జాతీయ గీతాల స్థాయిలో గౌరవమిస్తున్నామన్న కార్యకర్తలు సభాస్థలిలో వాటి రచయితల చిత్రపటాలను ప్రదర్శించకపోవటం విషాదకర సంఘటన. ప్రత్యేకంగా ఆహ్వానించిన రాయప్రోలువారి కిచ్చిన శాలువా తిరిగి తీసుకొని ఆ పెద్ద వయస్సులో జనసముద్రంలో మీ దారి మీరు చూసుకొండని మొహం చాటుచేసుకున్న కార్యకర్తల ఔదార్యం ప్రశంసనీయం. అవన్నీ తలుచుకోవటం దుఃఖహేతువు. సామాజిక భాషా పరిశీలనార్థం వ్యవహర్తల ప్రసంగాలను రికార్డు చేయటానికి కొన్న టేపులను చెరిపి మహాసభలో జరిగే ఉపన్యాసాదులను రికార్డు చేయమన్నారు. ఎంతో ఖర్చుతో జరుగుతున్న మహాసభలకు వేరుగా వాటిని కొనకపోగా, సేకరించిన భాషా సమాచారాన్ని చెరిపివేయాలని సంకల్పించిన పెద్దల భాషాభిమానం తిరుగులేనిది. ఇంతకన్నా వ్యక్తిగతంగా నన్ను బాధించిన అంశం మరొకటి. వయోజనులకోసం ప్రత్యేకంగా పాఠ్యగ్రంథాలు తెలుగులో తయారు చేయటానికి కొంత సొమ్మిస్తామని మైసూరులోని కేంద్రీయ భాషా సంస్థ సంచాలకుడు దేవీప్రసన్న పట్నాయక్ గారు ముందుకు వచ్చారు. పాఠాల రచనకు స్థలమిమ్మంటే తెలుగు అకాడమి అధికారులు నిరాకరించారు. చివరకు అద్దె చెల్లించి నారాయణగూడాలోని వై.ఎం.సి.ఏ. కార్యాలయంలో వర్క్‌షాప్ (ఒకనాటి విద్యామంత్రి దీన్ని 'దుకణం' అని వ్యవహరించారు) నిర్వహించవలసి వచ్చింది. సభకు పట్నాయక్‌గారు అధ్యక్షత వహించగా వావిలాల వారు ప్రారంభోపన్యాసం చేశారు. అందులో అప్పటి అకాడమి సంచాలకుల పుత్రిక కూడా పాల్గొన్నా, అకాడమి స్థలం వాడుకోటానికి అనుమతి లభించలేదు. రచయితలందరికీ సమానంగా పురస్కారా లందించే

కార్యక్రమం శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో ఖర్చులేకుండా జరిగింది. పాఠ్యగ్రంథాలను విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారు ప్రచురించారు. ఈ ప్రయత్నాన్ని హర్షిస్తూ సాయపడని ప్రభుత్వాన్ని నిందిస్తూ గోరాశాస్త్రి గారు ఆంధ్రభూమిలో సంపాదకీయం రాశారు!

ఆగ్రాలోని కేంద్రీయ హిందీ సంస్థాన్‌తో కలిసి తెలుగు అకాడమి 1976 జూన్‌లో రెండు రోజులపాటు తెలుగుభాషను భిన్న రంగాల్లో ప్రయోజనవంతంగా తీర్చిదిద్దే మార్గాల నన్వేషించ టానికి ఓ సదస్సు నిర్వహించింది. అప్పట్లో విద్యావిషయక స్థాయీ సంఘానికి అధ్యక్షులుగా ఉన్న మోటూరి సత్యనారాయణగారు పూర్వం ఆ సంస్థకు అధ్యక్షులుగా ఉన్నందువల్ల హిందీ వాళ్ళు తమ భాషాభివృద్ధికి చేస్తున్న సమస్త కార్యాలనూ తెలుగువాళ్ళం చేయాలనే పట్టుబట్టారు. సదస్సు పేరు ప్రయోజనాత్మకమైన తెలుగు సదస్సు. హిందీలో మిశ్ర/వైరి సమాసభావనే లేదుకాబట్టి ఆయన ప్రయోజనాత్మక తెలుగన్నా మేం ఆత్మరక్షణార్థం తెలుగుకు ముందు 'మైన' చేర్చాం. నాటి రాష్ట్ర గవర్నరు మోహన్‌లాల్ సుఖాడియా అధ్యక్షతన జరిగిన ప్రారంభ సమావేశంలో కేంద్రీయ హిందీ సంస్థాన్ అధ్యక్షుడు డాక్టర్ పి.గోపాలశర్మ గారూ ఢిల్లీలోని కేంద్రీయ హిందీ సంస్థానుకు తాత్కాలిక సంచాలకులుగా ఉన్న ఆచార్య ఆర్.ఎన్.శ్రీవాస్తవ పాల్గొన్నారు. గోపాలశర్మగారు తెలుగువాళ్ళేగాని మూడు తరాలుగా వారి కుటుంబం మధ్యప్రదేశ్‌లో స్థిరపడింది. ఆయన ఆ రాష్ట్రంలో డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్‌గా పనిచేశాడు. అంతకు ముందు రవిశంకర్ శుక్లా కుటుంబంతో ఆయనకున్న స్నేహ సంబంధాలను నేను ప్రత్యక్షంగా చూశాను. ఆయన హిందీ లోనేగాక సంస్కృతంలో మంచి పండితుడేగాని ఆయనకు తెలుగురాదు. ఉత్తర హిందూస్థానంలో ఆయన పొందిన గౌరవ మర్యాదలకు నేను ప్రత్యక్ష సాక్షిని. అకాడమి పాలక మండలిలో సభ్యు డాయన కేంద్ర ప్రభుత్వం తరపున. భర్తృహరి రాసిన వాక్యపదీయాన్ని తెలుగులోకి అనువదింప జేసి పీఠికలో ప్రాచ్యపాశ్చాత్య భాషాశాస్త్ర సిద్ధాంతాల తులనాత్మక పరీక్ష రాయిస్తే బాగుంటుందని ప్రతిపాదించినందుకు నన్ను పదవినుంచి తొలగించాలనే ఒత్తిడి వచ్చింది తీర్మాన రూపంలో, పాలక మండలిలో. ఆధునిక శాస్త్ర విషయాల్లో పాఠ్య గ్రంథాలు రాయించవలసిన సంస్థ ఈ పని చేయాలనటం నేరమన్నారు (తరవాతి కాలంలో తాడూ పేడూ లేని తెలుగు సాహితీ గ్రంథాలను ముద్రించిన వారిని మహానుభావులని కీర్తించారు). ఆంధ్రదేశంలో సంస్కృత కళాశాలల్లో కూడా వాక్యపదీయం బోధించటంలేదు. చివరకు మంజూషను చెప్పటం మానివేశారు. తాతా సుబ్బ రాయుడు శాస్త్రి గారి శిష్యులుగా దశాబ్దాల పర్యంతం వాక్యపదీయం పాఠం చెప్పిన పేరి సూర్య నారాయణ శాస్త్రిగారు వార్ధక్యంలోకి వచ్చారు. వారిచేత అనువదింపజేస్తే మంచిదని సిఫారసు చేసినందుకు రభస జరిగింది. అప్పుడు అడ్డుకొని దాన్ని ప్రచురించవలసిందేనని గంటివారూ, ప్రచురించకపోతే కేంద్ర ప్రభుత్వాన్ని రంగంలోకి దింపుతానని గోపాలశర్మగారూ అడ్డుపడకపోతే ఏం జరిగేదో చెప్పలేను. కాకపోతే నేను వ్యాజ్యమాడవలసి వచ్చేది.

ఆ సదస్సులో అధికార భాషా సంఘం ప్రథమాధ్యక్షులైన వావిలాల గోపాలకృష్ణయ్యా గారు, సుప్రసిద్ధులైన డాక్టర్ కె.ఎల్.రావుగారు, డి.పి.పట్టనాయక్, ఎం.వి.రాజగోపాల్, ఉండేలు మాల కొండారెడ్డి వంటి పెద్దలేగాక తెలుగువాళ్ళలో ప్రచండ వాణిజ్యవేత్త ఒకడున్నాడని నిరూపించిన



రామోజీరావుగారు కూడా పాల్గొన్నారు. అధికార, వాణిజ్య, బోధన, సాంకేతిక, సామాజిక రంగాల్లో తెలుగుభాషను అభివృద్ధి చేసే మార్గాలను ఆ సదస్సు సూచించింది. అప్పటి ముఖ్య మంత్రి జలగం వెంగళరావు గారూ, విద్యామంత్రి మండలి వెంకట కృష్ణారావు గారు సభకు హాజరైనారు. సదస్సు సిఫారసులను అకాడమి తెలుగు, ఇంగ్లీషు భాషల్లో ప్రచురించింది.

1977 జూన్‌లో సామాజిక భాషాపరిశీలన భారతదేశం మొత్తంలో మొదటిసారి పెద్ద ఎత్తున చేపట్టిన తెలుగు అకాడమి ఆ రంగంలో జరిగిన పూర్వప్రయత్నాల, ప్రస్తుత కార్యక్రమాల మంచి చెడ్డలను చర్చించి అప్పటి ప్రసంగాలను చర్చలతోసహా ఇంగ్లీషులో ప్రచురించింది (ఇతర భాషల వారిక్కూడా ప్రోత్సాహం కలిగించేందుకు). స్థానికులైన భద్రిరాజు వారేగాక మైసూరులోని కేంద్రీయ భాషా సంస్థ సంచాలకులైన డి.పి.పట్టనాయక్, జనాభా లెక్కలు తయారుచేసే అసి స్టెంట్ రిజిస్ట్రార్ జనరల్ బి.పి.మహాపాత్ర, ఢిల్లీ విశ్వవిద్యాలయంలో భాషాశాస్త్రాధ్యక్షుడైన ఆర్.ఎన్.శ్రీవాస్తవలేగాక ద్రవిడభాషాసంస్థ నిర్మాత, కేరళ విశ్వవిద్యాలయంలో భాషాశాస్త్ర శాఖాధిపతీ అయిన వి.ఐ.సుబ్రమోనియం వగైరాలు పాల్గొన్నారు. ఈ సదస్సులు విద్యాసంస్థల్లో తెలుగు అకాడమి కూడా ఒకటని రుజువు చేయటానికే గాక, తెలుగు భాషను సమస్త రంగాల్లో సమర్థంగా ప్రవేశపెట్టాలనే అభిలాషను బలపరచటానికీ పనికి వచ్చాయి. ఒకటో రెండో సదస్సులు నిర్వ హించటానికి అనుమతి సంపాదించటం ఒక మహాయజ్ఞం. అవి నెరవేరటానికి పడవలసిన పాట్లు అసంఖ్యాకం. ఇంతా చేసి ఈ చర్చలవల్ల పాఠ్యగ్రంథ ప్రచురణగాని, అది కారణంగా వచ్చే ఆదాయంగాని ఏమీలేవనే నిరాశతోబాటు వ్యయహేతువులైన ఇటువంటి కార్యకలాపాలను వ్యతిరేకించటమే ఆనవాయితీగా ఉండేది. ఖర్మంచాలక ఇలాంటి సదస్సులు నిర్వహించటానికి అనుమతి లభిస్తే ఉన్నతాధికారులకూ, మంత్రిసత్తములకూ భిన్నాంశాలతో ఉపన్యాస పాఠాలు రాసి ఇచ్చి ఆమోదం పొందవలసిన దుష్కర్మ ఉద్యోగులకు తప్పినా శాఖాధిపతులకు తప్పేదికాదు. అది అనేక జన్మార్జిత పాపసంచితం.

విశ్వవిద్యాలయాల ఆచార్యులు పాఠ్యప్రణాళికనుంచి పాఠ్యగ్రంథ రచనదాకా అకాడమిని ఎన్నో విధాల ఏడిపించారు. మరోవైపు రచయితలుగా, సంపాదకులుగా ఎవరికి వారు తమ కెల్లాగైనా సంబంధముండాలని ఆకాంక్షించేవారు. అకాడమిలో విద్యావంతులున్నారని ఒక పట్టాన అంగీకరించే వారు కాదుగాని వాళ్ళు ప్రూఫురీడర్లనీ, ప్రభుత్వానికీ సంచాలకులకూ సేవకులనీ చిన్నచూపు చూసేవారు. ప్రభుత్వాధికారులు ఈ ఉద్యోగులు ప్రభుత్వేతర సేవకులని భావించేవారు. అయితే సభలూ, సమావేశాలూ, చర్చాగోష్ఠులూ, సదస్సులూ నిర్వహించటానికి అకాడమి ఆర్థిక సహాయం అర్థిస్తూనే ఉండేవాళ్ళు. ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖ తెలుగు అకాడమిలోని తెలుగు పండితులను ఎన్నడూ సమదృష్టితో చూడలేదు. కానీ వజ్రోత్సవ సందర్భంలో తెలుగును అధికార భాషగా అభివృద్ధి చేయదలిచామనీ, ఆర్థికంగా తోడ్పడమనీ కోరారు. చిత్రమేమంటే సొమ్ము అకాడమి ఇచ్చినా ప్రారంభోత్సవం తప్ప (అధికార భాషా సంఘా నికి అప్పటి అధ్యక్షులైన వైలాల/వందేమాతరం రామచంద్రరావుగారి ఆనుకూల్యం కోసం ప్రారంభ సమావేశం అకాడమిలో జరిగింది. ఆయన తెలుగు పాండిత్యమేమో అధికారులకూ

అభిమానులకూ బహుశా తెలిసి ఉంటుంది) తక్కిన సభలు విశ్వవిద్యాలయంలోనే జరగాల న్నారు. సభాధ్యక్షుల ధోరణికి అప్పటి విద్యాశాఖ కార్యదర్శి ప్రతాప రెడ్డిగారు మండిపడి సర్దు కున్నారు.

**థామస్ బరో రాక**

అకాడమి అధికారులకు ప్రభుత్వం మీద తప్ప విద్వజ్జనం మీద గౌరవం చాలా తక్కువ. ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో సంస్కృత భాషాచార్యుడుగా, ద్రవిడ భాషా తులనాత్మక నిఘం టువుకు ఎం.బి.ఎమెనోతోబాటు సహనిర్మాతగా ఉన్న థామస్ బరో హైదరాబాదు విచ్చేశారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం వారు అతిథి గృహంలో వసతి కల్పించారు. భాషాశాస్త్ర శాఖలోని ఒకరిద్దరు తప్ప ఇతర భాషాశాఖలవారు ఆయన వైపు కన్నెత్తి చూడలేదు. తెలుగు అకాడమితో బాటు (అక్కడ జరుగుతున్న సామాజిక భాషా పరిశీలనకూ నిఘంటునిర్మాణానికీ ఆయన సూచనలూ, ఆశీస్సులూ పొందాలని ఆకాంక్షించాను. సహోద్యోగులంత ఆసక్తి చూపలేదు. ఒక రోజు ఆయన్ను నగరంలోని భిన్న సాంస్కృతిక సంస్థలకు తీసుకపోవటానికి వాహన సౌకర్య మడిగితే అకాడమి సంచాలకులు నిరాకరించారు. మొండితనంలో నేనెవరికీ తీసిపోను కాబట్టి అద్దె వాహనం తీసుకొని, సెలవుపెట్టి తిరిగాను. సాహిత్య అకాడమికి తీసుకవెళ్తే అక్కడ అధ్యక్ష కార్యదర్శులిద్దరూ ఉన్నారు. బరోగారిని గురించి చెప్తే "మీకు తెలుగు తెలుసా?" అని గోపాలరెడ్డి గా రడిగారు. 'కొద్దిగా'నంటే మీకు సూర్యరాయాంధ్ర నిఘంటువు సంపుటాలను బహూకరిస్తా మన్నారు. "అవి నాకు వద్దు. వాటి మీద నాకు గురుత్వంలే"దన్నా డాయన గోడలు చూస్తూ. కళాభవన్‌లో కవిపండితుల వర్ణచిత్రాలున్నాయి. ఆయనకు తెలుగురాదనే గట్టి నమ్మకంతో ఆ బొమ్మ లెవరెవరివో రామానుజరావు గారు వివరిస్తుంటే బరోగారు వినిపించుకోలేదు. గిడుగు వారి బొమ్మకు చేతులెత్తి భారతీయ పద్ధతిలో నమస్కరించాడు! ఆ తరవాత పబ్లిక్ గార్డెన్స్‌లోని పురాతత్వ శాఖకు తీసుక వెళ్ళాను. అప్పటికి కాకతీయుల బంగారు నాణేలు దొరికాయంటే ఒకసారి చూపమని వేడుకున్నా కుదరదన్న పెద్దలు, బరోగా రనగానే కాళ్ళకు మొక్కి దొరగారికి వాటిని చూపుతుంటే కడుపుమండింది నాకు. అక్కడి అద్దాల బీరువాలో నుంచి శాతవాహనుల నాటి వస్తువులు కనిపించాయి. ఒకదాని మీద 'చిన చిలాత' అని ఉంది. మీరు చర్చించిన 'చినచిలాత' ఇక్కడ ఉన్నదనగానే ఆయన బంగారు నాణేన్ని అక్కడ పడవేసి ఇది చూడటానికి వచ్చాడు! ఆయన ప్రథమ ప్రణయం భాషమీద. అంతటితో నాకు సంతోషం పెల్లుబికింది (నాణెంకోసం వెతుక్కునే బాధ అక్కడి పెద్దలకు కలిగినందుకు). సాలార్‌జంగ్ మ్యూజియానికి తీసుక వెళ్ళా నక్కడినుంచి. అక్కడ లిఫ్ట్ దగ్గరకు నడుస్తుండగా అందులో దిగివచ్చిన అవధీశ్ రాణిగారు గావుకేక పెట్టింది (బరోగా రనగానే). ఆమెకు తెలిసినపాటి నా కప్పటి కాయన్ను గురించి తెలీదు – బ్రిటిష్ మ్యూజియం లైబ్రరీలో ఆయన పదమూడేళ్ళు భారతీయ విభాగాధి కారిగా ఉన్నాడని. ఆమె స్వయంగా తీసుకవెళ్ళి క్యూరేటరుకు పరిచయం చేసింది. విడిగా వెళ్ళి నప్పుడు నేనెన్నడూ చూడలేకపోయిన అపూర్వ వస్తు సంచయాన్ని ఆయనతోబాటు నేను చూశాను. మన జాతి స్వతంత్రమైనా శ్వేతజాతీయులను గౌరవించినంతగా స్వదేశీయులను అగౌరవిస్తుందనటానికి నాకు దొరికిన రెండో ప్రత్యక్షసాక్ష్య మిది.



(ఆనర్సు ఫైనలియర్లో ఉండగా ఆంధ్ర విశ్వవిద్యాలయంలో కొత్తగా సాగరశాస్త్రాన్ని ప్రవేశ పెట్టారు ప్రత్యేక విషయంగా. ఒకే విద్యార్థి ఉండేవాడు – జి.రామకోటయ్య. గురుడు అమెరికన్ నౌకాదళాధికారిగా ఉండి ఒక సంవత్సరంపాటు ఇక్కడ బోధన చేయవచ్చాడు – లాఫంటే అని. ఆ మహాత్ముడు ఐ.ఎన్.ఎస్. శివాజీ మీద సముద్రమధ్యకుపోయి సముద్రగర్భంలోని వస్తువులను సేకరించటానికి అనుమతించారుగాని, మా వంటి భారతీయ విద్యార్థుల కెవరికీ అనుమతి లేదు. చాలా కష్టపడి, గొడవపడి, చచ్చిచెడి అనుమతి సాధిస్తే ఓడ అంచున తాళ్ళు పట్టుకొని నిలబడ మన్నారు. కక్కి అవస్థలు పడ్డాం. దొరగారికి లోపలికి ప్రవేశముంది. మాకా నౌకమీద పదిమైళ్ళ ప్రయాణానుమతి ఇప్పించిందీ ఆ దొరే. అందుకు కృతజ్ఞతాసూచకంగా ఈ నడివేసవిలో స్వదేశం వెళ్తున్నానంటే "మా ఊరికి వచ్చి పొండి – మీరక్కడ స్కయింగ్, స్కేటింగ్ కూడా చేయవ" చ్చంటే సరేనన్నాడు. ఉపాధ్యాయులు పిలవకపోయినా విద్యార్థులిలా ఆహ్వానించారని గొప్పలు చెప్పు కుంటే "ఎవరు ఎక్కడికి ఆహ్వానించా"రని అడిగారు. "రామగుండంగాని, పిడుగురాళ్ళగాని, ఆ రెండూళ్ళకూ గాని రమ్మని" నేనాహ్వానించానని విని భూగర్భ శాస్త్రాచార్యుడు పిలిపించి నాతో పోట్లాడి బెదిరించాడు. ఇది హత్యాప్రయత్న మన్నాడు. నేర మన్నాడు. శిక్ష తప్పదన్నాడు. ఏమీ చేయలేకపోయాడనుకోండి. ఇది ప్రథమానుభవం)

ప్రథమ ప్రపంచ మలయాళ మహాసభలు 1977 నవంబరులో తిరువనంతపురంలో జరిగాయి. ఆ సందర్భంగా జరిగే ఒకానొక సదస్సులో తెలుగు సాహిత్య చరిత్రలో వచ్చిన ఉద్య మాలను గురించి నన్నో పరిశోధనపత్రం సమర్పించమని ఆహ్వానించారు. మహాసభల ప్రధాన కార్యదర్శి కేరళ విశ్వవిద్యాలయంలోని మలయాళభాషాశాఖలో రీడరు. శాసనస్థ మలయాళ భాషాచరిత్రపై పరిశోధించిన వాడూ నా మిత్రుడూ. సాదరంగా ఆహ్వానించి నాకతడు కల్పించిన వసతి నా జన్మలో ఊహించగలిగింది కాదు. పైజమా, లాల్చీలతో పచ్చి భారతీయుడులా కని పించే ఆస్ట్రేలియన్ విద్వాంసుడు ఎ.ఎల్.బాషాంతోబాటు నాకో గదిలో స్థానం కల్పించాడు. The Wonder that was India అనే ఉద్గ్రంథం రచించిన పండితుడాయన. ఎంత విద్వాంసుడో అంత వినయ సంపన్నుడు. భట్టబాణుడి కాదంబరిలోని భాగాలను ఇంగ్లీషులోకి అనువదించి కూడా తనకు తెలిసిన సంస్కృతం చాలా తక్కువ అని, మాతృభాష కాబట్టి ఇంగ్లీషు వచ్చుననుకుంటా ననీ చెప్పాడు! భారతీయుల ఆధ్యాత్మిక వైభవం, సంతృప్త జీవనం వేల సంవత్సరాలుగా వర్ధిల్లటా నికి కారణం గాయత్రీ పారాయణంవల్ల సంభవించిన మహిమ అని చెప్పలేనుగాని ఆ మంత్రంలో కోరిన కోర్కెలోని మనశ్శుద్ధి, శాస్త్రీయమైన సూర్యోపాసనా అనటానికి సంశయించనన్నాడు! "ధియో యో నః ప్రచోదయాత్" అంటూ తమ తెలివి తేటలను పెంచమని ఈ సృష్టికి మనకు తెలిసిన మూలాధారమైన సూర్యుణ్ణి అభ్యర్థించటం మరే జాతీ చేయని, అర్థం చేసుకో(లే)ని అపూర్వ విషయమని వివరించాడు. తెలుగుదేశంలోని సాహితీ వికాసం సంస్కృతాభిమానం అనే రెంటిని గురించి తరచితరచి అడిగి నోట్సు రాసుకున్నాడు. ఆ మహావ్యక్తితో పరిచయ భాగ్యం కలిగినందుకు నాకు కలిగిన ఆనంద విభ్రమాలకన్నా మించిన విచారం ప్రారంభసభ కలిగిం చింది.

ముఖ్యమంత్రి అచ్యుతమీనన్ సభాధిపతిగా తన రాజకీయ ప్రత్యర్థిని – నంబూద్రిపాద్‌ను వరించాడు. ప్రారంభోపన్యాసం మలయాళ మహానిఘంటు నిర్మాణం ఆరంభించి అప్పటికి అర్థాధికంగా పూర్తిచేసిన సూరనాడ్ కుంజన్ పిళ్ళై చేస్తారని ప్రకటించాడు. నిర్వహణ బాధ్యత మాత్రమే తన మీద పెట్టుకున్నాడు. ప్రారంభ సభకు రెండున్నరలక్షలకుపైగా ప్రజలు హాజరైనారు. సభారంభానికి ఇంకా అయిదారు నిముషాలుండగా పిళ్ళైగారు సభాస్థలికి చేరుకున్నారు. ఆయన్ను కృష్ణవారియర్, మలయాళ మనోరమ పాలకుల్లో ఒకడైన భాస్కరన్ చెరోవైపు చేయి పట్టుకొని వేదికవైపు తీసుకొని వస్తుంటే నంబూద్రిపాద్ క్షణాల ప్రకారం సభ ఆరంభమయిందంటూనే పిళ్ళై గారు వేదికమీద కూర్చుండి విశ్రమించి సిద్ధమనేదాకా ఏమీ జరగవని ప్రకటించాడు. సభ్యులందరూ లేచి నుంచొని కరతాళ ధ్వనులమధ్య ఆయన వేదిక చేరటానికి పట్టిన పది నిముషాలూ నిలబడే ఉన్నారు! తెలుగుదేశంలో ఒక పండిత మాత్రుడికి, అదిన్నీ అధికారైశ్వర్యాలు లేని ఒక వినయశీలికి, ఆ విధంగా నా జీవితకాలంలో గౌరవ మర్యాదలు జరుగుతాయని కలలోకూడా ఊహించలేను. నేనాయన్నంతకు ముందు నాలుగైదుసార్లు కలిశాను. ఎప్పుడు కలిసినా ఆచార్యులవారి యోగక్షేమాలే ప్రథమ ప్రశ్న. ఆచార్యులవా రెవరంటే తనకు ప్రాకృత భాషలో ఓనమాలు నేర్పిన బహుభాషావేత్త, మహానిఘంటు నిర్మాణం తొలిదశలో తనకు మార్గనిర్దేశం చేసిన మహావిద్వాంసుల్లో ఒకడైన పుట్టపర్తి నారాయణచార్యులు! తరవాత 'కవిజీ' వంటి మహావిద్వాంసుణ్ణి కన్న తెలుగువా ళ్ళెవరనేది మూడో విషయం. "అంగుష్ఠమాత్రః పురుషః" అనే ప్రసంగాన్ని ఈ అల్పకాయుడైన మహావిద్వాంసుడికి అన్వయించాలనిపిస్తుంది. ఒక చిన్న పేదరాష్ట్రం ఇటువంటి పెద్దలకు పెద్దపీటవేసి విశ్వవిద్యాలయంలో వసతులు కల్పించి మలయాళ భాషకు ఓ మహానిఘంటువును నిర్మింపజేసి తమిళ కన్నడులకు తీసిపోమని నిరూపించుకుంది. మనమూ ఉన్నాం. పూర్తికావస్తున్న తెలుగు శబ్దసాగరాన్ని సిబ్బందిని తగ్గించీ, తొలగించీ మూసివేశామని ప్రకటించకుండా అంతర్ధానం చేసి పారేశాం. ఇంతటి దౌర్భాగ్య జాతి మరొకటి ఉండదని నిరూపించుకున్నాం. మనకు భాషకన్నా దాని పేరిట పదవులూ, అధికారమూ, ఐశ్వర్యమూ ముఖ్యం. 'విద్వా నేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్' అన్న మాట నిజమైతే ఆంధ్రప్రదేశ్ అధికార పీఠంలో విద్వాంసుడనేవాడు లేనేలేడని బల్లగుద్ది చెప్పవచ్చు.

## స్తనశల్యపరీక్ష

1977 ఒక విచిత్రమైన సంవత్సరం. అప్పటికి తెలుగును బోధన భాషగా అభివృద్ధి చేయాలని అకాడమిని నెలకొల్పిన మొదటి మోజు తీరిపోయింది. ప్రథమ నిర్మాత ఆంధ్రప్రదేశ్ రాజకీయాలకు దూరమైపోయాడు. అయినా కేంద్రంలో అధికారంలో ఉన్నాడు లెక్కకు. ఇందిరా ప్రియదర్శినీ నెహ్రూ గాంధీగారి రాజ్యం తిరుగులేని అధికారం చెలాయించటం మొదలుపెట్టింది. అత్యవసర పరిస్థితిలో రాష్ట్ర పాలకులను వ్యతిరేకించగల సమర్థమైన ప్రతిపక్షం లేదు. కొత్తగా అధికారంలో ఉన్న వారికి తమ వారిని సమస్త సంస్థల్లోనూ అధికార పీఠంమీద ఉంచగల శక్తిసామర్థ్యాలు వచ్చాయి. అయితే అందుకు కారణాలు వెతకవలసి వచ్చింది. తెలుగు అకాడమి ఒక కులవర్గం ఆధిపత్యంలో ఉందనీ ఆ పీడ తొలగించాలనీ నిర్ణయించుకున్నారు. అసలు అకాడమి ఉద్దేశాలేమిటి, ఏమి చేయవలసి ఉంటే ఏమి చేశారు, ఎలా ఎంతచేశారు, దాని ఆర్థిక పరిస్థితి ఏమిటి, వగైరా విషయాలను కూలంకషంగా పరిశీలించి ప్రభుత్వానికి నివేదించటానికి ఒక పరిశీలక సంఘాన్ని నియమించారు. దాని అధ్యక్షుడు పరిపాలనానుభవం లేని గాంధేయుడు. పూర్వాశ్రమంలో విశ్వనాథ సత్యనారాయణ గారితో కలిసి జంట కవిగా కొంతకాలం కవితా గోష్ఠులు నిర్వహించిన వయోవృద్ధుడు కొడాలి ఆంజనేయులు గారు. సభ్యుల్లో కోదాటి నారాయణ రావు గారి వంటి పెద్దలు కూడా ఉన్నారు. ఇద్దరు ఐ.ఏ.ఎస్. అధికారులున్నారు – ఎల్.మాల కొండయ్య, బి.వి.రెడ్డి (ఈయన ప్రభుత్వ ముద్రణాలయ సంచాలకుడు). ఇలాంటి సంఘాలన్నిటి లాగానే ఈ సంఘం కూడా తెలుగు భాషాభివృద్ధికి తెలుగు అకాడమి ఏమేమి చేయాలో సిఫారసు చేయటంకోసం అవసరమైన ప్రాథమిక సమాచార సేకరణకు మొదట ఈ రాష్ట్రంలో, తరవాత కన్యాకుమారి దాకా ప్రయాణించి తెలుసుకున్నది. ఎవరికి నిర్దిష్టమైన పనులు వారు చేయక పరిశోధన బోధన విభాగాల వాళ్ళు ప్రచురణ కార్యక్రమా లెందుకు చేశారు, వ్యాకరణ రచన ఎందుకు పూర్తి కాలేదు, సామాజిక భాషా పరిశీలన ఎందుకు పూర్తికాలేదు, ఏయే నిఘంటువులు నిర్మించారు, ఎందుకు మరిన్ని నిర్మించలేదు, ఉద్యోగులకు అవసరమైన నిర్దిష్ట విద్యార్హతలున్నవా లేవా, లేకపోతే ఎలా ఎవరు నియమించారు వారిని, ఉంటే మాత్రం అంతకన్నా అర్హులు ప్రపంచంలో లేరా వగైరా మౌలిక ప్రశ్నలను వేసి ఉద్యోగులను ఏడిపించారు గానీ అడగవలసినవి అడగలేదు. కేంద్ర ప్రభుత్వం ధనసహాయం చేస్తూ పెట్టిన షరతులను రాష్ట్ర ప్రభుత్వం పాటించిందా లేదా, నిర్వహణ భారం విశ్వవిద్యాలయాల కివ్వక రాష్ట్రప్రభుత్వోద్యోగులకు ఎందుకు కట్టబెట్టారు, విద్యావిషయకోద్యోగుల్లో అట్టడుగు స్థాయిలో ఉన్న వారికున్న విద్యార్హతలు కూడా లేని విద్యాశాఖోద్యోగులను సంచాలకులుగా ఎందుకు నియమించారు, అందుకు బాధ్యు లెవరు, ఆధునిక శాస్త్ర గ్రంథ నిర్మాణ ప్రచురణల్లో మార్గనిర్దేశం చేయటానికి కవిగాయకాదుల నెందుకు నియమించారు వగైరా ప్రశ్నలు అడగలేదు. ఇవన్నీ చెత్త ప్రశ్నలని తేలిపోయింది వారి దృష్టిలో. కాకపోతే ఈ రాష్ట్ర ప్రభుత్వం అన్ని విశ్వవిద్యాలయాల అకడమిక్ కౌన్సిళ్ళలోనూ తెలుగు అకాడమి సంచాలకులను సభ్యుడుగా నియమిస్తుంటే, ఎక్కడో మదురైలో ఉన్న మదురై కామరాజ్ విశ్వవిద్యాలయానికి మూడేళ్ళపాటు అదేవిధంగా నిన్ను ఎలా నియమించారని నన్ను నిలదీశారు! చిత్రమేమంటే ఆ నియామకం ఆ విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షుడు కుళందైస్వామి గారి సిఫారసు మీద ఆధారపడి తమిళనాడు గవర్నరు చేశాడు – నేను దరఖాస్తు చేయలేదు. నీకే రాజకీయ బలముండి ఈ(ముష్టి)పదవిని సంపాదించగలిగావని అడగని పెద్దలులేరు. వారందరికీ నా మొండి సమాధానమొకటే: "నిజంగా నాకు రాజకీయ బలమే ఉంటే ఈ రాష్ట్రంలోనే ఇంతకన్నా పెద్ద పదవి ఎందుకు సంపాదించలేకపోయానంటారు? నేను బలవంతుణ్ణనే విశ్వాసలేశం మీకుంటే నన్ను ఇలా ప్రశ్నించగల గుండెబలం మీకుండేదా?". ప్రశ్నకు ప్రశ్నే మంచి సమాధానమని పెద్దలు చెప్పగా విని, ఇలా ఎదురు సవాలు విసిరానన్నమాట. అనుభవం పెరిగేకొద్దీ అజ్ఞాన దురహంకారాలు ప్రబల మవుతాయని ఎవరన్నారో గుర్తులేదు. ఇటువంటి గొప్ప అనుభవాలలో 1977 గడిచిపోయింది నా జీవితంలో.

## మరికొన్ని సభలూ సమావేశాలూ

నా జీవితంలో ఉద్యోగ వ్యవహారాల్లో బహుశా ఎనిమిదో దశకం విపరీత పరిణామాలకు దారితీసిందనవచ్చు. తొలి నెలల్లో విశ్వకళాపరిషత్తులో వాడుక భాషను గురించి ఓ సదస్సు జరిగింది – అరసం నిర్వహణలో. అప్పటి ఉపాధ్యక్షుడు మేకా రంగయ్యప్పారావు గారు అబ్బూరి నగర్ అని పేరుబెట్టిన గ్రంథాలయం పక్కనున్న భవనంలో గిడుగు వేదికలో సభాధ్యక్షత వహించారు. ప్రాంగణంలో అడుగుపెడ్తూనే అప్పటికి నలభై ఏళ్ళ క్రితం స్నేహం కలిసిన రాంషా (దర్భా రామశాస్త్రి) పలకరింపుతో పూర్వస్మృతులు గుర్తుకు వచ్చాయి. చివరి నిమిషంలో భద్రిరాజు వారు నిరాకరించినందువల్ల నాగార్జున విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు ఆచార్య భావరాజు సర్వేశ్వరరావుగారు ప్రారంభోపన్యాసం చేశారు. సభలో పాల్గొనటానికి వెళ్ళే రాంభట్ల గారినీ నన్నూ 'ఈనాడు' ఆతిథ్యం స్వీకరించమని రామోజీరావు గారన్నారు. అయితే పదిమందితో కలిసి ప్రయాణిస్తున్న మేం విడిగా విమానయానం వగైరాలు చేయటం బాగుండదనీ, ఏదో సాయంత్రం ఈనాడు కార్యాలయానికి తప్పక వస్తామనీ వాగ్దానం చేశాం. విశ్వకళాపరిషత్తు ఏర్పాటు చేసిన బస్సులో బస్‌స్టాండ్ దగ్గర ఆవిష్కృతమైన గురజాడ విగ్రహానికి నమస్కరించి కదిలాం. ఆ మధ్యాహ్నం మూడు గంటలనుంచీ మాకూ మామిత్రులకూ అతిథి మర్యాదలు చేయటానికి ఈనాడు స్థానికాధికారి వాహనాది సౌకర్యాలు కల్పించారు. అది మొదటిరోజు. సంతోషంగా గడిచింది.

రెండో రోజు సాయంత్రం ముగింపు సమావేశానికి (ఒరిస్సాలోని ఆంధ్రులు ఉద్యాపనసభ అంటారు) భవనం వేంకట్రాంగారు అధ్యక్షత వహించారు. పాఠ్య గ్రంథాల్లోని భాషను గురించి నేనంతకు ముందు రాసిన వ్యాసాన్ని అభ్యుదయలో ప్రచురించారు. నేను దాన్నే చదివాను – ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డప్పటినుంచీ ప్రభుత్వం తెలుగు భాషోద్ధరణకు విడుదల చేసిన ఉత్తరువులనూ తత్పూర్వ పరిస్థితినీ ఈనాటికీ నెరవేరని లక్ష్యాలనూ తేదీల వారీగా ఏకరువు పెడ్తూ. మంత్రిగారికి కోపం వచ్చింది– "ఈ విషయాలను నాకు ముందుగా ఎందుకు చెప్పలేదు? ఇది క్రమశిక్షణకు భంగకరం" అని గర్జించారు. "అప్పటప్పటి మంత్రులకూ ఇతరాధికారులకూ నివేదించాను. ఉత్తరువులు జారీచేసిన వారికి తెలియదనగలమా?" అని ఎదుర్కొన్నాను. సభలో ఉన్న వావిలాల వారూ పురిపండా అప్పలస్వామి గారూ "మీరు తీసుకొనే చర్యలు మీరు తీసుకోండి. మేం చేయగలది మేం చేస్తా"మని వత్తాసు పలికారు. మంత్రిగారి వెంటనున్న పేట్రియట్ పత్రికలో పనిచేసే ప్రభాకర్ "సాయంత్రం విడిదికిరా. అన్నీ సర్దుకుంటా"యన్నాడు. నేను రానన్నాను. పోలేదు. (మంత్రిగారి భార్య జయప్రదగారు ఆయనకన్నా ముందే మంత్రిత్వం పొందారు. ఆమెగారూ ఇంటరు, ఆనర్సులు చదువుతున్నప్పుడు నాకు సమకాలికురాలు. ఒకర్నొకరు ఎరుగుదుంగాని ఒకరినొకరు ఏ సాయాన్నీ అర్థించిన వాళ్ళం కాదు. అకాడమి ఉద్యోగుల జీతభత్యాలనూ, పదోన్నతినీ గురించి విన్నవించటానికి వెళ్ళినప్పుడు కూడా ఆమె నన్ను సాదరంగా పలకరించారు. అకాడమిని చూడవచ్చినప్పుడు కూడా న్యాయమూర్తి అమరేశ్వరిగారితో మాట్లాడుతూ మేం వాల్తేరులో ఉన్నప్పటి విశేషాలూ, 'పోలీసు వెంకటస్వామి' అనే జానపద గేయాన్ని తూమాటి



దొణప్ప గారిని నిర్బంధించి నేను పాడించటం గుర్తుకు తెచ్చారు. అధికారం ఆలోచించ నీదు. అహంకరిస్తుంది. భాషాధికారం మాత్రం అలాంటిదికాదా అనేది నా ప్రశ్న). ఆ సాయంత్రం నుంచి అర్ధరాత్రిదాకా ఈనాడు ఆతిథ్యంపొంది వాల్తేరు స్టేషన్లో తిరిగి ఇతర మిత్రులను కలిశాం– వాల్తేరులో రామోజీగారు చేయించిన మర్యాదలను గురించి ఆచార్య కె.కె.రంగనాథాచార్యుల వారిద్వారా విన్న భద్రిరాజువారు మళ్ళీ అలాంటి ఏర్పాటు చేయించమనీ వ్యావహారిక భాష గురించి తాము ప్రామాణికోపన్యాసం చేస్తామనీ నన్ను ప్రబోధించారు. "అనేక శతభాండాని భిన్నాని మమ మస్తకే" అన్నట్లు అనేకానేక పూర్వానుభవాల సమాహారం నన్నలాంటి పనికి పూనుకోనీలేదు. ఆయన భాషాశాస్త్ర సదస్సులకు రామోజీగారి నభ్యర్థించి ఆర్థిక సహాయ మందించి రసీదులకోసం నేను పడ్డపాట్లు మరిచిపోలేను. రామోజీ గారిచేత సదస్సులకు విచ్చేసిన పాశ్చాత్య పండితులకు ఆతిథ్య మిప్పించమని అడిగి అనుమతి తెచ్చిన తరవాత ఎక్కడ ఎవరెవరికి ఎటువంటి మర్యాద జరపాలో తాము నిర్ణయిస్తామని ఆ అవకాశం పోగొట్టుకొని నన్ను మొహమాటంలో ఇబ్బందుల్లో పడవేసిన సందర్భాలనేకం.

ఆయేడే హైదరాబాద్‌లో జరిగిన రెండు భాషాశాస్త్ర సదస్సుల్లో పాల్గొన్నాను. దక్షిణాసియా భాషావేత్తల ద్వితీయ మహాసభ (ఇంగ్లీషులో SALA అంటా రాసంఘాన్ని) భద్రిరాజు వారి, కేంద్రీయాంగ్ల పాశ్చాత్య భాషాసంస్థ (CIEFL) వారి ఉమ్మడి నిర్వహణ అది. అందులో ద్విభాషితను (diglossia) గురించి చర్చిస్తారనీ, ఆ భావన (concept)కు మూలపురుషుడైన ఆచార్య ఫెర్గుసన్ స్వయంగా పాల్గొంటున్నాడనీ చెప్తే భద్రిరాజువారికీ, నాకూ మధ్య వివాదాస్పదమైన ఆ విషయం గురించి ప్రసగించటానికి వ్యాసం రాశాను. కానీ దాన్ని ఆ మహాసభ రెండు రోజుల్లోనూ చదివే అవకాశం నాకు లేదన్నారు. అప్పుడు పట్టుదలకు "పరిపాలన భాషగా తెలుగు ప్రయోగం" గురించి మరో వ్యాసం చదవక తప్పిందికాదు. ఆ సమావేశంలో టెక్సస్ విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖాధిపతిగా ఉన్న ఆంద్రీ షోబర్గ్ కూడా పాల్గొన్నారు. ఆ మహాసభకు ప్రతినిధిగా తెలుగులో పరిశోధిస్తున్న వోల్గా బరనికోవాను చేర్పించాను. (ఆమె తల్లిదండ్రులు హిందీలో పేరు మోసిన వాళ్ళు. ఆ రష్యన్ జన్మించింది ఢిల్లీలో. ఆమె తాతగారు విక్తర్ బరనికోవిచ్ అనే మహా విద్వాంసుడు లెనిన్‌గ్రాడ్ విశ్వవిద్యాలయం ప్రచురించిన సంస్కృత నిఘంటు నిర్మాతల్లో కడపటివాడు. మోనియర్ విలియమ్స్ కన్నా ముం దానిఘంటు నిర్మాణంలో పనిచేసిన వాడు. రాహుల్ సాంకృత్యాయన్ రష్యాలో పర్యటిస్తున్నప్పుడు పనిగట్టుకొనిపోయి ఆ వృద్ధ విద్వాంసుణ్ణి కలిసి సంస్కృతంలో చర్చించానన్న సంతృప్తి కలిగిందని రాశాడు). ఆ మహాసభ పూర్తయిన తరవాత తమ శాఖలో ఫెర్గ్యుసన్ అధ్యక్షతన జరిగే సభలో ధైర్యముంటే ప్రసంగించమన్నారు. ముందే సిద్ధమైన వివరాలతో అ భావనను ఎందరు విద్వాంసు లెన్నెన్ని విధాల నిర్వచించారో ఉదాహరించాను. "నాకింతమంది ఇలా వ్యాఖ్యానించినట్లు తెలీదు. మీ ప్రసంగవ్యాస మివ్వండి" అంటూనే 'ఇన్ని రకాల వ్యాఖ్యానం సబబా?' అని ప్రశ్నించాడు ఫెర్గ్యుసన్. "పాణిని పతంజలుల వ్యాకరణ చర్చలకు మన మిప్పు డెన్నెన్నో రకాల వివరణ లిస్తున్నాం గదా. అది సబబా?" అని నేనడిగాను. (1998లో నేను అమెరికాలో ఉండగా నా Occasional Papers అనే గ్రంథాన్ని అంకితం

పొందిన జాషువా ఫిష్మన్ నాకీయన స్వభావాన్ని వివరించాడు – “తెలివిగలవాడు. ఎన్నో మంచి భావనలు ప్రతిపాదించాడు. తరవాత వాటినిగురించికూడా పట్టించుకోని నిర్లిప్తుడు” అని. నేనక్కడ ఉండగానే ఫెర్గ్యుసన్ కన్నుమూశాడనీ ఆయన ఆత్మశాంతికి ప్రార్థించమనీ ఫిష్మన్ గారు నాకు ఇ–మెయిల్ పంపారు!). తరవాత నా వ్యాసాన్ని ప్రచురిద్దామంటే కనిపించలేదనీ, తక్షణం నా సొంతకాపీని పంపమనీ అడిగారు. “పోయిన దాన్ని పోనీండి. దాన్ని ప్రచురించి మీ వ్యాసాల గౌరవం తగ్గించుకోవద్దు. నాకు లేనిపోని గౌరవం కల్పించనూ వద్దు” అని విన్నవించాను. మహా కావ్యాలు అంతరించిన ప్రపంచంలో క్షుద్రరచనలకు ప్రాముఖ్య ముంటుందనుకోవటం భ్రమ. కాకపోతే వెర్రి.

## ఉత్తమ సంస్కారం

1980లో ద్రవిడ భాషాసంఘం, యు.జి.సి వగైరా సంస్థలు ఉమ్మడి కార్యక్రమంగా రెండు రోజులపాటు హైదరాబాదులో సదస్సు నిర్వహించాలనుకున్నాయి. భిన్న ప్రాంతాల నుంచి వచ్చే వారికి కేంద్ర స్థానమని హైదరాబాదును ఎంపిక చేశారు. ద్రవిడ భాషా సంఘానికి లెక్కకు నేను ప్రధాన కార్యదర్శిని కాబట్టి స్థానిక నిర్వాహకుడుగా పనిచేయాలని నిర్ణయించారు. భాషావేత్తలు, మానసిక శాస్త్రజ్ఞులు, బోధనశిక్షణ రంగంలో ప్రసిద్ధులు, నాడీ మండల శాస్త్రజ్ఞులూ, వివిధ రంగాల్లో ప్రసిద్ధులైన ఇతరులూ సమావేశమై మెదడు పనిచేసే విధానానికీ భాషాజ్ఞాన సంపాదన ధారణలకూ మధ్యగల సంబంధాలనూ, మానసిక రోగులకు భాషాబోధన చేసే విధానాలనూ చర్చించాలనేది ప్రతిపాదన. బొంబాయిలోని తాతా సంస్థలో నాడీశస్త్ర చికిత్సచేసే డాక్టర్ నరసింహన్‌గారి వంటి పని ఒత్తిడిగల పెద్దలకోసం నిర్ణీత కాలవ్యవధిలో చర్చలు సమాప్తం కావాలనేది ముఖ్యమనిపించింది. సమావేశ స్థలం గురించి ముందే అభ్యర్థిస్తే పూర్వానుభవాలనుబట్టి బెడిసికొట్టుందని తెలుసు. సభానిర్వహణకోసం రెండు రోజులు సెలవడిగితే “మిమ్మల్నే స్థానిక నిర్వాహకు డనటం న్యాయమా? డైరెక్టరుండగా” అన్న ప్రశ్న వచ్చింది. డైరెక్టరు కీనిర్వహణ బాధ్యత నివ్వటానికి సంఘం అనుమతించలేదు. ఒకవేళ అనుమతిస్తే ఏ విద్యామంత్రో, ముఖ్యమంత్రో సభారంభ సమాపనలకు తేదీ నివ్వాలనీ వారి నాహ్వానించాలనీ పట్టుబడ్తారు. ముఖ్యంగా వైద్యనిపుణులకోసం సమయపాలన తప్పదు. పరిష్కారమార్గం ఆలోచించి అప్పటి రాష్ట్ర గవర్నరు శారదా ముఖర్జీ గారిని సభాధ్యక్షత వహించి ఆశీర్వదించమని వేడుతూ లేఖరాస్తే ఫలానా సమయంలో కలిసి మాట్లాడమని నిర్దేశించారు. సెకన్ల ప్రకారం నన్ను భవనంలో ప్రవేశపెట్టారు. నా శరీర సౌందర్య పరిమాణాలను బట్టి ఎ.డి.సి. గారు నేను కూచోదగ్గ వ్యక్తిని కానని నిర్ణయించారు. ఇక్కడ నిలబడండి. గవర్నరు గారికి నమస్కరించి వారు అడిగిన వాటికి ప్రత్యుత్తర మిమ్మని నిర్దేశించారు. మరుక్షణం ఆమెగారు వచ్చారు. సగౌరవంగా నమస్కరించాను. ఎదుటి బల్లమీది ఆహ్వానం చదివి “మీరు ముఖ్యమంత్రి గారినో, మరే సీనియర్ మంత్రినో ఆహ్వానించకపోయారా?” అని అడిగారు. “వైద్య నిపుణులు కూడా హాజరవుతున్న సభ సకాలంలో మొదలుకాకపోతే విఫలమవుతుంది. ముఖ్యమంత్రి ప్రభుత్వాధిపతేగాని తమరు రాజ్యాధిపతులు – తేదీ నిర్ణయం ఎందరినో, ఎంతోకాలం వెంటబడి అభ్యర్థించి అందరికీ అనుకూలమైన రోజుగా



నిర్ణయించారు. నేను స్థానికుణ్ణని బాధ్యత ఇచ్చారుగాని నాకు నిర్ణయాధికారం లేదు. క్షమించి మా అభ్యర్థన మన్నించ”మన్నాను.

“మొరార్జీ ప్రధాని అయిన తరవాత గవర్నర్ల మొదటి సమావేశం మీ తేదీ మరునాడు ఢిల్లీలో ఉంది. నేను పోకతప్పదు. జాగ్రత్తగా అన్ని విషయాలూ తెలుసుకొని పోకపోతే ఆయన క్షమించడు. ఆయన స్వభావ మది కాబట్టి...” అంటుండగానే ‘మాకు గత్యంతరం లేదు. సభను రద్దు చేసుకోవలసి వస్తుం”దని మనవి చేశాను. “నేను వస్తానని రాకపోతే ఏం చేస్తా”రని ప్రశ్నించారు. అంతసేపూ నేను నిలబడే ఉన్నాను. ఆమెగారు కూర్చోమనలేదు. నేను స్వంతంత్రించి కూర్చోటానికి జంకాను. విసుగ్గా అప్పుడు “యత్నే కృతే యది నసిద్ధ్యతి కోAత్ర దోషః?” అన్నాను వినబడీ వినబడనట్లు. చిత్రం! ఆమె తక్షణం లేచి నమస్కరిస్తూ “పండిట్‌జీ! ఆప్ తశ్రీఫ్ లాయియే – మెహమాన్ కర్కే” అన్నారు. నేను పస్తాయిస్తుంటే ఆమెగారు “మవ్లంకర్ గారి పుత్రిక ఒక సంస్కృత పండితుణ్ణి అగౌరవించిందన్న అపఖ్యాతి రానీకండి! దయచేసి కూర్చోండి!” అని సన్నచేయగానే, నేను కూర్చునే లోపల ఫలాహారం పళ్ళాలు సిద్ధమైనాయి. (అప్పటిదాకా ఆమె కీర్తిశేషుడైన ఎయిర్ మార్షల్ ముఖర్జీ భార్య అని మాత్రమే విన్నాను. మవ్లంకర్ గారి పుత్రిక అని అప్పుడే తెలిసింది). ఆమె టీ చప్పరిస్తూ “మీకు తక్షణ మర్యాదలు చేయనందుకు క్షమించ”మన్నారు. నేను “వస్త్రేణ వపుషా వాచా నరో రంజయితే జనాన్” అన్నారు. కాబట్టి నేను మాట్లాడే దాకా మీరు నన్ను లక్షించకపోవటంతో తప్పులేదు. తప్పు జరిగిందనుకున్నా, ఆ శ్లోకభావానికి అపచారం జరుగుతుం”దన్నాను. “నేను వచ్చి తీర్తాను – సభాప్రారంభకు లెవ”రని ప్రశ్నించారు. “సాంకేతిక విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులైన ఎం.వి.రాజగోపాల్ గారిని ఆహ్వానిద్దా మనుకుంటున్నా”నని మనవి చేశాను. “అది బాగుంది. సభాస్థలం ఎక్కడ? నాకు అతిథుల వివరాలూ, సభోద్దేశాలూ కూడా పంపండి. సెల” వని నమస్కరించి లోపలికి వెళ్ళారు. అధ్యక్షు లెవరనే ప్రశ్నకు సమాధానం చెప్పిన తరవాత రాజగోపాల్‌గారు నా ఆహ్వానం స్వీకరించారు. ‘వేదిక ఎక్కడ?’ అని ఆయనే అడిగి “అకాడమీ డైరెక్టరుకు చెప్తాను. మీరు కార్యాలయం చేరేసరికి ఆయన ఆమోదం లభిస్తుం”దన్నారు – విద్యాశాఖా కార్యదర్శిగా తన అనుభవంలో కార్యాలయాధికారుల భావభంగిమ లెలా ఉంటాయో తెలిసిన వారు కాబట్టి. సభ విజయవంతంగా జరిగింది. DLA వారు ఇంగ్లీషులో నాటి ప్రసంగ పాఠాలను, చర్చలనూ ప్రచురించారు. ఆ గ్రంథానికి నేను సహసంపాదకుణ్ణి– బెంగుళూరులోని ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్సెస్‌లో కంప్యూటర్ విభాగాధిపతితోబాటు.

మరుసటేడు భద్రిరాజువారు అమెరికాలో ఉండగా తాత్కాలికంగా భాషాశాస్త్ర శాఖాధిపతిగా పనిచేస్తున్న ఆచార్య అనంత నారాయణగారి ఆధ్వర్యంలో ద్రవిడ భాషాసంస్థవారి మహాసభ ఉస్మానియా విశ్వవిద్యాలయంలో జరిగింది. మాండలిక వృత్తిపదకోశాలు పరంపరగా తెలుగులోనే వచ్చాయి – మొత్తం భారతదేశంలో. వాటి నిర్మాణ విధానాలకు సంబంధించిన సైద్ధాంతికాచరణలను విశదీకరిస్తూ నేనో పరిశోధనపత్రం చదివాను. నా కోరిక మీద రామోజీరావుగారు చాలా ఖరీదైన ఫైళ్ళను పాల్గొన్న వారందరికీ ఇప్పించారు. ఆయేడే తెలుగు

అకాడమీలో నిఘంటు నిర్మాణ పద్ధతులను గురించి ఒక విద్వద్గోష్ఠి నిర్వహించాం. కుంజన్ పిళ్ళై గారి తరవాత మలయాళ మహానిఘంటు నిర్మాతగా నియుక్తులైన బి.సి.బాలకృష్ణన్ గారు, కన్నడ సారస్వత పరిషత్తు నిర్మింపజేస్తున్న సువిస్తృతకన్నడ నిఘంటు నిర్మాణాధిపతి జి.వెంకట సుబ్బయ్యగారు, హిందీలో బహునిఘంటు నిర్మాత అయిన హర్‌దేవ్ బాహరీ వంటి అనుభవజ్ఞులు విచ్చేశారు. మొత్తం సభకు ప్రతిష్ఠ తెచ్చిన అతిథి వరేణ్యులు జ్ఞానపీఠాధిపతి శివరామ కారంత్. ప్రారంభ సభకు అధ్యక్షత వహించిన విద్యామంత్రి ముద్దు కృష్ణమ నాయుడు గారు కారంత్ గారిని ఆహ్వానిస్తూ నేను చేసిన ప్రసంగం విని "ఈయన కాంగ్రెసు వ్యతిరేకి అని ఎందుకు చెప్పలే"దని ప్రశ్నించారు. ఇందిరా గాంధీతో చిక్కమగళూర్ నియోజకవర్గంలో ఓడిపోతానని తెలిసీ పోటీ చేసింది రాజకీయ సిద్ధాంతాలకోసం కాదు. వ్యక్తి స్వాతంత్ర్యాన్ని కాలరాచిన అత్యవసర పరిస్థితిని కల్పించినందుకు. ఆయనకు ప్రయాణభృతి ఇచ్చే విషయంలో కార్యాలయం పేచీలు పెట్టింది. ఆయన్నో వీరగుమస్తాగారు మీ ఉద్యోగమేమి టంటే 'యాచన' అని చెప్పాడు! కన్నడ అధ్యయన సంస్థ నిర్మాణానికి లక్షల రూపాయల విరాళాలు సేకరించి దానికి మీరే ప్రథమాధ్యక్షులుగా ఉండాలని కోరితే "యాచకుడికి అధికారం ఇవ్వరాదు. ఇచ్చినా నా వృత్తిధర్మంగా నిరాకరిస్తా"నన్నాడు మదన్‌మోహన్ మాలవ్యాలాగా! ప్రభుత్వోద్యోగులు సామాన్య పౌరులను గుర్తించటం మానివేశారు స్వతంత్ర భారతంలో. బ్రిటిష్ వారి హయాంలో ఉద్యోగులకన్నా నిరుద్యోగ పౌరులకే సభల్లో కూడా ప్రాధాన్యమివ్వాలనే ఉత్తరువుండేది. అది అమల్లోనూ ఉండేది. "లేనివాడు పుడమి లేనివా"డన్న సూక్తికి ఇప్పటి పరిస్థితులనుబట్టి అధికారం, పదవి, బిరుదు వగైరాలు కూడా లేనివాడనే విస్తృత వ్యాఖ్యానం అవసర మనిపిస్తుంది.

### ఈనాడుతో బంధం

1981లో నాలుగైదేళ్ళ పరిశ్రమ ఫలితంగా 'ఈనాడు భాషా స్వరూపం' వెలువడింది. వందల, వేల పేజీలు చదివి భాషా విషయకంగా కనిపించిన దోషాలను గుర్తించి విశ్లేషించి పత్రికాధిపతి మనోభావాలను కూడా చర్చించి తెలుసుకొని ఈ గ్రంథం రచించాను. పత్రికా భాషలో కనిపించిన లోపాలను అంతకు ముందు కొంతకాలం లిఖిత రూపంలో పాత్రికేయులకు తెలిపిన తరవాత వాటిని గ్రంథస్థం చేశాను. మరసటేడు ఆంధ్రప్రదేశ్ రాజకీయాలు సంక్షుబ్ధ స్థితికి వచ్చాయి. నందమూరి తారక రామారావు గారు స్థాపించిన తెలుగుదేశమనే సరికొత్త ప్రాంతీయ రాజకీయపక్షం రంగప్రవేశం చేసింది. ఎన్నికల్లో పోటీచేసినప్పు డాపార్టీకి కావలసిన కరపత్రాల నుంచి, ఉపన్యాసాదులదాకా సమస్తం ఈనాడు కార్యాలయంలో తయారవుతుండేవి. కొండవీటి వేంకటకవి, గజ్జెల మల్లారెడ్డి, కొసరాజులు పాటలు రాస్తుండేవాళ్ళు. ఉపన్యాసాల రచన మల్లారెడ్డిది ఎక్కువభాగం – రాజకీయానుభవ మున్నవాడు కాబట్టి ఆయనకాపని అప్పగించారు. 1983లో రాష్ట్ర రాజకీయాలు మలుపు తిరిగాయి. తెలుగుదేశం అనూహ్య స్థాయిలో గెలిచింది. శాసనసభలో ప్రతిపక్షమైన కాంగ్రెసు విధానపరిషత్తులో సంఖ్యాధిక్యంలో ఉంది కాబట్టి గొడవలు జరుగుతుండేవి. ఆ సంవత్సరం జూన్ నెలలో ఆ సభలో ఆవేశకావేషాల మధ్య జరిగిన దుర్ఘటనలను పురస్కరించుకుని 'పెద్దల గలాభా' అనే శీర్షికతో ఈనాడు దినపత్రిక వార్త



ప్రచురించింది. అప్పటికే గజ్జెల మల్లారెడ్డి ఆంధ్రభూమి దినపత్రికకు ప్రధాన సంపాదకులుగా వెళ్ళారు. ఆంధ్రప్రభ సంపాదకులుగా పొత్తూరి వెంకటేశ్వరరావు గారుండేవారు. ఆ రెండింటిలో కూడా గలభా అనే మాట ఉంది. ఆ పత్రికల సంపాదకులు విచారం వెలిబుచ్చారు కాబట్టి వారి మీద ఏ చర్యా తీసుకొని విధానపరిషత్తు క్షమార్పణ చెప్పని రామోజీరావుగారి మీద ధ్వజమెత్తింది. ఎగువసభ అక్కరలేదని శాసనసభ తీర్మానించినా కేంద్రప్రభుత్వం పట్టించుకోలేదు. రాష్ట్రప్రభుత్వ చర్యను సమర్థించిన రామోజీరావుగారిని దండించాలనే నిర్ణయించుకున్నారు. విషయం సర్వోత్తమ న్యాయస్థాన పరిశీలనకు వెళ్ళినా కాంగ్రెసు వారు వేచి చూడటానికి సమ్మతించలేదు. ఆ సమయంలో ఇటువంటి సందర్భం ఉత్తరప్రదేశ్‌లో వచ్చినప్పుడు సుప్రీంకోర్టు విచారించి తీర్మానించిన వైనాన్ని అనువదించీ, తెలుగులో 'పెద్దలు, గలాభా' అనే మాటలకు భిన్ననిఘంటువులిచ్చిన అర్థాలనూ పూర్వం ఆంధ్రపత్రిక వంటి జాగ్రత్తగల పత్రికలోకూడా అటువంటి పదప్రయోగం జరిగిన విషయాన్నీ ప్రత్యేకంగా సేకరించి రచించిపెట్టాను.

ఆయేడు జూన్‌లో మహాకవి శ్రీశ్రీ అస్తమించినప్పుడు సంపాదకీయం రాయటానికి అనువైన వ్యక్తికోసం ఈనాడు అన్వేషణలో పడ్డది. రాంభట్ల, మల్లారెడ్డి గారలు ఈనాడు నుంచి తప్పుకున్నారు– ముందు వెనకలుగా. వెళ్ళేముందు మల్లారెడ్డి గారు 'పుణ్యభూమి'లో దాశరథి (కృష్ణమాచార్యుల) మీద ఘోరమైన విమర్శ రాసివెళ్ళాడు. పైపెచ్చు శ్రీధర్ ముఖ్యమంత్రి అంజయ్యగారినీ, దాశరథిగారినీ వెక్కిరిస్తూ వ్యంగ్య చిత్రం వేశాడు. కాబట్టి దాశరథిగారిచేత సంపాదకీయం రాయించే వీలులేదు. సినారే గారు రాసిస్తామని మాట ఇచ్చారు గాని మధ్యాహ్న సమయానిక్కూడా ఆయన వ్యాసం అందలేదు – ఆయన ఆచూకీ దొరకలేదు! అప్పుడు సినిమా సంబంధాల వల్ల పరిచితులైన వేటూరి సుందరరామమూర్తి గారు మద్రాసు నుంచి టెలిఫోన్లో చెప్తుంటే ఇక్కడ టేపురికార్డు చేసి కంపోజింగ్ మొదలుపెట్టారు. కొన్నిచోట్ల మూలం తెలియలేదు. మొత్తంమీద సంపాదకీయం సుదీర్ఘమయింది. దాన్ని కుదించటానికి నన్ను పిలిపించారు రామోజీరావు గారు. (నాకు శ్రీశ్రీని గురించిగాని, సాహిత్యం గురించిగానీ ఏమీ తెలియదనీ, నేనొక వైయాకరణ ఖసూచిననీ ఉప్పు నిప్పులు (రాంభట్ల మల్లారెడ్లకు అది జంటపేరు) ఎన్నో విధాల 1974 నుంచీ చెప్తుంటే బ్రాహ్మణుడూ నల్లమేకా సామెతగా నేను రాయటానికి పనికిరాననే విశ్వాసం కుదిరింది. ఈ విశ్వాసాన్ని గట్టిచేసిన మిత్రుల్లో రావూరి భరద్వాజగారు కూడా ఉన్నారు. అందుకు నేను విచారించకపోగా సంతోషించటానికి కారణముంది – ప్రభుత్వరంగ సంస్థలో ఉద్యోగం వెలిగించినందువల్ల ఫలానా పనిచేస్తే బాగుంటుం దన్నామో ప్రభుత్వంలోగాని, దానితో సంబంధమున్న సంస్థల్లోగాని చచ్చా మన్నమాటే. ముఫ్ఫుగా నీవే ఆ పని కూడా అదనంగా చెయ్యమంటారనేది పరమసత్యం). అందరికీ నేను కుదింపులకూ రంధ్రాన్వేషణ చేసి తప్పులు దిద్దటానికీ పనికివస్తానన్న నమ్మకముంది కాబట్టి ఈ పనికి నన్ను పిలిచారు. నా కర్తవ్యం నెరవేరే సమయానికి సాయంత్రం 6 గంటలు దాటింది. అప్పుడు నారాయణరెడ్డి గారు వేంచేసి లాల్చీ జేబులోంచి ఒక వ్యాసం తీసి ఇచ్చి "వీలైనంత త్వరలో అచ్చు వేయించం"డంటూ నిష్క్రమించాడు. ఆయనక్కూడా

చూపి సంపాదకీయాన్ని సవరించవచ్చు గదా అంటే "మీకీ విషయాలు తెలియవు. ఊరుకోండి. సంపాదకీయం రాసినా, వ్యాసం ప్రచురించినా ఇచ్చే ప్రతిఫలం ఒక్కటే. వ్యాసం కింద పేరుంటుంది. సంపాదకీయంలో రచయిత పేరుండదు. అందుకే ఆయన కావాలని ఆలస్యం చేశా"దని బోధపరిచారు. ఆ తరవాత 'పుణ్యభూమి' అనే శీర్షికను తన కోరిక మీద ఎవరారంభించారో (మొదట 'తుఘ్లక్' అనే కలం పేరుగల రచయిత – ఆయనెవరో నాకు తెలిసినా నేను బయట పెట్టను – తరవాత 'బలరాం' అనే కలం పేరుతో కొంతకాలం, సొంత పేరుతో ఉన్నంతకాలం రాసింది మల్లారెడ్డి గారు) వివరించి ఆ పని నన్ను చేయమన్నారు. "నేను మల్లకవిలా (అది మా వ్యవహారం) రాయలే"నంటే "మీలాగే రాయండి. రాజకీయాలు తెలియవని నాకు చెప్పకండి. వెక్కిరింతలూ, వేళాకోళాలు చేతకాదన్నా నమ్మను. ఉద్యోగంలో ఉన్నారు కాబట్టి కలం పేరు పెట్టుకోం"డన్నారు. "నేనేం చేయాలో స్పష్టంగా చెప్ప"మంటే "ధర్మోపన్యాసాలు" అన్నారు. అయితే "ధర్మారావు" అని పేరు పెట్టుకొంటానని అంగీకరించి ఆ పని ఆరంభించాను. నేను 'సి.ధర్మారా'వనే పేరుతో రాస్తూ మిత్రుణ్ణి చిక్కుల్లో పెట్టానని భాషించినవారూ, దూషించిన వారూ ఉన్నారు. చిత్రమేమంటే అలా నమ్మిన పెద్దలక్కూడా పత్రికా రంగంలో భాషాసాహిత్యాల్లో (చిత్రసీమలోనూ) ప్రసిద్ధులైన తాపీ ధర్మారావు గారిపేరు స్ఫురించకపోవటం. పాపం శమించుగాక! కాలంమారి, అధికారంలోనో పదవిలోనో లేని వారిని తలుచుకొనేవాళ్ళుకూడా అంతరిస్తున్నా రన్నమాట.

1980–84 మధ్యకాలంలోని అనుభవాలు జీవితాంతం గుర్తుండేవి. వాటిలో కొన్ని ఎంత సంతోషప్రదాలో మరికొన్ని అంత బాధాకరాలు. కష్టసుఖాలు కావడికుండలనే సామెత అనేక విధాలుగా నా అనుభవంలోకి వచ్చిందాకాలంలో. సుఖాలను మరిచిపోగలం – కష్టాలు మరుపురావు. మొగపిల్లల్లో పెద్దవాళ్ళిద్దరూ చెరో వృత్తి విద్యలో ఉత్తీర్ణులైనారు. పెద్దవాడు వైద్యవృత్తిలో ప్రవేశిస్తే, రెండోవాడు ఇంజనీరై ఉన్నత విద్యకోసం అమెరికా వెళ్ళాడు. అప్పుడు డాలరు ఏడున్నర రూపాయలు మాత్రమే. ఇప్పటి సంగతి అందరికీ తెలుసుకాబట్టి ప్రస్తావించనక్కరలేదు. ఏక పుత్రిక పిహెచ్.డి. పూర్తిచేయబోతున్నది. సంసారం ఒడ్డునపడుతున్నదని సంతోషిస్తున్నప్పుడు ఉద్యోగం సంక్షోభంలో ప్రవేశిస్తున్నది. తంజావూరులో స్థాపించిన తమిళ విశ్వవిద్యాలయం ప్రారంభోత్సవానికి వెళ్ళి దేశభాషల్లో పరిభాషా కల్పన గురించి ప్రసంగించే అవకాశం కలిగింది. నేనొక్కణ్ణే ఇంగ్లీషులో మాట్లాడినవాణ్ణి. అక్కడ సరస్వతీమహల్ గ్రంథాలయం ఏ దుస్థితికి వచ్చిందో తెలుగు విషయంలో, తమిళ విషయంలో ఎలాంటి మహర్దశ నందుకుంటున్నదో చూశాను. అక్కడే ఒకప్పటి ఇలస్ట్రేటెడ్ వీక్లీ సంపాదకులైన ఎ.ఎస్.రామంగారితో రెండు రోజులు గడిపాను. ఉభయులకూ అబ్బూరివారి కుటుంబంతో ఉన్న అనుబంధం పరస్పరాకర్షణ పెంచింది. వెలాతెలాపోతున్న బృహదీశ్వరాలయం శ్రీకాళహస్తీశ్వరుడి దేవాలయాన్ని గుర్తుకు తెచ్చింది. తిరువాయూర్‌లోని త్యాగరాజు సమాధి దగ్గరకు పోయినప్పుడు మా పెద్దలను గుర్తు పెట్టుకున్న బాపట్లవాసి అయిన సాధువును కలిసి ఆశ్చర్యపడ్డాను. హైదరాబాదుకు తిరిగి వచ్చిన కొద్ది రోజుల్లోనే విచిత్ర పరిస్థితు లెదురైనాయి.



**వేధింపులు, బాధలు**

అకాడమి ఏలిక మారారు. ఘట్టమనేని గోపాలకృష్ణన్ అనే పరమాద్భుత పాలకుడు అంతకు ముందున్న సౌమ్యప్రభువు మనోహరరావుగారి స్థానంలో ప్రవేశించారు. రాగానే ఉద్యోగుల పుట్టుపూర్వోత్తరాలను పరిశోధించి తెలుసుకున్నాడు. ఈనాడుతో నాకు మంచి సంబంధాలున్నాయని, అక్కడి సంపాదకవర్గంలోని రాంభట్ల మల్లారెడ్లు నాకు అత్యంత సన్నిహితులనీ తాళ్ళూరి నాగేశ్వరరావుగారి ద్వారా తెలుసుకున్నాడు. నన్ను పిలిచి ఆకాశాని కెత్తాడు. రామోజీ రావుగారిని కీర్తించాడు. పనిలో పనిగా అప్పటి డి.పి.ఐ. రామచంద్రన్ (ఆయన ఈయనకు సహాధ్యాయులు కూడా) అసమర్థుడని దూషించాడు. విద్యాశాఖ అభివృద్ధి చెందాలంటే డైరెక్టర్ జనరల్ ఆఫ్ ఎడ్యుకేషన్ అనే పదవి ఎంత అవసరమో చెప్పాడు. ఆ పదవికి తానెంత తగినవాడో ఇతరులెంత తగరో విశదీకరించాడు. ఈనాడులో తన వాదాన్ని సంపాదకీయంగా ప్రచురిస్తే తెలుగుదేశం ప్రభుత్వం అమలుజరిపి తీరుతుందన్నాడు. ఆ సంపాదకులతో తనకు పరిచయం కల్పించమని అనునిత్యం నాలుగయిదు గంటలు పోరగా పోరగా వారిని సంధానించక తప్పలేదు. అలౌక్యుడైన రాంభట్ల ఇలాంటి పదవులవల్ల జరిగే లోకకళ్యాణ మేమీలేదని నిర్మొహమాటంగా చెప్పాడు ఆయన మొహంమీదే. ఎంత చెడ్డా రాజకీయానుభవం, కొంత నాయకత్వ లక్షణం ఉన్నవాడు కాబట్టి మల్లారెడ్డి సరైన సమయంలో సంపాదకీయం రాస్తానని ఆశపెట్టాడే గాని, దరిమిలా దొరకనే లేదాయనకు! నా మెడకు చుట్టుకొంది ఏలినవారి సమున్నతోద్యోగ సంపాదన పాశం. రామోజీరావు గారిని కలిసి మాట్లాడండని అందుకవకాశం కల్పించాను. వారిదగ్గర వీరేం చెప్పుకున్నారో నాకు తెలియదు. తెలుసుకోవాలనీ అనుకోలేదు. కొద్దికాలం తరవాత సతీనాయర్ అనే మలయాళీని విద్యాశాఖలో సహాయ కార్యదర్శినిగా నియమించారు. ఆక్స్‌ఫర్డ్ నిఘంటువు తెలుగు అనువాదం సంగతి రచ్చకెక్కి శాసనసభలో ప్రశ్నలకు దారితీసింది. జరిగిందేమిటో రాయమంటే రాసి సమర్పించాను. సతీనాయర్ గారి సంతకం కావాలిట సభకు మంత్రిగారు సమాధానం సమర్పించేందుకు. నేను మొదటినుంచీ లేను కాబట్టి సంతకం పెట్టనని, నన్ను ఆ పని చేయమన్నాడు. చేశాను. కానీ ఆమెగా రంగీకరించలేదు. కొంత గొడవ తరవాత తానూ సంతకం పెట్టి వచ్చాడాయన. తా ననుకున్న పదవి పుట్టకపోగా డి.పి.ఐ.గా ఆమెనే నియమిస్తున్నారన్న పుకారు పుట్టింది. నన్ను పిలిచి నీనిర్వాక మిలా తగలడిందని మండిపడ్డాడు. తక్షణం మూటాముల్లే కట్టుకొని డిప్యూటీ డైరెక్టర్లు ముగ్గురూ దక్షిణభారత పర్యటనచేసి ఆయా రాష్ట్రాల్లో ప్రాంతీయ భాషాభివృద్ధికి ఏమేం జరిగిందో, జరుగుతున్నదో నివేదిక సమర్పించమన్నాడు పదిహేను రోజుల్లో. దాన్ని తాను స్వయంగా ముఖ్యమంత్రిగారికి సమర్పించి తెలుగును అత్యున్నత స్థితికి తెస్తానన్నాడు. మేం బయలుదేరక తప్పిందికాదు. మేం పర్యటిస్తున్నామో లేదో స్వయంగా పరిశీలించడానికి ఆయనా బయలుదేరాడు. మొదటి అంచెలో మేం నలుగురం కార్యాలయ వాహనంలో బయలుదేరాం. ఆయన మధ్యమధ్య స్వస్థలాదులను సందర్శించి మళ్ళీ వచ్చి కలుస్తుండేవాడు.

దురదృష్టాన్ని ఎవరూ జయించలేరు. తిరుపతిలో విశ్వవిద్యాలయంవారి వసతిగృహంలో

దిగాం. అక్కడ మా ప్రభువుగారి పూర్వసహాధ్యాయి జి.ఎన్.రెడ్డిగారు తటస్థపడ్డారు. వారిద్దరూ చాలాసేపు తమిళంలో సంభాషించిన మీదట ఇంటికిపోతున్న రెడ్డిగారి కంటబడ్డాం మేము. అప్పట్లో ఆయన నూతన గృహప్రవేశం చేశాడు. మాతో ఆయనకు పూర్వపరిచయ ముంది. మమ్మల్ని స్వయంగా తీసుకపోయి తన ఇల్లు చూపి తెస్తానన్నాడు. పావుగంటలో అలా చేయమనీ, మేం చాలా బోలెడు తొందరగా శ్రీకాళహస్తి చేరాలనీ అన్నాడు మా ఏలిక. (ఆయన 'ఘగో' అని తెలుగులో సంతకంపెట్టేవాడు. అదే మా వంటి సేవకుల వ్యవహారంలో ఆయన సంక్షిప్తనామ ధేయం). ఎంత పరుగులు తీసినా మా దౌర్భాగ్యంవల్ల చంద్రగిరి దారిలో రైలుగేటుపడింది. రెడ్డి గారు అంటూనే ఉన్నాడు మనవాడు వీరాంగ మేస్తాడని. అదే జరిగింది. అక్కడికే వచ్చిన ఘగో గారు మమ్మల్ని అక్కడినుంచే తిట్టడం మొదలుపెట్టాడు. శస్త్రచికిత్స జరిగి సరిగా నడవలేని తాళ్ళూరి నాగేశ్వరరావును మరీ వేధించాడు. అలా పర్యటించి తిరుత్తణి వెళ్ళక తప్పదన్నాడు. అక్కడి రైలుగేటుపడి నలభై నిమిషాలు ప్రయాణం స్తంభించింది. పరుగులమీద రేణిగుంటచేరి అక్కడి విమానాశ్రయం దగ్గర తనను దింపి మిగిలిన పర్యటన మమ్మల్ని చేయమన్నాడు. మేం ఆయన్ను దించి బతుకుజీవుడా అని పారిపోయాం. విమానం రద్దయింది. ఆయన నానా అవస్థలూ పడి రేణిగుంట చేరి రిజర్వేషన్ లేని పెట్టెలో మరో విద్యాశాఖోద్యోగిని ఇచ్చిన అరువు సొమ్ముతో ప్రయాణించక తప్పిందికాదు. అదంతా ఆయన స్వయంకృతం. నిష్కారణంగా దూషణ లకు గురైన విచారంలో రాసుకున్న పద్యాల్లో ఇదొకటి:

**తిరుపతి రైలుగేటుకడ తిట్టి, తిరుత్తణి రైలుగేటు ద**
**గ్గర తన నోరుమూసి, పడిగాపులు గాసియు, రేణిగుంటలో**
**గరితలవద్ద ముష్టిగొని, కాళ్ళు వడంకగ గాంధి క్లాసులో**
**నరమరలేక నిల్చిన ప్రయాణ మెరుంగు ఘగో స్వభావమున్.**

ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖ హోల్‌మొత్తంలో ఆయన్ను గురించి మంచిగా చెప్పిన వాళ్ళను చూడలేదు. నాటి డి.పి.ఐ. రామచంద్రన్ గారిని గురించి చెడుగా చెప్పిన వారినీ ఎరగం. పైపెచ్చు 'పెద్దాయన' అని బంట్రోతునుంచి జాయింట్ డైరెక్టరుదాకా రామచంద్రన్ గారి పేరెత్తకుండా గౌరవించేవాళ్ళు. ఎవరికి వారు వాకబుచేసి నిజానిజాలు తెలుసుకోవచ్చు. ఇది గడిచిన వారానికి మేం తిరిగివచ్చి "నివేదికను విషయక్రమంలో రాయమంటారా? కాలక్రమం లో రాయమంటారా?" అని అడిగాం. 'మీ ఇష్టం వచ్చినట్లు తగలబెట్టం' దని సుకుమారంగా చెప్పాడు. తరవాత రోజుకు కనీసం ఒక్కటి చొప్పున 287 మెమోలు నాకు పంపాడు – తక్షణ సమాధానం అపేక్షిస్తూ. నేను ఆయన పంపిన కాగితం మీదనే ప్రత్యుత్తరం రాస్తే అదో నేర మయింది. చివరకు ప్రాణం విసిగి "ఈ డైరెక్టరును తొలగించకపోతే నేను కోర్టుకెక్కి పోరాడు తాను – ఉద్యోగం తీసివేసినా సరే" నని విద్యామంత్రికే రిజిష్టర్డు నోటీసు పంపాను – నిండా ముని గిన వాడికి చలేమిటని. నా ఇంక్రిమెంట్లు ఆపాలని ఆదేశాలు జారీచేశాడు! పాపం. అజ్ఞానం. నాకప్పటికి మిగిలిన ఇంక్రిమెం ట్లేమీ లేవు! మొత్తంమీద ఆయన రాజ్య మొక పీడకలగా మిగిలింది. నాకు తక్షణ ప్రమాదం జరగలేదు.



ఆక్స్‌ఫర్డ్ ఇంగ్లీషు నిఘంటువు తెలుగు అనువాదం సంగతి ఒకటి రెండుసార్లు ప్రస్తావించాను గదా. దాన్ని మొదట సరిచూస్తాను తెప్పించండన్న వారు పింగళివారు. వారు కన్నుమూస్తే వారి స్థానంలో విద్యావిషయక స్థాయీ సంఘాధ్యక్షులైన గంటి జోగి సోమయాజులు గారు తాము ఆ పని 'ఉచితంగా' చేస్తామన్నారు (అప్పటికి సి.ఎస్.టి.టి. ఛైర్మన్ పదవినుంచి ఆయన విముక్తుడైనాడు. ఆ వివరాలు మన కనవసరం). సరేనన్నారు ఛైర్మనైన పి.వి.గారు. పరి పాలనదృష్ట్యా నా పెత్తనంలో అఘోరించే పరిశోధనశాఖ వారు పర్యవేక్షించవలసిన విషయమది. మా పరమగురువు సమాధానం చెప్పేవాడు కాదు. పాలకమండలిలో భయంకర చర్చలు జరి గాయి. కరపత్రాలు వెలిశాయి. శాసనసభలో విధాన పరిషత్తులో ప్రశ్నలు వచ్చాయి. పి.వి.గారు ఎప్పటికి పూర్తవుతుందో, ఎంత పని. మిగిలిందో చెప్పమని అడిగితే "తమరు పెద్దలు తమరే మని చెప్పమంటే అలాగే చెప్తా" నన్నా డాయన! ఏంచేయాలో జుట్టుపీక్కున్నా తేలక, చివరికి ఆ వ్యవహారాన్ని అటకెక్కించామన్నారు. ఆ దెబ్బ కొంద రుద్యోగులకు తగిలి విలవిల్లాడారు. కొంత కాలం తరవాత పద్మవిభూషణ్ మోటూరి సత్యనారాయణగారు విద్యావిషయక సంఘాధ్యక్షులై నారు. వారు ఆలోచించి పదిమందికి పని పంచి పూర్తిచేయించాలన్నారు – తలా పదివేల రూపాయలిచ్చి. అందుకు నియుక్తులైన కొందరికి ఇంగ్లీషు భాషలో అంతఃప్రవేశంలేదు. Traveller's Joy అనేది ఒక తీగపేరని మూలంలో ఉంటే కవితా ధోరణిలో 'యాత్రోత్సాహ'మని అనువదించారు! కొన్ని మాటలు మింగారు. కొన్ని మరిచారు. కొన్ని మార్చారు. మొత్తంమీద ఏదో రూపంలో ఆ బృహన్నిఘంటువు వెలుగుచూసింది. విమర్శలు చీకట్లు సృష్టించాయి.

మోటూరి వారే మరో మంచి ఆలోచన చేశారు. ఆధునిక శాస్త్ర విజ్ఞానాన్ని అందించే Random House English Dictionary (Unabridged) ని తెలుగులో పెట్టాలన్నారు. పాలకమండలి తీర్మానించింది – ఆ పని నేనో సంవత్సర కాలంలో మరొకసారి సాయం తీసుకొని పూర్తిచేయాలని! ఉత్తరువేగాని చర్చ ఏమిటో, ఎలా ఇలా నిర్ణయించారో నాకు తెలియదు. సాధ్యం కాదన్నాను. అప్పటి విద్యాశాఖ కార్యదర్శి మామిడిపూడి గోపాలకృష్ణగారికి నా మీద కోపం వచ్చింది. ఆదేశాన్ని అమలుజరపలే నన్నందుకు ఏ శిక్ష విధించాలో మీరే నివేదించండని నిల దీశాడు. ముందే ఎందుకు చెప్పలేదన్నాడు. నా ఉద్యోగం తుమ్మకుండానే ఊడేదని బోధపడ్డది. తెగబడి చెప్పాను. మన ప్రభుత్వం వారి అధీనంలో ఉన్న ముద్రణ యంత్రాలన్నీ, ముద్రణ శాఖ మొత్తం నూరు జన్మలెత్తయినా ఈ మూల నిఘంటువును కంపోజ్‌చేసి ఒక సంవత్సరంలోగా ప్రచురించలేదన్నాను. అందులో పేర్కొన్న అనేక శాఖోపశాఖల విజ్ఞానాల పేర్లు కూడా నాకు తెలియవన్నాను. ఆ నిఘంటువులో ఇచ్చిన నిర్వచనాన్ని కనీసం నలభై మంది నోబెల్ బహుమతి గ్రహీతలచేత సరిచూపించారు – నాకు, నా పవిత్రదేశంలో– ఒక్క నోబెల్ పురస్కార గ్రహీతకూడా అందుబాటులో లేడన్నాను. మీ చిత్తం వచ్చిన శిక్ష విధించమన్నాను. చివరకు ఉద్యోగంపోయినా సర్వోత్తమ న్యాయస్థానందాకా పోయి పోరాడి తీర్తానన్నాను. విన్న తరవాత మొదట ఎంత మండిపడ్డాడో అంత చల్లబడి "ఎందు కసాధ్యమో మరింత వివరంగా రాసివ్వండి. ఆ నివేదికను ఆమోదించి తీర్మానిస్తా" మన్నాడు!

ఇలాంటి కష్టాల్లో అన్నింటికన్నా ప్రమాదకరమూ అప్రతిష్ఠాకరమూ అయినది తెలుగు శబ్దసాగరం అనే మహానిఘంటు నిర్మాణం చేపట్టాలనే నిర్ణయం. హిందీలో శబ్దసాగర్ ఉంది కాబట్టి తెలుగులో కనీసం సాగరం ఉండక తప్ప దనుకున్నారన్నమాట. ఆ నిఘంటువు నెలా నిర్మించాలో బోధించి మాకు జ్ఞానోదయం కల్పించడానికి ఓ సలహాసంఘం ఏర్పడింది. మొదటి దఫా సలహా సంఘానికి అధ్యక్షులు దేవులపల్లి రామానుజరావు గారు – ఆయన మా పాలక మండలిలో తెలుగు అకాడమి పుట్టినప్పటినుంచి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి మూతపడే దాకా బెజవాడ గోపాలరెడ్డిగారి ప్రతినిధిగా శాశ్వత సభ్యత్వంలో ఉన్నవారు. నిఘంటు నిర్మాణా నికి ఏనాడూ అయిదుగురు ఉద్యోగులు పనిచేయలేదు. వారి అభిరుచులూ, శక్తిసామర్థ్యాలూ ఎవరూ పరిగణనలోకి తీసుకోలేదు. వారిని పాఠ్యగ్రంథ ప్రచురణ కార్యక్రమంలోకి సాలుకు రెండుసార్లయినా బదిలీ చేయడం మానలేదు. సలహాసంఘ సభ్యుల్లో కనీసం సగంమందికి పైగా ఇంగ్లీషులోగాని, ఇతరభాషల్లోగాని మహానిఘంటు నిర్మాణం ఎంతకాలం తీసుకుందో, ఎంత ఖర్చుచేయవలసి ఉంటుందో, ఎందరి సేవ లవసరమైనాయో కనీసం సిద్ధాంత గ్రంథాలనుంచి గాని పరిచయ పత్రాలద్వారాగాని తెలుసుకున్నవాళ్ళు కాదు. మూడువంతుల మంది చిన్న నిఘంటువులనైనా నిర్మించిన వాళ్ళుకాదు. కన్నడం, మలయాళం, హిందీవంటి భాషల్లో బహు కాలం నిఘంటు నిర్మాణంలో పనిచేసిన సూరనాడ్ కుంజన్ పిళ్ళై, శివరామ కారంత్, హరదేవ్ బాహరీ, జి.వెంకటసుబ్బయ్య, బి.సి.బాలకృష్ణన్‌వంటి పండితప్రకాండుల పేర్లయినా విన్నవాళ్ళు కాదు. అయితేనేం? చేయడంకన్నా చెప్పడం తేలిక కాబట్టి, ప్రశ్నించే అధికారం పనివాళ్ళకు లేదుకాబట్టి, ఉద్యోగులను నిందించి, వెక్కిరించి అధికారుల అభిమానం చూరగొనగలిగిన నైపుణ్యాదు లున్న వాళ్ళే. అందువల్లనే ఆ నిఘంటువు పురిట్లోనే సంధికొట్టినట్లో, మృతశిశువు గానో వెలువడవలసిందే. ఇటీవల – ఈ గ్రంథ రచనాకాలంలో – ఆపేరుగూడా తొలగించి, కేవలం ‘తెలుగు–తెలుగు నిఘంటు’వనే పేరిట ఒక నిఘంటువు బయటపడ్డది – గండం గడిచి పిండం బయటపడ్డట్టు. బీరువాలకెత్తిన నిఘంటు సమాచారాన్ని బీరువాలతోసహా అంతర్ధానం చేసిన మహాధికారులను నివాళించక తప్పదు!

ఆరేదీపం వెలిగినట్లు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి అంతరించేముందు ఎన్నికలు జరిపారు – లేదా జరిగాయి. అధికారవర్గం ఆశీస్సులు లేకపోయినా తెన్నేటి హేమలత, పేర్వారం జగన్నాథం వంటివారు పోటీచేసి గెలిచారు. అయితేనేం! నార్లవారి సిఫారసు నచ్చి నందమూరి తారకరామారావుగారు సదరు అకాడమిని మూసివేశారు. అప్పటినుంచీ తక్కిన అకాడమీలు మూతపడనందుకు దేవులపల్లివారు పడ్డ మానసికక్షోభ పగవాళ్ళక్కూడా వద్దనుకోదగ్గది. ఆయన కోరిక కొంతవరకైనా ఫలించి మరికొన్ని మూతపడి తెలుగువిశ్వవిద్యాలయంగా కొత్త రూపంలో అవతరించాయి. విశ్వవిద్యాలయంలోనే లయ మనేమాట ఉందని విశ్వకళాపరిషత్తుగా పేరు మార్పించిన కట్టమంచి రామలింగారెడ్డి వంటి వాళ్ళిప్పుడు లేరు. ఒకవేళ ఉన్నా కాలప్రవాహంలో కొట్టుకుపోయేవారు – నిష్క్రియు లనిపించుకొని. తెలుగుజాతికున్న భాషాభిమానం, సాంస్కృతిక పరిరక్షణభావం రూపాంతరం పొంది తెలుగుచలనచిత్రాల్లో దర్శనమిస్తున్న తరవాత పూర్వరూపా



లతో నిజానికి ఎవరికీ అవసరంలేదు. తెలుగువర్ధిల్లాలి అంటే తెలుగుపేరిట రాజకీయార్థికావ కాశాలు వర్ధిల్లాలని అర్థం. తర్కరీత్యా పరమాణు పర్యంతం నశిస్తేనేగాని పునస్సృష్టి జరగదు. నాశం కోరదగ్గదికాదు. కాబట్టి పునర్నిర్మాణావకాశాలు రాకపోవచ్చు – తర్కం ప్రకారం. ‘ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః’ అనుకోవడం మేలు.

**రెండున్నర మహత్తర సంస్కరణలు**

ఎన్టీఆర్ రాజ్యాధికారానికి వచ్చిన తరవాత సాంస్కృతిక రంగమనేదానికి ప్రత్యేకంగా అస్తిత్వ మెందు కనిపించినట్లుంది. మూర్తీభవించిన భారతీయసంస్కృతి ఆయనే కాబట్టి అలాగనిపించి ఉండాలి అభిమానులకు. ఆయన పాలన మొదట్లోనే రెండున్నర మహత్తర సంస్క రణలు జరిగాయి. మొదటిది నార్ల వేంకటేశ్వరరావు గారి ఏకసభ్య విచారణ సంఘం సిఫారసు ప్రకారం ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమిని మూసివేయటం. రెండోది ఆంధ్రజాతికి సంబంధిం చిన సమస్తకళారూపాలనూ ఏకముఖంగా ఉద్ధరించటానికి తెలుగు విశ్వవిద్యాలయం స్థాపించా లనుకోవటం. అందుకో పెద్ద సంఘాన్ని నియమించారు న్యాయమూర్తి ఆవుల సాంబశివరావు గారి అధ్యక్షతన. ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులైన జి.రామిరెడ్డి గారు దానికి ఉపాధ్యక్షులు. తెలుగు అకాడమి సంచాలకులుగా నియమితులైన పరిపాలనానుభవం గల మహావిద్వాంసులు కొండలరావుగారు సభ్యకార్యదర్శి ఆ సంఘానికి (అంటే మావంటి పరిచార కులు సేవలందిస్తే వారు పెద్ద సంతకం పెట్టారన్నమాట). సదరు సంఘం కొంతకాలం పనిచేసిన తరవాత అధ్యక్షుల వారిక్కూడా తెలియకుండా తూమాటి దొణప్పగారిని ప్రత్యేకాధికారిగా నియ మించారు. (ఆయన మత్స్య పరిశ్రమకు సంబంధించిన మాండలిక వృత్తి పదకోశం నిర్మించారని సాక్షాత్తు ముఖ్యమంత్రిగారే సెలవిచ్చారు గాని అది ఈ రచనాకాలానిక్కూడా వెలుగు చూడ లేదు!). దరిమిలా సమస్త శుభలక్షణ శోభితమైన తెలుగు విశ్వవిద్యాలయం అవతరించి కళా భవన్‌లో కొలువుతీరింది. ఆ సందర్భంలో నాటి విద్యామంత్రిగారి సమక్షంలో– తెలుగు అకాడమి బడ్జెట్ సమావేశంలో – అది మార్చి 31న జరిగింది సాయంత్రంవేళ – తెలుగు విశ్వవిద్యా లయంలో అకాడమిని విలీనం చేయాలనే ప్రతిపాదన చేశారు సభ్యుల్లో ఒకరైన సింగిరెడ్డి (సత్య) నారాయణ రెడ్డిగారు. డైరెక్టరంటూ ఒకరు వేరే ఉన్నా తొలినాటినుంచీ వెట్టి చేస్తున్న నేనే ప్రత్యుత్తరం చెప్పాలన్నారు పెద్దలందరూ. తెలుగు విశ్వవిద్యాలయ స్థాపనార్థం నియమించిన సంఘం ముందు అంతకు ముందే నేను సాక్ష్యమిచ్చాననీ కేంద్రప్రభుత్వనిధులతో స్థాపించిన సంస్థను, దాని మూలధనంతోబాటు మరోకొత్త సంస్థలో కలిపివేయటం న్యాయసమ్మతమో కాదో ప్రధాన న్యాయమూర్తిగా వ్యవహరించిన పెద్దలు తమరే నిర్ణయించాలని ఆవుల వారికి విన్న వించాననీ మనవి చేశాను. వారి నివేదికలో ఏముందని నన్ను నిలదీశారు. “నేను ఆ సంఘంలో సభ్యుణ్ణికాను. ఆ నివేదికలో ఏముందో నాకు తెలియ”దన్నాను. (నిజానికి సదరు నివేదిక నా గదిలో సిద్ధమైంది. అయితే అదంతా లోపాయకారీ వ్యవహారం కిందకే వస్తుందిగాని అధికారికం కాదు). సినారేగారు “విద్యామంత్రిగారు మీ సంస్థను విలీనం చెయ్యాలనుకుంటున్నారు. మీ అభ్యంతరమే”మని నన్ను రెట్టించారు. అప్పుడు పూర్వాశ్రమంలో నేను చదివిన, విన్న శాస్త్ర

విషయాలను విధిలేక ప్రస్తావించవలసి వచ్చింది. “విద్యామంత్రి గారు అకాడమి అధ్యక్షులు. మీరందరూ పాలకవర్గ సభ్యులు. నే నుద్యోగిమాత్రుణ్ణి. నా అభిప్రాయాలకు విలువలేదు. కానీ ఒకటి గుర్తించండి. తెలుగు విశ్వవిద్యాలయానికి గవర్నరు గాక సాక్షాత్తూ ముఖ్యమంత్రిగారే అధ్యక్షులు. పార్టీప్రజాస్వామ్యం అమల్లో ఉన్న దేశంలో ప్రజాప్రతినిధు లెన్నుకున్న ముఖ్యమంత్రి ఒక్కరే ప్రభుత్వం. మంత్రులు కారు. కార్యదర్శులు రాష్ట్రపతి పాలనలో మాత్రం ప్రభుత్వం అవుతారు. సదరు ముఖ్యమంత్రి గారు కలిపివేయాలని నిర్ణయిస్తే, దానికి తిరుగులేదు. అది కుదరదనుకుంటే మంత్రిగా రంగీకరించినా, పాలకమండలి తీర్మానించినా జరిగేదేమీ లేదు. మంత్రి గారికీ ముఖ్యమంత్రిగారికీ సన్నిహితులైన సినారేగారు వారితో సంప్రదించి వారి అభిప్రాయం ప్రకారం ఏం చేయాలో అది చేయించవచ్చు. ఇందులో నా ఇష్టానిష్టాలకు అస్తిత్వంలే”దని తెగేసి చెప్పాను.

ఆ తరవాత బడ్జెటు కేటాయింపుల ప్రసంగం వచ్చింది. నామమాత్రంగా నా ఆధిపత్యంలో ఉన్న పరిశోధన శాఖ ఎన్నెన్ని శాస్త్రాలకు పరిభాషను సిద్ధంచేసిందో చెప్పమన్నారు. చెప్తే న్యాయశాస్త్రానికి ఎందుకు సిద్ధం చేయలేదని కోపగించారు. తెలుగు అకాడమివంటి ప్రాంతీయ భాషా సంస్థల ఆవిర్భావానికి కారణమైన సి.ఎస్.టి.టి. వారూ కేంద్ర ప్రభుత్వం వారూ “న్యాయ శాస్త్రం మినహా” అని తాము విధించిన షరతుల్లో పేర్కొన్నందున మేమాజోలికి పోలేదన్నాను. “ఆ విషయంలో అనుమతికోసం ప్రయత్నించారా? ఎప్పుడు? అనుమతి కోరకపోతే ఎందుకు కోరలే”దని మంత్రిగారు నిలదీశారు. కొండమీది నుంచి పడ్డ వాడికి బొప్పులెన్ని అనే సామెత ఉంది. చెడ్డ చేనికి మంచెలెన్ని అనేదీ విన్న సామెతే. ఈ పెద్దలేదో నిర్ణయించుకొని నా మీద దండయాత్రకు సిద్ధమైనట్లుంది కాబట్టి వెన్నుచూపి పారిపోయేకన్నా పోరాడి వీరస్వర్గ ముంటే దాన్ని సాధించాలని నిర్ణయించుకున్నాను. అధికార భాషాచట్టాన్ని కేంద్రంలో పార్లమెంటూ, రాష్ట్రంలో శాసనసభ విభిన్న కాలాల్లో ఆమోదించినప్పుడుగాని, తెలుగును అధికారభాషగా అభివృద్ధి చేయటంకోసం ప్రత్యేకించి అధికారభాషా సంఘాన్ని స్థాపించినప్పుడుగాని, న్యాయపరిభాషను తెలుగు అకాడమి సిద్ధం చేయాలనకపోగా ఆ వ్యవహారాన్ని అధికారభాషాసంఘానికి అప్పగించారు. సదరు సంఘానికి అధ్యక్షులైన సినారేగారు చేయవలసిన పని నేను చేయనక్కరలేదు” అంటే “ఆ పని మీకు బదలాయించవచ్చుగదా” అని ఉస్మానియా విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు నవనీతరావు గారు వ్యాఖ్యానించారు. “తెలుగులో పరిభాష సిద్ధంగా లేనందువల్ల, మీకు తెలియనందువల్ల ఇంగ్లీషులో విన్నవిస్తున్నాను. 'A power once delegated cannot be redelegated' అనేది న్యాయశాస్త్రంలోని మౌలిక భావనల్లో ఒకటి. ఇక్కడే ఉన్న న్యాయశాఖా కార్యదర్శిగారు నా వాదం సక్రమమో కాదో నిర్ణయించటం మంచి”దన్నాను. ఆయన నన్ను సమర్థించారు. అప్పటికే ఉపన్యాసాల సమయం మించిపోతున్నది. కాబట్టి సమావేశాన్ని వాయిదా వేద్దామన్నారు. “మార్చి 31న ఆమోదం పొందకపోతే బడ్జెటును రేపు చర్చించవచ్చా” అని నేనే తెగబడి అడిగాను. ఎవరూ మాట్లాడలేదు. లేచారు. నేనూ లేచాను. తెలుగువిశ్వ విద్యాలయ స్థాపనకు సంబంధించిన నివేదికను తెల్లవారు జామున ముఖ్యమంత్రిగారికి సమర్పించమంటే



న్యాయమూర్తి ఆవుల సాంబశివరావు గారు అలా చేయలేదు. ఉపాధ్యక్షులవారు ఆ పని చేశారు – ప్రత్యేకాధికారితో కలిసి. తీరా ఆమహాసంస్థ స్థాపనోత్సవసమారోహం పెద్ద యెత్తున జరిగినప్పుడు, ప్రారంభోపన్యాసం ముఖ్యమంత్రి, ప్రధానోపన్యాసం మాజీ రాష్ట్రపతి నీలం సంజీవరెడ్డి గారలు చేసిన తరవాత వేదికమీద ఆవుల వారు లేరని గుర్తించి ఆహ్వానించారు! అంతదాకా నా పక్కన కూర్చున్న ఆయన చరచరా వేదికనెక్కి “ఆంధ్రభాషా సాహిత్య సంస్కృతుల అభివృద్ధికోసం ఎవ రేంచేసినా నేను హర్షిస్తా”నని ఒకే ఒక్క వాక్యం చెప్పి కిందికి దిగివచ్చారు! ప్రధాన న్యాయమూర్తిగా, లోక్ ఆయుక్తగా, విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులుగా వ్యవహరించిన ఒక సుప్రసిద్ధ వ్యక్తిని ఇంతగా గౌరవించగలిగిన మనవాళ్ళ రాజకీయ సంస్కారాన్ని కీర్తించటానికి వేనోళ్ళు చాలవు. బహుశా అందుకే ఆదిశేషుడో అనంతుడో నోరు విప్పలేదు!

ఇంతకు ముందు రెండున్నర మహత్తర విషయాలని రెండే ప్రస్తావించాను కదూ. అర సంగతికి వస్తాను. మల్లంపల్లి వారి రేడియో ప్రసంగాలు తప్ప ఆంధ్రజాతి ఆవిర్భావ రాజకీయ పరిణామాలను స్థూలంగానైనా వివరించిన మరోగ్రంథం లేదు. సమగ్ర చరిత్ర రాయించాలని మాదాటి రామప్పగారి ఆధిపత్యంలో ఉన్న అంతర్జాతీయ తెలుగుసంస్థ కొంత ప్రయత్నించింది. విద్వాంసులను పిలిచి వారికి సొమ్మిచ్చి, వసతులు కల్పించింది గాని జరిగిందేమీ లేదు. తెలుగు తేజం వెలిగిపొయ్యే రోజులు మళ్ళీ వచ్చాయి కాబట్టి, ఆ పని తెలుగు అకాడమి చేయిస్తే ఎలాగుంటుందనే ప్రశ్న వచ్చింది. ముఖ్యమంత్రి దృష్టిలో పడటానికి ఇది మంచి ఎత్తుగడ అనిపించింది. సమస్త విశ్వవిద్యాలయాల్లోని చరిత్రాచార్యులనూ ఆహ్వానించాం. సంబంధమున్న ప్రభుత్వాధికారులనూ సమావేశపరిచాం. రెండు రోజులు ఊపిరాడకుండా జరిగిన చర్చల్లో ఆంధ్రజాతికి సంబంధించి సమస్త రంగాల్లోనూ చరిత్ర పూర్వయుగం నుంచి 20వ శతాబ్దిదాకా తెలిసిన విషయాలన్నిటినీ క్రోడీకరించాలనీ, నిర్దిష్ట కాలంలో దేశంలోని ఏ ప్రాంతంలో ఏ రాజవంశం ఎంత భూమిని పాలించిందో స్పష్టంగా తెలిసేట్లు రచన కొనసాగాలనీ అంగీకరించారు. ఇంచుమించు ఏ విషయంలో ఎవరు నిపుణులో ఎవరిచేత ఏ భాగం రాయించాలో ఎన్ని సంపుటాలుగా ప్రచురించాలో ఎంత ఖర్చవుతుందో అంచనావేసి నిర్దిష్ట వ్యవధిలో గ్రంథ ప్రచురణ పూర్తికావాలని కూడా కార్యక్రమ నిర్ణయం జరిగింది.

ఆ తరవాత వచ్చిన మొదటి చిక్కు ఏ సంపుటానికి ఎవరు సంపాదకులుగా ఉండాలో, మొత్తం సంపుటాలకు ఎవరు ప్రధాన సంపాదకులో ముందే తేల్చాలన్న వాదం. చర్చలు వేడెక్కిన తరవాత అంతర్జాతీయ ప్రఖ్యాతిగల, తెలుగువాడైన వ్యక్తిని ఎంపిక చేయాలనుకున్నా, ఆ వ్యక్తి ఎవరన్నది వివాదాస్పదమైంది. చివరకు ‘సర్వేపల్లి రాధాకృష్ణన్ కుమారుడు గోపాల్ పేరు అధిక సంఖ్యాకులు ఆమోదించి కూడా ఆయన అంగీకరించకపోతే ఎలాగూ, ఆయన తెలుగులో రాయగలడా, రాసింది బోధపరచుకోగలడా” లాంటి ప్రశ్నలు వచ్చాయి. విడివిడిగా ఆచార్యులతో సంప్రతించి తరవాతి సమావేశంలో కొంత రచన సాగిన తరవాత చివరి నిర్ణయం తీసుకోడానికి అంగీకారం పొందాం. విషయాన్ని పాలకవర్గం ముందుంచితే రమారమి 50 లక్షల రూపాయ లెక్కడినుంచి వస్తాయనే సందేహం మొలకెత్తింది. సగం రాష్ట్ర ప్రభుత్వం భరిస్తే తక్కిన సగాన్నీ

అకాడమి నిధులలో నుంచి పెట్టవచ్చని భావించి ఆమోదం నిమిత్తం విద్యామంత్రిగారి ద్వారా ముఖ్యమంత్రిగారికి నివేదిక సమర్పించాం. నెలలు గడిచి సంవత్సరం దాటిన తరవాత తెలిసిందేమంటే ఆ నివేదిక మొత్తం వివరాలతో సహా అంతర్ధానమయిందనీ, ఎంత ప్రయత్నించినా దొరకలేదనీ! ఆంధ్ర రాష్ట్రం రాగానే గవర్నరుగా నియుక్తుడైన చందూలాల్ మాధవలాల్ త్రివేదీ గారు ఒక విషయం ప్రభుత్వపరిశీలనలో ఉందంటే ఫైలు కనిపించటంలేదనీ, తీవ్రపరిశీలనలో ఉందంటే అది పోయినట్లేనని అర్థంచేసుకోవాలని గుంటూరులో బహిరంగ సభలో చెప్పారు. దరిమిలా పరిశీలిస్తున్నామని నీలం సంజీవరెడ్డి గా రొక విషయంలో సభలో చెప్తే ఫైలు దొరకనట్లేగదా అని ఒక గౌరవ సభ్యుడు వ్యాఖ్యానించి గవర్నరు అభిభాషణను పేర్కొని సంచలనం పుట్టించాడు. గవర్నరు గారితో మాట్లాడి నిజానిజాలు తెలుసుకొని చెప్తానని మంత్రిగారన్నారు గాని తరవాత ఏమయిందో తెలియదు. ఇది తెలుగుదేశం ప్రభుత్వం మొదటి రెండేళ్ళ పాలనలో సాంస్కృతిక రంగంలో సాధించిన రెండున్నరో విజయం.

1984 జూన్‌లో మదరాసులోని రైటానరబుల్ శ్రీనివాసశాస్త్రి భవనంలో మహాకవి శ్రీశ్రీ వర్ధంతిని పురస్కరించుకొని త్రికాలాల్లో అభ్యుదయ సాహిత్యం గురించి ఆంగ్లంలో ప్రసంగిస్తూ అరసం, విరసం అనే చీలికలు మాని కలిసి ఉండమని ఉద్బోధించాను. సభకు హాజరైన టి.వేణు గోపాలరావు ఆ విషయాన్ని చర్చించి తెలియబరుస్తానన్నాడు గాని నేటికీ జరిగిందేమీ లేదు. ఆ వ్యాసాన్ని లోటస్ పత్రికలో ప్రచురించాలని ప్రయత్నించి భంగపడ్డ మిత్రుడు ఏటుకూరి ప్రసాద్ తరవాత తెలుగులోకి అనువదించి ఇస్తే విశాలాంధ్రలో ప్రచురింపజేస్తానని ప్రయత్నించి మరోసారి విఫలుడైనాడు. ఇదో పెద్ద విషయమనిగాక వేరుపడ్డ కుటుంబ సభ్యులు కలవటం అసాధ్యమనీ, అన్నదమ్ములు పంచుకునే సమయంలో అటువైపు పెద్దపులి పోయినా దానికే ప్రాణాపాయమనీ పెద్దలు చెప్పినమాటలెంత అనుభవపూర్వకాలో తెలుసుకోటానికి పనికి వస్తుందనీ రాస్తున్నాను. దరిమిలా రెండు భాషల్లోనూ నా సొంత రచనలుగా ప్రచురించటమనేది అంత ముఖ్యం కాదు. ఆ వ్యాసాలవల్ల సాహితికి వచ్చిన గౌరవంగాని, అగౌరవంగాని ఏమీలేదనీ, ఉండదనీ నాకూ తెలుసు.

ఆయేడే సభాహక్కుల ధిక్కారమనే నేరానికి రామోజీరావుగారిని బంధించి తెచ్చి విధాన పరిషత్తులో విచారిద్దామనుకున్న కాంగ్రెసు వారి ప్రయత్నాలు విఫలమైనాయి. మరుసటేడు పరిషత్తే తన అస్తిత్వం కోల్పోయింది. 1985లో ఢిల్లీలో సి.ఎస్.టి.టి. వారి రజతోత్సవ సభలు జరిగాయి. దాదాపు పదిహేను సంవత్సరాలుగా ఆ కమిషన్‌తోనూ, గోపాలశర్మగారి హయాంలో మొదలైన అఖిలభారత పరిభాషా కల్పనలోనూ అంతో ఇంతో పాలు పంచుకున్నందుకు ప్రారంభ సమావేశంలో పాల్గొనమనే ఆహ్వానం నాకు వచ్చింది. తమకు రానందుకు సంచాలకులవారు కంటగించుకున్నారు. ఆ సభలైన తరవాత ఏటా జరిగే అకాడమిల సంచాలకుల సమావేశానికి ఆయన్ను ఆహ్వానించారు గానీ ఆయనకు తృప్తి కలగలేదు. 'కలిసి పోదామా?' అన్నారు గాని నాకు ధైర్యం చాలలేదు. ఆయనకు విమానయాన వ్యయం సమకూరుస్తుంది తెలుగు అకాడమి. నాకు సంస్థాధి పతిని కాదు కాబట్టి ఆ సౌకర్యం ఎటూ లేదు. గుర్రంమీది రాజువెంట గొడుగుపట్టే భటుడిలా పరిగెత్తగల శక్తిలేదు. విడిగానే వెళ్ళాంగాని ఆయన తొలిసభకే వచ్చారు. ప్రవేశ విషయం నేను కల్పించుకొని అనుమతి తెచ్చుకోవలసివచ్చింది. సభాధ్యక్షత వహించినవారు విదేశాంగ మంత్రిగా ఉన్న పి.వి.గారు. గోపాలశర్మగారిని మొదట మాట్లాడమంటే "నేను కొద్దికాలం పెత్తనం చెలాయించాను గాని పదిహేనిరవై సంవత్సరాలుగా పరిభాషావ్యవహారంలో మునిగి తేలుతున్నవాణ్ణి మాట్లాడించండి" అని నా పేరు సూచించారు. (విద్యా వేత్తలకు లోక జ్ఞానం సాధారణంగా ఉండదనటాని కిదో నిదర్శనం. అనుమతించిన పి.వి.గారికిగాని, సభలో కూర్చొని వినవలసిన నా ప్రభువుకు గాని ఇది హర్షదాయకం కాదని శర్మగారు గ్రహించలేదు. ఈ దిక్కు మాలిన పరిభాషావిషయంలోనే మదురై కామరాజ్ విశ్వవిద్యాలయంలో ద్రవిడ భాషావేత్తల సమావేశంలో దొణప్ప గారిని మాట్లాడమన్నారు. ఆయన పీకలదాకా ఆ పనిలో మునిగిన నా మిత్రు డాపని చేస్తా"డని గంట నా మెడకు కట్టాడు. ఆత్మగౌరవమనే అర్థరహిత లక్షణంవల్ల నేనాశువుగా ప్రసంగించక తప్పలేదు. మధ్యలో ఓ అపరిచిత వ్యక్తి రసాయన శాస్త్ర పరిభాషా విషయం మాట్లాడుతుండగా "మీకీ భేదం స్పష్టంగా తెలుసా?' అని నిగ్గదీశాడు. ఒక విశ్వవిద్యాలయంలో బాధ్యతారహితంగా మాట్లాడగల తెంపరితనం నాకు లేదనీ, రసాయన శాస్త్రాచార్యు లిక్కడ ఉంటే తప్పు పట్టవచ్చనీ, నేను చెప్తున్న శాస్త్ర విషయం మా రాష్ట్రంలోని ఆచార్యులు చెప్తే విన్నదేగాని స్వానుభవంలోది కాదనీ మనవి చేశాను. వెనక పంక్తిలో ఉన్న మరెవరితోనో గుసగుసలాడి సభానంతరం నన్ను విందు కాహ్వానించా డాయన. నేనిక్కడి నుంచి దక్షిణదేశయాత్రకు సకుటుంబంగా పోతున్నా కాబట్టి క్షమించమన్నాను. అప్పుడాయన తన పేరు కుళందైస్వామి అనీ, తానీ విశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్షుణ్ణనీ చెప్తే గాభరాపడ్డాను. ఆయన నన్ను అకడమిక్ కౌన్సిల్ సభ్యుణ్ణి చేసినందుకు నేను పడవలసివచ్చిన ఇబ్బందులు ఇంతకుముందే పేర్కొన్నాను. అందుకే ప్రభుత్వోద్యోగులకు, రాజకీయ వాదులకూ ఉన్నంత లోకజ్ఞానం విద్యావంతుల కుండదని కుండబద్దలు కొట్టినట్లు రాస్తున్నాను).

### సాహిత్య శోకం

తెలుగు అకాడమి ప్రచురించిన తెలుగు సాహిత్యకోశం ప్రథమభాగం 1980లోనే వెలువడింది. పరిపాలనా న్యాయపదకోశం విషయంలో లాగానే దీని విషయంలోనూ శ్రీకారం చుట్టింది నేనే. అందువల్ల 'ఆరంభించరు నీచమానవులు విఘ్నాయాస సంత్రస్తులై, ఆరంభించి పరిత్యజింతు రురువిఘ్నాయత్తులై మధ్యముల్' అనే రెండుచరణాలూ నాకు అన్వయించగూడదని కొంతపని సాగిన తరవాత ఇతరులకు అవకాశమిమ్మని నన్ను తప్పించారు. అందుకు సంతోషించే అవకాశం మాత్రం కల్పించలేదు. విమర్శలు వస్తే వాటికి నేనే బాధ్యుణ్ణి – పెద్దరికంవల్ల. పొగడ్తలకు తక్కిన వారు హక్కుదారులు. ఈలాంటివి అనేకం విని అబ్బూరి మాష్టారు "నిమ్మకర్మ దుష్కర్మ" అని విచారిస్తుండేవారు. ఆంధ్రమహాభారత రచయితల్లో తిక్కన మూడోవాడని, బమ్మెర పోతన వీరభద్ర విజయం రాసిన నూరేళ్ళకో ఏమో భాగవతం రాశాడని సాహిత్యకోశంలో ప్రచండ దోషాలు వచ్చాయని పత్రికల్లో విమర్శలు వచ్చాయి. విధాన పరిషత్తులోనూ వచ్చాయి. అక్కడ తీవ్రాతితీవ్రంగా స్పందించిన గౌరవ సభ్యులు బోయి భీమన్నగారు సదరు గ్రంథ నిర్మాతను

నేననుకున్నారేమో తెలీదుగాని సంపాదకులను ఉరితీయాలన్నారు విధానపరిషత్ చర్చల్లో. విద్యామంత్రిగారికి సమాచారం అందించటంకోసం ఫైళ్ళు మోసుకొనిపోయిన నన్ను మంత్రిగారు ఏమని సమాధానం చెప్పాలని కోపంగా అడిగారు. అంగీకరించం డన్నాను. అందువల్ల భాషా సాహిత్య చరిత్రలకు మరింత అపకారం, అపచారం జరక్కుండా పోతుందంటే ఆయన విస్తుపోయాడు. సభలో తప్పులు దొర్లినంతమాత్రాన ఉరితీయగల అధికారం మనకుందేమో పరిశీలించి చెప్పమన్నారు. అప్పుడు పుస్తకం మరోసారి శ్రద్ధగా గమనించిన పెద్దలు అలాంటి ప్రతిపాదన తామేమీ చేయలేదనీ తప్పులు సవరించుకొంటే సరిపోతుందనీ అన్నారు – ప్రథమ విమర్శకులు. బయటికి వచ్చిన తరవాత పుస్తక సంపాదకు లెవరో గమనించిన మంత్రిగారు “అదా మీ ధీమా” అన్నారు. నిజానికి గ్రంథ పరిష్కర్తని పేరున్నది డాక్టర్ బి.విజయకుమారి గారిది. (ఆమెగారు భీమన్నగారి ప్రథమ పుత్రిక). ఇంత తీవ్రవాదంతో పేట్రేగిపోయిన విధాన పరిషత్తు రద్దుకావటం ఆంధ్రప్రదేశ్ పౌరుల అదృష్టం. ఆ భీమన్న గారేగాక మరికొందరు మహా విద్వాంసులు అకాడమి తలపెట్టిన తెలుగుశబ్ద సాగరమనే మహానిఘంటువుకు సలహా సంఘంలో ఉండేవారు. అందులో ఒకరు రోజుకు 500 ఆరోపాలకు అర్థవివరణ చేయవచ్చుననీ, ఉద్యోగులు ఒళ్ళు దాచుకుంటున్న దొంగలనీ మండిపడ్డా డొకసారి. అంతటి అజ్ఞానియైన ఆచార్యుణ్ణి ప్రపంచమంతా గాలించినా దొరకబట్టుకోలేరు. అసలాయనకు నిఘంటువులు చూడటమైనా తెలుసని చెప్పలేను. ఆయన పేరు స్మరించి పాపసంపాదన చేయదలచలేదు – అవసరమైతే బహిరంగంగా ప్రతిఘటించగలను గాని. 1986లో తెలుగు సాహిత్యకోశం ద్వితీయ భాగం వెలువడ్డప్పుడు పెద్ద రభస ఏమీ జరిగినట్లు గుర్తులేదు.

1984 నుంచి విషయసేకరణ ఆరంభించిన గోండీ, కోయ భాషల వాచకాలు రెండేసి చొప్పున 1985లో ప్రచురించింది అకాడమి. ప్యారేలాల్ సంఘం వారు దేశంలోని గిరిజన భాషలను అధ్యయనం చేసి వారి సంస్కృతి పరిరక్షణార్థం పాఠ్యగ్రంథాలను తయారుచేయించాలని అయిదో దశకంలో భారత ప్రభుత్వాన్ని కోరింది. అది బుట్టదాఖలైంది. తరవాత ధేబర్‌భాయ్ కమిషన్ 1973లో కాబోలు రాష్ట్ర ప్రభుత్వాలు ఆ కార్యక్రమం చేపట్టి తమతమ రాష్ట్రాల్లోని ప్రధానప్రాంతీయభాషకున్న లిపిలో ఆయా గిరిజన భాషలకు పాఠ్యగ్రంథాలు ప్రచురించాలని సిఫారసు చేశారు. ఆ సిఫారసును రాష్ట్ర ప్రభుత్వాల విద్యా శాఖల వారు భద్రంగా అపరిశీలితంగా ఉంచారు గాని, కడుపునెప్పి తెరల్లా అప్పుడప్పు డేం చేశారనే కేంద్ర ప్రభుత్వం వారి లేఖలు వస్తుండేవి. ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖ వారు ఈ పని గిరిజన శాఖవారు చేపట్టాలంటే, వారు విద్యాశాఖలోని విద్యాపరిశోధన బోధన విభాగం వారందుకు తగిన వారంటే, అందరూ తప్పుకోటానికి అకాడమిని చేపట్టమని కోరారు. ఎవరికి పుట్టిన బిడ్డో వెక్కెక్కి ఏడుస్తున్నదన్నట్లు అందరికీ లోకువైన ఏడుపుగొట్టు సంస్థ తెలుగు అకాడమి ఔననలేక, కాదనలేక కొంతకాలం గడిపింది. స్నాతకస్థాయి పాఠ్యగ్రంథ ప్రచురణ కూడా ఒక కొలిక్కి వచ్చిన తరవాత, స్నాతకోత్తర స్థాయి గ్రంథ ప్రచురణ తీరిగ్గా చేపట్టదగిందని భావించి మొత్తం సంస్థలో దిక్కూ దివాణంలేని పరిశోధన శాఖను ఈ పని చెయ్యమన్నారు – అవసరమైతే తెలుగు సామాజిక భాషా పరిశీలనను వెనకపెట్టి. అందువల్లనూ, పురుషపుంగవులు ఇతరకార్యభారాల్లో ఉన్నందువల్లనూ, పర్యటనపరిశోధన చేయవలసి ఉన్నా అంతకాలం తప్పించుకున్నారు కాబట్టి వారూ ఉద్యోగవిధులు చేస్తున్నట్లు నిరూపించక తప్ప దనుకోవటంవల్లనూ స్త్రీరత్నాలకు ఆపని అప్పగించారు. నేనే అడివికి పోతానంటే అంగీకరించలేదు – నాకు ప్రయాణభత్యం దినబత్తెం కోసం ఎక్కువ సొమ్ము కేటాయించవలసి వస్తుందన్న బహిరంగ కారణంవల్లా నాలాగా గొడ్డు చాకిరీ చేసేవాణ్ణి ఇతర కార్యాలకు పంపితే ఇక్కడి పని పాడుపడుతుందన్న రహస్య హేతువు వల్లా! నా ఎరికలో కూర్మా వేణుగోపాలస్వామి నాయుడు గారూ, అబ్బూరి రామకృష్ణారావు గారూ నామీద ఏనాడూ పెత్తనం చేసిన వాళ్ళు కాకపోయినా నా కష్టాలు వినీచూసీ నా ఉద్యోగానికున్న భద్రతకు తిరుగులేదని సమాశ్వాసిస్తూ ఉండేవాళ్ళు – నిన్ను పీకేస్తే నీ చాకిరీ చేయటానికి పది మందిని మేపాలని నీ అధికారులందరికీ తెలుసని చెప్తూ. గోండీ రెండో వాచకానికీ, కోయ రెండు వాచకాలకూ అందుబాటులో ఉన్న సమాచారంమీద ఆధారపడి నేను సంపాదకత్వం వహించాను. గిరిజన సంక్షేమ శాఖాధికారులతో కలిసి ఉట్నూరు వెళ్ళి ప్రచురించిన గోండీ వాచకాల్లోని సమాచారాన్ని సరిచూసుకున్నాంగాని, కోయభాష విషయంలో ఆ పాటి కూడా సాధ్యంకాలేదు. మేం అడివికి పోయే దానికన్నా అడివినే హైదరాబాదుకు తెస్తే సరిపోతుందని అధికారులు నిర్ణయించారు! వారి నిర్ణయానికి తిరుగులేదు.

1986లో అనేక విధాల సొంత బాధలు వచ్చాయి. కొనుక్కున్న ఇల్లు కోర్టుద్వారా రిజిస్టరైనా ఆస్తి పన్ను నిర్ధరించక మునిసిపాలిటీ వాళ్ళు వేధిస్తే లోక్ ఆయుక్త దగ్గర సొంతంగా వాదించుకోవలసి వచ్చింది. అందులో ఎన్నో కష్టాలున్నాయి. కోర్టుల నిర్ణయాలకోసం మిత్రుల దగ్గరకు తిరిగి విషయసేకరణ చేయటం వగైరాలు తప్పలేదు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారు నాటక రంగోద్ధరణకు ఎ.ఆర్.కృష్ణ నేతృత్వంలో పెట్టిన సంస్థను మూసి నెలకు అయిదు వందల రూపాయల భృతితో విద్య నేర్చుకుంటున్న వారి పొట్టకొట్టింది. ఆ సందర్భంలో వారికోసమూ నేను ప్లీడర్ల చుట్టూ తిరిగాను. తెలుగు అకాడమి ఉద్యోగులు జీతభత్యాల విషయంలో ఎన్నోసార్లు ఎన్నో విధాల ప్రాధేయపడ్డారు గాని అధికారులు పట్టించుకోలేదు. ప్రభుత్వం నియమించిన ఉప సంఘం నెలకోసారి పరిపాలన విషయాలు నిర్ణయించటానికి సమావేశమైనా ఈ విషయం జోలికి పోలేదు. విద్యామంత్రికి విన్నవిస్తే డిగ్రీలుంటే చాలదనీ బోధనానుభవం కూడా ఉండాలనీ కోప్పడ్డారు. నేను పదిహేనేళ్ళు డిగ్రీ కళాశాలలో బోధించి వచ్చాననీ, ఉస్మానియా విశ్వవిద్యాలయం వారు పిహెచ్.డి. పరిశోధక విద్యార్థులకు తెలుగులో పర్యవేక్షకుడుగా వ్యవహరించటానికి 1978లోను, అదేవిధంగా భాషాశాస్త్ర విషయంలో 1979లోనూ నన్ను గుర్తించారనీ చెప్పినా ఆయన వినలేదు (రెండేళ్ళు ఇంటర్ విద్యార్థులకు రాజనీతి శాస్త్రం బోధించిన వారి అనుభవం ముందు నాది బలాదూరు). నా జీతభత్యాల, పదోన్నతి విషయం ప్రస్తావించటం లేదనీ, కళాశాలల్లో ప్రభుత్వ సంస్థల్లో ట్యూటర్, డిమాన్‌స్ట్రేటర్ పదవులున్నప్పుడు వాటికి ప్రభుత్వం లెక్చరర్ పోస్టులుగా పదోన్నతి కల్పించిందనీ అదే జీతాల్లో ఇక్కడ విశ్వవిద్యాలయోద్యోగాలకు తగినంత విద్యార్హతలున్న వాళ్ళు స్కేలు చివరికి వచ్చారనీ వారిని కరుణించమంటే నా అంతు

చూస్తామన్నారు. నేను కోర్టుకు పోక తప్పదన్నాను. ప్లీడర్లను కుదిర్చాను. తీరా పిటిషన్ దాఖలు చేసేప్పుడు నా ఉద్యోగం సంగతి తక్కిన సోదరోద్యోగులు ప్రస్తావించనే లేదు. నేనందుకు విచారించనూ లేదు. 1986 ఇలా తగలడిపోయింది.

అప్పట్లో వినోదం అవసరమనిపించి వెతికి బాల్యమిత్రుడైన కీర్తిశేషుడు మాచిరాజు దేవీ ప్రసాద్ పేరడీలను ప్రచురిద్దా మనుకున్నాను. అతడి రచన సామ్యవాద సిద్ధాంతానుగుణంగా లేదని, శ్రీశ్రీని వెక్కిరించాడనీ ఏటుకూరి బలరామమూర్తి గారు ప్రచురణకు అనర్హమని నిర్ణయించారు. విశాలాంధ్ర బుక్‌హౌస్ వారు అందువల్ల మావల్ల కాదంటే రామోజీరావుగారు విరాళమివ్వగా శ్రీశ్రీ స్మారక సంఘం పేరిట ఆతడి పద్యభాగాన్ని మాత్రం ప్రచురించాను – సంపాదకత్వం వహించి.

**దుర్ఘటన పరంపర**

1987లో చెప్పుకోదగ్గ దుర్ఘటన రాష్ట్ర ప్రభుత్వం వారి రెసిడెన్షియల్ స్కూళ్ళలో పనిచేసేందుకు స్నాతకోత్తర స్థాయి విద్యార్హతలు కల ఉపాధ్యాయుల ఎంపిక భారం నానెత్తిన పడటం. కళాశాలల్తో విశ్వవిద్యాలయాల్తో సాహిత్య విషయకంగా ప్రత్యక్ష సంబంధాలు కోల్పోయిన నాకు దునియా చూపించారు అభ్యర్థులు. ఒక పరిశోధక విద్యార్థికి – ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో కథానికల గురించి పిహెచ్.డి. చేస్తున్నవాడికి – విజయనగరం వాస్తవ్యుడు – "మీ ఊళ్ళోనే తెలుగు కథ పుట్టిందంటారు. నిజమా?" అని మొదలుపెట్టి పది నిమిషాలు పది రకాలుగా అడిగినా, అతడికి గురజాడ – దిద్దుబాటు– గుర్తుకు రాలేదు! "పోనీ చా. సో. గారు తెలుసా?" అంటే ఆయన ఎవర న్నాడు. అప్పుడు

**"చాగంటి సోమయాజుల**
**రోగం కుదిరింది; ఎవ్వరున్ విజినగరం**
**లో గుర్తించరు కథకు**
**ల్లో గొప్పని; కాలమెంతలో మారినదో?"**

అని రాసుకున్నాను.

ఇలా రాశానని ఏటుకూరి ప్రసాద్ గారిద్వారా తెలుసుకుని మరునా డాయన వచ్చి "నా మీద రాసిన పద్యం నాకివ్వరాదా?" అని అడిగి తీసుకపోయాడు – 'లోకం ఇలా ఉన్నదా?" అని ఆశ్చర్యపోతూ.

లోకం కోసమైనా నాటి దుఃఖహేతువులను గురించిన రెండు మూడు పద్యా లుదాహరిస్తాను:

**"స్వస్తి" విసర్గ సంధియను పండితురాలిని మెచ్చుకొందుమా?**
**నాస్తి సుఖమ్ము పోతన కనారత భోగిని సేవలో ననన్**
**కస్తి వహింతుమా? పదముకానిది పద్య మటన్న వానితో**
**జాస్తిగ శబ్దశాస్త్రమున చర్చలు చేతుమ? చెప్పు దుర్విధీ! –**
**"ఏదని చెప్పుదున్ దమరి, కింత యెఱుంగరె? పోతరాజుకున్**



**మాదయగారి మల్లన సుమా సమకాలికు, డా మహాత్ముకున్**
**గాదిలిపత్ని మొల్ల; అనగా విని, సంతస మంది, జ్ఞాన సం**
**పాదన చేసి, అవ్యయకపాట విపాటన మాసచేసితిన్!'**

ఈ రెండో పద్యాన్ని కోవెల సంపత్కుమారాచార్యులవారు విని రాయించుకొని తీసుకొని పోయారు. కాస్సేపు కాలక్షేపం చేద్దామని ఆయన వచ్చేసరికి నేను దాశరథి (కృష్ణమాచార్యులు) గారి దగ్గరికి పోతున్నాను. విశేషమేమంటే 'గజల్' అంటే ఏమిటో నాకు తెలీదు. తెలుగు గజళ్ళను సమీక్షించాలి. కాస్త చెప్పి పుణ్యం కట్టుకో"మంటే సాయంత్రాలు మా ఇంట్లోనో, మీ ఇంట్లోనో ఆ విషయం మాట్లాడుకుందా" మన్నా డాయన. ఆ రోజు నే నాయన దగ్గరకు పోవలసి వుంది. "నేనూ వస్తాను. ఈ పద్యం రాసి ఇవ్వం"దని కోవెలవారు తీసుకవెళ్ళారు. ఆయన రాక మరో విధంగా నాకు తోడ్పడింది. "గజళ్ళను గురించి సాధికారికంగా చెప్పగలవారు కాళోజీ రామేశ్వర రావుగారు. మీకూ పరిచయ ముందిగదా! ఓమారు హన్మకొండ వచ్చిపొండి. ఉభయ తారకంగా ఉంటుం"దని ఉద్బోధించా డాయన. నా చాపల్యాన్ని మరో పద్యం ఎత్తిరాసి కట్టిపెట్టాను–

**"శ్రీనాథ కృతుల కాశీఖండ మాద్యమ్ము**
**పలనాటి కథ కవిత్వమ్ము కాదు**
**కావ్యాలలో అలంకారాలు లేకుండు**
**భోగిని పోతన్న భోగపత్ని**
**మణియు ప్రవాళమన్నను కన్నడపు గృతి**
**మూర్తి యన్నను భట్టుమూర్తి యొకడె**
**కృష్ణశాస్త్రియ భావగీతుల కాద్యుండు**
**గురజాడ శ్రీశ్రీకి గుప్తశిష్యు**
**డను నవీనశకారుల కనియు వినియు**
**భాసశూద్రక కవుల కల్పనల రోసి**
**మా పురాకృత పుణ్యకర్మములవలన**
**మతులు చెడిపోక బ్రదుకుట మాకు గొప్ప"**

ఇటువంటి మహావిద్వాంసుల్లో కొందరిని ఎంపిక చేయమని ఎన్నో రకాల ఒత్తిడులు వచ్చాయి. సాక్షాత్తు మా ప్రభువులే బెదిరించారు – ప్రమాదమని. అప్పుడు 'ఆత్మప్రబోధ'మని రాసి పంపిన నాలుగు పద్యాల్లో చివరి దిది.

**"ఉన్న దఙాగళస్తన సమున్నతమై హసనీయమై వృథా**
**పన్నకరంబునై పరమ పాతక సేవకమౌ పదమ్ము– లే**
**కున్న వృథాభరమ్మగు పదోన్నతి, పోయెడిదేమి? ఉన్నచో**
**మన్నన వచ్చునా? పదవి మాలిన పోవున? పోల్చి చూదుమా?"**

**కష్టకాలంలో మరోనష్టం**

1968 డిసెంబరు నుంచి 1988 మేదాకా తాళ్ళూరి నాగేశ్వరరావుగారూ నేనూ కలుసుకోని రోజులన్నీ కలిసి నూరయినా ఉంటాయో లేదో చెప్పలేను. తెనాలి వి.ఎస్.ఆర్. కాలేజీలో

వాణిజ్య శాఖలో పనిచేసి అకాడమి సర్వీసులో చేరిన మలితరం ఉద్యోగుల్లో ఆయనొకడు. మొదట రీసర్చి అసిస్టెంటుగా చేరినవాడు క్రమాభివృద్ధి పొంది డిప్యూటీ డైరెక్టరైనాడు – ప్రచురణ విభాగాధికారిగా. చేరిన పదోరోజునుంచి మేం కలిసి వాణిజ్యశాస్త్ర పరిభాషా కల్పనలో నిమగ్నమైనాం. ఆ రోజుల్లో ఆనర్సు చదివే రోజుల్లో రచయితగా పరిచితుడైన ఇచ్ఛాపురం జగన్నాథరావుగా రోమారు అకాడమికివస్తే తాళ్ళూరివారికి పరిచయం చేశాను. ఆ క్షణంనుంచీ వారిద్దరి పరిచయమూ మైత్రిగా పరిణమించింది. తెనాలి కళాశాలలో వాణిజ్య శాఖాధిపతిగా ఉన్న హితశ్రీ నాకో సంవత్సరం సీనియరు వాల్తేరులో. ఆయన రచనలంటే నాకు అభిమాన మయితే తాళ్ళూరికి ఆరాధనభావం. మా ఇద్దరిలో ఇతర సమానలక్షణాలు లేవనే చెప్పాలి. భిన్న ధ్రువాల మధ్య ఆకర్షణ ఉన్నట్లే సాధువైన అతడికీ అసాధువునైన నాకూ అవిచ్ఛిన్నమై అనుక్షణాభి వృద్ధి పొందిన మైత్రికి ప్రధాన కారణం మా ఇద్దరికీ సమంగా కొందరు రచయితలమీద ఉన్న గౌరవం కొందరిమీది అగౌరవభావం. రెండోది మాకు అనేక వ్యక్తులతో అంతకు పూర్వమే ఉన్న స్నేహ సంబంధాలు. కులగోత్రాలు ఎన్నడూ మా మైత్రికి అడ్డురాలేదు. మేమిద్దరం మధ్యాహ్న సమయాల్లో దాదాపు ఇరవై సంవత్సరాలు విధిగా కలిసేవాళ్ళం. మధ్యలో ఇంటర్‌కాం ద్వారా ఎన్నిసార్లు సంప్రతించుకున్నామో లెక్కేలేదు. ఆయన జబ్బుపడి చివరికి కన్నుమూసిన తరవాత ఏదో అనిర్వచనీయ శూన్యభావం నన్నావరించింది. ఉద్యోగవిధుల్లో నిత్యం ఎదుర్కొంటున్న వేధింపులలో మనసులోని భావాలను చెప్పుకొని ఓదార్పు పొందడానికి నాకంతటి మిత్రుడు లేడు. అతడి సంస్మరణార్థం ఒక స్మారక సంచిక ప్రచురించే ప్రయత్నంచేసి దాన్ని గజ్జెల మల్లారెడ్డిగారి చేత ఆవిష్కరింపజేశాను. నాలుగైదు ప్రతులిచ్చిన ముద్రాపకులు తక్కిన కాపీ లివ్వనేలేదు – అతడి జీవితకాలంలో ఎన్నో మేళ్ళు పొందికూడా. మనసు గాయపడింది. అతడి కుటుంబం అదే సంస్థలో అల్పోద్యోగానికి సిద్ధపడిన తరవాత నాకు అక్కడ పనిచేయడం మనస్క రించలేదు. రోగీ వైద్యుడూ పథ్యమే కోరినట్లు ఈ విషాదం నేను అకాడమినుంచి వెళ్ళిపోవాలనే సంకల్పాన్ని బలపరిచింది. తన చావుకు పన్నెండు పదమూడేళ్ళ క్రితం రాసిన 'శ్రావణమేఘాలు' అనే నవలలోని కథానాయకుడు ఎలా అనంతవిశ్వంలో కలిసిపోయాడో సరిగ్గా తాళ్ళూరికూడా అదే విధంగా కన్నుమూశాడు. అతడు లేనిలోపం తీరేదికాదు. తీరే మార్గమూ లేదు.

రాను రాను ఈ నరకంలో నుంచి బయటపడాలన్న తాపత్రయం తీవ్రమవుతున్న రోజుల్లో గంగారాంగారి కోరిక మేరకు అంతకు ముందు గిడుగు వేంకట సీతాపతి గారూ నిడుదవోలు వేంకటరావు గారూ సరిచూడటం అర్థాంతరంగా ఆగిపోయిన ఒక సాహిత్యకోశం పని చూడ వలసి వచ్చింది. మూలంలో ఏ మార్పులూ చేయకుండా ఎక్కడైనా పొరపాట్లూ పూరించవలసిన విషయాలూ ఉంటే సరిచేసి ఓ పీఠిక రాసి పంపమన్నారు. అది Internationl Encyclopaedea of Indian Literatures అనే గ్రంథ పరంపరలో తెలుగుకు కేటాయించిన అయిదో సంపుటం. ఆ సమయంలోనే ఏషియన్ స్టడీస్ వారికోసం భారతదేశం మొత్తం ఒకే సాహితీ ప్రాంతమనీ ప్రధాన భాషల్లో వచ్చిన సాహిత్య చరిత్రనూ రచనా విధానాలనూ శతాబ్దాల వారీగా చర్చిస్తూ ఒక వ్యాసం ఇంగ్లీషులో రాసి పంపాను. (దరిమిలా దాన్ని నేనే ఆంధ్రీకరించి ప్రచురించాను). బెంగు ళూరులో కన్నడ సాహిత్య పరిషత్తూ మైసూరులోని కేంద్రీయ భారతీయ భాషాసంస్థ ఉమ్మడిగా నిర్వహిస్తున్న చర్చా గోష్ఠిలో పాల్గొనవలసిందనీ నిఘంటు నిర్మాణ సమస్యల గురించి ఉపన్యసించ మనీ ఆహ్వానించారు. రెండు మూడు వారాలపాటు సెలవు కావాలంటే సంచాలకుల వారు సంతో షంగా మంజూరు చేశారు. అంతకు ముందు నా చిన్న కుమారుడి వివాహం జరుగుతున్నది కాబట్టి పది రోజులు ఢిల్లీకి పోవాలంటే వారం కేటాయించారు. వారే ఇంత దయ ఎందుకు చూపారన్న సంశయం వచ్చింది గాని, ఏదో మహత్తర పాండిత్య ప్రదర్శన చేయబోతున్నానన్న ఆనందంలో కారణాలను ఆలోచించనూ లేదు – గుర్తించనూ లేదు.

తెలుగు అకాడమికి సొంత ముద్రణాలయం కావాలనే ప్రతిపాదన నన్ను పంపమన్నా రంతకుముందు. దాని అవసరం ప్రచురణశాఖకే గాని పరిశోధన విభాగానికి లేదు. అయినా అందరిలో సీనియరువు కాబట్టీ, ఈనాడువారి కిలాటి పనే చేసిపెట్టిన అనుభవముంది కాబట్టీ చేయమన్నారు. రెండోది ఆరోపణేగాని వాస్తవం కాదన్నాను. కేంద్ర ప్రభుత్వమూ అంతకు ముందు అకాడమి పాలకమండలీ ఇలాంటి ప్రతిపాదనను వ్యతిరేకించా యన్నాను. అలా రాశాను కూడా. తమ పని తాము సానుకూలం చేసుకుంటున్న సమయంలో నేను లేకపోవటం మంచిదనుకున్నా రనేది ఒక కారణం. నాటి ముఖ్యమంత్రి ఆంధ్రనామ సంగ్రహాన్ని పునర్ముద్రించి విద్యార్థులందరికీ పంచిపెట్టాలంటున్నారనీ ఆ విషయంలో కావలసిన డబ్బుడుగుతూ ప్రతిపాదన పంపవలసిందని మరో ఆజ్ఞ. ఆ తాతల నాటి చిన్ని నిఘంటువు నేటి విద్యావిధానంలో పనికిరాని దని, అందులోని అచ్చ తెలుగు మాటల అర్థాలూ వాడుకా మారిపోయాయనీ రాశాను. "రాజ్యాధి కారమున్న ముఖ్యమంత్రి ఆదేశాన్ని తిరస్కరిస్తారా? మిమ్మల్ని బదిలీ చేయిస్తాను. "థాం థూ" మని నా మీద ఎగిరారు. "నేను ప్రభుత్వోద్యోగిని కాను – బదిలీ అసాధ్యం" అంటే "ప్రభుత్వోద్యో గిని చేయించి అంతకన్నా తీవ్రచర్య తీసుకుంటా"మన్నారు. "నా సర్వీసును ప్రభుత్వ సేవలో కలిపితే ప్రస్తుతం విద్యాశాఖ సంచాలకులుగా ఉన్న వారందరూ నాకు జూనియర్లవుతారు. అది సాధ్యంకాదు. పైగా అధికార ప్రస్తావన తెచ్చారు కాబట్టి చెప్తున్నాను. నన్ను ముఖ్యమంత్రి ఆదే శించలేదు. ఆదేశించినా నాకున్న భాషాధికారాన్ని పురస్కరించుకొని నేను ఇచ్చిన సలహాను ఆయనా ధిక్కరించలే"దన్నాను. ఇవన్నీ గతంలో జరిగినా వర్తమానంలో గుర్తుకు వచ్చాయి. నేను బెంగుళూరు నుంచి తిరిగి వచ్చేసరికి తెలుగుశబ్ద సాగరం బీరువాలే అంతర్ధానమైనాయి. ఎవరూ ఏమీ చెప్పలేదు – ఎంత తరిచి అడిగినా. అప్పుడు నిర్ణయించుకున్నా పదవీ విరమణ చేయాలని. స్వచ్ఛంద పదవీ విరమణకు నిబంధన లంగీకరించవన్నారు. రాజీనామాయే శరణ్య మన్నమాట. ఆ పని చేస్తే పెన్షను రాదన్నారు. ఆ మాటకు నేను తెలుగు పరిభాష 'భరణ'మని భావించి, పురుషుడికి భరణం తీసుకొనే వీలులేదు కాబట్టి, నేను పురుషుణ్ణి కాబట్టి భరణరహితంగా తప్పు కుంటున్నానని రాసి ఇచ్చాను. వెంటనే తేల్చకపోతే జీతం నష్టం మీద సెలవు పెట్టి, రాజీనామా ఆమోదించి విడుదల చేస్తామని రాసి పంపేదాకా కార్యాలయానికి రానని రాశాను. ఫలానా రోజున విడుదల చేస్తామన్నారు. విడుదలై ఇంటికి వెళ్ళాను. అదీ జరిగిన కథ.

# 11. అనిశ్చితిలో

ఇరవై సంవత్సరాల వెట్టిచాకిరీనుంచి బయటపడ్డంత సంబరంతో తెలుగు అకాడమినుంచి విశాల ప్రపంచంలో అడుగుపెట్టున్నా ననిపించింది యాభై ఆరో ఏట. ఉద్యోగం నుంచి విడుదల చేస్తున్నాం, కార్యాలయానికి వచ్చిపొమ్మని రాసిన అధికారులు అజ్ఞానులో, అహంకారులో, వంచకులో తెలీలేదు – పదవీ బాధ్యతలను ఎవరికి అప్పజెప్పాలో నిర్దేశించనందువల్ల! చిట్టచివరి బాధ్యతకు ఆరిపోతున్న దీపలక్షణాన్ని జోడించి నా అధీనంలో ఉన్న గుండుసూదుల సంఖ్యనుంచి సమస్త వస్తువుల పట్టికనూ సిద్ధంచేసి ఆరు కాపీలు తీసి సమర్పించవలసిందని ఆజ్ఞాపించాను – నాకు లోకువైన వారిని. ఆ పని జరుగుతుండగా గుర్తుకు వచ్చింది రామోజీరావు గారు ఎన్నో సార్లు నన్నడిగిన ప్రశ్న: "బూదరాజు గారూ! మీ ఉద్యోగం ఎప్పుడు పోతుంది?" అని. వెంటనే అకాడమినుంచి మొదటిసారిగా ఆయనకు ఫోనుచేసి మరో రెండు మూడు గంటల్లో నా ఉద్యోగం పోతున్నదని చెప్పాను. అది ఒక విధంగా ఉభయతారకమైన విషయం.

సినారే గారి 'తెలుగు గజళ్ళ'ను నేను సమీక్షించినప్పుడు ఆయన 'ఎదురింట్లో' (అంటే ఈనాడు కార్యాలయానికి ఎదురుగా ఉన్న సార్వత్రిక విశ్వవిద్యాలయంలో) వైస్ ఛాన్సలరుగా ఉండేవాడు. అక్కడి నుంచే అధికార పూర్వకంగా ఆంగ్లభాషలో రామోజీరావు గారి కో ఉత్తరం రాశాడు. నా సమీక్ష అజ్ఞాన పూర్వకమనీ, తప్పుల తడక అనీ చెప్తూ నన్ను ఉద్యోగంలోనుంచి తొలగించమని సిఫారసు చేశాడు. రామోజీ గారిని మరునాడు నేను కలిసినప్పుడు ఆ ఉత్తరం చూపి "నాకో పెద్ద సమస్య వచ్చిపడ్డది. నేనివ్వని ఉద్యోగం నుంచి మిమ్మల్ని తొలగించే దెలా"గని ప్రశ్నించారు. "అంత చిన్న పుస్తకంలో అచ్చు తప్పులుండటం తెలుగువారి దురదృష్టమని నేను మచ్చుకు 17వ పేజీలో నుంచి ఒక్క ఉదాహరణ ఇస్తే తాను, ఎన్నిసార్లు పరీక్షించినా పదికన్నా ఎక్కువ లేవుగాని సమీక్షకుడు 17 అచ్చుతప్పులున్నాయన్నాడని కదా నా మీద ఆయన ఫిర్యాదు. ఇప్పుడు నేను ఏడు తప్పులను వెతకాలా? తెలుగులో రాసిన మాటలను సరిగా అర్థం చేసుకోలేని మహాత్ముడు నిజంగా తానే ఈ ఇంగ్లీషుత్తరం రాశాడా? అవన్నీ అలాపెట్టి, ఆయన కోర్కె తీర్చాలని పిస్తే నన్నుద్యోగంనుంచి తొలగిస్తూ ఉత్తరువు జారీ చేయండి" అన్నాను. 'ఇది మీ దగ్గరే ఉంచండి. ఎప్పుడైనా పనికి వస్తుందేమో"నని నా చేతికిచ్చాడా ఉత్తరాన్ని. (తరవాతి కాలంలో గజ్జెల మల్లారెడ్డి గారు తన కవిత్వాన్ని ఆక్షేపించినందుకు ఆయన్ను ఉద్యోగం నుంచి తొలగించ మని 'ఉదయం' అధిపతులకు రాసిన ఉత్తరాన్ని నేను చూశాను – మల్లారెడ్డి గారు చూపగా. 'కవీ! ఇదే'మని నా మామూలు ధోరణిలో అడిగితే, మల్లారెడ్డి గారు "ఇందులో ఒక విశేషముంది. కడపరెడ్డిని తీసెయ్యమని తెలంగాణారెడ్డి నెల్లూరు రెడ్డికి ఉత్తరం రాయటమే విశేషం కదా? యావత్ ప్రపంచమూ తన ఇష్టానుసారం నడవాలని పాపం ఆతడి ఆరాటం" అని జాలిపడ్డాడు). నా ఉద్యోగం పోతున్నదని రామోజీ గారికి చెప్పటం ఆ క్షణంలో మంచిదనిపించింది. చెప్పాను.

ఎలాగైతేనేం అకాడమినుంచి బయటపడి 'విశ్రాంతి'కి ఉపక్రమించే ముందు జరిగిన ఓ చిన్న దుర్ఘటన గుర్తుకు వస్తుంది. గోండీలు మహాత్ముడని గౌరవించే హైమన్‌డార్ఫ్ సతీసమేతంగా



హైదరాబాదుకు వచ్చాడని తెలిసి వెళ్ళి కలిసి అకాడమిలో మేం సిద్ధం చేసిన గోండీ వాచకాలు చూపి లోపాలోపాలు తెలుసుకుందా మనుకుంటున్నాననీ, రేపు మా కార్యాలయానికి వచ్చి మాతో మధ్యాహ్న భోజనం చేయమనీ కోరాను. వారు అంగీకరించారు. కానీ పరిశోధన శాఖ వారు ఎవరూ రాలేదు – ఆ రోజు ఏదో పండగ సెలవని. పిలిచిన పాపానికి నేనే పుస్తకాలు చూపి దగ్గరలోని హోటల్లో ఆ దంపతులకు విందిచ్చి మూడింటికి కొంపకు చేరాను. కాస్సేపు నడుము వాల్చానో లేదో మాటూరి గోపాలరావు గారి ఏకపుత్రుడూ, నాకు మిత్రుడూ అయిన సుభాష్ గారు ఒక పెద్దాయనతో సహా వచ్చాడు. ఆయన తనకు బాబాయిగారనీ, సోషలిస్టు పార్టీలో క్రియాశీలంగా పాల్గొన్నాడనీ, ఆయనకు దినచర్య రాసే అలవాటు బలీయంగా ఉందనీ, దాన్ని ప్రచురించాలంటే ఎంత ఖర్చవుతుందో తెలుసుకుందామని వచ్చామనీ అన్నాడు. పెద్దాయన నైజాం పరిపాలనలోని 200 గ్రామాలను కోయలు విముక్తం చేశారనీ, సోషలిస్టుల నాయకత్వం లో అది సాధ్యమైందనీ, ఇంతలో హైమన్‌డార్ఫ్‌ను నైజాము నవాబు కోయగూడేలకు పంపితే గిరిజనాభిమాని అనే భావంతో మనసు విప్పి వాళ్ళు మాట్లాడారనీ, తిరిగి వెళ్ళిన ఆ పాశ్చాత్యుడు కోయల దగ్గరవున్న ఆయుధాల వివరాలనూ, ఆనుపానులనూ చెప్పినందువల్ల ఆకస్మికంగా ముట్టడించి తిరుగుబాటును అణచివేయగలిగాడనీ చెప్పాడు. ఈ రెండో విషయం నిజమైతే అతణ్ణి గౌరవించి ఆతిథ్యమిచ్చిన నేను చేసిన పాపానికి ప్రాయశ్చిత్తం లేదు. వేలపేజీల్లో ఉన్న ఆ డైరీల్లోని విషయాన్ని సంక్షేపించి ప్రచురిస్తే ఆది చరిత్రకు మహోపకార మవుతుందని, వేయి పదగలంత గ్రంథమవుతుంది, ముద్రణ వ్యయం భరించగలరా అంటే లేదన్నాడు. "ఒకవేళ విరాళాలు సేకరించి ముద్రించినా పది పదిహేనువందల రూపాయల వెల గల పుస్తకాన్ని ఎవరు కొంటారు? ఎవరు అమ్మగలరు?" అని ప్రశ్నిస్తే అది చరిత్రాభిమానుల కర్తవ్యమేనన్నాడు. "ఆలోచించుకొని మరొకసారి కబురు పెట్టండి. సంగ్రహంగా 200 పేజీల పుస్తకాన్ని ప్రచురించినా దాని ప్రభావం అద్భుతంగా ఉంటుం"దని చెప్పి పంపాను. వారి పట్టుదల సడలలేదు. నాటి చరిత్ర కాలగర్భంలోనూ, ఆ డైరీల్లోనూ దాక్కుంది!

నిరుద్యోగపర్వం మొదలైంది. మరునాడు రామకృష్ణ మఠంవారు నా పూర్వవైభవం నాకనిష్ఠ పుత్రుడి ద్వారా వినీ, నమ్మీ, తాము నెలకొల్పబోతున్న రామకృష్ణ వివేకానందుల చిత్రపట ప్రదర్శనశాలలో ఆయా చిత్రాల పక్కన రాసి ఉంచదలచిన సూక్తులను తెలుగుచేస్తారా అని అడిగారు. చేస్తానంటే ఇంగ్లీషులో వారి ప్రధాన కార్యాలయం వారు ఎంపికచేసిన సూక్తులను ఇచ్చారు. అనువదించి ఇవ్వటానికి వారం రోజులు పట్టలేదు. అనువదిస్తున్న సమయంలో హైదరాబాద్ బుక్‌ట్రస్టు వారు మిత్రులతో వచ్చి గిడుగు వేంకట రామమూర్తి గారు 1913లో ఇంగ్లీషులో రాసిన నివేదిక ఇటీవల దొరికింది. దాన్ని అనువదిస్తారా అంటే సరేనన్నాను – పూర్వాశ్రమంలో ప్రజావాఙ్మయమని వారి ఇంగ్లీషు వ్యాసాలను అనువదించిన అనుభవంతో. నివేదికానువాదం అంతకన్నా క్లిష్టమయింది. రెండు చోట్ల నేను అనువదించలేదు. ఒకటి: మదరాసులో ఆంధ్ర సాహిత్య పరిషత్ సమావేశంలో చేసిన తీర్మానాలున్న భాగం. ఎటూ పరిషత్ పత్రికలో ప్రచురించి

ఉంటారు కాబట్టి దాన్ని సేకరిస్తే సరిపోతుందన్న భావంతో అనువదించలేదు. రెండోది: కందుకూరి వీరేశలింగం గారు 'పాడు పుస్తకము'లను గురించి రాసిన వాక్యాలు. గిడుగువారు పరిషత్ పత్రికకన్నా ముందే కృష్ణాపత్రికలో వెలువడ్డ తీర్మానాలను ఇంగ్లీషులోకి అనువదించి వ్యాఖ్యానించారు. ఆ కృష్ణాపత్రిక సంచిక దొరకలేదు గాని పరిషత్ పత్రికలో అవి ఉన్నాయి. వీరేశలింగం గారి తెలుగును కాదని నేను తెలుగు చేయటం బాగుండ దనుకున్నాను. ఆ భాగాలను మేం సేకరిస్తామన్న వాళ్ళు రెండున్నర సంవత్సరాలు ఏమీ చేయలేదు. చివరకు మూలం, నా అనువాదం చేకూరి రామారావుగారి దగ్గర ఉన్నాయని తెలిసే సరికి నేనే మూలభాగాలను సేకరించగలిగాను. యార్లగడ్డ ఆంజనేయులుగారిద్వారా మూలానువాదాలు రెంటినీ పునస్సంపాదించి మిగిలిన రెండు భాగాలనూ చేర్చి 1995లో విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్‌ద్వారా ప్రచురించవలసి వచ్చింది. పుస్తకం వెలుగుచూసిన తరవాత రెండు రోజులకు చేకూరి వారు ప్రెస్ క్లబ్బులో తటస్థపడ్డారు. "నేను సువిస్తృత పీఠిక రాద్దా మనుకున్నా మీ అనువాదానికి. రోజులు దొర్లిపోతున్నా"యంటే, "ఆభాగ్యం మీకు దొరికేట్లు లేదు. నేను ప్రచురింపజేశా"నని మనవి చేశాను.

ఉద్యోగం పోయిన వారం పది రోజుల్లోనే రెండు మార్గాలు లభించాయి – భుక్తికి. ఒకటి నియమించినట్లు అధికార పూర్వకమైన ఉత్తరువు లేని ఈనాడు పనులు. ఏ పనికి ఎంత ఇవ్వటం ఆచారమో ఆ పని చేసినప్పుడు అంత ఇవ్వటమే గాని గంపగుత్తగా ఇంత అనే నిర్దేశం లేని ఉద్యోగమిది. నా జన్మలో ఎన్నడూ ఎక్కడా పొందని గౌరవాదరాలు అక్కడే లభించాయి. రెండోది గచ్చీబౌలీలోని కేంద్రీయ విశ్వవిద్యాలయంలో కొత్తగా నెలకొల్పుతున్న తులనాత్మక సాహిత్య విభాగంలో విజిటింగ్ ప్రొఫెసరుగా నియామకం. బోధనమాధ్యం ఇంగ్లీషు. తెలుగు శాఖలో పది పన్నెండు ఉపన్యాసా లివ్వటం కర్తవ్యాలు. సమయాభావంవల్ల రెండు తగ్గి పది విషయాలమీద ప్రసంగించవలసి వచ్చింది. 1. నిఘంటు నిర్మాణ సూత్రాలు – సిద్ధాంతాలు, 2. తెలుగు నిఘంటువులు, 3. వ్యాకరణతత్వం – సిద్ధాంతాలు, 4. తెలుగు వ్యాకరణ రచన – సిద్ధాంతాలతో సమన్వయం, 5. సమకాలిక సాహితీ విమర్శ ధోరణులు, 6, భాషానవీకరణ – పరిభాషా సమస్య, 7. అనువాద సిద్ధాంతాలు, విధానాలు, ఆచరణ, 8. భారతీయ సాహిత్యాలు – సమాజ చరిత్రతో సమన్వయం, 9. సాధుత్వాసాధుత్వాలు – భాషా శాస్త్ర దృష్టి, 10. తెలుగు సాహిత్యంలో తిరుగుబాటు ధోరణులు. కేంద్రీయ విశ్వవిద్యాలయంలో పనిచేయటం లంకమేతకు ఏటి ఈతకూ సరి అన్నట్లనిపించింది. నాచాదస్తంవల్ల నేను సకాలంలో అంతదూరం చేరినా, తలుపులు తెరవని రోజు లున్నాయి. అక్కడ వెలగబెట్టేది రెండున్నర గంటలే అయినా అయిదారు గంటలపాటు నేనున్నానో లేదో ఎక్కడున్నానో తెలియకపోవటం బాధాకరంగా ఉండేది. ఒకానొక పరమవిప్లవకారుడైన ఆచార్యు డొనాడు "విశ్వవిద్యాలయాల్లో విజిటింగ్ ప్రొఫెస ర్లుండాలా? అవసరమా?" అని నన్నే అడిగాడు పదిమందిలో. "తెగబోలెడు చాలా అవసరం. అసలు పెద్ద జీతాలు తింటున్న ఆచార్యులు పాఠాలు చెప్పటం ఇక్కడ మాని ఇతరత్రా చెప్పి పది రూపాయల దొంగ సంపాదన మీద బతుకుతున్నప్పుడు, వారానికి రెండు సార్లయినా మొహం చూపే సన్నాసులు అవసరమే గదా?" అని నేను విన్నవించవలసి వచ్చింది.



**విశ్వవిద్యాలయాలు**

ఏకాస్త వంకదొరికినా కార్యస్థానానికి రాని ఉపాధ్యాయు లున్నారంటే వారు సర్వతంత్ర స్వతంత్రులు కావటమే. వారికి హాజరుపట్టీలో సంతకంపెట్టే పనిలేదు. నెలజీతం నేరుగా బ్యాంకులో జమ అవుతుంది కాబట్టి ఎంగిలి చేసిన రెవిన్యూ స్టాంపు మీద సంతకం పెట్టి జీతం తీసుకోవలసిన కర్మలేదు. పని రోజుల్లో సభలు, సమావేశాలూ, చర్చాగోష్ఠులూ వర్కింగ్ లంచులూ (తిండి పని అని అనువదించవచ్చా ఈ ఇంగ్లీషు సమాసాన్ని?) ఉంటాయి. మరీ పెద్దలయితే విదేశ యానంలోనో, ఇతర విశ్వవిద్యాలయాల్లో ఇలాంటి పనులకోసమో వెళ్ళక తప్పదు. సొంత పరిశోధనలు, పరిశోధక విద్యార్థుల పర్యవేక్షణ, ప్రభుత్వాదులకు సలహాలివ్వటం వంటి చావ దీరని పనులుంటాయి. నేను చదువుకొనే రోజుల్లో మాది విశ్వకళాపరిషత్తే గాని విశ్వవిద్యాలయం కాదని సి.ఆర్.రెడ్డి గారి వ్యాఖ్యానం. ఇప్పుడు పరిషత్తుల్లేవు. ఆలయంలోని ప్రథమాక్షర లోపం సర్వసాధారణం. ఆయేడు నవంబరులో ననుకుంటాను తెలుగుశాఖాదిపతికి రాసిచ్చిన పద్యాల్లో ఒకటి –

**కడుపులో తిండి కదలని ఒడుపు పోయె**
**మిన్నులే పడ్డ ఇచ్చోట మిడుకు కతన–**
**ఉన్న దేమౌనొ తెలియ, దీ ఉంచుకున్న**
**దాని ప్రేమానురాగబంధమ్ము వలన...**

తులనాత్మక సాహిత్య శాఖను ప్రత్యేకంగా వేరుపరచటం చాలామందికి ఇష్టంలే దనిపించింది. తెలుగుశాఖాధిపతి దీనికీ అధిపతేగాని అనువాద పద్ధతులను గురించి ఇంగ్లీషు, భాషా శాస్త్ర శాఖలనుంచి ఎరువు పంతుళ్ళు పాఠాలు చెప్పేవాళ్ళు. అప్పటి హిందీ శాఖాధిపతి ఓసారి స్కూల్ సమావేశంలో విరుచుకపడ్డాడు. "మేం సీటివ్వని, పనికిరాదని నిర్ణయించిన విద్యార్థికి తులనాత్మక శాఖలో అవకాశం కల్పిస్తున్నారంటే మేమిచ్చే డిగ్రీలకు విలువ లేనట్లే గదా?" అని ఆయన పోరాటం. "డిగ్రీలు, శాఖలూ శాఖాధిపతులు ఇవ్వరు. విశ్వవిద్యాలయ మిస్తుంది" అంటే ఆయనకు రోషం వచ్చింది. "మేం లేనిదే విశ్వవిద్యాలయ మెక్కడుంటుం"దని గర్జించాడు. అకడమిక్ కౌన్సిల్ సమావేశం మొదటేడు దీన్ని చర్చించనేలేదు – అజెండాలో లేదని. రెండో ఏడు చర్చించినా ఏమీ నిర్ణయించలేదని తెలిసింది. ఈనాటికీ అదో ప్రత్యేకశాఖ అయినట్లు లేదు. ఆ విభాగంలో డిగ్రీలు పుచ్చుకున్న వారి గతేమిటనే ప్రశ్నకు సమాధానం లేదు. విశ్వవిద్యాలయాల స్వాతంత్ర్యానికి యథేచ్ఛానిర్ణయాధికార మని భాష్యం చెప్పారేమో తెలీదు. రెండో సంవత్సరంతో మొహంమొత్తింది. ఎటూ పూర్తికాలం ఉద్యోగంకాదు. అజాగళ స్తనంలాంటి అలంకారప్రాయమైన ఈ శరీరశ్రమ నుంచి బయటపడి బతికుంటే బలుసాకు తినవ చ్చనిపించింది. విద్యార్థుల ప్రవర్తన లక్షరెట్లు మెరుగు – ఉపాధ్యాయుల ఈర్ష్యాసూయాద్వేషాలకన్నా, క్రమశిక్షణరాహిత్యం కన్నా. అందుకే వినతిపత్రంలాంటి పద్యమొకటి శాఖాధిపతి పాదసన్నిధిని పారేసి వచ్చాను. అదేమంటే–

**ఈ నా జీవితశేష మంతయును సాహిత్యోపచారక్రియా**
**ధీనమ్మై పరమస్వతంత్రత పరాధీనమ్ము కాకున్నచో–**

**నే నిన్నాళ్ళుగ కోరు కార్యములు కానీ కాకపోనీ – మన**

**మ్మానందమ్మున నిండు! మిత్రుల సహాయం బిందు కర్థించెదన్** – అనేది.

### మరో అవతారం

ఈనాడు పత్రికాధిపతి రాష్ట్రంలోని భిన్న ప్రాంతాల్లో పని చేస్తున్న విలేఖరులకోసం కరె స్పాండెన్స్ కోర్సులాంటిది నడపాలని అభిలషించాడు. చదువుకోదలచిన వారందరికీ వారం వారం ముద్రించిన పాఠాలు పంపితే ఎవరికి వారు పాఠాల చివరి ప్రశ్నలకు స్వయంగా చూసి గాని, చూడకుండాగాని సమాధానాలు రాసి సరిచూసుకోవచ్చు. 52 వారాల తరవాత కేంద్రీ కృతంగా పరీక్ష జరుగుతుంది. ఉత్తీర్ణులకు మంచి అవకాశాలు కల్పిస్తామన్నారు. తెలుగుభాషా స్వరూపం, అనువాద పద్ధతులు, జర్నలిజం పాఠాలు తప్పకుండా పంపేవాళ్ళం. ఇంగ్లీషులో జర్న లిజం పాఠాలు పదహారింటితో అయిపోయినవనటం బాధాకరమనిపించింది. పత్రికలో పని చేస్తున్న వాళ్ళతో ఇది నెరవేరదని, తక్కిన పాఠాలు నేనే రాసి ఇచ్చాను. ఆ సమయంలో నాకు పనికి వచ్చింది కోటంరాజు రామారావు గారిచ్చిన పుస్తకం. మొదట ఈ కోర్సులో వందల సంఖ్యలో చేరిన వాళ్ళు చివరి పరీక్ష నాటికి పదుల్లోకి దిగారు. అందువల్ల ఎంపిక చేసిన విద్యార్థులను ఈనాడు కార్యాలయంలోనే క్రమపద్ధతిలో బోధించాలని నిర్ణయించాం. పత్రికల్లో తరచుగా ప్రయోగించే ఇంగ్లీషు మాటలను సేకరించి వాటికి తెలుగు పత్రికల్లో అప్పటికే సిద్ధంగా ఉన్న తెలుగుమాటలను నిర్దేశిస్తూ 'ఈనాడు వ్యవహారకోశం' తయారు చేశాను – 1990 నాటికి. ఆ గ్రంథం ప్రచురితమయ్యే నాటికే చాలావరకు సిద్ధమైన 'మరవరాని మాట' అనే కొటేషన్ల నిఘంటువు ఈ రచనాకాలానికి ముద్రణభాగ్యం నోచుకుంటున్నదన్న అనుమానం కలుగు తున్నది.

కొమర్రాజు వేంకట లక్ష్మణరావు గారు తెలుగుభాషాతత్వం గురించి ఒక గ్రంథమే రాశా రని అది అచ్చుకివ్వకముందే కన్నుమూశారనీ 1960లో నాకు డాక్టర్ అచ్చమాంబగారి ఉత్తరం ద్వారా తెలిసింది. ఆ రాత ప్రతిని అచ్చు వేయిస్తామని మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు తీసుక పోయారనీ, అది ఎలాగో చిలుకూరి నారాయణరావు గారికీ, గంటి జోగి సోమయాజి గారికీ దొరికిందనీ, అందులోని విషయాలను ఉపయోగించుకున్న వారు కనీసం లక్ష్మణరావు గారిని స్మరించనైనా లేదనీ, కష్టంమీద తమ భర్తగారు రాత ప్రతిని సంపాదించారనీ ఆమె నాకు ఉత్తరంలో వివరించి ఆ పెద్దల గ్రంథ చౌర్యాన్ని నిరూపిస్తూ పీఠిక రాయగల సాహసం నీకున్నదని నమ్ముతున్నా మన్నారు. వాల్తేరు చీరాల మధ్య ప్రయాణంలో ఒక పూటైనా విజయవాడలో తమను కలిసి పొమ్మని రాశారు. నేనప్పుడు పీకలదాకా అసంపూర్ణ సిద్ధాంత వ్యాస రచనలో ఉన్నాను. అయిదారు నెలల తరవాత ఆ పని నుంచి బయటపడితే మీ కోరిక మన్నించగలనన్నాను. తీరా చీరాల్లో కళాశాలా వ్యవహారాల్లో ఉపాధ్యాయ సంఘం పేచీల్లో మునిగిన నాకు ఆమెగారుకూడా కన్నుమూశారని తెలిసింది. 1985 ప్రాంతంలో హైదరాబాద్‌లోని నా స్వగృహంలో కొమర్రాజు లక్ష్మణరావు గారు అద్దెకు చేరారు. పూర్వోక్త లక్ష్మణరావు గారి పౌత్రులు వీరు. కన్నీటి చుక్కల్లా రాలిపడుతున్న నీటిచుక్కలను పట్టుకుంటూ కొళాయి దగ్గర తిష్ఠవేసి వంతులవారీగా నీళ్ళు



మోస్తున్న మాకు ఓ రోజు ఈ ప్రసంగం వచ్చింది. ఆ రాత ప్రతి శిథిల మవుతున్నదని తమ తండ్రి గారు వినాయకరావుగారు తమ చేత మరో ప్రతి రాయించారనీ మొత్తం తమ దగ్గర ఉందనీ అన్నారు. అచ్చు వేయించటానికి తమ శక్తి చాలదన్నారు. ఆయన్ను ఒప్పించి విశాలాంధ్ర పబ్లి షింగ్ హౌస్ వారిద్వారా నా పీఠికతో అచ్చు వేయించాను. మూలంలోని కొన్ని భాగాలు నాకు నేటికీ స్పష్టంగా బోధపడలేదు. ప్రకరణాల క్రమం మార్చకపోతే బాగుండ దనిపించింది. అది ముద్రణయోగ్య ప్రతి కాదు – గ్రంథరచనకు ఆయనో ప్రణాళికా రూపంలో చిత్తుగా రాస్తున్న ప్రతి అది – 1922 నాటిది. దాని విలువ దానికుంది. రచనాకాలం నుంచి ఏడు దశాబ్దాలు గడిచిన తరవాత ఎవరెవరు అందులోని ఏ భాగాన్ని సంగ్రహించారో చర్చించటం అనవసర మనిపిం చింది. నేను ఆరంభించిన పనులు అసలు నెరవేరనివి లేవుగాని సకాలంలో పూర్తి అయినవేవీ లేవు. అందులో కొమర్రాజు వారి గ్రంథానికి పీఠిక రాసే అదృష్టం ఒకటి.

అప్పుడప్పుడు రాసిన సాహిత్య వ్యాసాలనూ, భాషాశాస్త్ర వ్యాసాలనూ విడివిడిగా పుస్తక రూపంలో పెట్టి విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారి సౌజన్యంతో ప్రచురించగలగటం 1990లో సాధ్యమయింది. సెలవుల, అనుమతుల ప్రస్తావనలేని స్వతంత్రత వచ్చిందనటం కుదరదు. 'పుణ్యభూమి' కారణంగా శుక్రవారం ఉదయం (నమాజు– అని దాని ముద్దు పేరు) ఊరికీ ఇంటికీ కట్టుబడక తప్పని స్థితి. జర్నలిజం స్కూలు పాఠాల బాధ్యత ఉంటుంది. బడి మొదలయ్యే లోగా లభించిన విశ్రాంతిలో తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో నిఘంటు నిర్మాణ సమస్యల గురించి జరుగుతున్న సదస్సులకు హాజరైనాను. తెలుగుభాషా వ్యాకరణానికి సంబంధించిన సమస్త సమస్యల్లో కర్మణి ప్రయోగ మొక్కటే అత్యంత ప్రధానమనే భావంతో చేకూరి రామారావుగారు ఏదో విధంగా దాని ప్రస్తావన తేకుండా వదలరు. అది 1990 మార్చి 25వ తేదీ అనుకుంటాను. సగం వెక్కిరింతగా ఓ పద్యం చెప్పాను అత డుండగానే –

**'బడు' రామరావు చేకూ**

**రుడు కర్మణి తెలుగులోన రూఢం బగునా?**

**నడినెత్తి మొత్తి చెప్పిన**

**విడువంబడదయ్యె వాడవిధ మాతనిచే!**

అంటే "చూశారా! మీరూ 'బడు' ప్రయోగించారు. ఈ పద్యం నేను వాడుకోనా?" అన్నా డల్పసంతోషి. సరేనన్నా. నార్ల వేంకటేశ్వరరావు గారు తమ పత్రికలో ఉద్యోగులు కూడా అప్పు డప్పుడు 'బడు' ప్రయోగం చేస్తున్నందుకు విసుక్కుంటూ ఆ ప్రయోగం నిషిద్ధమని సర్క్యులర్ పంపమన్నారట. వెంటనే "బడు ఇక ముందు మన పత్రికలో వాడబడరాదు" అని సర్క్యులర్ పంపారని కొన్ని సంవత్సరాలపాటు పది మందికీ చెప్పి బాధపడుతుండేవారు. క్షుద్ర విషయాలకు గ్రాంథికమనే భావంతో వేళాకోళానికి చెప్పిన పద్యమైనా చేకూరివారి కిదో మహత్తర విజయ మనిపించింది. సంతోషం. చేరాతల్లోనో, మరో వ్యాసంలోనో ఈ పద్యాన్ని ఉదాహరించారని తెలిసి కనీసం ఒక్క జీవికైనా సంతోషం కలిగించగలిగిన ఒక్క పద్యమైనా రాయగలిగినందుకు సంతుష్టి పొందాను.

**అ.భా.సం. నిర్వాకం**

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తెలుగును అధికారభాషగా నిర్ణయిస్తూ 1966లోనే చట్టంచేసింది. అధికారభాషా సంఘాన్ని సృష్టించింది. దాని తొలి అధ్యక్షులు వావిలాల గోపాలకృష్ణయ్య గారు సదరు సంఘానికి అధికారంలేదని, భాషను గురించి తెలియదని, సంఘీభావం లేనిదని చమత్కరిస్తుండేవాడు. ఆయన తరవాత చండప్రచండ కవిపండితులు ఆ పీఠ మధిష్ఠించారు. తెలుగు అధికార భాషగా నేల నాలుగు చెరగులా వ్యాపించింది – ఇంకా ఊర్ధ్వలోకాలక్కూడా విస్తరించే స్థితికి వచ్చినట్లుంది. సరిగ్గా అలా జరుగుతున్న కాలంలో న్యాయపరిభాష చాలినంత లేక ఇబ్బందులు వస్తున్నాయని పెద్దలూ, పిన్నలూ గమనించారు. పైసా పెన్షన్‌లేని అభాగ్యుణ్ణి ఆదుకోవాలన్న సద్భావమేదో పొటమరించి ఉంటుంది. గాలించి నా కన్నా అయోగ్యుడు లేడని కనిపెట్టారు (యోగ్యులు వారివారి యోగ్యతలకు తగ్గ మహోద్యోగాల్లో ఉండి చావదీరని అవిశ్రాంతిలో బాధపడుతుంటారు). నన్నాపని కొంత చేసిపెట్టి పదివేల రూపాయలు ప్రతిగ్రహించమన్నారు. నేను దరఖాస్తు చేయలేదు. నేను పెన్షనరును కూడా కాదు కాబట్టి నన్ను నిర్బంధించే అధికారమూ లేదు ప్రభుత్వానికిగాని, దాని శాఖలకుగాని. వారిచ్చిన పదపట్టికలకు తెలుగు పరిభాషను సూచించడమే నా బాధ్యత. ఆ పనిపూర్తికాగానే న్యాయమూర్తి ఆవుల సాంబశివరావుగారి ఆమోదం పొందా లన్నారు. పదపట్టిక ప్రతులను అధికారభాషా సంఘం కార్యదర్శితో వెళ్ళి న్యాయశాఖా కార్యదర్శికి సమర్పించాను.

నెలలు గడిచాయి. సంవత్సరం దాటింది. చెల్లించవలసిన ప్రతిఫల మివ్వలేదు. ఉత్తరాలకు ప్రత్యుత్తరం లేదు. చివరికి వ్యాజ్యమాడుతానని రిజిష్టర్డు పోస్టులో తెలియబరిచాను. ఖాతరు చేయలేదు. వకీలు చేత చట్టం నిర్దేశించిన గడువు పేర్కొంటూ సకాలంలో చెల్లించకపోతే దావా వేస్తానన్నాను – నోటీసు అందుకున్నారు. మౌనం పాటించారు. గడువు తీరిన తరవాత దావా వేశాను – ప్లీడరు ఫీజు, కోర్టుఫీజు చెల్లించి. ఆ మీదట 1991 జనవరి 15వ తేదీన ఒక ఉత్తరువు జారీచేసి మూల్యం ఇంటికి తెచ్చి ఇచ్చారు. మరి వ్యాజ్యం ఖర్చుల సంగతేమిటనే ప్రశ్నే వేసుకోలేదు అభాసవారు. దావా నడిచింది (ఓ.ఎస్.2121/1991). ప్రభుత్వం హాజరుకాలేదు. 1993 మార్చి 12వ తేదీన ఏకపక్ష నిర్ణయం ప్రకటించారు కోర్టువారు. ప్రభుత్వ యంత్రాంగం కదలలేదు. అజాగరాన్ని కదిలించడానికి 1996 దాకా వేచిచూసి నాకు రావలసిన బకాయి కోసం ప్రభుత్వాస్తులను జప్తుచేయించమంటూ న్యాయస్థానాన్ని అభ్యర్థించాను. ఉత్తరువును రద్దుచేయమని ప్రభుత్వం కోరింది న్యాయస్థానాన్ని. లిమిటేషన్ యాక్ట్ ప్రకారం గడువు తీరడానికింకా కొన్ని నెలల వ్యవధి ఉందికాబట్టి మొత్తం వ్యవహారాన్ని తిరగదోడమంది! కోర్టువా రంగీకరించలేదు. 22.4.1998 నాడు తుదినిర్ణయం వెలువడింది. అప్పుడూ హైకోర్టుకు పోవాలని ప్రయత్నించి, గవర్నమెంటు ప్లీడరు ఇప్పటికే విపరీతమైన జాప్యం జరిగింది కాబట్టి పునర్విమర్శన సాధ్యంకాదని 1.9.98 నాడు ఉత్తరం రాస్తే సర్కారు వారు చిట్టచివరకు 22.10.98 నాడు బకాయి చెల్లించేందుకు ఉత్తరువు జారీచేశారు! మొత్తం వ్యవహారం ప్రభుత్వంవారి చిత్తశుద్ధివల్ల ఎనిమిదేళ్ళకు తేలింది. అది ఒక ఎత్తు.



సర్కారు వారి ఉత్తరువులోనే (Go, Rt. 4445 of GAD (OL-I) Dept., of 22.10.1998) దాని బతుకు బయటపడింది. ఏ పద్దుకింద ఈ చిల్లర సొమ్ము చెల్లించాలో స్పష్టంగా తేలక, 1998–99 ఆర్థిక సంవత్సరానికి అదనపు నిధులు ప్రతిపాదించి సంపాదించవలసి ఉంది కాబట్టి అనుకోని ఖర్చుల నిమిత్తం కేటాయించిన నిధుల్లోనుంచి సాధారణ పరిపాలన శాఖవారు కావలసిన సొమ్ము (కేవలం రూ. 2,854 లు) బయానా తీసుకొని చెల్లించడానికి ఆర్థికశాఖ వారి అనుమోదంకూడా పొందామని రాసుకున్నారు! ఎంత దరిద్రస్థితిలో ఉందో పాపం మన ప్రభుత్వం. ఇందులో కనీసం రెండు రకాల దుర్మార్గాలున్నాయి. ప్రభుత్వానికి న్యాయశాఖ ఉంది; సొంత న్యాయవాదు లున్నారు; పెద్ద జీతాల ఉద్యోగు లున్నారు; అన్నిటికన్నా ముఖ్యం దిగ్గంతుల వంటి అధికారభాషా సంఘంలోని విద్వాంసులున్నారు. వీరెవరికీ న్యాయపరిభాషను కల్పించేందుకు ఓపికా, తీరికా, శక్తీ లేకపోవడంవల్లనే గదా నావంటి అభాగ్యుడి కీపని అంటగట్టింది? సేవలు పొంది చెల్లిస్తామన్న ప్రతిఫలం చెల్లించకపోగా ఏడేళ్ళపైకాలం వ్యాజ్యమాడిన ప్రభుత్వం, దాని యంత్రాంగం, దాని సారథులను గురించి ఏమనుకోవాలి? అభాస అధ్యక్షులవారి ఆమోదం లేనందువల్ల ఇలా జరిగిందనీ, ఏనాడో నాతోబాటు ఆంధ్రవిశ్వకళాపరిషత్తులో చదివిన ఒక అనామకుడు సమున్నతాధికారిగా ఉండగా అతగాణ్ణి నేనాశ్రయించకపోగా ప్రభుత్వం మీదనే వ్యాజ్యం తెచ్చిన నా దురహంకారాన్ని తగ్గించడానికి తాను రిటైరయ్యేదాకా నాకు పైసా చెల్లించనీనని ప్రతిజ్ఞచేసి వీరంగం తొక్కాడనీ, అందువల్ల ఇలా జరిగిందనీ పుకార్లు వచ్చాయి. ఆ సన్నాసులు కోర్టుకు హాజరై ఈ (కారు)కూతలు కూస్తే ఏమయ్యేదోగాని, ఉత్తరకుమారప్రజ్ఞలు నెరవేరనందుకు సదరు వ్యక్తుల చిత్తశాంతికోసం ప్రార్థించాలని మాత్రం నా కనిపించింది. ఈ బాపతు అనుకూల శత్రువులే ఎక్కువ ప్రమాదకారులు. పైసా పెన్షను కాశించని నేను, నా జీవితశేషమంతా ఈ ముష్టి పదివేల రూపాయలతోనే గడుపుకోలేక అలవటించిపోతానని ఎలా ఊహించారో ఈ వాజమ్మలు! వారికోరిక నెరవేరనందుకు సానుభూతి చెప్పక తప్పదు.

1991లో జర్నలిజం స్కూలు అవతరించింది. నన్ను దానికి ప్రిన్సిపలని వ్యవహరించారు. చెల్లింపుల్లో కొన్నిసార్లు వృత్తిపరమైన సలహానిమిత్తమని, మరికొన్నిసార్లు సలహాకని రాస్తుండేవాళ్ళు. ఏమని పిలిచినా ఏమి చెల్లించినా నియామకపత్రం లేదు. దరఖాస్తూ లేదు. బ్యాంకు చెక్కులూ, రెవిన్యూ స్టాంపు అతికించిన రశీదులూ ఉండేవి. ఆయేడు మదరాసులో కన్యాశుల్క నాటక ప్రదర్శన శతజయంతి ఉత్సవాలు జరుపుతూ వచ్చి నాలుగు ముక్కలు చెప్పి పొమ్మని ఆహ్వానిస్తే రాంభట్ల కృష్ణమూర్తి గారితో కలిసి వెళ్ళాను. సాయంత్రం సభ జరిగింది.

**మద్రాసు సభ**

మరునాడు సాయంత్రం తిరుగు ప్రయాణ మనుకుంటుండగా ఉదయం మా ఇద్దరినీ పి.టి.ఐ. వారి కార్యాలయానికి ఆహ్వానించారు. అక్కడ ఉదయం 9 గంటల నుంచి మధ్యాహ్నం ఒంటి గంటదాకా దండయాత్ర జరిగింది. "రాంభట్ల సరే. దశాబ్దాలేమిటి? అర్ధ శతాబ్ది పైగా జర్నలిస్టు వృత్తిలో ఉన్నవాడు. నీవెంత? నీ బతుకెంత? తెలుగుపంతులివి. నీవు జర్నలిస్టులకు పాఠాలు చెప్పటమేమిటి?" అని నా మీద విరుచుకపడ్డారు. భాషనుగురించి మాట్లాడవచ్చుగాని

నీవు జర్నలిజం స్కూలుకు ప్రిన్సిపలు వేమిటన్నారు. ప్రశ్నోత్తరాల సమయం ఒక గంట గడిచిన తరవాత ధోరణి మారింది. 'ఈనాడు' మీద ఎవరెవరు ఏ విధమైన దండయాత్ర చేయదలుచు కున్నారో అవన్నీ నావైపు దృష్టి నిలిపి సమాధానాలకు నిగ్గదీశారు. రాంభట్ల సాయం నాకు లేకుండా చేశారు. మినీ డెయిలీ లెందుకు పెట్టారు? చిన్న పత్రికలను దెబ్బతీయటానికా? జోన్లని ప్రాంతాలని జిల్లాలని విభజించి ఒక చోటి వార్త మరో చోట తెలియకుండా దాచటంలోని ఉద్దేశ మేమిటి? రంగులద్దట మేమిటి? ఇలాంటివన్నీ ప్రశ్నలు. టర్కీలో, ఫ్రాన్సులో ప్రాంతీయ విభాగా లతో పెద్ద పత్రికల వాళ్ళు చిన్న స్థానిక పత్రికలు నడపటం నలభై ఏళ్ళుగా జరుగుతున్నది. వాణిజ్య ప్రకటనలను కూడా స్థానిక పత్రికల్లో స్థానిక ప్రకటనలుగానే ప్రచురిస్తున్నారు. టి.వి.తో పోటీపడి దృశ్యకావ్యాలను ఆవిష్కరించలేం. గంటగంటకూ వార్తాప్రసారంచేసే టీవీలూ, రేడియోలూ క్షణక్షణం మారే సరికొత్త వార్తలనూ, వ్యాఖ్యలనూ అందిస్తున్నప్పుడు వాటికన్నా వేగంగా దినపత్రిక వేడివేడి వార్తలందించలేదు. ప్రధాన సంఘటనలను మాత్రమే అందించగల టీవీ, రేడియోలతో పోటీలేకుండా స్థానిక వార్తలు జనరంజకాలని గ్రహించి ప్రచురించటంలో తప్పే మిటి? ప్రతి గ్రామంలోనూ నిత్యం జరిగే సంభవాలనూ రాష్ట్రవ్యాప్తంగా ప్రచురించాలంటే ఎంత స్థలంకావాలి? ఎన్ని పేజీలు ముద్రించాలి? ఎంత ఖరీదుకు అమ్మాలి? అని అడ్డం తిరుక్కున్నాను. తెలుగు దినపత్రికల్లో రంగులద్దిన మొదటి పత్రిక ఉదయంగానీ ఈనాడు కాదు. తక్కిన దినపత్రిక లన్నీ ఫోటోకంపోజింగ్ చేపట్టిన తరవాత కొంతకాలానికిగాని ఈనాడు లెటర్‌ప్రెస్సునుంచి బయటపడలేదు. ఈనాడు జిల్లా ఎడిషన్లు ప్రచురించటం నీతిబాహ్య మనిపిస్తే తక్కిన పత్రికల వారు కూడా అదేపని ఎందుకు చేస్తున్నా రని ప్రశ్నించాను. ఈ వాదోపవాదాల ఫలితం నాకూ జర్నలిజం గురించి నాలుగు ముక్కలు తెలుసనే భావం కలిగించినట్లుంది. నేనుపయోగిస్తున్న పాఠాలను తమకిస్తే దక్షిణభారత జర్నలిస్టుల సమాఖ్య ప్రచురించి పదిమందికీ సాయపడుతుం దన్నారు. రామోజీరావు గారితో మాట్లాడిన తరవాత చెప్తానన్నాను. అప్పటికే మేం పాఠాలుగా అందిస్తున్నవి దొంగచాటుగా కొన్ని విశ్వవిద్యాలయాలకూ అమృతవాణి వంటి వాటికీ అందాయి. ఇలా జరుగుతున్నదంటే "మనకు ఏకలవ్య శిష్యు లేర్పడితే సంతోషిద్దాం" అని రామోజీరావు గారు అభ్యంతరపెట్టలేదు. అప్పుడు పాఠాలు పంపితే వాళ్ళు నా కోరికకు భిన్నంగా కలగాపులగం చేసిన విషయాలతో ప్రచండమైన శీర్షికతో సంపాదించిన విరాళంతో పుస్తకం అచ్చువేసి తిరుపతిలో ఆవిష్కరిస్తున్నాం రమ్మని ఆహ్వానించారు. జర్నలిస్టులమన్న వాళ్ళకు సగం ధరకే పుస్తకా లమ్మి నష్టపోయామని దుఃఖించారు. అప్పుడు నేను విశాలాంధ్ర వారితో ఏర్పాటుచేసి ముద్రణ ప్రచురణలు వారు చేసి, అమ్మిన సొమ్ములో నాకు రాయల్టీగా చెల్లించే మొత్తాన్ని సదరు సమాఖ్య వారి కిచ్చే ఏర్పాటు చేశాను.

ఈనాడు జర్నలిజం స్కూలులో చేరటానికి వేల సంఖ్యలో దరఖాస్తులు వచ్చేవి. భాషాజ్ఞానం, అనువాదశక్తి పరీక్షించే ప్రశ్నపత్ర మొకటి, ప్రపంచజ్ఞాన పరీక్ష చేసేది మరొకటి. ఆన్సరు చేసిన పత్రాలను సరిచూసి కనీసం 40 శాతం మార్కులు వచ్చిన వాళ్ళను మౌఖిక పరీక్షకు ఎంపికచేసే వాళ్ళం. అభ్యర్థులు తమ దరఖాస్తుతో ఏదో ఒక ఆధునిక విషయం గురించి ఒక వ్యాసం రాసి



పంపవలసి ఉండేది. సమాధాన పత్రాలు చూసి చదివి బాధపడి రాసిన పద్యా లొక రెండు –

**తెలుగా చచ్చెను, ఇంగిలీషు మృతి చెందెన్, భావజాలంబు వి**
**హ్వలతాపాదక మయ్యె, సంస్కృత మహాప్రాణంబు లల్పంబులై**
**పొలిసెన్, సంధిసమాస సంకరము దుర్బోధంబుగా మారె, క**
**న్నులు పెన్నుల్ శిథిలంబు లయ్యె, నవగణ్యుల్ వ్రాయగా చూడగా –**
**వందల కొలంది దుష్టకావ్యములు వెలసె**
**వేల లక్షల తప్పులు విస్తరించె**
**కాల మల్పంబు శ్రమ నిరాఘాట మగుట**
**మతులు పోయెను, పంతుళ్ళ గతులు తప్పె.**

ఇలా పిచ్చిపద్యాలు రాసుకుంటే మనశ్శాంతి కలుగుతుందనే విశ్వాసం చిన్నప్పుడే పుట్టింది. అది తొలగిపోవటం లేదు.

**సభల ధోరణి**

1992లో భిన్నగ్రంథ రచనకు కావలసిన ముడిసరుకు పోగుచేయటం మొదలైంది. ఒక వైపు పాఠాలు చెప్పుకోవటం, సమీక్షలు రాయటం నిత్యకృత్యాలైతే, మరోవైపు పాత అలవాట్లు తప్పించి అప్పుడప్పుడు సాహిత్య సభలకు హాజరుకావటం ఆరంభించాను. ఉపన్యాసాలు విన టానికి వెళ్ళినప్పుడు తెలిసినవాళ్ళు సభానిర్వాహకు లైతే ముందు చెప్పకుండా నాలుగు మాటలు మాట్లాడమనే దుష్టసంప్రదాయం బాధించేది. అలా పిలవటం మర్యాద అని సమర్థించుకోవటం ఒక ఎత్తయితే, పిలవగానే వచ్చి సభ నలంకరించి సందేశ మిచ్చినందుకు కృతజ్ఞతలు చెప్పటం మరో ఎత్తు. ఈ లక్షణాలు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి పుట్టుకతో హైదరాబాదులో మొదలై ఆ సంస్థ గిట్టిన తరవాత కూడా కొనసాగుతూ యావదాంధ్రకూ విస్తరించటం దురదృష్టం. సభకు వచ్చిన, వద్దా మనుకొని రాని, రాదగ్గ, సభామధ్యలో మరో కార్యక్రమముందని వెళ్ళే మహాత్ము లందరినీ అభినందన మందారాలతో నమస్సుమాంజలులతో ప్రస్తుతించి, సదస్సులనూ నానా సంఘాల వారినీ పురస్కారగ్రహీతను సత్కరించమని ఆహ్వానించటం వృత్తిగా, ప్రవృత్తిగా, సంప్ర దాయంగా, వ్యాపారంగా విశ్వరూపం ధరించటం జాతి దౌర్భాగ్యానికి చిహ్నమయింది. కొన్ని సార్లు సభ్యుల్లోగాని, ఉపన్యాసకుల్లోగాని, నానావిధాతిథుల్లోగాని మార్పు కనిపించదు. వినీవినీ చూసీచూసీ పూర్వపద్ధతులను స్మరించీ ఇలా బాధపడ్డాను:

**కోర విశాలాంధ్రము మన**
**సారగ, ఆంధ్రప్రదేశ సంస్థానము చే**
**కూరెన్; సంస్కృతి పైరవి**
**కారుల పాలాయె; పిదప కాలము వచ్చెన్.**

సాహితీ సంస్కృతులు కొద్దిమంది చేతుల్లోకి వచ్చాయి. విమర్శ అంటే ప్రస్తుతి. కాళిదాసాదుల లోపాలను ఎత్తిచూపి దూషించవచ్చుగాని ఈ అభినవ రామకృష్ణుల పొరపాట్లను గూడా ప్రస్తావించరాదు. ఇది సరికాదని రాస్తే వారివారి భక్తులు, సేవకులు, అభిమానులు

విడివిడిగా కలివిడిగా దండెత్తి దూషించటం, బెదిరించటం పరిపాటి అయిపోయింది. సింగిరెడ్డి (సత్య) నారాయణరెడ్డి గారు 'తెలుగు కవిత – లయాత్మకత' అనే మహాగ్రంథం ప్రచురించారు. దాన్ని సమీక్షించే ప్రయత్నంలో ఇన్నాళ్ళుగా చదివిన చదువూ, సంగీతశాస్త్రంలో పారంగతులైన పండితుల సహాయమూ వినియోగించి లయతాళాలు ఒకటికావని రాస్తే కొందరింటికి వచ్చి బెదిరించారు – నూకలు చెల్లుకుంటాయి జాగ్రత్త అని! ఒకరేమో భగవ ద్దూషణ జరిగిందన్నంతగా బాధపడి ఏమేమో రాశారు పత్రికల్లో. నా ప్రశ్నలివి. వీటికి సూటిగా సమాధానం చెప్పమంటే దైవదూషణ చేస్తారా అన్నట్లు విరుచుకపడ్డారు. అష్టవిధతాళాంగాల్లో ఒకటని సంగీతశాస్త్రగ్రంథాలు చెప్పిన లయ, అందుకు విరుద్ధంగా తాళమేనని ఎలా అన్నారు? "నృత్తం తాళలయాశ్రితమ్" అని భరతముని ఆ రెంటినీ వేరువేరుగా భావించి ఎందుకు ప్రసంగించాడు? "అగ్నిమీడే పురోహితమ్" వంటి వేదవాక్యాలు స్వరవిరహితంగా తాళానుసారంగా ప్రథమాక్షర లోప మెందుకు పొందాలి? అగ్ని శబ్దంలోని అకారం లోపిస్తే మిగిలిన భాగానికి అర్థమేమిటి? "కమలాకుచ చూచుక కుంకుమతో..." అనే సంస్కృత వృత్తాన్ని లయాత్మకం చేయాలని, మొదటి రెండక్షరాలనూ తొలగించి సరిదిద్దవచ్చా? అలా చేయకుండా పాడిన ఎం.ఎస్.సుబ్బలక్ష్మి, ఘంటసాల వేంకటేశ్వరరావుల సంగీత పరిజ్ఞానం దోషభూయిష్ఠమా? గ్రంథకర్త స్వయంగా ఉదాహరించి అనువదించిన నిర్వచనమే లయతాళాలు ఒకటి కాదంటుండగా, స్వవచోవ్యాఘాతాన్ని విస్మరించి సమీక్షకుడి మీద ఈ యుద్ధ ప్రకటన ఏమిటి? కాళిదాసాదులను నిర్దిష్ట విషయ పరిశీలనలో దారుణంగా ఖండించిన అభినవగుప్తాదులు సహృదయులు కాదా? అధికార పదవులూ, బిరుదులూ సంపాదించిన వారిని ప్రశ్నించటమే నేరమా? ఇలాటి ప్రశ్నలతో విశ్వవిద్యాలయ తెలుగు శాఖాధిపతులందరికీ వాదభిక్ష ఇప్పించమని రాశాను. ప్రత్యుత్తరాల్లేవు, చాటు మాటుగా తిట్టిన వాళ్ళూ మెచ్చిన వాళ్ళూ ఉన్నారు గాని. తెగబడితే ఏం జరుగుతుందో చూద్దామని నేనూ కొన్ని పద్యాలు రాసి నా లేఖకు అనుబంధంగా పంపాను. వాటికీ సమాధానం లేదు. కడుపుమండి రాసిన పద్యాల్లో రెండు మూడు ఉదాహరిస్తాను.

**మీటింగు తేరకల్లును**
**వాటంబుగ లేని బతుకు వలదని యేద్వన్**
**పాటించి జ్ఞానపీఠి**
**న్నాటె సినారేను పి.వి. నయవంచనతో –**

**వారా లబ్బాయనియెదు**
**పేరు నుభయచరమటన్న బిరుదును గల ఈ**
**పైరవికారుని పదవుల**
**తీ రేమగలంజ కబ్బె తెలుగులలోనన్? –**

**శ్రోతలె కల కవితావి**
**ఖ్యాతికి, పాఠకులులేని యవకరమునకున్**

**లాతిపలుకు సమయించుట**
**ప్రీతి సినారే స్వభావరీతికి కుదురై–**

డెబ్బై ఏళ్ళ జీవితంలో చాలామంది కవిసమ్రాట్టులనూ, సార్వభౌములనూ, చక్రవర్తులనూ చూశాను. వారి రచనలు చదివాను. ప్రసంగాలు విన్నాను. 'మందః కవి యశః ప్రార్థీ గమిష్యా మ్యుపహాస్యతామ్' అన్న మహాకవి వినయానికి పులకరించాను. 'భగవద్గీతా కించి దధీతా' అన్న మహావిద్వాంసుడి ప్రామాణ్యాన్ని స్మరించి పారవశ్యం పొందాను. రాజకీయాధికారం కన్నా భయంకరంగా, నియంతృత్వం కన్నా నిర్దాక్షిణ్యంగా వ్యవహరించే దురహంకారుల సామాన్యత్వాన్ని గుర్తించాను – గర్హిస్తాను. 'విద్య యొసగును వినయంబు" అనే సూక్తి కలికాలంలో వర్తించదేమో.

గడచిన శతాబ్ది చివరి అయిదేళ్ళూ హడావిడిగా గడిచాయి. జీవితంలో పడదగిన కష్టాలూ, సుఖాలూ రెండూ ఉక్కిరిబిక్కిరిచేశాయి. 1995లో సాహిత్య అకాదమి ప్రచురించిన "భారతీయ సాహిత్యం – సమకాలిక కథానికలు" అనే గ్రంథంలోని చివరి కథానికను అనువదించటమేగాక సహసంపాదకత్వం వహించగలిగాను. చిన్నయసూరిని గురించి నేను రాసిన మోనోగ్రాఫును ఆయేడే అకాదమివారు ఇంగ్లీషులో ప్రచురించారు. బి.ఆర్.అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం వారు జర్నలిస్టులకోసం రాయించిన "ప్రసారమాధ్యమాలకోశ"మనే గ్రంథానికి సంపాదకత్వం వహించాను. విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్ వాళ్ళు నేను సిద్ధం చేసిన పురాతన నామకోశాన్ని ప్రచురించారు. అప్పటికి పదేళ్ళక్రితం నేను తెనుగుచేసిన "సాగరశాస్త్రం" అనే గ్రంథాన్ని నేషనల్ బుక్‌ట్రస్ట్, ఇండియా వాళ్ళు ప్రచురించారని మిత్రుల ద్వారా తెలిసి వెంటబడితే దయదలచి రెండు ప్రతులు పంపారు! అంతకు పదేళ్ళు ముందు నా చేత అనువదింపజేసిన సలీమ్ ఆలీ పక్షులను గురించి రాసిన పుస్తకం ప్రతి ఏమయిందో తెలియదని వారే ఖండితంగా తెలియజేశారు!

## తెలుగు విశ్వవిద్యాలయం కత

'అతనికంటె ఘనుడు ఆచంటి మల్లన్న' అన్నట్లు నేషనల్ బుక్‌ట్రస్టు కన్నా గొప్ప సంస్థ తెలుగు విశ్వవిద్యాలయం. దాని అవతరణకు ముందు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాదమి వారి ఆదేశం ప్రకారం క్రీ॥ శ॥ పన్నెండో శతాబ్దినాటి తెలుగు శాసనాలను క్రోడీకరించి ఇస్తే ఆ మహాసంస్థ అంతరించే నాటికి పీఠికాభాగం తప్ప తక్కిన భాగం అచ్చయింది. తెలుగు విశ్వవిద్యాలయం అవతరించింది. మొదటి ఉపాధ్యక్షుడుగా ఒకనాటి సహాధ్యాయి ఆచార్య తూమాటి దొణప్ప అధికారం స్వీకరించారు. ఎన్నోసార్లు హెచ్చరించాను – గ్రంథానికి పీఠిక రాసి ప్రచురించమని. అలనాటి ముద్రణ శాఖాధికారి బహుధా పరిశ్రమించి గ్రంథం పోయిందని కొన్నిసార్లూ, సికిందరాబాద్‌లోని బాల్‌రెడ్డి ప్రెస్సులో ఉండిపోయి వివాదం కోర్టుల్లో ఉంది కాబట్టి అన్ని సమస్యలూ తీరినప్పుడు వెలుగుచూపవచ్చునని కొన్నిసార్లూ ఓదార్చారు. దొణప్ప గారి తరవాత గద్దె నెక్కిన వారు తమ స్థాయిని గుర్తించకుండా తమకు ఈ గ్రంథం సంగ తెంతలో ఉందని లేఖ రాసినందుకే మండిపడ్డారు! పేర్వారం జగన్నాథంగారు ఆ పదవిలోకి వచ్చి పూర్వమైత్రిని

పురస్కరించుకొని నాశుభాకాంక్ష లర్థించే నాటికి నేను కంటి శుక్లాలకు శస్త్ర చికిత్స చేయించుకొని నిస్తేజంగా పడి ఉన్నా. స్వయంగా బయటికి వెళ్ళగలిగిన తరవాత పేర్వారం వారిని కలిసి నా దగ్గరున్న అచ్చయిన భాగాన్ని సమర్పించి, ఎదురుగా శవాన్ని పెట్టుకొనే కన్నా దానికి దహనమో, ఖననమో ప్రాప్తింపజేస్తే కొంత కాలానికైనా దుఃఖోపశమనం కావచ్చునని చెప్పాను. ఆయన వెతికించీ, అప్పటికి ప్రచురణ శాఖాధిపతి అయిన నా పూర్వసహోద్యోగి జయధీర్ తిరుమలరావు గారు అవిశ్రాంతంగా వెంటబడీ సమాధినుంచి వందో రెండు వందలో కాపీలను – సగానికి పైగా చెదలు తిన్న వాటిని – బయటికి తీయించగలిగారు. ఇరవయ్యో శతాబ్దంలో ఇటువంటి దుస్థితి ఉండగా పోతన భాగవతాన్ని నాటి రాజులు పాతిపెట్టించారంటే అది నమ్మగూడని విషయం కాదనిపిస్తుంది.

ఆ శాసనాలు అలా బయటపడేసరికి 1996 వచ్చింది. వాటితోబాటే సమర్పించిన 13వ శతాబ్ది తెలుగు శాసనాల ప్రతి అలాగే అదృశ్యమై ఆ జయధీర్‌వల్లనే బయటపడి ఎన్.గోపి గారు ఉపాధ్యక్షులైన తరవాత ముద్రాపకుల నియామకం అనే మరో దశాంతరానికి చేరుకుంది. అయితే ఈ రచనా కాలానికివ్వూడా ముద్రణ మొదలుకాలేదు. ఈ శాసన గ్రంథాలు అచ్చుకానందు వల్ల తెలుగు చరిత్రకూ, సంస్కృతికీ వచ్చిపడే ప్రమాదం ఏమీలేదు. అవి అచ్చయినంత మాత్రాన నాకు కొత్తగా వచ్చే ప్రతిష్ఠగాని, అప్రతిష్ఠగాని, ప్రయోజనంగాని, ప్రమాదంగాని లేవు – ఉండవు. కాకపోతే నానా కష్టాలుపడి నెల్లూరు శాసనాల కోసం ఊళ్ళు పట్టి తిరిగిన ఆడగూతురు సుధకు ఆ గ్రంథ ప్రచురణ ఉద్యోగావకాశాలు కల్పించి ఉండేదేమో. ఆమె ఏమయిందో, ఎక్కడుందో తెలీదు. నాయని కృష్ణకుమారిగారు సదరు విశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్షురాలుగా ఉండగా కొత్తగా పరీక్ష పాసై, అంతో ఇంతో పరిశోధన కార్యక్రమంలో పాల్గొని, ఉద్యోగంకోసం– కాదు– బతుకుతెరువుకోసం – అలమటిస్తున్న ఓ ఆడపిల్లకు సాయపడిన పుణ్యం సంపాదించటానికైనా ఆ శాసన గ్రంథాలను ప్రచురించమని అర్థించాను. ఎవరి హృదయమూ కరగలేదు. తడిసిన సిమెంటులా గట్టిపడ్డదేమో తెలీదు. ఆ సంవత్సరమే నా మీద దయదలచి కేంద్ర సాహిత్య అకాదమి వారు అంతకు రెండేళ్ళ క్రితమే నేను ఇంగ్లీషులో రాసి సమర్పించిన శ్రీశ్రీ మీద మోనో గ్రాఫును ప్రచురించారు.

చెప్పటం మరిచిపోలేదుగాని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాదమి జీవించి ఉండగా, ఏనాడో కుంచె పట్టడం మానేసిన రాంభట్ల కృష్ణమూర్తిగారి చేత రేఖా చిత్రాలు వేయించి సమర్పించిన ఒకానొక వృత్తి పదకోశం రాతప్రతికివ్వూడా తెలుగు శాసనాల గతే పట్టింది. పాత రికార్డులు తిరగవేస్తే అకాదమి అస్తమయానికి రెండేళ్ళు ముందుగానే రాతప్రతినిస్తే భిన్న భాగాలుగా పద జాలాన్ని విభజించి పునస్సమర్పించమని ఆదేశించారు. మొదట్లో అది చేతి పనులకు సంబంధించినంతవరకే పరిమితం కావాలన్నా, సంపాదకమండలివారు చిత్రలేఖనం, శిల్పం, నాటకం అనే వాటిని కూడా చేర్చాలనీ అవీ చేర్చిన తరవాత కోశమంతా ఒకే అకారాదిక్రమంలో ఉండటం కన్నా ఏ భాగానికి ఆ భాగం విడివిడిగా అకారాదిగా ఉండాలనీ తీర్మానించారు. పని పూర్తి అయిన తరవాత తిరగదోడి బయలుదేరిన చోటికి తిరిగి పంపటంలో మా గురువుగారు సిద్ధహస్తులు. వారే సంపాదక మండలి అధ్యక్షులు. పేరు చెప్పలేదా? ఎంత పొరపాటయింది! వారి పేరు ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారు. భాగాలుగా విభజిస్తే ఉపకరణాల విషయం పునరుక్త మవుతుందంటే వీలైనంత వరకు అలా జరక్కుండా చూడమన్నారు. నాతోబాటు మొదలుపెట్టిన ఇతరుల కోశాలు సిద్ధమైతే అప్పుడు దీనిని వాటితో బాటు ప్రచురించవ చ్చనేది కవిహృదయం. అవి ఈనాటికీ పూర్తికాలేదన్నది వేరే విషయం. పూర్తి చేసి సమర్పించిన రాతప్రతీ, చిత్రాలూ శాసనాల్లా అంతరించి, పునర్జన్మించగా ముద్రించవ చ్చన్నవారు నాయని కృష్ణకుమారిగారు. తీరాచూస్తే రాతప్రతిలో చాలాభాగం, బొమ్మల్లో కొన్ని అంతరించాయి. అష్టాదశ సంవత్సరాల తరవాత దానికి పూర్వౌన్నత్యం కల్పించటం వల్లమానిన పని. పోయిన బొమ్మలను మరోసారి వేయటానికి రాంభట్ల వారు నిరాకరించారు. నాకీమొత్తం వ్యవహారం చచ్చిన దూడ శరీరంలో గడ్డి నింపి దాన్ని చూపి పాలు పిండినంత పాప మనిపించింది. అయినకాడికి పూర్తిచేసి చేతులు కడుక్కుందా మనుకొన్నాను. కోశనామధేయం 'చేతిపనులు' (Handicrafts) అని ఉండాలని తీర్మానంలో ఉంది! నాటకం, సంగీతం చేతిపను లనటం అర్థరహితమని మనవిచేశాను. లలితకళలకు సంబంధించి మరోకోశం ప్రచురించాం కాబట్టి ఆపేరు పెట్టడం బాగుండదన్నారు తెలుగు విశ్వవిద్యాలయం వారు. ఎంతకోపం వచ్చినా 'ప్రేతకళ' లనటం తప్పున్నర అని భావించి, చివరికి 15వ వృత్తి పదకోశ సంపుటానికి 'కళలు' అని మాత్రం పేరుపెట్టి బయటపడవేయక తప్పిందికాదు. ఈ సంపుటాలు వాటికిచ్చిన సంఖ్యల క్రమంలో అన్నీ రాలేదు. వచ్చినవాటి సంఖ్యలను మార్చలేదు. కొన్నిటికి ఒకటికి రెండుసార్లు డబ్బు కేటాయించారు. నెలజీతా లిచ్చారు కొన్నేళ్ళు. అయినా దశాబ్దాలు గడిచినా అవి వెలుగుచూడలేదు. ఒకచేతి వేళ్ళే ఒకే రకంగా ఉండనప్పుడు, సమానత్వం లాంటి భావనలు అసందర్భాలేమో!

1998 సుఖదుఃఖమయమైన కాలం నా జీవితంలో. కుటుంబ వ్యవహారాల్లో గత సంవత్సరం అనుభవించిన బాధామయవ్యవహారాలు కుంగదీశాయి. కోలుకుంటున్న సమయంలో ఈనాడులో ధారావాహికంగా ప్రచురితమైన మాటల మూటలు పుస్తక రూపంలో వెలువడ్డాయి. ఎంతో కాలంగా ప్రచురిద్దా మనుకుంటున్న ఇంగ్లీషు వ్యాసాలను కొన్నిటిని Occasional Papers అనే శీర్షికతో ప్రచురించటం సాధ్యపడింది. (ద హేగ్ నగరం నుంచి వెలువడే International Journal of the Sociology of Language అనే పరిశోధన పత్రిక నూరూ – నూట ఒకటో సంచికలో 1993లో "The First Congress for the Telugu Language" అనే నా వ్యాసం వెలువడింది. ఆ సంపుటి సంపాదకుడైన భాషాశాస్త్రవేత్త జాషువా ఫిష్మన్‌తో ఆ సందర్భంలో కలిగిన పరిచయం మైత్రిగా పరిణమించింది. దాని ఫలితంగా) ఈ గ్రంథాన్ని ఆయనకు అంకితం చేశాను. ఆయన సామాజిక భాషాశాస్త్రంలో అంతర్జాతీయ ప్రఖ్యాతిగల విద్వాంసుడు. న్యూయార్క్‌లోని బ్రాంక్స్‌లో ఉన్న యెహోవా విశ్వవిద్యాలయంలోనూ, కాలిఫోర్నియాలోని స్టాన్‌ఫోర్డ్ విశ్వవిద్యాలయంలోనూ ఆచార్య పదవిలో ఉన్నారు. గ్రంథం ప్రతులను ముందుగా పంపి త్వరలో వ్యక్తిగతంగా కలుస్తానని రాశాను. జులై నెలలో అమెరికాలో స్థిరపడ్డ నా రెండో కుమారుణ్ణీ అక్కడే జన్మించిన నా మనమణ్ణి చూసి రావాలనే ప్రయత్నం మొదలుపెట్టాను.

ఆ సమయంలో గుంటూరులోని హిందూ కళాశాల వజ్రోత్సవాలు జరగబోతున్నాయనీ, ఆ సందర్భంలో ఒక ప్రత్యేక సంచిక ప్రచురించబోతున్నారనీ, తన సంపాదకత్వంలో వెలువడనున్న ఆ సంచికలో 'పది పంక్తులకు మించని కవిత'ను ప్రచురణార్థం పంపమనీ కరుణశ్రీ కుమారుడు మహతీ శంకర్‌నుంచి ఉత్తరం వచ్చింది. అర్ధశతాబ్దం నాటి గుంటూరు కళాశాల వాతావరణాన్నో, సాంస్కృతిక పరిస్థితులనో రాయమంటే సంతోషించే వాణ్ణి. వెంటపడగా విసుక్కుంటూ ఓ పద్యం రాసి పంపాను. అది –

**ఎదియో వ్రాసి, అదే కవిత్వమని, సాహిత్యమ్ములో గౌరవ**
**ప్రదమౌ స్థాన మొసంగుడంచు కవితావ్యాపారులన్ వేడి, వా**
**రి దయాభిక్షకు నాసచేసి, తుద కాంధ్రీపూతసాహిత్యసం**
**పద కన్యాయము చేయలేక కవితావ్యాసంగమే మానితిన్–**

అని రాసి దానికి (అబ్బూరి వారిశైలిలో) 'సాహితీ సేవ' అనే శీర్షిక పెట్టి పంపాను. పది పంక్తులు కాలేదంటే మరో పద్యం రాసి పంపాను. ఆ సంచిక వెలువడనందుకు సంతోషించాలో వజ్రోత్సవం జరగనందుకు దుఃఖించాలో ఇప్పటికీ తేలలేదు.

**అమెరికాయాత్ర**

జింబో నగర ప్రవేశంలాగా నా అమెరికా యాత్ర సాగిందేమో చెప్పలేను. హైదరాబాద్ ఎయిర్‌పోర్టు కౌంటరును వారు ప్రయాణికులను రమ్మన్న సమయానికి తెరవనే లేదు. గంట ఆలస్యంగా తెరిచినా లగేజీని పరీక్షించే ఎక్స్‌రే యంత్రం మొరాయించింది గంటన్నర సేపు. ఇక లాభంలేదని ఎయిర్ ఇండియా వాళ్ళు ఔట్ ఎయిర్ లైన్స్ వారి సాయమపేక్షించారు – బాగుచేయటానికి ప్రయత్నించి విఫలమైనామని గట్టిగా విశ్వసించిన మీదట. సెక్యూరిటీ వ్యవహారం లేని దానితో సమానం. బొంబాయికి బయలుదేరవలసిన విమానం కేవలం రెండు గంటలు ఆలస్యంగా బయలుదేరింది. అక్కడ పరుగులు తీయించారు. సీట్లో కూర్చుంటుండగా హైదరాబాద్ విమానం కారణంగా లేటుగా బయలుదేరవలసినా సకాలంలో లండన్ చేరుస్తామని ఆర్భాటంగా ప్రకటించారు. హీత్రో విమానాశ్రయానికి ఆలస్యంగా చేరిన మన విమాన రాజాన్ని ఇంచుమించు విమానాశ్రయానికి చిగురుటంచున వాలనిచ్చారు. టెర్మినల్ నాలుగైదు మైళ్ళ దూరాన ఉంది కాబట్టి దిగవలసిన వాళ్ళు, ఎక్కవలసిన వాళ్ళు వచ్చే బస్సులో పొమ్మన్నారు. న్యూయార్క్ పోవలసినవాళ్ళం విమానంలో రెండు గంటలపాటు బందీలం. మన వాళ్ళ సామర్థ్యంవల్ల న్యూయార్కులో దిగగలిగినందుకు గర్విస్తూ కుప్పలు పోసిన సామాన్ల నుంచి మనవి మనం గుర్తించి బయటకు తేవటానికి మూడు గంటలు పట్టింది. సామాను స్వీకరించిన ట్రాన్స్ వరల్డ్ ఎయిర్‌వేస్ వాళ్ళు చాలా పెద్ద మనుషులు. రెండు మూడు ఫర్లాంగులు బాటకు కుడివైపున నడిచి తమ టెర్మినల్ చేరమన్నారు. బస్సు ఎక్కవద్దని మరీమరీ చెప్పారు. వారి ఆదేశం ప్రకారం గంట ముందుగా చేరినందుకు ఆనందిస్తుంటే, క్షణాలు గడిచేకొద్దీ దుఃఖించవలసిన పరిస్థితి తీవ్రతరమవటం మొదలయింది. నెలాపదిహేను రోజుల కింద కొన్న టిక్కెట్టు మొర్రో అన్నా 'విశ్రమించండి, ఎదురుచూడండి, అవకాశమున్నట్లు లే'దని బుజ్జగిస్తూనే ఉన్నారు. విమానం వచ్చింది.



ప్రయాణికులకు బోర్డింగు ప్యాసు లిస్తున్నారు. నా సంగతేమంటే 'వేచి ఉండండి' అన్నారు. తిక్కతిరిగి "ప్రపంచం మొత్తంలో మాదే పనికిమాలిన దేశమని దుష్ప్రచారం చేస్తున్నారు గాని, మీది మరీ దుర్మార్గదేశంగా ఉంది. నా సామాను రెండు గంటల క్రితమే మీరు స్వాధీనం చేసుకున్నారు. దాన్ని విమానంలో చేర్చినట్లు అద్దాల్లోనుంచి కనపడుతున్నది. నాసీటు నమ్ముకొని నాకే సీటు లేదంటున్నారు. లక్షల డాలర్ల నష్ట పరిహారంకోసం దావా తగిలిస్తా"నని అరుస్తూ వెనుదిరిగితే మరోక్షణం ఆగమని "దేశ గౌరవార్థం మీలో ఒకరైనా తరవాతి ఫ్లైట్లో పోదురుగాని, ఈ భారతీయుణ్ణి పోనీండి" అని బతిమాలుకుంటే ఒక జత థూ అని ఉమ్మి, వాళ్ళ బోర్డింగ్ పాసును వాళ్ళ మొహాన కొట్టి వెళ్ళింది. అవి రెండూ నాకిచ్చి "విమానం బయలుదేరుతున్నది, త్వరగా పొండి" అని ఇంచుమించు కిందికి నెట్టినంత పనిచేశారు. బరువైన చేతి సంచితో పరిగెత్తలేనని మొరాయిస్తే చచ్చినట్లు ఎవడో మోసి విమాన మెక్కించాడు. ఈ రెండు సీట్లలో ఎక్కడ కూచోవాలంటే 'మీ దయ' అన్నారు. తూనీగలా ఎగిరి ఆ విమానం రెండు గంటల్లో బాల్టిమోర్ చేర్చింది గాని నా సామాను బయటపడటానికి గంటన్నర పట్టింది! రాత్రి (స్థానిక కాలమానంలో) 9 గంటల వేళ. నావాళ్ళెవరూ కనిపించలేదు. సామాను ట్రాలీమీద పెట్టించుకొని బయటికి వస్తుండగా నా కుమారుడు కనిపించాడు. రెండు గంటలుగా ఎందరికి ఎన్ని ఫోనులు చేసినా విమానం ఎప్పుడు వస్తుందో చెప్పలేదనీ, ఇక్కడా మన దేశ లక్షణాలు సమృద్ధిగా ఉన్నాయనీ, మరో గేటు దగ్గర నా కోసం ఎదురు చూస్తున్న కోడల్నీ, మనమణ్ణీ తెస్తానని నన్ను కారు దగ్గర నిలబెట్టి వెళ్ళి ఓ పావుగంటకు వాళ్ళతో వచ్చాడు. కార్లో కూచోటం తప్పట – నడపనప్పుడు!

పది నిమిషాల్లో ఇల్లు చేరుకున్నాం. ఆ తరవాత అయిదుసార్లయినా వాషింగ్టన్ వెళ్ళాను. ఓ అరడజను సార్లు బాల్టిమోరు. ఎక్కడా అంగరక్షకులూ, అధికారులూ, ప్రజానాయకులూ కనిపించలేదు. మేరీల్యాండ్ గవర్నరు సొంతంగా కారు నడుపుకుని వచ్చి సరుకులుకొని భార్యాసమేతంగా వచ్చినట్లే పోవటం చూశాను. ఈయన ముందు వెనకాల సాయుధ భటు ల్లేరేమంటే 'మనం ఎన్నుకున్నాం. వాళ్ళ రక్షణ బాధ్యత మనది. అంగరక్షకు లెందు'కని కోప్పడ్డా రనేకులు. మన ఎమ్మార్వోక్కూడా సాటిరాని అమెరికా అధ్యక్షుడు మన పక్కనుంచే వెళ్తున్నా మనల్నెవరూ ఆపనందుకూ, ట్రాఫిక్ ఆగనందుకూ బోలెడు దుఃఖపడ్డాను చాలాసార్లు. ట్రాఫిక్ పోలీసులు తప్ప సాయుధ రక్షకభటుల కోలాహలం వినిపించని దేశంలో ఉండబుద్ధిపుట్టలేదు. చౌరస్తాల్లో ట్రాఫిక్ పోలీసులను పెట్టలేని అమెరికా వాళ్ళ దారిద్ర్యం కుంగదీసింది. కుడి ఎడమలనుంచీ ఎదురు బొదురుగానూ బళ్ళు నడపటం చేతకాని దేశస్థులా ప్రపంచాధిపత్యం వెలిగిస్తున్నవాళ్ళు? మేమందరికన్నా ఎక్కువగా బడిపంతుళ్ళను గౌరవిస్తామనీ, రాజకీయవాదులను అసహ్యించుకుంటామనీ చెప్పిన మాటలు నిజమని నాకే ధ్రువపడింది. ఓ చిన్న టి.వి. అనౌన్సర్ అమెరికా ప్రెసిడెంటును నానామాట లనటం వింటూ చూస్తూ ఇదే నా దేశమైతే ఇలా జరుగుతుందా అని మన అతిశయానికి గర్వించాను. ఎవరి జోకునో కాపీకొట్టినందుకు ముప్ఫై సంవత్సరాల అనుభవమున్న సీనియర్ రిపోర్టరును బర్తరఫ్ చేసిన బోస్టన్ గ్లోబ్ పత్రిక సాహసం, ప్రతివార్తనూ అందించిన విలేఖరి పేరూ రాసిన ఉపసంపాదకుడి పేరూ ప్రచురించకపోతే తప్పుడు వార్తలు

ప్రచురించినందుకు పడే దావాలతో పత్రికను ఏనాడో మూసుకోవలసి వస్తుందని భయపడే న్యూయార్క్ టైమ్స్ పత్రిక పిరికితనం ఆశ్చర్యకరం. ఏ మాల్‌కు వెళ్ళినా బంగ్లాదేశ్ సరుకైనా కనిపిస్తుంది గాని భారతీయ వస్తువులు కనిపించనందుకు విస్తుపోయాను. వార్తాపత్రికల్లో మన దేశ వార్తలు సాధారణంగా కనిపించకపోవటం ఒక విధంగా మంచి దనిపించింది. అమెరికన్ల సంపదను చూసి ఈర్ష్యపడాలో, మన దరిద్ర్యాన్ని తలుచుకుని ఏడవాలో తేలలేదుగాని, నేటి న్యూయార్క్‌లోని మన్‌హాటన్ హర్మ్యాలను దూరంనుంచి చూసినా వివేకానంద మనకు దక్కేవాడు కాదు (పాతకాలపు చికాగో వైభవానికే ఉన్నన్నినాళ్ళూ విలపించినవాడు కాబట్టి). మనం ఛాందసులమే కావచ్చు – నదుల్లో సముద్రంలో నాణేలు విసురుతాం కాబట్టి. వాళ్ళు నాగరకులు కాబట్టి Wishing Wellsలో నాణేలు పడేసి, తరవాత వాటిని బైటికితీసి లెక్కించి, ప్రకటించి, ఆ సొమ్మును హాయిగా పునర్వినియోగానికి తెస్తారు కాబట్టి వాళ్ళ లౌక్య లనక తప్పదు! మనవాళ్ళు అటు తెల్లవాళ్ళతోనూ, ఇటు నల్లవాళ్ళతోనూ కలవకుండా దేవాలయాల్లో తమలో తామే కలుసుకొని ముచ్చట్లాడి బయటికి వస్తుండగానే కులం పేర్లు చెప్పి అందాకా సరసమాడిన వాళ్ళను బూతులు దోకగలిగిన మహత్తర సంస్కారాన్ని ప్రపంచ వ్యాప్తం చేస్తున్నందుకు తబ్బిబ్బయ్యాను. కెనడా వాళ్ళ రంగు దీపాలకాంతిలో తమ ప్రాంతంలోని నయాగరా జలపాత దృశ్యాలను చూపి సొమ్ము చేసుకోగలిగిన వాణిజ్య వైభవం, మన బుర్రా గుహలకన్నా చిన్నవైన బోడిగుహలను చూపి ప్రపంచంలో ఇలాంటిది మరొకటి లేదని దబాయించి డబ్బు గుంజే వ్యాపార నైపుణ్యం వారికే కద్దు. మనం ఆధ్యాత్మిక శోభను మాత్రమే గుర్తిస్తాం కాబట్టి ఇలాంటి వాటిని పట్టించుకోనక్కరలేదు. అమెరికన్ లైబ్రరీ కాంగ్రెస్ వారి గ్రంథాలయంలో ఇక్కడ దొరకని, కనిపించని తెలుగు పుస్తకాలు భద్రంగా ఉన్నా, జాషువా ఫిష్మన్, ఐ.ఏ.రిచర్డ్స్ వంటి విద్వాంసులను రాజోపచారాలతో పోషిస్తున్నా, జలవాయు వాక్కాలుష్యాదులు లేకపోయినా ఆ భయంకర నిశ్శబ్దంలోనుంచి త్వరగా బయటపడాలనే వాంఛ దినదినాభివృద్ధి పొందింది. ఒక పాత స్నేహితుడు తటస్థపడి చివరకు 'పంది బురద మెచ్చు పన్నీరు మెచ్చునా?' అని కూడా కూశాడు. "నీకిక్కడ సాహిత్యం దొరికింది కాబట్టి ఇది స్వర్లోక మనుకుంటున్నావు. నా జీవితానుభవాలను పురస్కరించుకొని అబ్బూరి మేష్టారు చెప్పినట్లు నాకు నరకమే సుఖప్రద మనిపిస్తుంది. విషంలో పెరిగే క్రిము లున్నాయి. అవి సుఖంగా లేవనుకోవటం అజ్ఞానం. నీవు జననమరణాలు లేని ఈ స్వర్గంలో ఉండు" అన్నాను. బొంబాయి విమానాశ్రయంలో దిగి ఛీఛా అనిపించుకుంటూ మరమ్మతుల్లో ఉన్న గదిలో మట్టికుప్పలమీద విశ్రమించి మళ్ళీ విమాన మెక్కినప్పటి ఆనందం అనుభవైకవేద్యం.

తిరిగి వచ్చిన తరవాత నా ఆధునిక వ్యవహారకోశ ప్రచురణ విషయం ఎక్కడ వేసిన గొంగడి అక్కడే ఉన్నట్లుందని అర్థమయింది. Occasional Papersను ముద్రించటానికి మూడేళ్ళు పట్టిన ప్రచురణకర్తకు ఈ గ్రంథ ప్రకాశనం కనీసం అంతకాలమైనా పట్టకపోతే బాగుండదు కదా? జర్నలిజం స్కూల్లో పాఠాలు చెప్పుకుంటూ ప్రూఫులు దిద్దుకుంటూ కాలం దొర్లిస్తున్నా భారంగా. తెలుగులోకి నేనే అనువదించిన నా పుస్తకం 'మహాకవి శ్రీశ్రీ'ని సాహిత్య



అకాడమి ప్రచురించింది. తెలుగు జాతీయాలు, మాటలవాడుక – వాడుక మాటలు, అనుభవాలూ న్యాయాలూ అచ్చయినాయి. ఆరోగ్యం దెబ్బతిన్నది. శేషజీవితంలో సగంలో వదిలిపెట్టిన గ్రంథాలను పూర్తి చేయాలనే తాపత్రయం పెరిగింది. 1999 ఆగస్టు 23వ తేదీన ఈనాడు జర్నలిజం స్కూలుకు చేటగొట్టాను. ఏడెనిమిదేళ్ళక్రితం సిద్ధంచేసి, అయిదేళ్ళ క్రితం ముద్రణ యోగ్యప్రతి తయారు చేసిన 'మరవరాని మాటలు" (తెలుగు రచయితల సూక్తుల సంకలనం) వెలుగుచూస్తుందన్న నమ్మకం పూర్తిగా పోలేదు. సాహిత్య అకాడమికోసం ఆధునికాంధ్ర రచయితల ప్రతినిధి రచనలను 'తెలుగు రవ్వలు' అనే పేరున సేకరించి, వారి జీవిత విశేషాలను సమకూర్చి ఇచ్చాను. అదెప్పుడు అచ్చుమొహం చూస్తుందో తెలీదు. నాలుగేళ్ళ క్రితం ఇంగ్లీషు పాఠం ప్రచురించిన సాహిత్య అకాడమి నేను చిన్నయసూరిని గురించి రాసిన పుస్తకానికి తమిళానువాదం ప్రచురించింది గాని నేనే అనువదించిన తెలుగు భాగాన్ని ముద్రణకు ఇచ్చినట్లు లేదు.

అనేకానేక విషయాల్లో విఘ్నేశ్వర పూజవల్ల ఆటంకాలు తొలుగుతాయేమో ననిపించిన మాట వాస్తవం. తీరా పూజ పూర్తయిన తరవాత ఎవరెవరో, ఏవేవో ఫోనులు చేసి రెచ్చగొట్టినందువల్ల పాత అలవాటు కొద్దీ (వినాయక చవితి 19.9.99న కాబోలు) ఆనాడు గురుస్మరణ చేయక తప్పింది కాదు. ఇలాగా–

**తన అభివృద్ధి కెంతయు తోడుపడినట్టి**
**గురుజనమ్ముల నెల్ల పరిభవించి**
**అమెరికన్ విశ్వవిద్యాలయమ్ములను భా**
**షాశాస్త్రమున రహస్యములు నేర్చి**
**తన శిష్య సంతానమును నిరంతర వేద**
**నాదూయమానమానసులజేసి**
**ద్రవిడ భాషా పతివ్రత కేక భర్తగా**
**ఆంధ్ర దేశమునందు వ్యవహరించి**
**చేట చేటీనటాది సంసేవకులకు**
**పదవులిప్పించి సంతృప్తిపడిన వాడు**
**భద్రిరా ద్వంశజలధి క్షపాకరుండు**
**కృష్ణమూర్తిని వర్ణింప నెవరి తరము?**

అనారోగ్యం నానాటికీ వయసుతోబాటు పెరుగుతుంటే అంతకన్నా వేగంగా తాపత్రయాలు పెరుగుతున్నాయి. భాషమీద రాస్తున్న ధారావాహికం పూర్తికాగానే మరొకటి మొదలుపెట్టకుండా అర్ధాంతరంగా ఆగిన పుస్తకాల విషయం ఆలోచించా లనుకున్నాను. అకాడమినుంచి బయటపడ్డ 11 సంవత్సరాల తరవాత, శక్తులు సన్నగిల్లి ఉడిగిపోయే సమయం వచ్చిన సమయంలో, నిరుద్యోగపర్వంలో ప్రవేశించి రకరకాల దురాలోచనలతో బాధపడుతుండేవాణ్ణి.

ఇంతకాలం ధీమాగా నడిచిన జీవితం ఇక మీదట ధీమీగా నడవకతప్పదనే నమ్మకం

కుదిరింది. శరీరారోగ్యం లాగానే గృహసౌభాగ్యం కూడా అనుక్షణ పరిరక్షణ మపేక్షించటం మొదలయింది. పొరుగూరు ప్రయాణం ఒంటరిగా చేయగల సాహసం కరవయింది. ఎవరి సాయమైనా ఉంటేగాని అడుగు ముందుకు వేయలేనేమోనన్న అనుమానం మొదలయింది. అలాగని ఇంట్లోనే పడి ఉండాలన్నా, నిర్వ్యాపారంగా కాలం దొర్లించాలన్నా మనసొప్పటం లేదు. ఇలా సందిగ్ధంలో ఉండగా 2000 ఫిబ్రవరిలో తిరుపతివెళ్ళక తప్పింది కాదు. అలా వెళ్ళిన రోజు రాత్రి పాత అలవాటు ప్రకారం పద్యం రాసుకున్నాను.

**స్వాగతింపగ వచ్చి వర్షించె ప్రేమామృ**
**త మ్మెంతగానొ ప్రతాపరెడ్డి**
**మూడు గంటలపాటు మొరటుమాటలు విని**
**తనిసినా మనిరి సదస్యు లెల్ల**
**ముందువెన్కల తుమ్మపూడి కోటీశుండు**
**సాహితీ విషయ ప్రసక్తి తెచ్చె**
**ద్రవసేవలో ఉపద్రవభీతి లేకుండ**
**సగమురాతిరి దాక జరిగె గోష్ఠి**
**విశ్వనాథ ప్రసంగము వేడిలేని**
**వెలుగు విరజిమ్మె, మధ్యలో నిలిచి మాకు**
**పుటిగరాప్పంతు లానందఘటకు దయ్యె**
**కడచె నొకరాత్రి సంతోష ఘటితముగను.**

మరునాడు తిరుగు ప్రయాణం. ఆరోజు ఉదయం కేతు విశ్వనాథరెడ్డిగారి కీ పద్యం చెప్పాను.

**నెలకొక రెండు రోజు లెటనేని యొకించుక విశ్రమించి మి**
**త్రుల నభిమానులం గలిసి తొల్లిటి ముచ్చట లాడివచ్చినన్**
**కలుగు సుఖమ్ము వార్ధకవికారములం దొలగించి నూత్న శ**
**క్తులు ఘటియించు దేహమునకున్, మదియున్ ప్రశాంతమౌ.**

కొండ ఎక్కలేదు. ఎక్కాలనీ అనిపించలేదు. కానీ మనసులోని మాట బయటకు రాకమానలేదు.

**మునుపటి శక్తిలేదు, ముదిముప్పు నెదుర్కొను యుక్తిలేదు, జీ**
**వనభరణమ్ము భార, మనివార్యము రోగభయమ్ము, కాపురం**
**బును నడపంగ ద్రవ్యమును ప్రోవిడు టన్నది తప్పదాయె; ని**
**ర్ధన మరణమ్ము తప్పినగదా చరితార్థత? సాధ్యమా ప్రభూ?**

ఇలా బాధపడుతుండగా ఎట్టకేలకు ప్రాచీ పబ్లికేషన్స్ వారు ఆధునిక వ్యవహారకోశ ప్రచురణ యజ్ఞం పూర్తిచేశారు. తెలుగు విశ్వవిద్యాలయం వారు పదసంబంధకోశంతో సహా తెలుగు భాషా స్వరూపాన్ని ప్రచురించారు. నిజాని కిది ఈనాడు వారు చేయవలసిన పని. వారి కార్యాలయంలో అయిదారేళ్ళు తలదాచుకొన్నదే గాని వెలుగుచూడలేదు. ఈనాడు జర్నలిస్టులకోసం తమ కార్యాలయానికి పరిమితంగా ప్రచురిస్తున్న 'సమీక్ష'లో నేను రాసిన వ్యాసాల్లో చాలాభాగం మరేమార్పులూ లేకుండా మీడియాహౌస్ వారికిస్తే 'మంచి జర్నలిస్టు కావాలంటే..' అనే శీర్షికతో ప్రచురించారు. జర్నలిజం మీద ఇటీవలి కాలంలో మోజు పెరిగినందువల్లనో, డాక్టర్ గోవిందరాజు చక్రధర్ వ్యాపార నైపుణ్యం వల్లనో అది అయిదారు నెలల్లో పునర్ముద్రణ భాగ్యం పొందింది. అందుకు సంతోషిస్తున్న సమయంలో ఒక విషాదం ఎదురువచ్చింది. అది వర్షశ్రీవ్రతకు నా ధూమపాన దుర్లక్షణం తోడ్పడగా ఊపిరాడక రెండు వారాలు వైద్యశాలలో ఉండి చచ్చి బతకటం.

రోగం రెండు విధాల కుంగదీసింది. అసలే దుర్బలమైన శరీరాన్ని మరింతబలహీనపరచటం సహజమేగాని అది మానసికంగా దెబ్బతీయటం ఊహించింది కాదు. "మరణ భయమ్ము నాకు నణుమాత్రము లేదు, మదీయజీవసంభరణభయంబె మిక్కుట" మనే పద్యపాదం నా అభిమాన విషయాల్లో ఒకటి – దువ్వూరివారి పానశాలలోది. ఎందరో ధూమపానం మానమని ఇంటాబయటా పోరుపెడ్తున్నా 1942లో మొదలుపెట్టిన ఈ అగ్ని కార్యానికి షష్టిపూర్తి అయిన తరవాత ఆలోచిద్దా మంటుండేవాణ్ణి. ఇన్నాళ్ళకు ప్రాణభయం కన్నా రోగభయమే భయంకరంగా ఉంటుందని యజ్ఞాన్ని పూర్తిచేశాను. పునరారంభించలేదుగాని ఏదో పోగొట్టుకున్నానన్న బాధ పోవటంలేదు. అదీగాక ఇది నా మొదటి చావుకూడా కాదు.

## ఎన్ని చావులో!

నా అయిదో ఏట మాతామహీ మాతామహులతో కలిసి ఇంకొల్లనే మహాగ్రామానికి వెళ్ళాను. వ్యాజ్యంలో గెలుచుకున్న ఇంటివాకిట తాతగారు దర్బారు తీరుస్తుంటే అమ్మమ్మ గారు నీటికోసం చెరువు దగ్గరకు వెళ్ళింది. ఆసరిపాతకొత్తకొంపలో యథేచ్ఛావిహారంలో ఉన్న నన్ను తాతగారి శత్రువర్గం వాడెవడో నోరుమూసి గుడ్డలు కుక్కి అలమరలో బంధించి పోయాడట. ఊరంతా గాలించి చివరకు ఇంట్లోనే అపస్మారంలో పడివున్న నన్ను బైటికితీసి వైద్యం చేయించి చచ్చి బతికావని ప్రకటించారట. ఆ తరవాత 1948లో టైఫాయిడ్ వచ్చి తిరగబెట్టి చచ్చినంత పనిచేసింది. చదువుకోసం గుంటూరు చేరగానే మొదట మలేరియా తరవాత డిఫ్థీరియా చంపి బతికించాయి. 1947లోని చావులాంటి బతుకో, బతుకులాంటి చావో– అధికార పూర్వకం కాదు – అంటే పెద్దలకు తెలీకుండా రహస్యంగా కొనితెచ్చుకున్నది. ఇంటినుంచి పారిపోయి కస్తూరి కుటుంబరావుగారి హత్యకు ప్రతీకారం తీర్చుకుందామని మిర్యాలగూడా వెళ్ళి, దళంలో చేర్చుకొమ్మని దొడ్డా నరసయ్య గారిని వేధించి, ఒక చుట్టు చుట్టిరమ్మంటే సుడిగాలిలా తెలంగాణాలో పది పన్నెండు రోజులు తిరిగి, మళ్ళీ వారి దగ్గరకు చేరాను. గతిలేనమ్మకు మతిలేని మగ డన్నట్లు నిజాం రజాకార్ వ్యతిరేక పోరాటానికి ఎవరెలా సాయపడ్డా కాదనలేని స్థితిలో నన్ను చేర్చుకొన్నందున దళం బాగుపడకపోగా నా ధూమపాన వ్యసనం శత్రువులను హెచ్చరించింది. గాయపడ్డ నన్ను వేటపాలెం చేర్చారు – రాత్రులు మాత్రమే మోసి. అప్పుడే కొత్తగా మార్కెట్టులోకి వచ్చిన పెన్సిలిన్ బూజులా ఉండేది. ఇరవై నాలుగ్గంటలూ మంచుగడ్డల మధ్య ఉంచాలి దాన్ని. మదరాసు నుంచి రైల్లోని ఐస్‌కంపార్ట్‌మెంటులో ముందుగా ఉత్తరువు తెచ్చుకొని కొని, డిస్టిల్డ్

వాటర్‌తో నింపిన ఆవయల్ను గూళ్ళుజారేదాకా విదిలించి కలిపి సూదిమందుగా ఎక్కించగా ఎక్కించగా పుండ్లుమాని బతికి బట్టగట్టాను. ఇది అనధికార రహస్య మరణంనుంచి పునరుత్థానమని చెప్పాలి.

దొంగచావులూ చచ్చాను. 1968లో హైదరాబాద్ చేరిన తరవాత నా కనిష్ఠ సోదరుడి వివాహార్థం స్వస్థలానికి వెళ్ళి పది రోజులుండి వస్తామన్న కుటుంబాన్ని అక్కడే ఉంచి కొలువుకు తిరిగి వచ్చాను. అక్కడ వివాహానంతరం బంధుమిత్రులకు చీరాల్లో సినిమా చూపించే ఏర్పాటు చేశాను. ఓ అరగంట సాగిన తరవాత కరెంటు పోయింది. ఆ సదవకాశాన్ని ధూమపానానికి వినియోగించదలచి మెట్లు దిగి రాగానే మొహంలో మొహం పెట్టి 'మీరు ఫలానాయేనా?' అని నత్తుతూ నంగిగా ప్రశ్నించిన వ్యక్తి కళాశాల ప్రిన్సిపాలుడు. "ఎందుకంత గాభరా?" అంటే నా అకాల మరణానికి సానుభూతి చెప్తూ ఆదిలాబాద్ కలెక్టరేట్నుంచి నా పూర్వ విద్యార్థు లిద్దరు పంపిన సందేశాన్ని పురస్కరించుకొని సెలవు ప్రకటించిన నాటి రాత్రే నేను కనిపించటం గాభరా పుట్టించిందని తెలిసింది. నా స్వగ్రామంలో నా బంధుమిత్రు లనేకు లున్నచోట నిజానిజాలు తెలుసుకొనే ప్రయత్నం కూడా చేయకుండా చచ్చినట్లు ప్రకటించిన ఆయన ఔదార్యం మంత్రముగ్ధుణ్ణి చేసింది. హైదరాబాద్ చేరిన తరవాత నా మార్గంలో నేను ఈ సంగతేమో తెలుసుకుందామనుకుంటే 'ఆంధ్రభూమి' పత్రికకు ఖమ్మంలో విలేఖరిగా ఉన్న మరో బి.రాధాకృష్ణ అకాలమరణం పొందాడు. అతడి ఫోటోను కూడా ఆ పత్రిక ప్రచురించింది. దాని ముద్రణ సౌభాగ్యం వల్ల అది నా ఫోటోయేనని నాకే అనిపించింది! ఇదా సంగతి అనుకుని సరిపెట్టుకున్నా. వారం రోజుల తరవాత ఫలానా బస్సులో తెలవారు జామున వేంచేస్తున్నామనే కబురందుకొని బస్ డిపో దగ్గర వేచి ఉన్నా – చుట్టుపక్కల సిగరెట్లు దొరికే స్థలముందా అని దిక్కులు చూస్తూ. ఎవరో పోర్టరు దగ్గరకు వచ్చి నా పేరడిగితే నీకెందుకన్నా. ఆ నీడలో నిలిచిన ఇద్దరూ అడగమంటే అడిగానన్నాడు. వాళ్ళను వెలుతురులోకి రమ్మన్నా. రాగానే ఒకరొకర్ని గుర్తించగలిగాం. ఆ చిరంజీవులే నా మృతికి సంతాపించిన వాళ్ళు! వాళ్ళకూ ఆధారం ఆ పత్రికలోని బొమ్మే, దాని కింది పేరే. ఇలా చచ్చిన వాళ్ళు ఒక పట్టాన చావరని పోర్టర్ మహాశయుడు వ్యాఖ్యానించాడు కూడా! ఇలా జరిగిందంటే మిత్రుడు ఏటుకూరి ప్రసాద్ చిన్న కథ చెప్పా ననుకున్నాడు. నమ్మలేదు. కొంతకాలం తరవాత ఆస్తి వ్యవహారాలు చూసుకోటానికి అతడు గుంటూరువెళ్ళాడు. తమకు చౌకగా ఇల్లమ్మలేదని కంటగించుకొన్న దాయాదులో, మిత్రులో హైదరాబాదుకు టెలిగ్రామిచ్చారు – రోడ్డు ప్రమాదంలో ప్రసాద్ కన్నుమూశాడని! ఏడుస్తూ మొత్తుకుంటూ వెళ్ళిన అతడి శ్రీమతికి ఆ నగరంలో మొదట కనిపించినవాడు ఆమె భర్తే! ఇదేనేమో పొయటిక్ జస్టీస్ అనేది.

1983లోనో 84లోనో టి.వెంకారెడ్డి గారు తెలుగు అకాడమికి డైరెక్టరుగా వచ్చారు విద్యాశాఖ నుంచి. మా ఇద్దరికీ మూడున్నర దశాబ్దాల గాఢ పరిచయ స్నేహాలున్నాయి. అతడు గుండెకోయించుకున్న తరవాత చూడబోయిన నేను మళ్ళీ పర్యటనలు చేసే దిక్కుమాలిన ఉద్యోగం నుంచి నిశ్చలంగా ఉండి ఏదో కొంత భాషాసేవ చేయగల తెలుగు అకాడమికి రారాదా అని



నిర్బంధించాను. అతడి పాలనకాలంలో ఓనాడు పాలక మండలి సమావేశం జరుగుతున్నప్పుడు మెట్ల దగ్గర ఏడుపులాంటిది వినిపిస్తే అటు పోయాను. ఏలూరులో భౌతికశాస్త్రోపన్యాసకుడుగా పనిచేసి, రిటైరైనా అకాడమికి గ్రంథరచన చేస్తున్న ఓ వృద్ధోపాధ్యాయుడు తన గ్రంథం మీద వచ్చిన విమర్శలకు సమాధాన మిస్తానని చెప్పాపెట్టకుండా వీరావేశంతో వచ్చి, మెట్లమీద ఆయాసంతో పడిపోయాడు. ఆయన వెంట ఉండి ఏడ్చిం దాయన శిష్యురాలే. ఆమె తాత్కాలికంగా అకాడమిలో పనిచేస్తున్నది. ఆమె పిలిస్తే బంట్రోతు లెవరూ ఉలకలేదు – పలకలేదు. అందరూ పాలకమండలి సేవార్థం బయట కనిపెట్టుకున్నారు. నేను నోరుపారేసుకుని మోసీ మోయించీ ఆయన్ను అకాడమి కారులోకి చేర్చాను. ఆమె వెంట బయలుదేరింది. చుట్టుపక్కల వైద్యులు ఇది మా పనికాదంటే, ఓల్డ్ ఎమ్మెల్యే క్వార్టర్స్‌లోని వైద్యశాలకు వెళ్ళాను. ఆ డాక్టరు తానే బయటికి వచ్చిచూసి ఇది గుండెపోటంటూ అడక్కముందే చీటీరాసి ఇచ్చి ఉస్మానియాకు తీసుకపోయి ఈ చీటీ చూపండి, వెంటనే సాయమందుతుం దన్నాడు. అలా వెళ్తున్నామని డైరెక్టరుకు చెప్పమని వెంట ఉన్న బంట్రోతుకు చెప్పి పరుగులమీద చేరాం. పరీక్షించి ఒకటి రెండు నిమిషాలకిందనే కన్నుమూశాడన్నారు. మందివ్వకుండా మరణించాడంటారా అని నా సహోద్యోగిని విరుచుకపడింది. అంతకన్నా ఉవ్వెత్తున లేచింది డ్యూటీ డాక్టరు. "శవాన్ని మార్చ్యురీకి పంపుతాం – గుర్తుపట్టి, మీకూ సదరు శవానికీ ఉన్న సంబంధాన్ని పోలీసుల దగ్గర రుజువుచేసి తీసుకుపోండి" అని! వ్యవహారం చెడుతుందని గ్రహించి, నా పెద్ద కొడుకు ఇక్కడే పరిశోధనలో ఉన్నాడని మనవి చేసి, మార్గాంతరం చెప్పమంటే మాటా పలుకూ లేకుండా శవాన్ని తీసుకు పొమ్మన్నారు! శవాన్ని కదిలిస్తే ఆయాగారు వచ్చి 'చంపి తెచ్చి తీసుకు పోతున్నారా?' అని గర్జిస్తే చేయి తడిపి బయటపడ్డాం. నేను ఇలా ఉస్మానియా ఆసుపత్రికి రావటం ఓ పెద్ద విద్వాంసుడు (అలనాటి అంతర్జాతీయ తెలుగు సంస్థలో ఉండేవాడు) చూశాడట. అతిథి కేమయిందోనని గాభరాపడుతూ మరో కారులో వెంకారెడ్డిగారు రావటమూ అతడు గమనించాడట. ఆఫీసుకు చేరేలోగానే పది పన్నెండు ఫోనులు వచ్చాయని చెప్పారు. "చచ్చిందెవరు? బూదరాజా? వెంకారెడ్డా? శవం ఎక్కడుంది? ఆఫీసు దగ్గరా? ఆసుపత్రిలోనా? ఇంట్లోనా?" అనేవి సాధారణ ప్రశ్నలు. వెంకారెడ్డిగారు గుండెలు తీసిన బంటుకాబట్టి ఇలాంటి పిచ్చి ప్రశ్నలు వస్తే ప్రమాదమని ఆయన ఇంటికి ఫోనుచేసి ఏదీ నమ్మవద్దని చెప్పి, దరిమిలా నా ఇంటికి చెప్పిన మీదట దురాలోచన పుట్టింది. "అడిగిందెవరో తెలుసుకొని జంటనగరాల్లో మారుమూలల్లో ఉన్న 'మీ నోటికి వచ్చిన' ఆసుపత్రి పేరు చెప్పి శవం అక్కడున్నదని వివరించం"దన్నాను. మా చావుకో, బతుక్కో ఇంత ఆరాటపడుతున్న మిత్రుల కాపాటి శవదర్శన సౌభాగ్యం కలిగించటం మంచిదనిపించింది. తరవాతి సంగతులకన్నా మరోసారి చచ్చినందుకు నన్ను నేనే అభినందించుకున్నాను. వీరు డొకేసారి చస్తాడు. పిరికివాళ్ళు అనుక్షణం చస్తుంటారనే సూత్రానికి నాది అపవాదం. నిజానికి సంబంధంలేని మాట. నేను పోరాడి చావలేదు. భయపడీ చావలేదు. నిజానికిప్పటికీ చావలేదు. చచ్చాననే వార్తపుట్టి, అదీ చచ్చింది – పుట్టినంత తొందరగానే!

వాస్తవానికి 2001వ సంవత్సరంతో ఇరవయ్యో శతాబ్దం ముగిసి మూడో సహస్రాబ్దం

మొదలుకావాలి. ఈలోగానే ప్రపంచమంతటా ఆర్భాటం, ఉత్సవాలూ మొదలుకావటమే వింత. క్రీస్తు శకాన్ని దృష్టిలో పెట్టుకున్నా ఇలాగే భావించాలిగాని, సంపన్న దేశాల్లో ఒక సంవత్సరం పాటు ఈ జాతర జరిగినా పేద దేశాల వాళ్ళు, క్రైస్తవమతం ప్రాబల్యంలేని దేశాల్లో, అనేకేతర శకాలు అమల్లో ఉన్న దేశాల్లో, ఈ వేలం వెర్రి ఎందుకు పుట్టిందో చెప్పలేం. 2001 వచ్చి రచనా కాలానికి ఎనిమిది నెలలు పూర్తి కాబోతున్నాయి. ఇప్పుడోసారి వెనక్కు తిరిగి గొప్ప గొప్ప విషయాలూ విజయాలూ సాధించకపోయినా, నేను తలపెట్టిన క్షుద్రరచనలనైనా పూర్తి చేయ గలనా అనే ప్రశ్న వచ్చింది. రెండో సహస్రాబ్దం చివరికే వస్తాయనుకున్న పుస్తకాలు మరవరాని మాటలు నేటికి ఏడు సంవత్సరాలుగా మరుపులో ఉన్నాయి. ముద్రణయోగ్యంగా సిద్ధపరచిన పాతప్రతి పనికి రాదని మళ్ళీ కంపోజింగ్ మొదలుపెట్టి ప్రూఫులు దిద్దించారు. ఈ సంవత్స రాంతానికి వెలువడుతుందేమో. దైవాధీనం. 13వ శతాబ్ది తెలుగు శాసనాలను ముద్రణకిచ్చి ఆరేడు నెలలు గడిచాయి. మొదటి అక్షరం కూర్పుకూడా మొదలుకాలేదు. సాహిత్య అకాడమి చిన్నయసూరిని గురించి రాసిన తెలుగు రచనను పరీక్షార్థం ఒక మహా సంస్కృత పండితుడికి పంపిందని తెలిసింది – ఏణ్ణర్థం క్రితం. శ్రీవారే నా ఇంగ్లీషు మూలాన్ని కూడా పరీక్షించారు. అయినా చావతీరని పనుల్లో పడి ఈ నా రచనను చూసి చావటం వారికి సాధ్యపడలేదు! త్వరలో ముద్రణ మొదలవుతుందంటున్నారు. అలాగే గడ్డితిని, నీళ్ళు తాగి, ఎందరినో యాచించి, మరెం దరితోనో చర్చించి సమకూర్చిన 'తెలుగు రవ్వలు' (ఆధునికాంధ్ర రచయితల ఉత్తమరచనల్లోని కొన్ని భాగాలు) సాహిత్య అకాడమి వారి దయవల్ల ముద్రణ భాగ్యం పొందబోతున్నదనే వార్త వచ్చింది. తెలుగుకు సంబంధించి సదరు అకాడమి వ్యవహారాల విధాత విదేశాలనుంచి స్వదేశా నికి వచ్చేలోగా ఏమీ జరగదని మాత్రం నమ్మవచ్చు. ఇవి నా అశక్తతవల్లగానీ, అసమర్థతవల్ల గానీ వచ్చిపడ్డ పరిణామాలు.

నా అశక్తత, అనిశ్చితివల్ల ఆగిపోయినవి – కాదు అర్థాంతరంగా నిలిచిపోయినవి – లేక పోలేదు. అందులో ప్రధానమైనది సంబంధి పదకోశం. ఏ భాషలోనూ అన్ని విధాలా సమా నార్థకమైన పదాలుండవు కాబట్టి పర్యాయపదా లుండవు. వాటిని సమీప పదా లన్నవా రున్నారు. సామీప్య సంబంధానికి విరుద్ధమైనది వ్యతిరేక సంబంధం. ఇంగ్లీషులో Thesaurus అని వ్యవహరించే ఈ సంబంధాలను వ్యక్తీకరించే పదాలున్న కోశాలున్నాయి. తెలుగులో నేనూ సిద్ధం చేయాలనుకుంటూ కొంత పనిచేసిన తరవాత ఆచార్య జి.ఎన్.రెడ్డి గారు విశ్వవిద్యాలయ విరాళ సంఘం వారి సాయంతో నలుగురైదుగురు శిష్యులతో అలాంటిది సిద్ధంచేస్తున్నామనీ పూర్తికా వచ్చిందనీ చెప్పారు. ఆయన నిర్మించిన నిఘంటువును విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారు ప్రచురించారు. ప్రధాన కోశంలో వచ్చిన పదాలన్నిటినీ అకారాది క్రమంలో పెట్టి రెండో భాగం సిద్ధం చేయాలంటే మొదటిభాగం ముద్రణ అయ్యేదాకానో పూర్తిఅయ్యేదాకానో వేచి ఉండాలి. కోశంలో వచ్చే పదాలన్నిటినీ ఒకే అకారాదిక్రమంలో ఉంచి సంబంధిపదాలను అవసరమైన చోట్ల మాత్రమే నిర్దేశించాను. కొన్ని మాటలకున్న నానార్థాలు కూడా ఈ అమరికలో బయట పడ్డాయి. అది నేనూహించినది కాదు. అందుకు కంప్యూటర్లను వాడితే పని సులభమవుతుం



దన్నారు ఈనాడువారు. వాటిని సమకూరుస్తా మన్నారు. అలా జరగలేదు ఇంతకాలంగా. నా ధోరణిలో నేనే యంత్ర సహాయ నిరపేక్షంగా సగంలో ఆగిన ఆ పని పూర్తి చేయాలని సంకల్పిస్తున్నాను. శక్తియుక్తులను కూడగట్టుకోవాలి. మరికొంతకాలం ఏకాకిగా శ్రమించాలి. నెరవేర్చాలి. ఇదో కోరిక.

పురాతన నామకోశం రాస్తుండగా పురాణేతర సాహితీపాత్రల గురించి ఒక చిన్న కోశమైనా ఎందుకు సిద్ధం చేయకూడదనే ప్రశ్న వచ్చింది. మొదట తెలుగులో, తరవాత సంస్కృతంలో, ఆ మీదట నా ఎరికలో ఉన్న విశ్వసాహితీ పాత్రలతో ఆ కోశం నిర్మించాలని పాత్రల పేర్లు మాత్రం గుర్తుకు వచ్చినంత వరకు రాసిపెట్టాను. మూడు నాలుగు వేల పాత్రల పేర్లను అకారాదిక్రమంలో (అవసరాన్ని బట్టి విదేశ నామధేయాలను తెలుగు లిపిలో ఇమిడ్చి) పెట్టాలి. ఆ మీద క్లుప్తంగానైనా వివరణ రాసి, చేతనైతే భిన్న సాహితీ పాత్రల్లో ఉన్న సమాన లక్షణాలను సూచించాలనే దురాశ ఇంకా పోలేదు. సంబంధిపదకోశం పూర్తి చేసిన మీద ఇందుకు సమకట్టాలనేది రెండో కోరిక.

పైవిగాక మరికొన్ని అలాంటివి లేకపోలేదు. ఇంటర్ చదువుతుండగా రాసిన (పిచ్చి) ప్రబంధంనుంచి అనేక విధాల రచనలు లిఖిత రూపంలో ఉన్నాయి – వాటన్నిటినీ ప్రచురించ గల శక్తిగాని, సాహసంగాని లేవు. పైపెచ్చు అపారంగా క్షుద్రసాహిత్య ప్రచురణచేసి, 'ఉచిత ప్రతు'లందుకున్న మిత్రులనైనా హింసించట మెందుకనే సందేహభయాలు లేకపోలేదు. సమాజం లోని భిన్న రంగాల్లో నా జీవితకాలంలో నేను గమనించిన పెనుమార్పులన్నిటినీ పేర్కొనగలిగా నన్న నమ్మకమూ లేదు. మరపువచ్చినవి కొన్ని; ప్రచురించి ప్రమాదం కొని తెచ్చుకోవటమెందు కనే భీతి కల్పించేవి కొన్ని; విశేషాలే కావనిపించేవి కొన్ని. ఇలా రకరకాల కారణాలవల్ల రాయ నక్కరలేనివీ, రాసినా పరిహరించవలసినవీ ఉన్నాయి. నేనెరిగిన మహాపురుషుల్లోని మహత్తర లక్షణాలన్నిటినీ రాయలేదేమోనన్న విచారమూ లేకపోలేదు. నా దృష్టిలో నేను రాసిన విషయాలు ఆత్మాశ్రయ ధోరణిలో లేవని నేను భావించినా లోకం భావించగలదో లేదో చెప్పలేను. జ్ఞానం లాగానే అజ్ఞానం, శక్తిలాగే అశక్తీ అపారమైనవి. వాటిని విభజించి వింగడించి తన నిర్ణయం ప్రకారం బతికించే, చంపే శక్తి దేశకాలపాత్రలవి. వాటి పరిణతనిర్ణయానికి తలొగ్గటం తప్పని సరి. అలా మనవి చేస్తూ సెలవు తీసుకుంటున్నాను. నేనూ ఈ రచనా బతికి ఉంటే తరవాతి కాలంలో మిగిలిన సంగతులను ప్రస్తావించవచ్చు.

# 12. మరి నాలుగు మాటలు

శ్రీనాథుడు 'బహుధా విప్రతిపత్తి ధీవిషయముల్ పొడైన శాస్త్రార్థముల్" అని విసుక్కున్నాడంటారు. ఆ విద్వత్కవి ప్రతిభా పాండిత్యాలు లేవు కాబట్టి శాస్త్రార్థ బాధలు నాకులేవు. కానీ కొన్ని వైరుధ్యాలైనా బాధించకపోలేదు. కవిరాక్షసీయమనే సంస్కృతకావ్యకర్త అసలుపేరు తెలీదుగాని ఆయన ప్రారంభ శ్లోకమే మన సాహితీ ప్రపంచాన్ని పక్కదారి పట్టించిందేమోనన్న సందేహముంది. "గుణదోషౌ బుధో గృహ్ణ న్నిందుక్ష్వేళా వివేశ్వరః, శిరసా శ్లాఘ్యతే పూర్వం పరం కంఠే నియచ్ఛతి' అన్నాడు మహానుభావుడు. ప్రతికావ్యంలోనూ పనిలోనూ తప్పొప్పులుంటాయి. తప్పదు. ఒప్పుల నేరుకొని శివుడు చంద్రుణ్ణి నెత్తికెత్తుకున్నట్టు గౌరవించాలనీ తప్పులను గొంతులో దాచుకుని శివుడిలా గరళగ్రీవుడు కావాలనీ, అలా ప్రవర్తించేవాడే బుధుడని కవిగారి ధర్మ నిరూపణ. అలాగే పొగిడి సహృదయత్వం ప్రదర్శించేవాడే సహృదయ విమర్శకుడనీ తెగడినవాడు కువిమర్శకు డనీ చాలామంది విశ్వాసం. మరోవైపు "శత్రోరపి గుణా వాచ్యా దోషా వాచ్యా గురోరపి, సర్వదా సర్వయత్నేన పుత్రే శిష్యవ దాచరేత్" అనే సిద్ధాంతం మరొకటుంది. శత్రువుల్లోని సద్గుణాలనూ, గురువుల దుర్లక్షణాలనూ చెప్పవచ్చునీ పిల్లల విషయంలో ఎప్పుడూ శిష్య వాత్సల్యం చూపి అన్ని విధాలా తోడ్పాడాలనీ మరోవాదం. తప్పులెన్నితే తానేం చేస్తాడో చెప్పూ తెనాలి రామలింగడి కాలంనుంచి నేటి రసపుతీన్లవరకూ మండిపడుతున్నవా ళ్ళున్నారు. అది మూడో రకం.

ఇన్నీ తెలిసి కాళిదాసంతటివాడిలోని తప్పులెన్ని కూడా ఆ మహాకవి విశిష్టతను కీర్తించిన ఆనందవర్ధనాది లాక్షణికులూ ఉన్నారు. ఈ వైవిధ్యమో వైరుధ్యమో కేవలం సాహితీ ప్రపంచంలోనే ఉందనుకోవటం భ్రమ. దేశకాల పాత్రలను బట్టి ధర్మాలూ లక్షణాలూ మారినా వాటిలో కొన్ని ఆదర్శప్రాయాలైన సమానగుణా లున్నాయి – ఉంటాయి; అసహ్యించుకోదగ్గ; అవహేళనం చేయతగ్గ అవలక్షణాలూ ఉన్నాయి – ఉంటాయి. నా జీవితానుభవంలో నాకు తటస్థపడ్డ వ్యక్తుల్లోని కొన్ని శుభలక్షణాలూ, కొన్ని వైపరీత్యాలూ గుర్తించాను. సమాజంలో ఇతర సభ్యుల్లో కొందరవే విషయాలను మరోవిధంగా అర్థం చేసుకున్నట్లూ, మరికొందరు వాటికి కారణా లన్వేషించినట్లూ, ఇంకా కొందరు నిర్లిప్తంగా ఏమీ పట్టించుకోనట్లూ గ్రహించాను. కష్టసుఖాల్లా, వెలుగు నీడల్లా మంచీచెడూ కలిసి ఉండటమే మానవలక్షణం. అతీతమానవులో దేవీదేవతలో కేవలం శుభలక్షణ సంపన్నులుగా ఉండవచ్చు – ఉంటారని ఊహించవచ్చు. ఆయా లక్షణాల పాళ్ళను బట్టి పెద్దాచిన్నా గొప్పాతక్కువా భేదాలుంటాయి. కేవలం సన్మార్గులుగానీ, పరమ దుర్మార్గులుగానీ లేరనే నమ్మకం కుదిరింది. వారివారినుంచి మనం నేర్చుకోదగ్గ, పరిహరించవలసిన విషయాలను రేఖామాత్రంగా ప్రస్తావించి మీమీ అనుభవాలను పురస్కరించుకొని మీ నిర్ణయాలకు మీరే రండని పాఠకలోకాన్ని అర్థిస్తున్నాను. వీటిలో కొన్ని వినోదప్రాయ మనిపించవచ్చు. వాటిని కూడా నిశితంగా పరిశీలించగోరుతున్నాను. వాటిని పేర్కొనటంలో కాలక్రమంగాని, ప్రాధాన్యక్రమంగాని లేవు. నాకు గుర్తు వచ్చిన క్రమమో నాకున్న గాఢపరిచయమో అజ్ఞానవిశేషమో క్రమనిర్ణయానికి దారితీసి ఉండవచ్చు.



## ఆదర్శప్రాయులు

మొదట నన్ను సమ్మోహపరచిన మేధావులను గురించి ప్రస్తావిస్తాను. మొదటిసారి బాల్యంలో చూసి పది నిమిషాలు వివరా లడిగి ఆ తరవాత కొన్ని దశాబ్దాలు గడచిన తరవాత పోలికలను బట్టి గుర్తించి పాతపరిచయాన్ని ప్రస్తావించగలిగిన జ్ఞాపకశక్తి నన్నిప్పటికీ ఆశ్చర్యపరుస్తుంది. అటువంటి శక్తిమంతుల్లో భిన్న రంగాల్లోని పెద్దలున్నారు. ఎన్.జి.రంగా నా బాల్యంలో నాలుగు నిమిషాలైనా చూశాడో లేదో నా అరవయ్యోయేట గుర్తించగలిగాడు. నాలుగైదు నిమిషాలు ఇంటర్వ్యూ చేసిన సి.పి.రామస్వామయ్యర్ సంవత్సరం తరవాత నా పరిశోధనాంశాన్ని గురించిన చిన్నచిన్న వివరాలను నాకే గుర్తుచేశాడు. సునీతికుమార్ ఛటర్జీ పదుల సంఖ్యలోని భిన్న భాషల లక్షణాలనేగాక వేలసంఖ్యలో వ్యక్తులను దశాబ్దాల తరవాత సరిగా గుర్తుపట్టగలిగాడు. ఒక్కసారి చదివో వినో గుర్తుపెట్టుకుని మూలగ్రంథం చూడకుండా పొల్లుబోకుండా అందులోని విషయాలను చెప్పి చర్చించిన నిడుదవోలు వేంకటరావుగారినీ, చిలుకూరి నారాయణరావు గారినీ ప్రత్యక్షంగా ఎరుగుదును. పదివేల పేర్లను విన్న క్రమంలో నెలరోజుల తరవాత తప్పు పోకుండా చెప్పగలిగి కాలక్రమాన ఆశక్తి సన్నగిల్లుతున్నదన్న రామోజీరావుగారు నాకు తెలుసు. 'ధారణ నిల్చునా నిలువదా యను సందియ మింతలేదు..." అని వార్ధక్యంలోనూ నిర్భయంగా చెప్పగలిగిన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారిని చూశాను. ఒక్కసారి చూడగానే పూర్వమెప్పుడో చదివినట్లు గుర్తుకు వస్తున్నదన్న ఆర్యసమాజ స్థాపకుడు దయానంద సరస్వతి గురించి విన్నాను. ఇలాంటి సందర్భంలోనేమో కాళిదాసు పార్వతిని గురించి చెప్పిన 'ప్రపేదిరే ప్రాక్తనజన్మ విద్యా' అన్నమాటను అనుసంధించవలసింది. ఆంధ్రప్రదేశ్‌లో విద్యారంగంలో ఉన్న వేలమంది పేర్లూ పుట్టుపూర్వోత్తరాలూ గుర్తు పెట్టుకోగలిగిన తాటిపర్తి వెంకారెడ్డితో నాకు విశేష పరిచయముంది. కేవలం ఏకాగ్రతవల్లనా నిరంతర సాధనవల్లనా వీరికీశక్తి ఎలా వచ్చిందనేది నాకు తెలీని విషయం.

సంక్లిష్టమైన విషయాలను సులభసుందరభాషలో గంటలూ, వారాలూ విస్తరించి చెప్పటమేగాక నిమిషాల్లో సంక్షేపించి ప్రధానాంశాలు మరిచిపోకుండా మనసుకు హత్తుకునేట్లు ప్రసంగించిన కొందరు పెద్దలను ప్రత్యక్షంగా చూశాను. భారతదేశంలో తొట్టతొలి అటార్నీ జనరల్‌గా పనిచేసిన ఎం.సి.సెతల్వాడ్ తరవాత దేశంలోని అన్ని హైకోర్టుల్లోనూ సుప్రీంకోర్టులోనూ ఆయా ప్రభుత్వాలకు అనుకూలంగానూ ప్రతికూలంగానూ వాదించిన ఏకైక న్యాయవాది దువ్వూరి నరసరాజుగారని చెప్తారు. గంటల తరబడి ఆయన వాదించటం విన్నాను. అయిదు నిమిషాల్లో ముగిస్తారా అంటే సరేనని స్పష్టంగా క్లుప్తంగా వాదించటమూ విన్నాను. కె.ఆర్.శ్రీనివాసయ్యంగారు గందరగోళంగా ఉండే యూరోపియన్ దేశాల, సాహిత్యాల చరిత్రను ఎలా కావాలంటే అలా సులభ భాషలో చెప్పగలగటం నా అనుభవంలోని విషయం. స్పష్టంగా చెప్పాలంటే విషయం విస్పష్టంగా తెలియాలనీ, సులభంగా చెప్పాలంటే నిజమైన భాషాధికారం ఉండాలనీ, ఆరెండూ ఉన్నవాళ్ళు కాబట్టి వాళ్ళు ఆరెండూ లేని మనకన్నా సమర్థులనీ పండితులనీ గుర్తించాలని అబ్బూరి మేష్టారి భాష్యం.

కొందరు నిర్మాతలు. అందరూ కారు – కాలేరు. డాక్టర్ గరికపాటి రాజారావు తన వృత్తి ధర్మం నిర్వర్తిస్తూనే ప్రజానాట్య మండలిని నిర్మించాడు. ఎందరినో ఉత్తమ నటులుగా తీర్చి దిద్దాడు. తన వైద్యవృత్తికీ, నటనా ప్రవృత్తికీ సంబంధం లేదు. ఆయన రంగస్థల నటుడేగాని నిత్య జీవితంలో నటుడుకాదు. అలాగే ఎ.ఆర్.కృష్ణ. అతడు మహానటు డేమీకాదు. కానీ వందల మందిని చేరదీసి ప్రోత్సహించి నాటకరంగ పునర్నిర్మాణంకోసం అస్థిచర్మాలు ధారపోశాడు. లెక్కకు ఎలెక్ట్రికల్ ఇంజనీయరు. కానీ ఫ్యూజు వేయగలిగినవాడు లైన్‌మెన్‌గానే రిటైరవుతాడనీ అసలామాటకు మనశాఖకూ ఎలాంటి సంబంధమూ లేదని నమ్మించగలవాడు విద్యుచ్ఛక్తి శాఖకు మంత్రి కాగలడనీ నమ్మబలికేవాడు. అతడి ఇంట్లోనే మైత్రిలోనే నేనెందరినో భిన్నవృత్తుల, వయోధర్మాల, గుణగణాల వ్యక్తులను – చిన్నా పెద్దా– కలుసుకోగలిగాను, 'కృష్ణరాయబార్'లో. జనసమీకరణ అందరికీ చేతగాదు – కొందరు రాజకీయ నాయకులక్కూడా. వి.ఐ.సుబ్రమోని యమ్ (తమిళ లిపిలో చుప్పిరమణి) తమిళుడు. కేరళలో భాషాశాస్త్ర పీఠ మలంకరించాడు. తమిళనాడులో తమిళ విశ్వవిద్యాలయానికి (తమిళ్ పల్కలై క జగమ్‌–కు) మొదటి ఉపాధ్యక్షుడై నాడు. కుప్పంలో వెలసిన ద్రవిడ విశ్వవిద్యాలయానికి ప్రోఛాన్సల రైనాడు. పదవులు సంపాదిం చినవాళ్ళు చాలామంది ఉన్నారు. కానీ తిరువనంతపురంలో ద్రవిడభాషాశాస్త్ర సంఘాన్ని నెల కొల్పి, దానికి ఆస్తులూ, భవనాలూ సంపాదించి, దాన్ని పరిశోధన సంస్థగా తీర్చిదిద్ది, ఏ అడ్డంకీ లేకుండా రాకుండా శాస్త్ర పత్రికను స్థాపించి నిర్వహింపజేస్తూ, తన సంస్థకన్నా ఎన్నో దశాబ్దాల ముందే నెలకొన్న అఖిలభారత భాషాశాస్త్రజ్ఞుల సంఘంకన్నా తన నిర్మితి అన్ని విధాలా సంపన్న మనిపించుకొనేట్లు శ్రమించిన ఆ వ్యక్తితత్వం నిర్మాణ కార్యక్రమ రహస్యం తెలిసిన అసాధారణ వ్యక్తిత్వం. ప్రభుత్వ కళాశాలలో అధ్యాపకత్వం వంటి చిన్న పదవిలో ఉండి రాజమహేంద్ర వరంలో ఆంధ్రచరిత్ర పరిశోధక మండలిని స్థాపించి, దానికో మంచి గ్రంథాలయాన్నీ నివేశన స్థలాన్నీ సమకూర్చి, ఇంగ్లీషులో పరిశోధన పత్రిక నిర్వహించి, కళింగ చరిత్రను ప్రకాశింపజేసిన రాళ్ళభండి సుబ్బారావు నిర్మాణ సామర్థ్యమున్న ఒక మనీషి. ఆంధ్రు లారంభశూరులు కాదన టానికి ఇలాంటి వ్యక్తులు సాక్ష్యాధారాలు. వీరి కార్యదీక్ష ఆదర్శప్రాయం కాదా?

పేద కుటుంబంలో పుట్టి అష్టకష్టాలుపడి విద్యార్జన చేసి, శ్రీనాథుడు ఆంధ్రదేశాన్నిలా కర్ణాటక ప్రాంతాన్ని మూడుసార్లు చుట్టబెట్టి, అసాధారణ ప్రజ్ఞాశాలిగా, గురువును మించిన గొప్ప రచయితగా, శత్రుసంహారానికి సదా సిద్ధంగా ఉన్న 'తీరపరశురాముడు'గా ప్రసిద్ధికెక్కి, జ్ఞానపీఠ పురస్కారం తన అజ్ఞానానికి గుర్తింపుగా వచ్చిందనే వినయశీలి శివరామ కారంత్! యక్షగాన ప్రక్రియను పునరుద్ధరించి ప్రపంచవ్యాప్త ప్రసిద్ధి సంపాదించినవాడు. చిన్నపిల్లలకోసం విజ్ఞాన సర్వస్వం రచించటమేగాక ప్రత్యేకశిక్షణ ఇచ్చే అపూర్వ విద్యాలయం స్థాపించాడు. నిఘంటువులు నిర్మించాడు. కన్నడ పురావైభవ ప్రదర్శనకోసం ఒక మహాసంస్థను నిర్మించాలని బిచ్చమెత్తి స్థల ముచితంగా ఇచ్చిన చోట నిర్మిస్తానని మైసూరు విశ్వవిద్యాలయం ఆవరణలో కన్నడ అధ్యయన సంస్థను తన అభిరుచి ప్రకారం స్వీయపర్యవేక్షణలో నిర్మించాడు. ఈ సంస్థకు మీరే మొదటి సంచాలకులుగా ఉండాలంటే మదన్‌మోహన్ మాలవ్యాలాగా బిచ్చగాడికి ప్రభుత్వం తగదని



నిరాకరించాడు! అలాంటి మహావ్యక్తి తెలుగుజాతిలో పుట్టాడా? పుడితే ఎవరు? పుట్టకపోతే ఎందువల్ల?

వజ్ఝల చినసీతారామస్వామి గారనే పండితు దుండేవాడు. మా వ్యాకరణ గురువైన దువ్వూరి వేంకట రమణశాస్త్రిగారి కాయన గురువు. నే నాయన దగ్గర చదవలేదుగాని ఆయన వ్యాకరణ ప్రసంగాలు విన్నాను. అరవై సంవత్సరాల వయసుదాకా ఇంగ్లీషులో అక్షరంముక్క రానివాడు అప్పుడు మొదలుపెట్టి అయిదారేళ్ళలో బిషప్ రాబర్ట్ కాల్డ్‌వెల్ రాసిన ద్రవిడభాషా సిద్ధాంత ప్రతిపాదక గ్రంథాన్ని అధ్యయనంచేసి విమర్శించాడు. వసుచరిత్రను వ్యాఖ్యానించాడు. నా పరిశోధనకాలంలో ఆయన్ను అపస్మారస్థితిలో ఉండగా విశాఖలోని కింగ్‌జార్జ్ హాస్పిటల్లో చేర్చారు. వైస్ ఛాన్సలర్ వాసిరెడ్డి శ్రీకృష్ణకు ఆయన మీద ఆరాధనభావం. స్వయంగా వెళ్ళి సూప రింటెండెంటును బతికించమని వేడుకోవడం చూశాను. ఆయనకు తెలివివచ్చి ఒక గంట నిల దొక్కుకోగలిగితే గండం గడచినట్లే నన్నారు. ఒక గంటసేపు మేం అక్కడ ఉండగా కదలి కనుదెరి చాడు. శిష్యులు వేంకటరమణశాస్త్రిగారిని గుర్తించాడు. "రమణా! ఈ అహోబలపండితుడు..." అంటూ కళ్ళుమూశాడు, శాశ్వతంగా! అపస్మారం రాకముందు ఆయన అహోబల పండితీయం లోని ఏ అంశం గురించో ఆలోచిస్తున్నా డన్నమాట. ఆఖరి క్షణందాకా తన అభిమాన విద్యమీదనే దృష్టి నిలిపిన, నిలపగలిగినవా రెందరున్నారు? అంత పట్టుదల ఆదర్శప్రాయం కదా? ఆ కాలంలోనే హెన్రీ ఆల్బెయిర్ అనే ఫ్రెంచి యువకుడు విశాఖ వచ్చాడు – వేమన పద్యాలనూ, గురజాడ కన్యాశుల్కాన్నీ ఫ్రెంచిభాషలోకి అనువదించేందుకు యునెస్కో (UNESCO) నుంచి ఉపకారవేతనం తీసుకొని. విమాన ప్రయాణానికి తగినంత డబ్బులేదని పారిస్‌నుంచి విశాఖకు రోడ్డుమార్గాన మోటార్‌సైకిల్‌మీద బయలుదేరాడు! క్వెట్టా దగ్గర ప్రమాదానికి గురై రెండున్నర నెలలు ఆసుపత్రిలో గడపవలసివచ్చింది. సేవలందిస్తున్న నర్సమ్మ మాతృభాష బ్రాహుఈ అని తెలుసుకుని ఆ సమయంలో అంత బాధలోనూ ఆ ద్రవిడ గిరిజన భాషను కొంతవరకైనా నేర్చు కొని వచ్చాడు! తెలుగు మాట్లాడగల పాశ్చాత్యులు చాలా తక్కువమంది. రష్యన్లు నేర్చుకొని వచ్చి తమ చదువుకు సానబెట్టుకొని పోయేవారు. అమెరికన్లు చదవగలరుగాని మాట్లాడగలిగినవారు చాలా కొద్దిమంది. ఇతడు విశాఖలోని నాగరక భాషకన్నా సమీపంలోని మాడుగల మాండలికం కన్యాశుల్కంలోని సాధారణ పాత్రల భాషకు సన్నిహితంగా ఉంటుందని వారంలో సగంరోజు లక్కడ గడిపి, రెండు లాభాలు గడించా ననేవాడు. ఒకటి సహజసుందరమైన సామాన్యుల తెలుగునేర్వటం, రెండోది ఖర్చులు తగ్గించుకోగలగటం. ఇతడి కార్యదీక్షా సౌమనస్యాలు మెచ్చ దగ్గవికాదా?

తాను చదివిన చదువుకూ చేసిన పరిశోధనలకూ ఉద్యోగాలకూ పొంతనలేదుగాని గొప్ప శాస్త్రజ్ఞు డనిపించుకున్నవాడు జె.బి.ఎస్.హాల్డేన్. తనకు సాయపడ్డ తెలుగువాడి దగ్గర (ర్యాలి వెంకట్రావుగారా? వేంకటేశ్వరరావుగారా?) భాష నేర్చుకొని, అభిమానం పెంచుకొని భారత దేశానికి అధికారభాషగా ఉండదగ్గది తెలుగేనని శాస్త్రీయ కారణాలు వివరించటమేగాక తన శరీరాన్ని మరణానంతరం కాకినాడలోని వైద్యకళాశాల కిమ్మని వీలునామా రాశాడు. చివరి

దశలో పుట్టకురుపు (Cancer) కణాలను తన శరీరంలోకి ఎక్కించుకొని రోగవ్యాప్తినీ, లక్షణాలనూ క్రోడీకరించినవాడు. సాధన నిరపేక్షంగా సముద్రంలో లోతులకుపోయి అందువల్ల మానవ శరీరానికి వచ్చే కష్టనిష్ఠురాలను సూత్రీకరించినవాడు. మన కలాంటి వ్యక్తి మరొకడు తటస్థపడ్డాడా తెలుగు జాతిలో?

**ఆనందదాయకులు**

నూటికి కోటికి ఒక్కరైనా సుఖశాంతులతో బతికారని చెప్పలేం. కష్టాలకు కుంగిపోకుండా ఎప్పుడూ సంతోషంగా నవ్వుతూ నవ్విస్తూ లోకాన్ని విమర్శిస్తూ తనను కూడా వెక్కిరించుకుంటూ బతకటం అందరికీ సాధ్యంకాదు. నాకు తటస్థపడ్డ వాళ్ళలో ఇద్దరు మాత్రం ఆ రకం వ్యక్తులు – బాల్యంలో మిత్రుడైన మాచిరాజు దేవీప్రసాదూ, మధ్య వయసులో నేస్తం కట్టిన అబ్బూరి వరద రాజేశ్వరరావూ ఆయిద్దరు. రెండో ప్రపంచయుద్ధం నాటి రేషనింగునూ విమానదాడి రక్షణోపాయాలనూ తానుచేస్తున్న (ఎక్సయిజ్) పోలీసు వృత్తినీ ఆక్షేపించి వెక్కిరించి పదవి తగ్గుతున్నా, బాధ్యతలు కూడా తగ్గుతున్నవని ఆనందించిన దేవీప్రసాద్ విచిత్రవ్యక్తి. విశ్వనాథవారి ఛాందసత్వాన్ని అధిక్షేపిస్తూ "అచ్చొత్తించు శ్రీప్రెస్సులో, శ్రీ అచ్చుల్ సరిపోయి ఏడ్చినవిటోయ్? శ్రీవిశ్వనాథేశ్వరా?" అని రాసి, విశ్వనాథ ఎదటే చదివి నవ్వి నవ్వించిన వ్యక్తి. భార్యావియోగం, నెలల వయసున్న బిడ్డ పెంపకం, తగ్గిన పదవి వగైరాలెంత బాధించినా మనిషికిరాక మానుకు వస్తాయా కష్టాలని నాలుగు పేరడీలు రాసి నవ్వి నవ్వుకునే తత్వం తానేడ్చి లోకాన్ని నవ్వించిన ఛార్లీ చాప్లిన్ ధోరణిలాంటిది. సభాపతి స్వామీ శివశంకరస్వామి వంటివారిని బాధించినా ముందువెనకల స్వాములయినందుకే వెక్కిరిస్తున్నా నని సర్దిచెప్పిన వాడతడు! ఇతడి హాస్యం సాత్వికం.

వరద (రాజేశ్వరరావు)ది ఉద్ధతం. జైలునుంచి వస్తూ పూలుకొని తల్లికిచ్చి నేను సొంతగా నీళ్ళుపోసి పెంచిన మొక్కలవని వివరించిన మహాత్ముడు. మరో కొత్త విషయం గుర్తుకు వచ్చే దాకా పట్టినపట్టు వదలకుండా వందలమందికి తన అభిప్రాయాలు వివరించి నవ్వి నవ్వించే వాడు. 'కెవ్వున రచియించినవాడ కేరాలక్ష్మీ!' అని ఆరుద్ర రాసిన దాన్ని పట్టుకొని "కెవ్వున ఏడుస్తారా? రాస్తారా? రాసి ఏడుస్తారా? ఏడ్చిరాస్తారా? ఏడ్చినట్లు రాస్తారా?" అని, "ఆ రాతకు పూర్వమహాకవి ప్రయోగా లున్నవా? మనవాడే అలా ప్రయోగించిన మొదటి మహాకవా?" వగైరా ప్రశ్నలతో తెలిసిన వారందరినీ విసిగించి, "ఇక పోనీరా ఈ విషయం" అని మొత్తుకుంటే, "కెవ్వున విసుక్కుంటున్నావా? కెవ్వున తిట్టున్నావా? నిఘంటు ప్రమాణాలూ పూర్వ కవిప్రయోగాలూ దొరికేదాకా కెవ్వుమనకుండా ఉండరాదా? పోనీ కెవ్వున నవ్వరాదా?" అని ఒకటే వాయించేవాడు. కొన్ని గొప్ప నిర్వచనాలు కూడా ఈ ధోరణిలోనే ఉండేవి... "పూర్వం స్కూళ్ళూ కాలేజీలూ లేవు కాబట్టి, ఇప్పటిలా పరీక్షలూ మార్కులూ లేవుకాబట్టి, మార్క్సిజం పుట్టలేదు. తెలుసా? ఇప్పుడేమో ప్రతిమనిషీ పిల్లల్ని కనటం, వాళ్ళను బళ్ళోపడేయటం, మార్కులు రాలేదని ఏడవటం, వస్తే వచ్చాయని మిడిసిపడటం మొదలయింది. అందరికీ ఒకటే ఏడుపు – మార్క్సే, మార్క్సే అని. అమ్మయ్యా. మేం ముగ్గురం ఆ బాధలేనివాళ్ళం – నేనూ, వి.బి.రాజూ, కాసు బ్రహ్మానందరెడ్డీ! మాకు పిల్లల్లేరు కాబట్టి బతికిపోయాం!"



**విచిత్ర వ్యక్తులు**

మరోరకం నిత్యశంకితులు, దుఃఖితులు, బాధితులు, పీడితులు, ఈర్ష్యాపరులు, ప్రగల్భ పరాయణులు. వారికి ప్రపంచమంతా దుఃఖమయం. ఫలానావాడు బాగుపడ్డాడంటే దుఃఖం. పడలేదన్నా దుఃఖమే. నిరంతర దుఃఖభాజను లయినవారిని స్మరించటం మానేస్తే మనకూ దుఃఖముండకపోవచ్చు– సంతోషం లేకపోయినాసరే. వీరిలో ప్రసిద్ధు లొకరిద్దరున్నారు – ఇతర కారణాలవల్ల ప్రఖ్యాతులన్నమాట. కొత్తపల్లి వీరభద్రరావుగారు వారిలో సర్వోత్తములు. బహు కాలం సహోద్యోగులు. ఇన్నాళ్ళుగా ఏళ్ళుగా ఉద్యోగం చేస్తున్నాగాని ఆంధ్రా బ్యాంకులో మూడు వందల రూపాయల్లేవని ఒకటేగోల! (ఇతర బ్యాంకుల సంగతి మాట్లాడడెందుకో!). "నే నెవరిని పొగడటానికీ జంకు" ననేది ఆయన ప్రతిజ్ఞ! (తిట్టడానిక్కాదా జంకాల్సింది?) ఆయన్ను గురించి చాలా పద్యాలు రాసుకున్నా. వాటిలో ఒకటి:

**ఖండితవాక్యముల్ పలుకగల్గుదుగాని, పొగడ్తలందు నా**
**కుండదు జం కటంచు, నెదురొడ్డిన నాదు తపఃప్రభావద**
**గ్ధుం డగుదంచు, నీ జననదోష మెఱుంగు దటంచు, వీరభ**
**ద్రుండు బిభీషికల్ పలుకు రూక్షవిలోచన ఘూర్ణమానతన్.**

ఉపాధ్యాయ వృత్తిలో చాలా సంవత్సరాలు గడిపాను. నేనెరిగిన వారిలో నన్నాకర్షించిన కొన్ని విశేషప్రజ్ఞలు ఎంత ప్రయత్నించినా పట్టుబడలేదు. చీరాలలో కళాశాల ప్రధానాధ్యాపకులైన టేకుమళ్ళ రామారావుగారిని అనుకరించాలని ఎంతో ప్రయత్నించాను. సాధ్యపడలేదు. ఎదట ఉన్న విద్యార్థుల సంఖ్యనుబట్టి ఆయన కంఠస్వరం స్థాయి మారేది. పదిమంది ఉన్న చిన్న క్లాసులో పదకొండో వాడికి ఆయనగొంతు వినిపించ దనిపించేది. నూటయాభై మంది ఉన్న తరగతిలో చివరిపంక్తి వారికే గాని వరండాలో నిలిచిన వ్యక్తికి ఆయన మాట వినిపించదు! విద్యాస్థాయినిబట్టి ఆయన వాడే పదజాలం మారేది. ఇంటర్మీడియట్ జూనియర్ల క్లాసులో చిన్నచిన్న మాటలతో, వాక్యాలతో నడిచిన పాఠం బి.ఏ. స్పెషల్ ఇంగ్లీషు క్లాసులో పైస్థాయికి చేరేది. ఈ విధానం అలవరచుకొనే దెలాగంటే, 'సాధన' అని నవ్వేవాడాయన.

కొందరు తమ అభిమాన విషయం తప్ప మరోసంగతి మాట్లాడరు – వినిపించుకోరు. ఎన్నోసార్లు కాళోజీ రామేశ్వరరావుగారిని కలిశాను. కాకతీయ సంచికలోని లోపాలుతప్ప ఆయనకు ఇతర ప్రపంచంతో పనిలేదేమో ననిపించేది. గజల్సును గురించి తెలుసుకోటానికి వచ్చానన్నప్పుడు కూడా మొదట కాకతీయ చరిత్రను గురించి ప్రసంగించిన తరవాతే ఈ విషయానికి వచ్చారు. తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు గాంధీజీ ప్రసక్తి తేకుండా మాట్లాడగలిగినట్లు లేదు. పింగళి పరశురామయ్యగారు ఆంధ్రదేశంలోని భూగర్భ నిక్షేపాల విషయానికే అత్యంత ప్రాముఖ్య మిచ్చి మాట్లాడేవారు. రాంభట్ల కృష్ణమూర్తిగారు తమ సామాజిక శాస్త్ర సిద్ధాంతాలనూ, భాషా విషయ విశ్వాసాలనూ మేళవించి చివరకు వేదాల ప్రసక్తి తేకుండా ఉండగలిగినట్లు లేదు. వెల్చేరు నారాయణరావుగారు సమకాలిక జగత్తులోని తెలుగు కవిపండితులు ఏమీచేయలేదనీ

తాము అనేకం చేయదలచుకున్నామనీ బట్టతలకూ మోకాలికీ ముడివేసినట్లు భాషాశాస్త్రంలోని విభిన్న సిద్ధాంతాలనూ, సాహితీ విమర్శనూ కలగాపులగంచేసి గాని సంతృప్తిపడేవారు కాదు. (వీరూ చేకూరి రామారావుగారూ కలిసి 'ద్వంద్వ సమాస' మనేవాడు వరద. తెలుగు విశ్వ విద్యాలయం కొంతకాలంపాటు వీరి ద్వంద్వ పరిపాలనలో అభివృద్ధి సాధించిందనే విశ్వాసంతో పద్యం రాస్తావా? చస్తావా? అని నాచేత రాయించా డొకటి: "వెల్చేరు రామరావును, దల్చిన నారా యణాఖ్యు దగ చేకూరిన్, గొల్చిన నుద్యోగమ్ములు, పెల్చన లభియించు తెలుగు పీఠములోనన్" అని రాస్తే దాన్ని అంకితం పుచ్చుకొని తీర్థ ప్రసాదా లివ్వటానికి తనకు అభ్యంతరం లేదన్నాడు!). తెలుగు భాషాసాహిత్యాల నుద్ధరించటానికి ఎవరూ ఏమీ చేయటంలేదనటమే పరమార్థంగాని, తాము చేసిందేమిటన్న ప్రశ్న ఆయన వేసుకోడు. అదో విశిష్టత. హరదేవ్ బాహరీ అనే నిఘంటు కారుడితో మూడు రోజులు గడిపాను హైదరాబాదులోనే. రైలు దిగినప్పటి నుంచీ తిరుగుప్రయా ణంలో రైలెక్కేదాకా ఆయన నిఘంటువులను గురించీ వాటి నిర్మాణంలో వచ్చే సమస్యల గురించీ తప్ప మరో విషయం మాట్లాడలేదు – ఇతరులు మాట్లాడితే వినిపించుకోనూ లేదు! మనలో ఉన్న లోపాలకూ మన అశక్తతకూ దురదృష్టానికీ మన 'సిలబస్సే' కారణమని ముకురాల రామారెడ్డి గారు మొరపెట్టేవాడు. నన్నయ తిక్కనలూ వ్యాకరణాలంకారశాస్త్రాలూ చదివి ఆ పాశ్చ్యప్రణాళిక వల్ల లోకజ్ఞానం లభించనందువల్ల ఇలా గయిపోయినా మని నిర్వేదంలో పడేవాడు. మనలాంటి చదువే చదివిన కొందరికి మహర్దశ పట్టిందంటే వాళ్ళు మరో సిలబస్ చదివి ఉంటారనీ, ఆ మరోటి వారికి ఒంటబట్టిందనీ వాదించేవాడు!

నా జీవితకాలంలోనే ఊరూపేరూ సంపాదించకుండానే నిష్కామకర్మగా తాము నమ్మిన పనిలో తాదాత్మ్యభావంతో సంతృప్తిపడి తమ కష్టాలను మరచిన వాళ్ళను చూశాను. వేటపాలెం లోని సారస్వత నికేతన గ్రంథాలయంలో పనిచేసినంతకాలం కామయ్యకు (ఆయన్ను లైబ్రరీ కామయ్యగానే నేనెరుగుదును) మరో ప్రపంచంలేదు. గ్రంథాలయంలో అతడు స్వయంగా బైండు చేయని పుస్తకం లేదు. పుస్తకాలకు కుక్కచెవులు పెట్టిన వాళ్ళతో పోరాడని సందర్భంలేదు. నమ్మకం కుదిరితే వెనక్కయినా తిరిగిచూడకుండా "నీ ఎడమ చేతివైపున్న మూడో బీరువాలో కిందనుంచి రెండో అరలో కుడిచేతివైపు రెండో పుస్తకం నీవడిగింది. తెచ్చుకో" అనేవాడు! అతడి వీపుకు కళ్ళున్నాయి – అక్కడి పుస్తకాలకు సంబంధించినంతవరకు. తన ఏకపుత్రుడు కూడా గ్రంథాలయోద్యోగమే చేయాలని తన కోరిక తీర్చుకున్నాడు. అలాంటివాళ్ళు అనేక లుండవచ్చు. వాళ్ళను స్మరించే వాళ్ళూ ఆదరించేవాళ్ళూ గౌరవించేవాళ్ళూ సమాజంలో కనిపించటం చాలా తక్కువ – ఆ వ్యక్తి లాంటి వాళ్ళలాగానే.

స్వవిషయంకన్నా అన్యులసంగతే ప్రధానమని, ఇతరుల జీవిత రహస్యాలను కూపీ తీయా లనే వాళ్ళు కొందరు. మోటూరు సత్యనారాయణగారూ, దేవులపల్లి రామానుజరావుగారూ నాకు తటస్థపడ్డ ఆ ధోరణి వ్యక్తులు. రామోజీరావుగారి అభివృద్ధికి, ఉన్నతికి కారణమేమని వందల సార్లు నన్నడిగారు. "నాకు తెలిసి నేను ఆచరణలో పెట్టగలిగితే నన్నిలా అడిగేవాళ్ళేనా? అనేది



నా సందేహం. "సమానశీల వ్యసనేషు సఖ్య" మన్న సంగతి వీరికి తెలీదా అని నా అనుమానం. పట్టుదల, ఏకాగ్రత, నిర్భయత్వం, నిరంతర పరిశ్రమ, పదిమంది నుంచి పదిరకాల అభిప్రా యాలు పోగుచేసుకుని సమన్వయించుకోవాలనే తాపత్రయం, ధారణ, ఆత్మవిమర్శ వంటి సవాలక్ష సద్గుణాలవల్ల అభివృద్ధి సాధించాడని సరిపెట్టుకోరాదా?" అని నా అడ్డ సవాలు. 'మీ స్నేహితుడు కదా' అని వారి వెక్కిరింతలాంటి ఆక్షేపణ. "నా రథీ రథిన స్సఖా" అని భారతంలో ద్రుపదుడు ద్రోణాచార్యుడికి దేవభాషలో చెప్పాడనీ, చిన్నా పెద్దా అనే ప్రశ్నలేకుండా తన పనికి పనికి వచ్చినంత మేరకు ఆయన ఎవరితోనైనా గౌరవమర్యాదాపురస్సరంగా ప్రవర్తిస్తా డనేది నా అనుభవమనీ, బహుశా అదే వ్యాపార విజయ రహస్యం కావచ్చు నంటే నమ్మనట్లు మొహం పెట్టేవాళ్ళు. బూర్గుల రామకృష్ణరావు గారూ పాములపర్తి వేంకటనరసింహారావుగారలు నాకన్నా ఏవిధంగా ఎక్కువ అనే ప్రశ్న వేస్తుండేవాడు రామానుజరావుగారు. ఫలితాన్ని బట్టి హేతువు నూహించవచ్చునంటే ఆయన బాధపడేవాడు. మీకన్నా పెద్ద పదవులు మీకన్నా తక్కువ చదివిన వాళ్ళకు వచ్చాయి గదా అని నన్నూ కలుపుకొనే ప్రయత్నంచేస్తే, సరస్వతికి మనమెంత దగ్గర యితే లక్ష్మి మనకంత దూరమవుతుందని మనల్ని మనం ఓదార్చుకోవచ్చునంటే ఆయనకు నచ్చేదికాదు.

ఇలాంటి ఉదాహరణలు, ప్రసంగాలు ఎన్నయినా చేయవచ్చు. కానీ చివరకు కొన్ని ప్రశ్నలు వేసుకొని సమాధానాలను దేశకాల పాత్రలకు వదిలిపెట్టడం మంచిదనిపిస్తున్నది. నేటి సమాజం నా చిననాటి సమాజంవంటిది కాదు, విలువలు అన్ని రంగాల్లోనూ మారాయి. భవిష్యత్తులో మరి కొన్ని విధాల మారవచ్చు. నేటి విలువలు మనల్నీ మనదేశాన్నీ ఎటు తీసుకపోతున్నవి? పరి పాలన, న్యాయ, రాజకీయాది రంగాల్లో మనమిప్పుడు ఏ వ్యవస్థనైనా గౌరవిస్తున్నామా? పోలీసు లను, కోర్టులను, శాసనకర్తలను మనం మన్నిస్తున్నామా? చలనచిత్రాలు ప్రదర్శిస్తున్నట్లు తాడూ పేడూ లేని స్త్రీ పురుషుల్లో ఎవరో అకస్మాత్తుగా ఊడిపడి భారత రాజ్యాంగం నిర్దేశించిన మూడు వ్యవస్థలనూ ధిక్కరించి వెక్కిరించి రెండర్థాల మాటలతో బహిరంగ శృంగారంతో మన దేశాన్ని ఉద్ధరించవచ్చని నమ్ముతున్నామా? కష్టపడి ఫలితం సాధించాలనే భావం స్థానంలో ఎవరో ఏదో విధంగా మనకు మేలు చేయాలనీ, మనంమాత్రం శ్రమించగూడదనీ నిర్ణయించుకున్నామా? స్వాతంత్ర్యసాధనకోసం సర్వస్వం ధారపోసిన మహనీయుల ఆదర్శాలనూ వ్యక్తిత్వాన్నీ విస్మరించి కులమత ప్రాంతాది విభేదాలతో ముక్కచెక్కలై మళ్ళీ అస్వతంత్రంగా బతకాలని ఆపేక్షిస్తున్నామా? ఆర్థిక స్వాతంత్ర్యం ఈనాటికీ సిద్ధించలేదు. పైపెచ్చు ఏకప్రపంచవాదంతో ఏకైకార్థిక వ్యవస్థ వచ్చి మన భావికి బంగారు బాటవేస్తుందనే నమ్ముతున్నామా? ఉన్నదనుకుంటున్న రాజకీయ స్వాతంత్ర్యం పోయేదాకా మనం విశ్రమించదలచలేదా? పాశ్చాత్యుల జీవనవిధానాల్లోని మంచి కన్నా చెడే మనల్ని ఆకర్షిస్తున్నదా? అవినీతి, అక్రమమార్గాలు, ఆశ్రితపక్షపాతం, కులమత భాషా ప్రాంత విద్వేషాలూ తెచ్చిపెట్టే తక్షణ సౌకర్యాలే దీర్ఘకాలిక ప్రయోజనాలకన్నా ముఖ్యమని భావిస్తున్నామా?

పాతకాలంలోని మంచిని గ్రహించి, లోపాలను పరిహరించి, భావికాలం సుఖప్రదంగా గడపటానికి మార్గాలన్వేషించవలసింది నేటియువతీ యువకులు. కాటికి కాలుచాచుకున్న మావంటి వాళ్ళుకాదు. నేను ప్రస్తావించిన విషయాల్లో మీకుపయోగించే వాటిని స్వీకరించమనీ పనికిమాలినవని తోచిన వాటిని మరచిపొమ్మనీ పాఠకలోకాన్ని కోరుతున్నాను. అంతకన్నా సాధించగలిగిందేమీ లేదని తెలుసు – సాధించిందీ లేదని తెలుసు. ఆత్మ ఉందో లేదోగాని ఆత్మావలోకనం, ఆత్మవిమర్శ అవసర మనుకుంటున్నాను. అదీ తప్పయితే క్షమించండి. సెలవు.



జీవితం కాన్వాసుపై
అనుభవాల చిత్రం
డెబ్బై వసంతాల
కాలగమనానికి
నిలువుటద్దం
తెలుగు 'నుడి'కి
తెలుగు'వాడి'కి
చిరునామా
ఓ సాహితీమూర్తి
అనుభవాల
అనుభూతుల కథనం
విన్నంత - కన్నంత

Media House
PUBLICATIONS